# తెలుగు వీరగాథ కవిత్వము

ఆచార్య తంగిరాల వేంకట సుబ్బారావు





మొదటి సంపుటము



మా గృహదైవము (ఇలువేల్పు)

శ్రీ వేంకటేశ్వర స్వామివారు, తిరుమల-తిరుపతి

## *Ballad Poetry in Telugu*
## *by* Prof. T. V. Subba Rao

*This is not 'Research'!*
*This is not 'Search' even!*
*This is an 'Adventure'!*
*Hats off to you!*
*I want to see you!!*

*-Prof. K. V. Ramana Reddy*

*He has collected many Telugu ballads*
*which are not known to the educated public and*
*when he publishes them,*
*I am sure,*
*he will put the Telugu public indebted to him*
*for his work.*

*-Prof. G. N. Reddy*

*His laborious collection of a good number of*
*new ballads from different parts of*
*Andhra Pradesh won admiration of the*
*Telugu scholars and he threw*
*new light on the subject.*

*-Prof. T. Kodandaramaiah*

# తెలుగు వీరగాథా కవిత్వము

## మొదటి సంపుటము

## వీరగాథా లక్షణము

1969లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము నుండి
డాక్టరేటు పట్టమును పొందిన సిద్ధాంత వ్యాసము



రచన

ఆచార్య తంగిరాల వేంకటసుబ్బారావు, ఎం.ఏ.; పిహెచ్.డి.

విశ్రాంత ఆంధ్రశాఖాధ్యక్షుడు

బెంగుళూరు విశ్వవిద్యాలయము

బెంగుళూరు



ప్రచురణ

శ్రీరస

శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య

బెంగుళూరు

**'TELUGU VEERAGATHA KAVITWAMU'** (Ballad Poetry in Telugu), Volume I, **'Veeragatha Lakshanamu'** (The Attributes of a Ballad), a Doctoral Thesis written by **Prof. T. V. Subba Rao** which was awarded Ph.D. Degree in Telugu by Sri Venkateswara University, Tirupati in February 1969.

**Pp.** : xxiv + 316

**First Edition** : 5th April 2000 (Vikrama Ugadi)

**Copies** : 1000

**Price** : **Rs. 200/- or $ 25**






**Cover Page Painting** : **'Seelam Brahmanayadu'** by Sri Madhavapeddi Gokhale

**Back Cover Painting** : **'Brahmanayani Chapa Kudu'** by Sri S. Janardan.

**Letters** : **BAPU,** Madras.

**Cover Design** : **Grafix Shop,** Bangalore.

**Published by** : **SRI RASA**
Sri Krishna Devaraya Rasajna Samakhya
No. 40/12-7, Saurabha (Upstairs)
22nd Cross, Govindaraja Nagar,
Vijayanagar, Bangalore - 560 040
Phone: 080-3305902

**Sole Distributers :** **M/s. Visalaandhra Publishing House**
4-1-435, Bank Street
Hyderabad - 500 001, A.P.

**For Copies** : **M/s Visalaandhra Book House,**
Hyderabad, Vijayawada, Guntur,
Anantapur, Tirupati, Kakinada,
Hanamkonda & Visakhapatnam

**DTP & Printed by:** **Sree Laxmi Art Printers**
910/A, 3rd Main, Vijayanagar,
Bangalore - 560 040 Phone: 3300093



తల్లిదండ్రులు

కీ.శే. తంగిరాల (భళ్ళమూడి) సీతామహాలక్ష్మి (1907-1990)

కీ.శే. తంగిరాల వేంకటసుబ్బావధానులు (1904-1968)



'తల్లీ! నిన్నుఁదలంచి...'
వృద్ధాప్యంలో అమ్మ
కీ.శే. తంగిరాల (భళ్ళమూడి) సీతామహాలక్ష్మి (1907-1990)



పెద్దక్కయ్య

కీ.శే. చల్లా (తంగిరాల) పెద వెంకట రామలక్ష్మి (1924-1998)



'చెల్లక్క' - చిన్నక్కయ్య

కీ.శే. బులుసు (తంగిరాల) చిన వెంకట రామలక్ష్మి (1926-1985)



తంగిరాల సోదరులు

కృష్ణమూర్తి - సుబ్బారావు - సోమయాజులు - భాస్కరరావు



తంగిరాల సోదరులలో వీరుడు
కర్నల్ తంగిరాల కృష్ణమూర్తి (1968లో మేజర్‌గా ఉన్నప్పుడు)



డా॥ తంగిరాల వేంకటసుబ్బారావు
(1969లో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము నుండి
పిహెచ్.డి. డిగ్రీ తీసికొనినప్పుడు)



డా॥ తంగిరాల వేంకటసుబ్బారావు

(బెంగుళూరు విశ్వవిద్యాలయములో తెలుగు ఉపన్యాసకుడుగా చేరిన క్రొత్తలో)

ప్రాణం వాపి పరిత్యజ్య మాన మేవాభి రక్షతు।
అనిత్యో భవతి ప్రాణో.మాన మాచంద్రతారకమ్॥

- (నీతి శాస్త్రము)

ఈ పొద్దిదియా రేపు తదియా నరుని ప్రాణమోయి!
నీటి మీదనూ బుగ్గ తోడిదీ నరా శరీరమ్మూ!
ఏలబోయి యీ ప్రాపంచంలో మరల ఏలబోము!
పుట్టబోయి మన తల్లి కడుపునా మళ్ళీ పుట్టేమా?

- (ఉయ్యాలవాడ నారసింహారెడ్డి వీరగాథ)

This book is published with the financial assistance given by Tirumala Tirupati Devasthanamas, Tirupati, A.P., under the scheme "Aid to Religious Books". I am very much grateful to Sri E.V. Subba Rao, Executive Officer, T.T.D., Tirupati, A.P.

**- T. V. Subba Rao**

## అంకితము

మా గృహదైవము (ఇలువేల్పు)

శ్రీ వేంకటేశ్వరస్వామివారి

పాదారవిందములకు...

నా యిష్టదైవము

'భగవాన్ శిఖిపింఛ మౌళి'

మోహన వేణుగానమునకు ...

నాకు

జన్మ నిచ్చిన

తల్లిదండ్రులకు...

వాత్సల్యమును పంచి యిచ్చిన

పెద్దక్కయ్యకు...

'చెల్లక్క' - చిన్నక్కయ్య కు...

అన్నయ్యకు...

బాచి తమ్మునకు...

బుల్లి తమ్మునకు ...

-భక్తి ప్రపత్తులతో

-నమస్సులతో

-ఆశీస్సులతో

-తంగిరాల వెంకట సుబ్బారావు

# కృతి స్వీకర్తలు

**తల్లి** : మమ్మల్ని పెంచి పెద్దచేయటం కోసం అష్టకష్టాలు పడిన మాతృమూర్తి, అభిమానవతి, పెదవాడపల్లె భళ్ళమూడి కృష్ణమూర్తిగారి యింట్లో పెద్ద ఆడుపడుచు **కీ.శే. తంగిరాల సీతామహాలక్ష్మి** (1907-1990).

**తండ్రి** : ప్రముఖ కృష్ణ యజుర్వేద పండితుడు, మనస్సన్న్యాసి, సంసార విషయంలో తామరాకు మీది నీటిబొట్టు, రాగద్వేషాలకు అతీతుడు, దైవసమానుడు **కీ.శే. తంగిరాల వేంకట సుబ్బావధానులు** (1904-1968).

**పెద్దక్కయ్య** : పూర్వార్ధంలో సిరిసంపదలతో తులతూగి, ఉత్తరార్ధంలో దారిద్ర్య సముద్రంలో ఈదులాడి, చివరికి కేన్సర్ మొసలి నోటపడిన **కీ.శే. చల్లా (తంగిరాల) పెద వెంకట రామలక్ష్మి** (1924-1998). (భర్త: కీ.శే. చల్లా పాపయ్యశాస్త్రిగారు, పేకేరు, పశ్చిమగోదావరి జిల్లా).

**'చెల్లక్క' - చిన్నక్కయ్య** : మొదట కొద్దికాలం సుఖించి, పిమ్మట బహుసంతానంతో, కటికి పేదరికంతో కష్టాల గోదావరిలో కొట్టుకొనిపోయిన **కీ.శే. బులుసు (తంగిరాల) చిన వెంకట రామలక్ష్మి** (1926-1985). (భర్త: కీ.శే. బులుసు సోమన్నగారు, రాజమండ్రి).

**అన్నయ్య** : సంఘజీవి, బుద్ధిజీవి, నియమబద్ధజీవి, గాంధేయవాది, వ్యాయామప్రియుడు, చతుర సంభాషణా నిపుణుడు, ఉభయ భాషా ప్రవీణుడు, కవి, పండితుడు, ఉత్తమ వక్త, విశ్రాంత ఆంధ్రోపన్యాసకుడు, నా మొట్టమొదటి సాహిత్య గురువు, నా 'కాటమరాజు కథల' కృతిస్వీకర్త: **శ్రీ తంగిరాల వేంకటకృష్ణ సోమయాజులు గారు** ఎం.ఏ. (తెలుగు), తణుకు. (భార్య: శ్రీమతి కోట భాస్కర లక్ష్మి)

**బాచి తమ్ముడు** : మా నాన్నగారి వంటి అమాయకుడు, మాతృభక్తి పరాయణుడు, సంతత దైవధ్యాన పారాయణుడు, పంచభక్ష్య పరమాన్న భోజనప్రియుడు, 'అజగర స్వామి', లక్ష్మీకటాక్ష సిద్ధిపొందిన అదృష్టవంతుడు, చిరంజీవి **తంగిరాల భాస్కరరావు,** బి.ఇ. (సివిల్), రిటైర్డు ఎక్జిక్యూటివ్ ఇంజనీరు (P.W.D) రాజమండ్రి. (భార్యలు: కీ.శే. వేదుల బాలాత్రిపుర సుందరి, శ్రీమతి ప్రవా శకుంతల).

**బుల్లి తమ్ముడు** : మా తంగిరాల సోదరులలో మహావీరుడు, నిరంతర చైతన్యవంతుడు, బంధుజనుల పాలిటి కల్పవృక్షం, నిత్యం సిరిసంపదలతో తులతూగే భోగి, సంతత త్యాగి, 'జానపద సాహిత్యం - వీరగాథలు' అనే నా సిద్ధాంతవ్యాస సారాంశ కృతిస్వీకర్త, చిరంజీవి కర్నల్ **తంగిరాల కృష్ణమూర్తి,** బి.ఇ. (మెకానికల్), తణుకు. (భార్య: శ్రీమతి మల్లాది శంకరి).

# వీరగల్లు – 1
## (విషయ సూచిక)

# ఆనాటి నా 'ప్రవేశిక'

నా దేశి కవితాభిమానమునకు మూలకారణము మా అమ్మగారు. ఆమె తఱుచుగా పాడుచుండెడి మేలుకొలుపులు, మంగళహారతులు; మా పల్లెలోని పడతుల నందఱును ఒక చోట చేర్చి వారికి అనుదినమును ఆప్యాయముగా వినిపించుచుండిన కుశలవ కుచ్చుల కథ, ధర్మరాజు జూదము, కుమ్మరి గుండయ్య కథ మున్నగు స్త్రీల కథలపాటలు నన్ను శైశవమునందే తమ వంకకు ఆకర్షించుకొనినవి. మా యిల్లు పంటపొలముల నడుమ నుండుటవలన పనిపాటులు చేసికొనెడి పామరుల పాటలపై గూడ బాల్యమునందే నాకు ఎనలేని మక్కువ నెక్కొనినది. అప్పటి నుండియు ఈ దేశి కవితాభిమానము నన్ను వెన్నంటుచునే యున్నది. ఈ అభిమానము చావకుండ, దీనికి ఆధునిక సాహిత్యాభిమానమును, శిష్ట సాహిత్యాభిమానమును గూడ జోడించి నాలోని దేశి సాహిత్య సంస్కృతికి నానాట ప్రోది కల్పించినవారు మా అన్నగారు ఉభయ భాషా ప్రవీణులు శ్రీ తంగిరాల వేంకట కృష్ణ సోమయాజులుగారు, మఱియు నా గురుదేవులు శ్రీ దిగుమర్తి సీతారామస్వామిగారు, గురువర్యులు డా॥ తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారు. దేశి సాహిత్యమున ప్రధాన శాఖయగు వీరగాథా కవిత్వమును పరిశోధనాంశముగా నేను స్వీకరించుటకు నా యీ దేశి సాహిత్య సంస్కృతియే ముఖ్య కారణము.

తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమున ఇంచుమించుగా ఐదేండ్లపాటు (1963-1968) సాగించిన పరిశోధన ఫలమే ఈ సిద్ధాంత వ్యాసము. దీనిని గూర్చి పరిశోధించుటలో నాకు మార్గదర్శకులు ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు (1963-1965), ఆచార్య జి. యన్. రెడ్డిగారు (1965-1968). నేను ఆంధ్రదేశమున వివిధ ప్రాంతములలో పర్యటించి, అపూర్వములగు వీరగాథలను వందలాదిగా సేకరింపగలుగుటకు గల ప్రధాన కారణము ఆచార్య జి.యన్.రెడ్డిగారి ప్రోత్సాహ సహకారములే! నా యీ పరిశోధన కార్యమునకు ఒక నిర్దిష్ట ప్రణాళికను రూపొందించి, తగు సూచనలిచ్చి, ప్రత్యక్షరమును పర్యవేక్షించి, సరిదిద్ది, దీనికిట్టి స్వరూపము నొసగుటకు తోడ్పడిన సహృదయవతంసులు, మద్గురువరేణ్యులు అయిన ఆచార్య జి.యన్.రెడ్డిగారికిని, డా॥ తిమ్మావజ్ఝుల కోదండరామయ్య గారికిని నేను మిక్కిలి ఋణపడియున్నాను.

విశ్వవిద్యాలయ ఆర్థిక సహాయ సంఘము (University Grants Commission) వారు ఈ పరిశోధన కార్యమును నిర్వహించుటకు నాకు, మూడేండ్లపాటు 'ఫెలోషిప్' (Fellowship) నొసగి తోడ్పడినారు. ఇదియునుగాక, వీరగాథలను సేకరించుటకై నేను ఆంధ్రదేశములోని వివిధ ప్రాంతములలో సంచరించుటకు వలసిన ఆర్థిక సహాయ సంపత్తిని గూడ ఈ సంస్థవారు నాకు చేకూర్చిరి. అట్టి సహాయమే లభింపనిచో, ఈ విధముగా మౌఖిక ప్రచారమున నున్న వీరగాథల సంపాదనము మీదనే ప్రధానముగా ఆధారపడిన ఈ పరిశోధన కార్యము దుర్ఘటమయ్యెడిది. అందుచే ఆ యు.జి.సి. వారికి నేను సర్వదా కృతజ్ఞుడను.

పరిశోధన కాలములో సంసార బాధ్యతలన్నియును తానే వహించి నాకు మిక్కిలిగా సహకరించిన మా ఆవిడ - ''భళ్ళమూడివారి చిట్టి''కి (శ్రీమతి తంగిరాల శకుంతలకు) నా ఆశీస్సులు...

**-తంగిరాల వెంకటసుబ్బారావు**

తిరుపతి
23-1-1968
(నేతాజీ జన్మదినము)

# సమాంతర సాహిత్యం

## ప్రముఖ విమర్శకుడు, విప్లవ కవి, పండితుడు, 'విరసం' అధ్యక్షుడు

## కీ.శే. కె.వి. రమణారెడ్డిగారు

అచ్చమైన 'దేశి' సాహిత్యం మచ్చులేని చంద్రబింబమే. అలాంటిది అసలే ఉండదని నిర్ధారించడం సాహసం మితిమీరడం కావచ్చు గాని, పూర్తి స్వచ్ఛందమైన 'దేశి' సాహిత్యం అపురూపమైన పదార్థమే. 'దేశి' సాహిత్యం చాలావరకు అపురూపం పొందిన 'మార్గ' సాహిత్యమే ననిపిస్తుంది.

ఇలా అనిపించడానికి కారణాలు అనేకం. వాటిలో మొదటిది ప్రజా సామాన్యం నిరక్షరాస్యత మాత్రమే కాబోదు. ఆస్తిలో అంతరాలే కాదు, అసలు సొంతానికి ఆస్తి గాని, అలాంటి ఆస్తి గురించిన భావం గాని లేని అత్యంత ఆదిమ కాలంలో, లిపి రూపొందడానికి ఎన్నో శతాబ్దాల ముందు, ఆహారాన్వేషణలో, సేకరణలో, ఉత్పాదనలో అతి హీనమైన స్థాయిలో వుంటూ పరస్పర సహకారమూ, సామాజిక విభజనా చేసుకోక తప్పని గణ సమాజ దశలో, ప్రకృతిని వశీకరించుకుంటున్నామన్న భ్రమతోటి ఆత్మవిశ్వాసం పొందుతూ సామూహిక నృత్యగానాలతోటి తమ శ్రమకు సంబంధించిన సాహిత్యాన్ని స్వచ్ఛందంగానే వెలువరించేవారు. విడి విడి కళలుగా అటు తర్వాత ఎంతోకాలానికి ప్రత్యేక ప్రతిపత్తి పొందిన సాహిత్య, నృత్య, గానాలు ఆనాటి అకృత్రిమ జీవన విధానానికి అనుగుణంగా ఉంటూ వచ్చాయి. అయితే, అవిభాజ్యంగా వుండిన యీ కళారూపాల విషయంలో తమలో ఒకరో కొందరో ప్రత్యేక ప్రావీణ్యం పొంది, దాన్ని తమ బిడ్డలకు అందించి పోయే క్రమంలో అవి ఆనువంశికంగా కొనసాగి వుండవచ్చు. ఇలా ఒక 'శిష్ట' బృందం రూపొందీ ఉండవచ్చు.

భౌతిక వస్తూత్పత్తి సాధనాలు మొరటువి కావడం కారణంగా ఉత్పాదనా శక్తి పరిమితమై జనానికి బొటాబొటీగానే సరిపోతూ వచ్చిన ఆదిమ గణ సమాజ దశ, ప్రధానంగా తన అంతర్గత వైరుధ్యాల మూలంగానే క్షీణించి నశించాక, దాని శిథిలాల మీద లేచిన ప్రాచీన రాజరికాలు తమ భౌద్ధిక జీవితానికి ఆలంబనంగా ఇలాంటి శిష్ట బృందాలనే ఆశ్రయించి, పోషిస్తూ వచ్చినందుచేత, సహజంగానే అది పోష్య-పోషక సంబంధాల మూలాన పరిపాలకులకు పనికిరాగల భావాలనే ప్రకటిస్తూ, కొత్త కొత్త సామాజిక - ఆర్థిక

వ్యవస్థల ప్రయోజనాలను పరిరక్షించే విధంగా భావోత్పాదననూ ప్రచారాన్నీ కొనసాగించడం జరిగింది. ఈ క్రమంలో కళలు గానీ, ఇతర భావజాల రూపాలైన మత విశ్వాసాదులు గానీ, పోను పోను ప్రజలకు దూరమై, ప్రజలనుంచి స్వతంత్రమై, ప్రజా జీవితాన్ని పాలకవర్గాలు అనుకూలంగా మలచుకునేందుకు సంకల్పపూర్వకంగానే ప్రయత్నించి నందుచేత, భౌతిక పరాధీనతకు భావ పరాధీనత తోడైంది. ఏ యుగం భావజాల మయినా ఆ యుగం పాలకవర్గానికి అనుకూలమైన భావజాలమే.

దీనికి అపవాదం లేనేలేకపోలేదు. పాలకవర్గ సంస్కృతికి భిన్నంగానే గాక బద్ధ విరుద్ధంగా కూడా, పాలిత ప్రజాకోటిలో స్వచ్ఛందంగా విశిష్టమయిన భావధోరణి తలెత్తినపుడు, దాన్ని 'ప్రతి సంస్కృతి' (Counter Culture) అనవచ్చు. అయితే అలాంటిది చాలా అరుదు. పాలకవర్గ సంస్కృతి ప్రభావానికి లోనై, దాన్నే మదికెక్కించుకొని, నరనరానా జీతింప జేసుకున్న ఫలితంగా, అనుకరణ జరుగుతుంది - లేదా అనుసరణ. అయితే ఇది 'శిష్ట' స్థాయిని ఎలాగూ పొందజాలదు గనక, దాన్ని 'భ్రష్టం' (Vulgarise) చేస్తుంది. ఇలాంటి ప్రజాసంస్కృతిని 'సమాంతర సంస్కృతి' (Parallel Culture) అనవచ్చు. 'సమాంతర సాహిత్యం' దీని అంతర్భాగమే. ఇది అసలుకి నకలూ కాదు, అసలు ఎలాగూ కాదు. దీని లోపం స్వచ్ఛందత. అందుచేత ఇది కుహనా సృజనే కాని అనుసృజన కూడా కాలేదు. అయినా ఇది జనంలో - పామరలోకంలో - విరివిగానే వ్యాప్తి పొందుతుంది. సమాజ నిర్మితి నిచ్చెనవంటి దయితే, దాని కింది మెట్టున వున్న సామాన్య ప్రజ, పైమెట్టున వున్న 'శిష్ట' పాలకవర్గాన్ని సంస్కృతి విషయాలలో అనుసరిస్తూ, లేని ప్రతిష్ఠను సమకూర్చుకొనేందుకు ఎన్నెన్ని తంటాలో పడుతుంది. 'మౌఖిక' సంప్రదాయంగా పేరుపొంది ఉన్న ఈ ధోరణి మహేతిహాసాల విషయం నుంచీ తాత్త్విక దర్శనాల విషయందాకా వర్తిస్తుంది. అద్వైత వేదాంతం వంటి గహనాల నుంచి కూడా తన శక్తి మేరకు ఎన్నో అంశాలను రాబట్టుకుని, తన మాటతీరునే గాక తన ఆలోచనారీతినీ దానికి జత చేసిన వాస్తవం ఎన్నో 'తత్త్వాల'లో ('అచల' తత్త్వం లాంటివి) కనిపిస్తుంది. ఇది ఒకానొక నిదర్శనం మాత్రమే.

'అపౌరుషేయాలు' గనక లిపిబద్ధం కాకూడదని వేదాలను సైతం మౌఖిక పద్ధతిలోనే గత శతాబ్దం ద్వితీయ దశకం దాకా వల్లెవేయిస్తూ, జటాంత స్వాధ్యాయులనూ, ఘనాపాఠీలు వగైరాలను రూపొందించుకుంటూ సంప్రదాయాన్ని, లిపి రూపొందిన తర్వాత గూడా కేవలం నిర్హేతుక విశ్వాస బలం కొద్దీ, అలాగే కొనసాగించారు 'శిష్టులు'.

అక్షరాస్యతకే నోచుకోని పామరుల విషయం వేరే చెప్పాలా? 'మౌఖిక' సంప్రదాయం అని పేరు పెట్టినంత మాత్రాన్నే ప్రతిదీ జానపదసాహిత్యమో, ప్రజాసాహిత్యమో కాగలుగుతుందనుకోవడం అవిచార మూలకమైన అభిప్రాయం. అయితే అభూత మనిపించే కల్పనాచాతుర్యం, వర్ణనా కౌశలం, పాత్రచిత్రణ వైచిత్రి, పరమ హృదయంగమమైన రీతిలో ఈ జానపద సాహిత్యాన్ని విలక్షణంగా నిలిపి, అత్యంత ఆత్మీయమే (Homely) అని అనిపింప చేసే విశేషాలు లేకుంటే, రాజపుత్రిక, ఋషిపత్ని అయిన రేణుక ఏకవీరగానో ఎల్లమ్మగానో మాహురమ్మగానో రూపొందడం మాత్రమే కాక, వర్ణభేదాలను సైతం ఎలా అతిక్రమించ గలుగుతుంది? పలనాటి వెలమనాయుడు బ్రహ్మన్న విష్ణు స్వరూపుడెలా కాగలుగుతాడు? 'మార్గ' పద్ధతి సాహిత్యానికి భిన్నంగా ఈ 'దేశి' సాహిత్యం ఎక్కువగా మాత్రాచ్ఛందస్సులలో లేక ద్విపదలనో ఆశ్రయించడం గానీ, రకరకాల చిందులతో దరువులతో గూడిన పాటల రూపం పొందడం గానీ, గోరంత వాస్తవానికి కొండంత కల్పనను జోడించి, స్థల, కాల, యథార్థ విషయాలను గజిబిజి చేస్తూ, సామాజిక చరిత్రకు తరగని గనిలా వుండవలసిన కథా ఇతివృత్తాన్ని దుర్గమారణ్యంగా మార్చడం గానీ ఎలా జరుగుతుంది? చిలవలు పలవలుగా పెరిగి మహావృక్షంలా రూపొందే కొన్ని కొన్ని గాథలు ఒక్కొక్క 'చక్రం' కాగలిగాయంటే, జానపదుల కల్పనాశక్తి ఎంత అపారమైనదో గ్రహించవచ్చు.

**కాటమరాజు కథలను, పలనాటి కథలను, ఇతర వీరగాథలను సేకరించ బూనుకోవడమే 'హెర్క్యూలియన్ లేబర్' లాంటి గొప్ప శ్రమ. ఓపికకూ, కష్ట సహిష్ణుతకూ కఠిన పరీక్షలాంటి ఈ గాథాసేకరణను ఔత్సాహికులైతే, ఇతర వ్యాసంగాలూ వ్యాపకాలూ లేనివారైతే, చేయగలగినంత తీరికగా, ఉల్లాసంగా, 'అకాడెమిక్' (academic) పరిశోధకులు చేయలేరని భావించడం సవ్యంకాదని తంగిరాల వెంకట సుబ్బారావు నిరూపించారు.** సేకరణ ఒక ఎత్తు కాగా, వర్గీకరణ మరొక ఎత్తు. మరి దానితో సరిపెట్టుకోకుండా ఈ కథాచక్రాల స్వరూప స్వభావాలను వివరించేందుకు ఎంతో ఉపజ్ఞ అవసరం. అది కూడా చాలదు. వివరణకు అస్థిబలం విశ్లేషణలోనే ఉంది. మరి ఈ కార్యం దక్షతకే గీటురాయి కావలెనంటే శాస్త్రీయమైన ఆలోచనాసరళి ఉండాలి. ఇది ఒక పట్టాన సమకూరేది కాదు. పరదేశాలలో యిలాంటి కృషికి సంబంధించి పరిశోధన గ్రంథాలు రాసిన ఆధునికులు ఎలాంటి భావపరమైన చట్రాన్ని (Conceptual Frame Work) రూపొందించుకొని, తాము సమకూర్చుకున్న సంక్లిష్టమైన విషయారణ్యాన్ని

ఉద్యానవనంలా ఎలా మార్చుకోగలిగారో ముందుగా తెలుసుకొని వుంటే గాని, వీలైనంత నిర్దుష్టమైన విశ్లేషణను గతానుగతికంగా తప్ప ఆలోచించలేని మన 'అకాడెమిక్' (academic) పరిశోధకులు సైతం సాధించలేరు. 'పండిత సంప్రదాయ' వాసనలు వదలనంత కాలం శుష్కరమైన ప్రకర్ష స్థానంలో సార్థకమైన పరిశీలన గట్టిగా కాలూనలేదు. **తంగిరాల వెంకట సుబ్బారావు పది పన్నెండు డాక్టరేట్ పట్టాలకు సరిపడా విషయసేకరణ చేశారు. కాలికి బలపం కట్టుకుని దేశమంతా తిరిగారు. చేతివ్రేళ్ళు అరిగేదాకా కలానికి పనిపెట్టారు. టేపులు ఎన్నో వాడుకున్నారు. ఆ తర్వాత వర్గీకరణకు పూనుకొని కృతకృత్యులయ్యారు. తదుపరి వివరణాత్మకమైన రచనలోనూ సాఫల్యం పొందారు.** ఎటొచ్చీ, విశ్లేషణ విషయంలోనే మరింత లోజూపు తోపాటు చుట్టుచూపును అలవరచుకొని వుంటే ఈ బృహత్కృషి సర్వాంశాసంపుష్టం కాగలిగి వుండేది. అసలే లేదనికాదు. ఉన్నదానికంటె ఉండవలసిందే ఎక్కువేమో! అయితే, చేసినంతవరకు **చూసినా ఎంతో సంతృప్తి కలిగేలా తన సిద్ధాంత వ్యాసాలను బహు విషయ సంపన్నం చేయగలిగారు. ఇలాంటి 'అకాడెమిక్' (academic) పరిశోధన ఎక్కడో తప్ప తనకు తగిన సమవుజ్జీని ఎదుర్కోలేదు.**

**డాక్టర్ పట్టా పొందిన తంగిరాల వెంకట సుబ్బారావుకు శ్రావ్యమైన కంఠస్వరం పెట్టని వరం. గానానికి ఒదిగి మెళుకువలెన్నో చూపగల తన గొంతుకనుంచి తానే సేకరించిన ఒక వీరగాథను (సర్వాయి పాపని కథ) వినడం తటస్థించింది. శృంగార, కరుణరస ప్రకటనకే యోగ్యం అని భ్రమ గొలిపేంత కోమలమైన ఆ కంఠస్వరం వీరాన్ని సైతం పలికించగలిగి ఆశ్చర్యం కొలిపింది.**

ఈ వ్యక్తి విశేషాన్ని అటుంచి చూస్తే, ఈ 'మౌఖిక' జానపద సాహిత్యరాశినుంచి రాబట్టుకోగలిగిన, రాబట్టుకోవలసిన నెల్లు ఎంత, దాని సాయంతోటి సమకూర్చగలిగిన సామాజిక చారిత్రకాంశ ఏపాటిది, అని ఆలోచించాలి. గాథాకారులెవరైనా గాయనీ గాయకులు సమాజం అడుగు పొరలనుంచి వచ్చిన వ్యక్తులు. ఈ వ్యక్తులకు ఇది ప్రత్యేకసిద్ధి కాదు. సమష్టి సంచితం కొందరి ముఖతా వెలువడుతుంది - అంతే. మీదుమిక్కిలి, వీళ్ళు కులవ్యవస్థలో కడగొట్టు భాగాలకు చెందినవాళ్ళు - స్పృశ్యులుగానీ, అస్పృశ్యులుగానీ. విద్యాగంధం శూన్యం. సంపదకెలాగో శిష్ట సంస్కృతికి అలాగే దాదాపుగా వెలిబడిన సాదామనుషులు. అయినా తరతరాల నుంచీ యీ గాథా సాహిత్యాన్ని సొంతం చేసుకొని అవిచ్ఛిన్నంగా మౌఖిక పద్ధతిలో కొనసాగించ గలుగుతున్నారు. పల్లెపట్టున రాత్రులకు

రాత్రులు వరసగా అవిశ్రాంతంగా కథాగానం చేస్తూ కొందరు, శ్రమక్రమంలో అలసటనూ, వేసటనూ తొలగించుకునేందుకు అలవాటు చొప్పున గానం చేసేవాళ్ళు కొందరు, పురుషులు స్త్రీలు యీ పామర సాహిత్య సంప్రదాయాన్ని చావనీకుండా నిలబెట్ట గలుగుతున్నారు. నాగరికత వ్యాపిస్తున్నకొద్దీ ఈ భూస్వామిక యుగీన పామరజన సంస్కృతి కంటికే గాక చెవికీ దూరమై మొరటనిపించుకొని అదృశ్యం కాక తప్పదు. ఇలాంటి స్థితిలో, ఇంకా నేలమీద నూకలు మిగిలి వుండగానే దాన్ని వెదికి, నెమికి, పట్టి, అక్షరబద్ధం చేసి, నిక్షేపించాలంటే మరో వందమంది తంగిరాల వెంకటసుబ్బారావులైనా అవసరం. వెయ్యి చేతులు చేయగలిగిన పని ఇంకా మిగిలి వుంది. డా. బిరుదురాజు రామరాజు, డా. తూమాటి దోణప్ప, డా. నాయని కృష్ణకుమారి, డా. గోవు లింగారెడ్డి, ఇంకా ఎందరో ఈ విధమయిన పనికి పూనుకొని ఎంతో కొంత సత్ఫలితమే చూపెట్టారు. అయినా ఇది నేటికీ సశేషమే. వీరికి, డా॥ సుబ్బారావుకు మధ్యగల భేదం, నాకంటికి, ఒక్కటే కనిపిస్తూంది. గుణంలో గాకున్నా పరిమాణంలో సుబ్బారావు పరిశోధనాకృషి బారైనదే గాక బరువైనది. నిడివిలోనే గాక విరివిలోనూ భేదం కనిపిస్తుంది.

కాటమరాజు కథాచక్రం గానీ, శక్తికథాచక్రం గానీ, పలనాటి వీరకథాచక్రం గానీ వ్యక్తిమాత్రులైన కర్తలకు చెందినవి కావు. రచనలు అసలే కావు. 'కవిసార్వభౌముడు' అనిపించుకున్న శ్రీనాథుడు పలనాటి వీరచరిత్రను రచించి వుండడు. రచించాడనుకొన్నా, తనకు యోగ్యమనిపించిన 'బాలుని యుద్ధం' వంటి భాగాలే రచించి వుండవచ్చు. 'శ్రీనాథ భట్టు'కూ - 'కవిసార్వభౌము'నికీ అభేదం చెప్పడం సాహసం. కొండయ్య, మల్లయ్య, మరొకరు, ఇంకొకరు - యిలాంటి వారే వీటిని గ్రంథస్థం చేసి వుండాలి. మంజరీ ద్విపద నడకలో గూడా కుంట్లు, రచనలో ఛందోభంగాలు, శబ్ద దోషాలు వల్లకొల్లగా కనిపించడానికి కారణం, యిదంతా పామనజన సృజన కావడమే. ''పండితుల చేతఁ బరిష్కరింపబడియె''నని ప్రకాశకులు ఎన్నడైతే రాశారో, అప్పుడే జానపద సాహిత్యాన్ని సంస్కరించి, శిష్ట సాహిత్య స్థాయిని కల్పించాలనే తాపత్రయంతోటి 'పండితులు' చెయ్యి చేసుకొన్నారని అర్థం చేసికోవలసి వుంటుంది. వేమనను అలాగే సంస్కరించారు. బ్రౌన్ చేసి చూపినదాన్ని చెరిపారు. పల్నాటి వీర చరిత్రను ''పండిత అక్కిరాజు ఉమాకాన్త విద్యాశేఖరులవారు'', ఆ తర్వాత 'ఆచార్య' పింగళి లక్ష్మీకాంతంగారు ఇలాగే మార్చారు. ఈ సంస్కరణ ఒక విధమయిన సంహరణ కాగా, ఈ మార్పు ఒక విధమయిన తెగటార్పుగానే పర్యవసించింది. మాతృక మొక్కట్లు స్ఫుటంగా

కనిపించని విధంగా పత్రికను పాండిత్యకోటి సింగారించడం, జానపదసాహిత్యాన్ని న్యూనతనుంచి తప్పించే ఉద్దేశ్యంతోటి కృతకతకు లోబరచివేయడమే. డా॥ టి.వి. సుబ్బారావు యిలా బలంగా చేయిజేసుకోలేదనే అనుకుంటున్నాను. ఎవరు అలా చేసినా క్షమార్హులు కారు. ఆ పని సాహిత్య-అకృత్యమే.

సిద్ధాంత గ్రంథరచనకు గ్రాంథిక భాషనే విధించిన రోజులలో టి.వి. సుబ్బారావు తన రచన చేశారు (1968). నిబంధన ప్రకారమే చేసినా, ఇష్టం కొద్దీ చేసినా, తన సిద్ధాంత గ్రంథంలో ఆయన వాడిన గ్రాంథిక భాషాశైలి కఠినం గాకపోవడం మంచిదయింది. లేకుంటే కొరుకుడు పడకుండా వుండేది. విశ్లేషణ పాలు ఎక్కువై వుంటే, వర్ణనా వైఫల్యం తగ్గి వుండేది. దాని మూలంగా ముద్రణలో వ్యయప్రయాసలు తగ్గి వుండేవి. కాని, ఇదంతా గతజల సేతుబంధనమే!

లోపాలు లేని వస్తువు ఏదీ వుండదు. లోపాలెక్కువా గుణాలెక్కువా అని చూసినప్పుడు టి.వి. సుబ్బారావు కృషి ప్రశస్తమయినది.

**(1986 జూన్ నెల 'భారతి' పత్రిక, కలగూరగంప, పుటలు 70-72)**

# ఈనాటి 'నా మాట'

'తెలుగు వీరగాథా కవిత్వం' (Ballad Poetry in Telugu) అనే ఈ సిద్ధాంత వ్యాసం శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో 1963 నుండి 1968 వరకూ నేను చేసిన పరిశోధన ఫలితం. ఇది మొత్తం 25 ప్రకరణాలలో సుమారు 1500 పుటలలో సుదీర్ఘంగా వ్రాయబడిన వ్యాసం. దీనిని అప్పట్లో ముద్రించాలనుకుంటే 30వేల రూపాయలు అవుతుందన్నారు. అంత డబ్బు అప్పట్లో నా శక్తికి మించిన పని. ఇప్పుడు ముద్రించాలంటే రెండున్నర లక్షల రూపాయలు కావాలి. ఇప్పుడు ఇది కూడా నా శక్తికి మించిన పనే! అందువల్ల దీనిని నాలుగు సంపుటాలుగా విడదీశాను. ఒక్కొక్క సంపుటానికి 60వేల రూపాయల చొప్పున ఖర్చు చేసి ముద్రించాలని నిర్ణయించుకున్నాను. మొదటి సంపుటం ఇప్పుడు ముద్రిస్తున్నాను. దీనికి తిరుమల తిరుపతి దేవస్థానంవారు 20వేల రూపాయల విరాళం ఇచ్చారు. టి.టి.డి. కార్యనిర్వహణాధికారియైన శ్రీ ఐ.వి. సుబ్బారావుగారికి మిక్కిలి కృతజ్ఞుణ్ణి.

1963-64 సంవత్సరాలలో ఈ పరిశోధన నేపథ్యానికి కావలసిన ఆంధ్రాంగ్ల గ్రంథాలు చదివాను. 1964-67మధ్య సుమారు మూడు సంవత్సరాలపాటు ఆంధ్రదేశమంతటా సంచరించి వివిధ వీరగాథలను సేకరించాను. గాథాకారులు పాడుతుంటే వ్రాసుకున్నవి కొన్ని; వ్రాతప్రతుల రూపంలో ఉన్నవి కొన్ని; తాళపత్ర గ్రంథాలుగా లభించినవి కొన్ని. ముఖ్యంగా పల్నాటి వీరకథలు, కాటమరాజు కథలు తాటియాకుల పుస్తకాలుగానే లభించాయి. 1966-68 సంవత్సరాల మధ్య ఒక సంవత్సరం నాలుగు మాసాలపాటు సిద్ధాంత వ్యాసరచన చేశాను. 1968 జనవరి 23వ తేదీ నాటికి రచన పూర్తి అయింది. సరిగ్గా ఆ రోజు భారత స్వాతంత్ర్య సమర మహావీరుడు నేతాజీ సుభాస చంద్ర బోసు జన్మదినం. ఇది కాకతాళీయమైనా నాకు ఎంతో ఆనందాన్ని కలిగించింది. 1968 జనవరిలో సమర్పించిన సిద్ధాంత వ్యాసానికి 1969 ఫిబ్రవరి నెలలో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంవారు పిహెచ్.డి. డిగ్రీకి అర్హమైనదిగా ప్రకటించారు. ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు, ఆచార్య యస్వీ జోగారావుగారు, ఆచార్య కొత్తపల్లి వీరభద్ర రావుగారు నా సిద్ధాంత వ్యాసాన్ని పరీక్షించి, ఉత్తమమైనదిగా నిర్ణయించారు. అంతేకాదు మౌఖిక పరీక్ష (viva-voce examination) లేకుండానే డిగ్రీ ఇవ్వవచ్చునని కూడా ఈ పరీక్షకులు విశ్వవిద్యాలయానికి సిఫారసు చేశారు! ఈ ఆచార్యత్రయానికి నా కృతజ్ఞతలు.

''తెలుగు వీరగాథా కవిత్వము'' అనే అతి విపులమూ అత్యుత్తమమూ అయిన ఈ సిద్ధాంతవ్యాసం 33 ఏళ్ళపాటు వెలుగు చూడకపోవటం నాకు మిక్కిలి బాధాకరమైన విషయమే అయినా, దీంట్లోని ముఖ్యమైన విషయాలన్నీ 1969-1975 సంవత్సరాల మధ్య కొన్ని వ్యాసాల రూపంలో 'భారతి'లో ప్రకటించాను. అవి కీ.శే. నోరి నరసింహశాస్త్రి,

కీ.శే. కె.వి. రమణారెడ్డిగారల వంటి ప్రముఖ కవి పండితుల ప్రశంసలు పొందాయి. 1975లో హైదరాబాదులో మొదటి ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీవారు నా సిద్ధాంత-వ్యాస సారాంశాన్ని (''సింహావలోకనము'' అనే చివరి ప్రకరణాన్ని) ''జానపద సాహిత్యము - వీరగాథలు'' అనే మోనోగ్రాఫ్‌గా ప్రకటించారు. నా పరిశోధనకు ముగ్ధులైన కీ.శే. నోరి నరసింహశాస్త్రిగారి సలహాపై ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు నేను సంపాదించి పరిష్కరించిన ''కాటమరాజు కథలు'' అనే నాలుగువేల పుటల వ్రాతప్రతిని రెండు సంపుటాలుగా 1976-78 సంవత్సరాలలో ప్రచురించారు. మొదటి సంపుటానికి నేను 300 పుటల సమగ్ర పీఠికను రచించాను. దీనితో నా సిద్ధాంతవ్యాసంలోని ''కాటమరాజు కథాచక్రము'' అనే 12వ ప్రకరణం వెలుగుచూచినట్లు అయింది. 1983లో నేను ''శక్తి కథాచక్రము'' అనే 10వ ప్రకరణాన్ని, ''పల్నాటి వీరకథాచక్రము'' అనే 11వ ప్రకరణాన్ని కలిపి ''తెలుగు వీరగాథా కవిత్వము - రెండవసంపుటము'' అనే పేరుతో ముద్రించాను. తరువాత 'బుఱ్ఱకథ'ను గూర్చిన సమస్త విషయాలూ పెద్ద వ్యాసంగా ''నాట్యకళ'' అనే ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడమీ వారి పత్రికలో ప్రచురించాను. ఈ విధంగా ఈ 33 ఏళ్ళలో నా సిద్ధాంతవ్యాస సారాంశమూ, వీరగాథా చక్రాలను గురించిన 10,11,12 ప్రకరణాలు, 'బుఱ్ఱకథ'ను గూర్చిన విషయాలు మాత్రం వెలుగు చూచాయి. తక్కినవి పండిత లోకానికి తెలియకుండానే ఉండిపోయాయి. వీటిలో ''వీరగాథల ఛందస్సు''ను గురించి నేను అపూర్వమైన విషయాలు వెల్లడించాను. గురువర్యులు ఆచార్య తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు ఈ ప్రకరణాన్ని చూచి, ''నేనే నీ థీసీస్సుకు ఎక్జామినర్‌ని అయితే ఈ ఒక్క ప్రకరణానికే నీకు పిహెచ్.డి. డిగ్రీ ఇచ్చి వేస్తాను!'' అన్నారు.

వీరగాథలను గురించి 'భారతి'లో నేను వ్రాసిన వ్యాసాలు చదివి మిక్కిలిగా సంతోషించిన కె.వి.రమణారెడ్డిగారు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయానికి వెళ్ళి, మా గురువర్యులు ఆచార్య జి.యన్.రెడ్డిగారిని కలిసి, నా సిద్ధాంత వ్యాసప్రతిని తీసికొని, 1500 పుటలూ పూర్తిగా చదివేసి, ఆనందపారవశ్యంతో నాకు ఈ క్రింది విధంగా లేఖ వ్రాశారు:

"This is not 'Research'! This is not 'Search' even! This is an 'Adventure'! Hats off to you! I want to see you!!"

ఈ మెచ్చుకోలును చూచి నేను ఎంతగా ఆనందించానో మాటలలో చెప్పలేను. వెంటనే 'కావలి' వెళ్ళి వారి దర్శనం చేసుకున్నాను. 1947 ఆగస్టు 15న ప్రచురింపబడిన ''ఆంధ్రపత్రిక'' ప్రత్యేక సంచికను వారికి బహూకరించాను. వారు నాకు 1901లో నందిరాజు చలపతిరావుగారు ప్రచురించిన ''స్త్రీల పాటలు - మొదటి భాగము'' ను బహూకరించారు. తరువాత వారు 'భారతి'లో నా సిద్ధాంత వ్యాసాన్ని గురించి ''సమాంతర సాహిత్యం'' అనే వ్యాసాన్ని ప్రచురించారు. (దానినే ఇప్పుడు ఈ గ్రంథానికి పీఠికగా చేసుకున్నాను)

25 ప్రకరణాలతో కూడి అతి విస్తృతమైన ''తెలుగు వీరగాథా కవిత్వము'' అనే ఈ సిద్ధాంతవ్యాసాన్ని నాలుగు సంపుటాలుగా విడదీశాను. ఒక్కొక్క సంపుటానికి ఒక్కొక్క పేరు పెట్టాను. 25 ప్రకరణాలనూ ఈ నాలుగు సంపుటాలలోకీ అమర్చాను. నా వర్గీకరణం ఈ క్రింది విధంగా ఉంటుంది:

## తెలుగు వీరగాథా కవిత్వము

**మొదటి సంపుటము : వీరగాథా లక్షణము**

1. ఆముఖము
2. వీరగాథా నిర్వచనము
3. వీరగాథల ప్రాచీనత
4. వీరగాథల ఉత్పత్తి కర్తృత్వములు
5. విదేశ భాషలు - వీరగాథలు
6. భారత భాషలు - వీరగాథలు
7. తెలుగులో వీరగాథలు
8. వీరగాథా లక్షణములు
9. వీరగాథల వర్గీకరణము

**రెండవ సంపుటము : వీరగాథా చక్రములు**

10. శక్తి కథాచక్రము
11. పలనాటి వీరకథ చక్రము
12. కాటమరాజు కథాచక్రము

**మూడవ సంపుటము : వీరగాథలు- వీరగాథానికలు**

13. బొబ్బిలి వరుస కథలు
14. పదములు - జంగం కథలు
15. వీరగాథానికలు లేక లఘువీరగాథలు
16. వీరగాథానుకరణములు - బుఱ్ఱకథలు

**నాలుగవ సంపుటము : రసపోషణాదులు – వైశిష్ట్యము**

17. వీరగాథలు - రసపోషణ
18. వీరగాథా కవిత్వము - పారానువర్తనములు

ఈ మొదటి సంపుటాన్ని గృహదైవానికీ, ఇష్టదైవానికీ, తల్లి దండ్రులకూ, అక్కయ్యలిద్దరికీ, అన్నదమ్ములకీ అంకితం చేశాను. రెండవ సంపుటాన్ని గురువర్యులకూ; మూడవ సంపుటాన్ని ఆప్త మిత్రులకూ; నాల్గవ సంపుటాన్ని నా భార్యా పుత్రులకూ అంకితం చేయబోతున్నాను.

ఈ సిద్ధాంత వ్యాసరచన 1967లో జరిగింది. ముద్రణ ఇప్పుడు చేస్తున్నాను. ఈ 33 సంవత్సరాలలో జానపద విజ్ఞానరంగంలో అనేక నూతన సిద్ధాంతాలు తలెత్తాయి. తెలుగులోను ఇతర భారతీయ భాషలలోను జానపద విజ్ఞాన పరిశోధనలు బహుముఖాలుగా విస్తరించాయి. ఈ నూతన సిద్ధాంతాలతో వీరగాథలను సమన్వయించే శక్తి సామర్థ్యాలు కాని, సమయ సందర్భాలు కాని, జవసత్వాలు కాని ఇప్పుడు 65 ఏండ్లు దాటిన నాకు లేవు. అయినా ఆనాడు నేను చేసిన పరిశోధనలోని మౌలికత (Originality) ఏ మాత్రమూ చెక్కు చెదరలేదని ఈనాటి జానపద విజ్ఞాన వేత్తలు గ్రహించగలరు.

జానపద సాహిత్యాన్ని గురించిన ఈ పరిశోధన వ్యాసాన్ని గ్రాంథిక భాషలో వ్రాయడం ఏమిటి? - అనే ప్రశ్న తలయెత్తవచ్చు. శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం - మద్రాసు విశ్వవిద్యాలయానికి మానస పుత్రిక. అక్కడి నియమ నిబంధనలనే ఇక్కడా పాటించారు. తెలుగు శాఖలో సిద్ధాంత వ్యాసాలు ఇంగ్లీషులో వ్రాయలనే నియమం మద్రాసులో ఉండేది. దానినే శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం వారు కూడా పాటించారు కొన్నాళ్ళు. తరువాత ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు వచ్చి తెలుగుశాఖలో సిద్ధాంతవ్యాసాలు తెలుగులోనే వ్రాయవచ్చునని

తీర్మానించారు. అయితే అప్పుడు ఆంధ్రదేశంలోని విశ్వవిద్యాలయాలన్నింటిలోనూ బి.ఏ., ఎం.ఏ. పరీక్షలలోకాని, సిద్ధాంత వ్యాసరచనలోకాని విధిగా గ్రాంథిక భాషనే ఉపయోగించాలనే నియమం ఉండేది. అందువల్ల నేను ఆనాటి నియమానుసారంగా ఈ సిద్ధాంత వ్యాసరచన గ్రాంథిక భాషలోనే చేశాను. తరువాతి కాలంలో వ్యావహారిక భాష ప్రముఖ స్థానాన్ని ఆక్రమించింది. అయితే ఈ సుదీర్ఘమైన వ్యాసాన్ని మళ్ళీ వ్యావహారిక భాషలోకి మార్చాలంటే నా తలప్రాణం తోకకి వస్తుంది. అందువల్ల అరసున్నలు తీసివేసి, విసంధి పాటించి, సరళాదేశాలు, గసడదవాదేశాలూ తీసివేశాను. శకటరేఫను మాత్రం అలాగే ఉంచి వేశాను. (కావ్య భాషలో రేఫ శకటరేఫలు ఆధునిక భాషా శాస్త్రరీత్యా కూడా భిన్న వర్ణాలు.

| ఉదా॥ | నీరు = ఉదకము; | నీఱు = భస్మము. |
|---|---|---|
| | అరుగు = పోవు; | అఱుగు = జీర్ణించు, క్షమించు |
| | వేరు = చెట్టు మూలము; | వేఱు = భేదము, అన్యము |
| | తేరు = రథము; | తేఱు = తేటపడు |
| | కారు = అడవి; | కాఱు = స్రవించు). |

అంటే సరళ గ్రాంథికంలోకి మార్చాను. శిష్ట వ్యావహారికంలోకి మార్చలేకపోయాను. పాఠకులు క్షమించగలరు.

ఈ సిద్ధాంత వ్యాసరచన 1968 జనవరి 23వ తేదీనాటికి, నేతాజీ సుభాస చంద్ర బోసు జన్మదినం నాటికి, పూర్తి అయిందని ఇంతకు ముందే విన్నవించాను. తరువాత దీనిని మద్రాసు తీసికొని పోయి తెలుగు టైపింగ్ చేయించి, బైడింగ్ చేయించి, తీసికొనిరావలసి వచ్చింది. (అప్పుడు తిరుపతిలో తెలుగు టైపింగు లేదు; మద్రాసులో మాత్రమే ఉండేది). దీనికి సుమారు రెండువేల రూపాయలు ఖర్చు అవుతుందని తెలిసింది. నా దగ్గర డబ్బులేదు. అప్పుడు నా గురువులూ ప్రియమిత్రులూ పదిమంది చేరి ఒక్కొక్కరు 200రూపాయల చొప్పున నాకు అప్పుగా ఇచ్చారు. నాకు ఆ విధంగా సహాయం చేసిన మహానుభావులు : శ్రీయుతులు జి.యన్.రెడ్డిగారు, తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారు, మద్దూరి సుబ్బారెడ్డిగారు, ప్రసాదరాయ కులపతిగారు, లింగంనేని బసవ శంకరరావు, సానికొమ్ము అక్కిరెడ్డి, బొప్పన విశ్వేశ్వరరావుగారు తదితరులు. వీరందరికీ నేను మిక్కిలి ఋణపడిఉన్నాను. వీరి మేలు నేను ఎన్నటికీ మరువలేను.

సుప్రసిద్ధ చలనచిత్ర దర్శకులు, ప్రముఖ చిత్రకారులు 'కళాప్రపూర్ణ'లు అయిన 'బాపు' గారు (మద్రాసు) నా సిద్ధాంత వ్యాసానికి అక్షరాలు వ్రాయడమే కాకుండా నాలుగు రేఖా చిత్రాలు కూడా ఉచితంగా వేసి యిచ్చారు. అవి: ''బ్రహ్మనాయుడు - నాయకురాలు నాగమ్మ;

మంచాల - బాలచంద్రుడు; ఖడ్గతిక్కన - బ్రహ్మరుద్రయ్యల ద్వంద్వయుద్ధము; తాండ్రపాపారాయడు విజయ రామరాజును సంహరించుట''. ఆరుద్రగారి కాటమరాజు నాటకానికి 'బాపు'గారు వేసి యిచ్చిన ముఖచిత్రాన్ని కూడా నా సిద్ధాంత వ్యాసంలో ఉపయోగించుకొనేందుకు అనుమతించారు. శ్రీ 'బాపు'గారికి నా నమశ్శతకములు. వీటిని రాబోయే సంపుటాలలో యథోచితంగా ముద్రిస్తాను.

ప్రస్తుతం ఈ మొదటి సంపుటిలో ప్రసిద్ధ చిత్రకారులు శ్రీ మాధవపెద్ది గోఖలే గారు చిత్రించిన ''బ్రహ్మన'' వర్ణచిత్రాన్నీ, శ్రీ ఎస్. జనార్ధన్ గారు చిత్రించిన ''బ్రహ్మనాయడు'' వర్ణచిత్రాన్నీ ఉపయోగించాను. ఈ చిత్రకారులకూ, పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం ఉపాధ్యక్షులైన డా॥ ఎన్. గోపి గారికీ నా కృతజ్ఞతలు.

'గురువాయూరు కృష్ణుని కౌపీన దర్శనము' రంగుల ఫోటోను నాకు ఇచ్చినవారు మహా భక్తులు, సాహిత్య పోషకులు, వితరణశీలి, విజయనగరంలోని 'పూర్ణిమా రెస్టరెంటు' మేనేజరు అయిన శ్రీ ఆర్. ఆర్. కృష్ణగారు. వారికి నా నమస్సుమనస్సులు.

ఈ గ్రంథంలో ప్రకటించిన ''వీర గల్లులు - సతీ కల్లులు'' ఫోటోలు ఇచ్చిన వ్యక్తి - నా ప్రియశిష్యుడు డా॥ ఆర్. శేషశాస్త్రి, కన్నడ రీడరు, శ్రీకృష్ణదేవరాయ విశ్వవిద్యాలయం, అనంతపురం. అతని నా అనంతానంత ఆశీస్సులు...

ఈ వీరగాథా పరిశోధనకు సంబంధించి నేను అప్పట్లో (1963-1968మధ్య) తీసిన ఫోటోలు సుమారు నూరు వరకూ ఉన్నాయి. వాటిని రాబోయే సంపుటాలలో ముద్రిస్తాను.

ఈ గ్రంథాన్ని ఓపికతో, నీట్‌గా డి.టి.పి. చేసి యిచ్చిన శ్రీమతి శాంతిశ్రీకీ; ఈ గ్రంథాన్ని, ఫోటోలను ఎంతో శ్రద్ధతో అహోరాత్రాలు శ్రమించి ముద్రించి యిచ్చిన ప్రియమిత్రులు శ్రీ లక్ష్మీ ఆర్ట్ ప్రింటర్స్ అధినేత డా॥ ఆకెళ్ళ సత్యసుబ్రహ్మణ్య కుమార్‌గారికీ, ఆయన ఇతర సిబ్బందికీ నా ప్రత్యేక కృతజ్ఞతలు.

– తంగిరాల వెంకటసుబ్బారావు

బెంగుళూరు
5-4-2000
(విక్రమ ఉగాది)

# తెలుగు వీరగాథా కవిత్వము

ముద్రణలో నున్న రాబోవు సంపుటములు



రెండవ సంపుటము

వీరగాథా చక్రములు



మూడవ సంపుటము

వీరగాథలు – వీరగాథానికలు



నాలుగవ సంపుటము

రసపోషణాదులు – వైశిష్ట్యము

## మొదటి ప్రకరణము

# ఆముఖము

ప్రపంచమున వీరులు లేని దేశము లేదు; అట్లే వీరగాథలు లేని సాహిత్యమును లేదు[1]. డెన్మార్కు దేశమందును, తత్సంబంధమగు 'ఫేరో' ( Faeroe) ద్వీపములందును, కవిత్వమంతయు వీరగాథలతోనే నిండిపోయినది[2]. ఒక్క డెన్మార్కునకే కాక తక్కిన స్కాండినేవియా కంతకును వీరగాథలు గర్వకారణమగు సాహిత్యముగా పరిణమించి భాసిల్లుచున్నవి. వీనిని తలదన్నినవి స్పెయిన్ వీరగాథలు[3]. పోర్చుగల్ సాహిత్యమున వీరగాథలు తక్క వేఱొక ప్రక్రియ కానరాదు. స్కాట్లండ్ దేశము కూడ వీరగాథాసంపదలో ప్రత్యేకముగా నెన్నదగినది. ఇటలీదేశ విభాగమగు 'సిసిలీ' (Sicily) ద్వీపమున ఏడువేల వీరగాథలున్నవని పరిశోధకులు నిర్ణయించినారు. ఇవన్నియును సాంప్రదాయక వీరగాథలే[4]. భారతదేశమున శూరకుల నిలయమగు రాజస్థానము వీరగాథల పురిటిగడ్డ! హిందీ సాహిత్యచరిత్ర వీరగాథాయుగముతోనే శ్రీకారము చుట్టుకొన్నది. పంజాబు మహారాష్ట్రములు వీరగాథల కాటపట్టులు! మన ఆంధ్ర దేశము వీరగాథల పుట్ట! ఇట్లు వివిధ దేశములలో ప్రాధాన్యము వహించిన వీరగాథాప్రక్రియ, సాహిత్యమునగల వివిధ శాఖోపశాఖలలో దేనికి చెందునో పరిశీలింపవలసియున్నది.

''సాహిత్యము, సారస్వతము, వాఙ్మయము అను పదములు మూఁడును ఇప్పుడు కొంచె మించుమించుగా సమానార్థకములుగానే వాడఁబడుచున్నవి. కాని సూక్ష్మముగాఁ బరిశీలించినచో

---

1. *"Almost all peoples possess a ballad literature."*
   *- Columbia Encyclopaedia, p. 143.*

2. *"Denmark had scarcely any poetry, except the ballads....There was room for the ballads, and the ballads took up all the room, with scarcely a challenge from any other competitor."*
   *- W. P. Ker, 'On the history of the ballads', Proceedings of the British Academy, Vol. IV, 1909-10, p. 198.*

3. *"Denmark, and the rest of Scandinavia, possess a ballad literature of which they do well to be proud; and Spain is said to have inherited even better legacies."*
   *- Frank Sidgwick, Introduction, Popular Ballads of the Olden Time.*

4. *"Nowhere has there been a richer growth of really popular ballads than in Sicily, where Pitre tells us that as many as seven thousand examples have been gathered."*
   *-The Home University Encyclopaedia, p. 377*

వాని యర్థ విస్తృతిలోఁ గొంత భేదము కనిపించును. ఈ మూఁడు పదములలో వాఙ్మయమనునది మిగిలినవానికంటెఁ గొంత విస్తృతతరమైనది. వాగ్రూపమైన సర్వమును ఈ జాతికిఁజెందునని చెప్పవచ్చును. దీనినిబట్టి సంభాషణములు, ఉపన్యాసములు కూడ వాఙ్మయభాగములుగానే పరిగణింపఁదగియుండును. సారస్వతమను పదమింత విశాలమైనది కాదు. లిఖితమైన లేక ముద్రితమైన గ్రంథజాల మంతయు ఈ జాతికిఁ జెందును. దీనిని బట్టి శాస్త్రగ్రంథములను సైతము సారస్వతమని పిలువవచ్చును. సాహిత్యమను పదము వైశాల్యమునఁ బై రెండింటి కంటెను సంకుచితమైనది. రసప్రధానములును, ఆనందప్రదములు నగు కావ్యములను మాత్రమే ఈ నామముతోఁ బిలువవచ్చును''[5].

పై నిర్వచనములను బట్టి 'వాఙ్మయము' లో రసప్రధానములగు కావ్యములు, జ్ఞాన ప్రధానములగు శాస్త్రములు, లౌకికములగు లేఖలు, దస్తావేజులు, వార్తలు, సంభాషణములు, ఉపన్యాసములు, దానశాసనములు, కైఫీయతులు, స్థానిక చరిత్రలు - ఇత్యాదులన్నియును చేరి యుండునని తెలియుచున్నది. ఈ వాఙ్మయము నుండి లేఖలు, దస్తావేజులు, వార్తలు మున్నగు లౌకికములను పరిహరించినచో శాస్త్రములు, కావ్యములు మిగులును. ఈ రెండును కలసి 'సారస్వత' మగును. కాని ఈ లౌకికములలో లేఖలు, సంభాషణలు, ఉపన్యాసములు మున్నగు వాని కేమాత్రము కవితాస్పర్శ యున్నను అవి సాహిత్యమున జేరిపోవుననుట మఱవరాదు. మహా కవులు వ్రాసిన లేఖలు, మాటాడిన చమత్కార సంభాషణలు, ఇచ్చిన మహోపన్యాసములు, సాహిత్య భాగములే కాని, లౌకికములు కానేరవు. ఈ సాహిత్యము కూడ సారస్వతాంగమే యగును.

'లిఖితమైన లేక ముద్రితమైన గ్రంథజాలము'[6] మాత్రమే సారస్వతమని భావించుటలో నొక చిక్కున్నది. వ్రాతకోతలతో పనిలేకుండ కేవలము మౌఖిక సంప్రదాయమున మనియుండు జానపద సాహిత్యము కూడ సారస్వతమున నొక భాగమేకదా! కావున సారస్వతమనగా కేవలము లిఖిత రూపమున నున్నది మాత్రమే కాదు. అలేఖ్య పారంపర్య సంప్రదాయమున వచ్చుచున్న దేశి సాహిత్యమంతయు సారస్వతములోని భాగమే. కాబట్టి రసప్రధానములగు లిఖితాలిఖిత సాహిత్యములును, బుద్ధిప్రధానములగు వివిధ శాస్త్రములును (సాహిత్య శాస్త్రములు, ఆధి భౌతిక శాస్త్రములు, ఆధ్యాత్మిక శాస్త్రములు) సారస్వతమగునని గ్రహింపవలెను.

శాస్త్ర సాహిత్య సమ్మిశ్రితమగు నిట్టి సారస్వతమునుండి బుద్ధిప్రధానములగు శాస్త్రములను తప్పించినచో రసప్రధానములును-ఆనంద ప్రదములును అగు కావ్యములు మాత్రమే మిగులును. ఇవి లిఖితములై యుండవచ్చును; లేదా ముఖస్థములై యుండవచ్చును. ఇవియే

---

5. ఆచార్య దివాకర్ల వేంకటావధాని, *ఆంధ్ర వాఙ్మయ చరిత్రము*, పుట - *1*.
6. అదే. (*Ibid.*)

సాహిత్యమను పేర వ్యవహరింప దగినవి. ఆఙ్గ్లేయులు 'Literature' అను పదమును ఈ యర్థముననే వాడుచున్నారు. కొందఱు ఆఙ్గ్ల విమర్శకులు సారస్వతార్థమున 'Literature' అను పదమును క్వాచిత్కముగా నుపయోగింపకపోలేదు. కాని అట్టియెడ శాస్త్రములను 'Literature of Knowledge' అనియు, కావ్యములను 'Literature of Power' అనియు వివరించియున్నారు. కాగా మన సాహిత్య శబ్దమునకు 'Literature' అనునదే సమానార్థకమగు ఆఙ్గ్ల శబ్దము.

ప్రతి నాగరక సంఘమందును ఈ సాహిత్యము ద్వివిధము: పండితకవులచే లక్షణానుగుణముగా వెలయింపబడునది యొక రకము; లక్షణములతో సంబంధము లేకుండ హృదయాభిరుచి ననుసరించి సామాన్య జనులచే వెలయింపబడునది మఱియొక రకము. మొదటిది చేతనాశిల్ప సమన్వితమై లిఖిత రూపమున నుండును. రెండవది అచేతనాశిల్ప సమన్వితమై మౌఖిక ప్రసరణమున వ్యాపించియుండును. లాక్షణికులు వీనికి ప్రత్యేక నామముల నీయకపోయినను, సంగీత నాట్య శాస్త్రముల పరిభాష ననుసరించియు, కన్నడ కవుల సంప్రదాయము ననుసరించియు నన్నెచోడాది మహాకవులు ఈ విభాగములకు వరుసగా 'మార్గ' - 'దేశి' అని పేరిడిరి. ఆఙ్గ్లేయులు వీనిని 'Classical' - 'Popular' అను పేర్లతో వ్యవహరించిరి. కాగా పండితుల సాహిత్యమును 'మార్గ సాహిత్యము' (Classical Literature) అనియు, సామాన్య జనుల సాహిత్యమును 'దేశి సాహిత్యము' (Popular Literature) అనియు పిలువవచ్చును[7].

---

7. *సాహిత్యమందేకాక శాస్త్రమందును ఈ మార్గ - దేశి విభాగమును గుర్తింపవచ్చును. నేడు మనకున్న సాహిత్య శాస్త్రములు (Literary Sciences), ఆధి భౌతిక శాస్త్రములు (Physical Sciences), ఆధ్యాత్మిక శాస్త్రములు (Meta - Physical Sciences) మున్నగున వన్నియును మార్గ శాస్త్రములే. ఇవన్నియును సంఘ నాగరకతాభివృద్ధి వలన ఏర్పడినట్టివే. ఇవి మానవుల మేధస్సంపదకు చిహ్నములు. శిష్టులు మాత్రమే వీని పరమార్థమును గ్రహించి ఆనందింతురు. పామరులకును వీనికిని చాల దూరము. అట్లని పామరులకు శాస్త్రములు లేవని తలపరాదు. జానపదులకును శాస్త్రములున్నవి. వారి భాష, నుడికారము, మాండలికములు, వృత్తి పదములు, సామెతలు మున్నగు వానిని సేకరించి పరిశీలించినచో అవి మన వ్యాకరణాది సాహిత్య శాస్త్రములతో సంవదించును. వారి ఆచారములు, నమ్మకములు, పండుగలు - పబ్బములు, పూజలు- పునస్కారములు, పరలోకము పునర్జన్మాదులను గూర్చిన వారి భావములు, చిలుక జోస్యము, ఎఱుకలసాని జోస్యము, నాటువైద్యము మున్నగునవి పామరులకు సంబంధించిన వివిధ శాస్త్రములనుటలో సందేహము లేదు. వీనిని 'దేశి శాస్త్రములు' లేక 'జానపద శాస్త్రములు' (Folk Sciences) అని పిలువవచ్చును. నృశాస్త్రవేత్తలు (Anthropologists) వివిధ జాతుల పరిశీలనముతోపాటు వారి శాస్త్రములను గూడ దృష్టియందుంచుకొని పరిశోధింతురు. మానవ జాతుల నిర్ణయములో ఈ జానపద శాస్త్రములు వారికెంతగనో ఉపయోగపడును. కావున జానపదశాస్త్ర పరిశోధనము నృశాస్త్రవేత్తలకును, సాంఘికశాస్త్రవేత్తలకును సంబంధించినది. నా ఈ వ్యాసరచనలో దాని పరిశీలనము అప్రస్తుతమగును. ఈ జానపద శాస్త్రములను*

నాగరకతాభివృద్ధి వలన సంఘములో పండిత - పామర భేద మేర్పడుచుండును. ఈ భేదమును బట్టియే సాహిత్యము కూడ మార్గ - దేశి అను విధముగా విడియుండును. అనాగరక సంఘమందు ఇట్టి తరతమ భేదము లుండవు గాన ఆ సాహిత్యమంతయును ఒకే రూపమున నుండును. కోయ, చెంచు మున్నగు ఆటవిక సంఘములలో నేటికిని ఒకే రకమగు సాహిత్యము- అంతయును నాగరక సంఘములోని దేశి ( జానపద) సాహిత్యము వంటిదే యున్నది. ఈ నిసర్గ సాహిత్యమే క్రమపరిణామమున మార్గ సాహిత్య స్వరూపమును దాల్చును. అనాగరక సంఘమంతయు నొకేమాఱు నాగరకము కాదు; కొంత కొంతగా నాగరక మగుచుండును. కావున అనాగరక సంఘములోని సాహిత్యము కూడ కొంతభాగమే మార్గముగా పరిణమించును. తక్కినది జానపద రూపముననే ఉండును. క్రమక్రమముగా సంఘమంతయు నాగరకమగునాటికి, జానపద సాహిత్యము మటుమాయము కావచ్చును. ఆటవికుల మాట యెట్లున్నను, మనకు మాత్రము నేడు సంఘమంతయు నాగరకమ్మై, జానపద సాహిత్య మంతయును నశించిపోగల ఘోర ప్రమాదము కనుచూపుమేరలో గలదు!

తెలుగు సాహిత్యమున మార్గ - దేశి విభాగము స్పష్టము[8]. ఇతిహాసములు, పురాణములు, కావ్యములు, ప్రబంధములు, నాటకములు, చరిత్రలు, కథలు, నవలలు, వ్యాసములు మున్నగునవి మార్గ సాహిత్యమునకు చెందును. పల్లెపాటలు, వీరగాథలు, స్త్రీల పాటలు, ద్విపద కావ్యములు, యక్షగానములు, వీథినాటకములు, హరికథలు, ఉదాహరణములు, శతకములు, సామెతలు, పొడుపుకథలు, దేశికథలు ( తెనాలి రామకృష్ణుని కథలు, పరమానందయ్య శిష్యుల కథలు, భట్టి విక్రమార్కుని కథలు, కాశీమజిలీ కథలు మొదలగునవి)- ఇవి అన్నియును దేశి సాహిత్యము క్రిందికి వచ్చును. దీనిని బట్టి వీరగాథలు దేశి సాహిత్యమున నొక భాగమని తెలియుచున్నది.

సాహిత్యము పండిత పామరాలంబనము ననుసరించి మార్గ-దేశి విభాగములైనట్లే, ఛందస్తత్త్వము ననుసరించి ( లేక లయాత్మకత ననుసరించి) 'కవిత్వము'- 'వచనము' అను మఱి రెండు ప్రధాన భాగములుగా విడిపోవును. తెలుగునందు మార్గ - దేశి సాత్యముల రెండింటను

---

విన్న మొన్నటి వఱకును 'సాంప్రదాయక విజ్ఞానము' (Folklore) అని వ్యవహరించెడివారు. కాని నేడీ శబ్దార్థమతివిస్తృతమ్మై, జానపద సాహిత్యమును గూడ కలుపుకొని, జానపదులకు సంబంధించిన సమస్త విషయములను సూచించునదిగా పరిగణింపబడుచున్నది.

8. *".........the evolution of Telugu literature falls into two catagories - Marga, classical, and Desi, indegenous or popular type. The Purana, Mahakavya, Prabandha - relating to Marga; the Dwipada, Udaharana, Sataka, Yakshagana and Geya Kavita relating to Desi..........."*

*- N. Venkatarao, Introduction to 'Lives of Telugu Poets', p.xi.*

ఈ విభాగము సుస్పష్టము. పురాణ, ఇతిహాస, కావ్య, మహాకావ్య, ఖండకావ్య, ప్రబంధ, పద్యనాటక, భావకవిత్వాదులు మార్గసాహిత్యమున కవితాశాఖకు చెందును. తక్కిన దేశచరిత్రలు, జీవిత చరిత్రలు, ఆత్మకథలు, నవలలు, నవలికలు, వచన నాటక-నాటికలు, కథా-కథానికలు, వ్యాస-పరిశోధక వ్యాసాదులు మార్గమున వచనశాఖకు చెందును. అట్లే దేశిసాహిత్యమున పల్లె పాటలు (లేక జానపద గేయములు), వీరగాథలు, పిల్లలపాటలు, స్త్రీలపాటలు, భజనకీర్తనలు (రామదాసు, అన్నమయ్య), కృతులు (త్యాగరాజు), పదములు (క్షేత్రయ్య), హరికథలు, యక్షగానములు, వీథినాటకములు, ద్విపదకావ్యములు, ఉదాహరణములు, అష్టకములు, శతకములు మున్నగునవి కవిత్వవిభాగము క్రిందికి వచ్చును. తెనాలి రామలింగని కథలు, తాతాచార్యుల కథలు, పరమానందయ్య శిష్యుల కథలు, భట్టి విక్రమార్కుని కథలు, సహస్ర శిరశ్ఛేద అపూర్వ చింతామణి కథలు, మదన కామరాజు కథలు, చిలుక చెప్పిన కథలు, హంస వింశతి కథలు, పలుకని పద్మావతి కథలు, పేదరాసి పెద్దమ్మ కథలు, స్త్రీల వ్రతకథలు, భోజ కాళిదాసు కథలు, బేతాళ పంచవింశతి కథలు, మర్యాద రామన్న కథలు మున్నగు దేశికథ లన్నియును దేశిసాహిత్యమున వచనవిభాగము క్రిందికి వచ్చును. లయాత్మకములును, రసప్లావితములును అగుటచే సామెతలు, పొడుపుకథలు కూడ దేశిసాహిత్యమున కవితావిభాగమునకే చేరునని నా యభిప్రాయము. ఈ విధమగు విభజనను బట్టి వీరగాథలు దేశిసాహిత్యమున కవిత్వశాఖకు చెందినవని స్పష్టమగుచున్నది.

పైన చేసిన మార్గ-దేశి కవితావిభాగము స్థూలనిర్దేశము మాత్రమే. అటు మార్గమును గాక, ఇటు దేశియును గాక, మధ్యేమార్గము ననుసరించు రచనలును కొన్ని కలవు. ''ఏదైన నొక పద్ధతిని మార్గమో దేశియో యనుట బాహుళ్య దృష్టితోడనే. మార్గకవిత్వమున దేశి కవితాచ్ఛాయలు కొన్నియు, దేశికవిత్వమున మార్గకవితాచ్ఛాయలు కొన్నియుఁ గాన వచ్చుచునే యుండును''[9]. కాబట్టి మఱికొంత సూక్ష్మ విభాగ మావశ్యకము.

నన్నయ నన్నెచోడుల రచనలు రెండును మార్గకవితాశాఖకే చెందినను రెంటికిని భేద మున్నది. అట్లే పాల్కురికి సోమనాథుని ద్విపదకావ్యములు, శ్రీనాథుని పల్నాటి వీరకథలు - ఈ రెండును దేశి కవితాశాఖకే చెందినను రెంటికిని భేదమున్నది. శార్ఙ్గదేవుడు తన సంగీత రత్నాకరమున గానమును మార్గ - దేశి విభాగములుగ మాత్రమే విభజించి ఊరకొనలేదు. దేశి గానమును మఱల 'నిబద్ధదేశి', 'అనిబద్ధదేశి' అని విభజించినాడు. కేవలము లక్షణ నిబద్ధమైనది నిబద్ధదేశి; లక్షణములు కొంచెము సడలింపబడినది అనిబద్ధదేశి. మన మీ విభజనపద్ధతిని మార్గ - దేశి కవిత్వముల యెడ పాటించి పరిశీలింపవచ్చును. అప్పుడు నన్నయాదుల కవిత్వము నిబద్ధ మార్గమును, నన్నెచోడుని కవిత్వము అనిబద్ధ మార్గమును అగును. అట్లే పాల్కురికి సోమనాథుని

9. ఆచార్య దివాకర్ల వేంకటావధాని, ప్రాఙ్నన్నయ యుగము, పుట - 381.

కవిత్వము నిబద్ధదేశి, పల్నాటి వీరకథాదులు 'అనిబద్ధదేశి' లేక 'శుద్ధదేశి' అనవచ్చును[10]. కాన వీరగాథలను కేవలము దేశికవిత్వ మనుటకన్న 'అనిబద్ధదేశి' లేక 'శుద్ధదేశి' (purely popular) కవితాప్రక్రియ యనుట మఱింత సమంజసము.

పల్లెపాటలు, వీరగాథలు, పిల్లలపాటలు, స్త్రీలపాటలు, రామదాసు భజనకీర్తనలు- ఇవి అనిబద్ధదేశి కవిత్వమునకు చెందును. ఇవి ప్రజల జిహ్వాగ్రములపై తాండవమాడుచు వివిధ రూపములలో నుండుటచే అనిబద్ధములు. ద్విపదకావ్యములు, యక్షగానములు, హరికథలు, వీథినాటకములు, ఉదాహరణములు, అష్టకములు, శతకములు, అన్నమాచార్యుని కీర్తనలు, అధ్యాత్మ రామాయణ కీర్తనలు - ఇవి నిబద్ధదేశికవిత్వమునకు లక్ష్యము లగును. వీనియందు ఛందస్సు, రచనాస్వరూపము, రాగతాళములు మున్నగునవి నిబద్ధింపబడియున్నవి. త్యాగరాజ కృతులు, క్షేత్రయ్య పదములు, జావళీలు సాహిత్యమునుండి సంగీతములోనికి తప్పుకొనిన రచనలు[11]. ఇవి కేవలము సంగీతజ్ఞుల సొమ్ముగనే పరిగణింపబడుచున్నవి. (కాని అన్నమాచార్య కీర్తనలు, అధ్యాత్మ రామాయణ కీర్తనలు సంగీతముతోపాటు సాహిత్యముపై కూడ దృష్టినుంచి రచింపబడినవి. అందుచే నివి నిబద్ధదేశికి చెందును.) రామదాసు భజనకీర్తన లిట్టివి కావు. ఇవి సంగీత జటిలములు కాకుండటచే పామరులను సహిత మాకర్షించినవి. జానపదగేయముల వలెనే వీనికిని బహుజనాదరపాత్రత, విశేషవ్యాప్తి యను లక్షణము లున్నవి. కావున నివి అనిబద్ధ దేశి

---

10. *ఒక రచన సంపూర్ణముగా దేశి యనుటకు మూడు ముఖ్యలక్షణము లా రచనలో నుండవలెను. ఇతివృత్తము, ఛందస్సు, భాష - ఈ మూడును ఎక్కడి నుండియో ఎరవు తెచ్చుకొన్నవిగా గాక, దేశీయములై యుండవలెను. పాల్కురికి సోమనాథుని రచనలలో ఛందస్సు, ఇతివృత్తము - అను రెండు మాత్రమే దేశి. భాష అంతయు మార్గమే. (ఇతివృత్తములలో గూడ ఒక్క పండితారాధ్య చరిత్రలోని ఇతివృత్తము మాత్రమే దేశీయమైనది). పల్నాటి వీరకథాదుల యందు పైన చెప్పిన మూడు గుణములును సంపూర్ణముగా దేశీయములై యున్నవి. కాబట్టి అవి శుద్ధ దేశి ప్రక్రియకు చెందును.*

*(- చూ. ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి పల్నాటి వీరచరిత్ర, పీఠిక, పుటలు -26, 27)*

11. *'సాహిత్యము నుంచి సంగీతములోనికి తప్పుకున్న క్షేత్రయ్య పదములూ, పరిమళ రంగని పదములూ; ఘట్టుపల్లి - ధర్మపురి - ఛత్రపురి - జావళీలు; సారంగపాణి పదములూ, దాసు శ్రీరాములు కీర్తనలూ, సంగీత రచనలే కాని దేశిసారస్వతంలోకి రావేమో నంటాను. వాటి ప్రచారము వాటిలోని సంగీతము వల్లనే కాని సాహిత్యము వల్ల కాదు. అధ్యాత్మ రామాయణ కీర్తనలు మట్టుకు కథాప్రాధాన్యతని కూడా లెక్కపెట్టి సాహిత్యము మీద మొగ్గుంచి రచించినవి.''*

*- డా॥ శ్రీపాద గోపాలకృష్ణమూర్తి, 'దేశి సారస్వత విభూతి', కిన్నెర, డిసెంబరు 1953, పుటలు 561-562.*

యనుటలో సందేహింపబనిలేదు[12]. 'మా కొ ద్దీ తెల్ల దొరతనము.......', 'మరువకు డార్యులారా పంజాబు వధలు', 'దండాలు దండాలు', 'నిరాకరణమను మిఠాయి', 'జైలు అది వున్నదీ మనకొక్క-వ్వైలు', 'జగద్రక్షకుడు గాంధిమహాత్ముడు' మున్నగు పాటలు రాజకీయోద్యమమును పురస్కరించుకొని పుట్టినవి. ఇవి కూడ నిబద్ధదేశి క్రిందికే వచ్చును. ఏలయన ఇవి శతకములవలెనే సామాన్యుల నుద్దేశించి పండితులు చెప్పిన పాటలు; జానపద గేయానుకరణములు. సామెతలు, పొడుపు కథలు - ఇవి రెండును ముఖ్యముగా స్త్రీలను, పిల్లలను ఆశ్రయించి యుండును. ఇవి నూటికి నూఱుపాళ్ళును దేశి సాహిత్యమునకు చెందునని శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు నిస్సందేహముగా నిర్ణయించి యున్నారు[13]. అయినను వీనియందు నాకొక నిబద్ధత గోచరించు చున్నది. వీనిలో అక్షరములనుగాని, పదములనుగాని ఎవరి యిచ్ఛవచ్చిన రీతి వారు మార్చుటకు వీలు లేదు. అవి యెల్లప్పుడు నొక నిర్ణీత స్వరూపమునందే యుండును. కావున వీనిని నిబద్ధదేశిగా భావింపవలెనేమో యని నా యనుమానము. నిబద్ధదేశికి చెందవలసిన త్యాగరాజు, క్షేత్రయ్యల రచనలు సాహిత్యమునుండి సంగీతములోనికి తప్పుకొనినట్లే - తోలుబొమ్మలాటలు, కొయ్య బొమ్మలాటలు, పగటి వేషములు మున్నగునవి సాహిత్యమునుండి ప్రదర్శనములోనికి తప్పుకొనినవని తలపవచ్చును.

మఱింత సూక్ష్మపరిశీలనమువలన అనిబద్ధదేశిలో సహితము మఱియొక వర్గము బయటపడును. ఇటు అనిబద్ధ దేశికన్న ఒకమెట్టుపైనను, అటు నిబద్ధ దేశికన్న ఒకమెట్టు క్రిందను ఉండు కవితాప్రక్రియలు కొన్ని కలవు. స్త్రీలపాటలు, భజనకీర్తనలు ఈ వర్గములో జేరును. ఇవి పల్లెపాటలకన్నను వీరగాథలకన్నను భిన్నములు. పామరులును, నిరక్షర కుక్షులును, నిమ్నజాతులవారును అగు పల్లెప్రజలు, కష్ట నివారణమునకుగాని, ఉల్లాసమునకుగాని పాడుకొను ఆత్మాశ్రయ ముక్తక సరళగీతములే 'పల్లెపాటలు' లేక 'జానపద గేయములు'. వీనిని ఆంగ్లమున **'Folksongs'** అందురు. వివిధ వర్ణములవారి నాశ్రయించుకొని జీవించు 'దేశద్రిమ్మరు'లగు భిక్షువులు పాడెడి పరాశ్రయ, కథాసహిత, వీరరసప్రధాన, సుదీర్ఘ గేయములు 'వీరగాథలు' లేక

---

12. *'పద సారస్వతమును పరాంకోటి కెక్కించి నట్టియు, శ్రీరామచంద్రుని తెలుగు మాటల నిల్పి పోయిన మహాభక్తుడగు త్యాగరాయలవారి కృతులుగాని, మువ్వగోపాలుని మోహనాకారమున కొడలు మరచి భక్తి శృంగారముల నివాళులెత్తిన క్షేత్రయ్య పదములు గాని, సారంగపాణి పదములు కాని జానపద గేయములు కావు. అవి మార్గ సంగీతమున సాగిపోయిన తెలుగులు. కాని త్యాగరాయలకు సమాన భక్తుడై గోదావరీ తటమున శ్రీరాము నొక యింటి వాని జేసి, సీతమ్మకు చింతాకుపతకమర్పించుకొన్న గోపన్న హృది ప్రిదిలి, పెదవి కదపి నంతనే వెడలిన కీర్తనలు జానపద గేయములు' – డా॥ బి. రామరాజు, 'తెలుగు జానపదగేయ సాహిత్యము', పుట 28.*

13. *కిన్నెర, డిసెంబరు 1953, పుట - 562.*

'జానపదగేయకథలు' (లేక జానపద కథాగేయములు). ఆంగ్లమున వీనిని 'Ballads' అందురు. స్త్రీలపాటలు పై రెండిటికన్నను భిన్నములు; పాకమున కొంచెము ప్రౌఢములు. వీనిని అగ్ర వర్ణములకు జెందిన ముత్తైదువులు మాత్రమే పాడుచుందురు. సామాన్య జానపద వనితలు వీనిని పాడలేరు. వీనియందలి భాష, సంగీతము జానపద గేయముల కన్న చిక్కగా నుండును. ఇందు లాలి పాటలు, జోల పాటలు, మంగళహారతులు మున్నగు ముక్తక గీతములును గలవు; రామాయణ, భారత, భాగవతాదులకు సంబంధించిన కథాగీతములును గలవు. వీనికి 'స్త్రీలపాటలు' అని వ్యవహారము. క్రీ.శ. 1900 ప్రాంతమున నందిరాజు చలపతిరావుగారు ప్రకటించిన స్త్రీలపాటల మూడు సంపుటములును వీనికి లక్ష్యములు కాగలవు. స్త్రీలపాటలవలెనే భజనకీర్తనలను గూడ కూలి నాలి చేసికొను సామాన్య జానపదుడు పాడలేడు. కొంచెము సంగీతపు వాసన, రాగతాళ జ్ఞానముగల శిష్ట జానపద భక్తుడే వీనిని పాడుచుండును. ఇవి ఎక్కువగా వృద్ధుల సొత్తు; దాసరి భిక్షువుల జీవనోపాధి. జానపదగేయములవలె వీనియందలి సంగీత సాహిత్యములు మార్పులకు లోనుగావు. అయినను వీనికి బహుజనాదరపాత్రతయు, విశేషప్రచారమును గలవు.

పల్లెపాటలలోను వీరగాథలలోను ఇతివృత్తము లెక్కువగా చారిత్రకములు, సాంఘికములునై యున్నవి. (కొద్దిపాటి పౌరాణికేతివృత్తములున్నను వానిలోగూడ సాంఘికవాతావరణమే గోచరించును). కాని స్త్రీలపాటలన్నియు పౌరాణికేతివృత్తములతో నిండిపోయి యుండును. ఇందు చారిత్రక సాంఘికేతివృత్తములు మచ్చునకైనను కానరావు. ఈ కారణము చేతనే వీరగాథలు నేటికిని సృజింపబడుచుండగా, స్త్రీలపాటల సృష్టి ఎన్నడో ఆగిపోయినది. ఇట్లు ఇతివృత్త తత్త్వ వైవిధ్యము లేమి కూడ స్త్రీల పాటలు జానపద గేయముల కన్నను వీరగాథల కన్నను భిన్నములని నిరూపించుచున్నది.

కాబట్టి అనిబద్ధ దేశిలో పల్లెపాటలును వీరగాథలును ఒక వర్గము క్రిందికి వచ్చును. స్త్రీల పాటలు, భజన కీర్తనలు వేఱొక వర్గము క్రిందికి వచ్చును. మొదటి వర్గమును 'పామర దేశి కవిత్వము' లేక 'జానపద కవిత్వ' మనియు, రెండవ వర్గమును 'జాతి దేశి కవిత్వ' మనియు పిలువవచ్చును[14]. పిల్లలపాట లెక్కువగా తల్లులు సృజించినవే కావున అవి స్త్రీలపాటలలో అంతర్భాగమగును.

---

14. నిబద్ధ దేశికవిత్వమును గూడ రెండు ప్రధాన విభాగములుగా విడదీయనగును. ఇందు కొన్ని కేవలము పాడుట కుద్దేశించినవిగాను, మఱికొన్ని చదువుట కుద్దేశించినవిగాను కన్పట్టును. యక్షగానములు, వీథినాటకములు, హరికథలు మున్నగునవి నిబద్ధములైనను పాడబడును. ద్విపద కావ్యములు, శతకములు, ఉదాహరణములు, అష్టకములు, అభ్యుదయ గేయములు మొదలగునవి చదువబడునే కాని పాడబడవు. అందుచే నిబద్ధ దేశిని 'గేయములు' (పాడబడునవి), 'పాఠ్యములు' అని విభజింపవచ్చును. సూక్ష్మ పరిశీలనముచే పాఠ్యములందు మఱల 'ప్రాచీనములు',

సామెతలు, పొడుపు కథలు కూడ ఎక్కువగా స్త్రీలకు, బాలబాలికలకు సంబంధించి యుండుటచే వానిని గూడ ఈ 'జాతిదేశి' విభాగమున జేర్చుకొనదగును. (జానపదులకు గూడ సామెతలు, పొడుపు కథలు కలవు కాని, స్త్రీలసంపదతో పోల్చినచో అవి మిక్కిలి తక్కువ). ఈ విధముగా దేశి కవిత్వమున 'పామరదేశి' (జానపదము), 'జాతిదేశి', 'నిబద్ధదేశి' అను మూడు ప్రధాన భాగములను గుర్తింపవచ్చును[15]. ఈ త్రివిధ విభాగములలో వీరగాథలు పామరదేశి (జానపద) కవితావిభాగమునకు చేరినవి.

---

'ఆధునికములు' అనియు; ఆధునికములలో 'ముక్తములు', 'కథలు' అనియు; మాత్రా ఛందస్సులు, ముక్తచ్ఛందస్సులు అనియు అంతర్విభాగములను గుర్తింపవచ్చును.

15. ఈ త్రివిధ విభాగములు దేశికవిత్వమందే కాక, దేశివచనము నందును పరిశీలింపవచ్చును. దేశికథలలో కొన్ని పూర్తిగా జానపదులకు సంబంధించినవి కలవు. మఱికొన్ని పిల్లలకు, స్త్రీలకు సంబంధించిన కథలు. కొన్ని జానపదకథల ననుకరించుచు శిష్టులు కొందఱు బుద్ధి కౌశలమును పరీక్షించు కల్పనలతో ఇంకను కొన్ని కథలను సృజించిరి. ఇది మూడవ వర్గము. కావున దేశి కథలలో - తెనాలి రామలింగని కథలు, తాతాచార్యుల కథలు, పరమానందయ్య శిష్యుల కథలు, భట్టి విక్రమార్కుని కథలు, సహస్ర శిరశ్ఛేద అపూర్వ చింతామణి కథలు, మదన కామరాజు కథలు, రేచుక్క - పగటి చుక్క కథలు, కాశీమజిలీ కథలలో ఎక్కువ భాగము, రామేశ్వర మజిలీ కథలు, శుక సప్తతి కథలు (పాలవేకరి కదిరీపతి కావ్యమునకును దీనికిని సంబంధము లేదు. ఇది జానపదులలో వ్యాపించియున్న వచన కథాసంపుటి), చిలుక చెప్పిన కథలు (మద్రాసు ప్రా. లి. పు. భాం.న దీని వ్రాతప్రతి కలదు. ముద్దా విశ్వనాథంగారు దీనిని ప్రకటించియున్నారు), హంస వింశతి కథలు (అయ్యలరాజు నారాయణామాత్యుని పద్యకావ్యమునకు వచనానుకరణము కాబోలు), పలుకని పద్మావతి కథలు (ఇవి కూడ భట్టి విక్రమార్కుని కథలకు సంబంధించినట్లే యున్నవి. దీని వ్రాతప్రతి మద్రాసు ప్రా. లి. పు. భాం.న గలదు) - ఈ కథలన్నియు 'జానపద వచన కథలు'. ఇవి 'పామరదేశి' కి చెందును. ఆంగ్లమున నిట్టి వానిని *'Folktales'* అని వ్యవహరింతురు. పేదరాసి పెద్దమ్మ కథలు బాలబాలికలకు సంబంధించినవి. స్త్రీల వ్రతకథలు స్త్రీలకు సంబంధించినవని వేఱుగా చెప్పపనిలేదు. స్త్రీల కథలును, బాలబాలికల కథలును 'జాతి దేశి' అను రెండవ వర్గమునకు చెందును. భోజకాళిదాసు కథలు (దీనికి 'భోజరాజు కథ' లనియు, 'కాంభోజరాజు కథ' లనియు నామాంతరములు కన్పట్టుచున్నవి), భేతాళ పంచవింశతి కథలు, రాయలసీమలో వ్యాపించియున్న మర్యాద రామన్న కథలు మున్నగునవి యుక్తిసహితములై బుద్ధికి పనికల్పించునట్టివిగా నున్నవి. ఇవి శిష్టులగు గ్రామవృద్ధులకు సంబంధించినవి. మధిర సుబ్బన్న దీక్షితులుగారు రచించిన కాశీమజిలీ కథలలో చాలభాగము (నవ్వితే నవరత్నాలు కథ, చేప నవ్విన కథ మొదలగునవి) జానపదులకు సంబంధించినవే. అయినను వీరు మార్గసాహిత్యములోని కొన్ని కథలను గ్రహించి, ఆ జానపద కథలలో కలిపి వేసిరి. 'మండన మిశ్రుని కథ' వంటివి ఈ వర్గములోనివి. కాశీమజిలీలోని ఇట్టి కథలు, పైన చెప్పిన యుక్తి కథలు 'నిబద్ధదేశి' అను

ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు వీరగాథాకవిత్వమును 'పదకవిత్వ' మను పేరుతో పిలిచి, తెలుగు కవిత్వమును పద్య - పద కవిత్వములుగా వర్గీకరించి, అందు పదకవిత్వమును దానిని ఇట్లు నిరూపించిరి:-

''........గీతిగతమైన లయనుబట్టి ఛందస్సు ఏర్పడినది. ఈ ఛందస్సు కతముననే పద్యపఠనవేళ మధురమైన ఒక గీతి విశేషము, వచన పఠనము కంటె భిన్నమైనది వ్యక్తమగుచుండును. ఇది పద్యకవిత్వముతో గీతికిగల అప్రత్యక్ష సంబంధము. అట్లుగాక, గీతికి ప్రత్యక్షాధికారమే యిచ్చిన కవిత్వము పదకవిత్వము. పద్యజాతికిని, పదజాతికిని ముఖ్యమైన భేదమిదియే.

ఈ పద కవిత్వమున, శబ్దమునకెంత ప్రాధాన్యమున్నదో, గీతికిని అంతే ప్రాధాన్యమున్నది. అనగా ఇందు సుందర శబ్దరచనతోపాటు, మధురమైన పాటయును కలిసియుండును. ఈ జాతిలో ఒక శాఖ కవిత్వముకంటె గానమునకే ఎక్కువ ప్రాధాన్యమిచ్చి గేయకవిత్వ మనిపించుకొనెను. ఆ గేయకవిత్వములో శాస్త్ర నిర్దిష్టమైన రాగ, తాళ, స్వర ప్రస్తరాద్యంగముల ప్రాధాన్యముతో ఒక అంతశ్శాఖ గానకళాకోవిదుల విద్యగా వెలసినది. అదియే సంగీతము. త్యాగరాజ కృతులు మున్నగునవి ఈ శాఖలోనివి. ఇంకొక గేయకవిత్వ శాఖ, ఈ కృతులవలె శాస్త్రీయ సంగీతముతో పాడుటకు అనువైనదైనప్పటికీ, అభినయార్థ ముద్దేశింపబడి, నర్తన పాత్రముల వశమైనది. జావళీలు, పదములు మొదలైన శృంగారాత్మక రచనలు ఈ శాఖలోనివి. మఱియొక గేయకవిత్వ శాఖ, సంగీత విద్యానైపుణ్యమును, అభినయ విద్యానైపుణ్యమును లేని సామాన్యులు సైతము, కొంచెము కంఠమాధుర్యమున్నచో పాడుకొని ఆనందించుటకు వీలుగా పాటలుగా వర్ధిల్లినది. మన ముత్తైదువులు పాడు పెండ్లిపాటలు, మంగళ హారతులు ఈ జాతిలోనివి. వీటిని పోలినవే భజన కీర్తనలు కూడ.

ఈ పద కవిత్వమున ఒక శాఖ గీతిని అంగీకరించియు, గేయకవిత్వమని అనిపించుకొనక, కవిత్వాంశకే యెక్కువ ప్రాధాన్యమిచ్చి, జాతివాచకమైన పదకవిత్వము పేరనే నిలిచియున్నది. పల్నాటి వీరచరిత్ర, కాటమరాజు కథ మున్నగు కావ్యములు ఈ శాఖలోనివి''[16].

ఈ విధముగా పింగళివారు చర్చించిన వీరగాథల స్థానము నిట్లు చూపవచ్చును :-

---

*మూడవవర్గము క్రిందకివచ్చును. వేదం వేంకటరాయశాస్త్రిగారు ఆంధ్రీకరించిన 'కథా సరిత్సాగరము'ను కూడ ఈ వర్గమున చేర్చుకొనవచ్చును. కావున దేశివచనములో కూడ 'పామరదేశి, జాతిదేశి, నిబద్ధదేశి' అను మూడు వర్గములు కానవచ్చుచున్నవని చెప్పవచ్చును.*

16. *పల్నాటి వీరచరిత్ర (విశాలాంధ్ర ప్రచురణ), పీఠిక, పుటలు - 25,26.*




ఇది పింగళివారి నిరూపణము. కాని ఇది సమగ్ర నిరూపణముగా దోపదు. ఏలయన ఇందు ద్విపద కావ్యములు, యక్షగానములు, వీథినాటకములు, హరికథలు, జానపద గేయములు, స్త్రీల గేయకథలు - మున్నగు దేశికవితా ప్రక్రియల స్థానము సూచింపబడలేదు. 'పదకవిత్వ' మను ఒకే నామమును రెండు పర్యాయములు రెండు భిన్నప్రక్రియల కుపయోగించుట వలన అర్థక్లేశము కలుగుట కవకాశమున్నది. (అనగా వీరు Popular Poetry, Ballad Poetry అను రెండింటికిని 'పదకవిత్వ' మను నొకే పేరును ప్రయోగించిరి. Popular Poetry అనగా దేశికవిత్వము. ఈ దేశికవిత్వమున నొక భాగము Ballad Poetry). మార్గ - దేశి విభాగములు కూడ వీరి విభజనలో స్పష్టముగా తెలుపబడలేదు. తెలుగుకవిత్వమును మొదట 'పద్యకవిత్వము', 'పదకవిత్వము' అని విడదీయుటలో పింగళివారి అభిప్రాయము 'మార్గ-దేశి' అని మనము ఊహించుకొనవలెను. ఈ పద కవిత్వమునే మఱల గేయ-పద కవిత్వములుగా విడదీయుటలో వీరు 'Song' - 'Ballad' అను భిన్నప్రక్రియలను మనసునందుంచుకొనిరని తలంపవలెను. పింగళివారు గేయకవిత్వములో భాగములుగా నిరూపించిన త్యాగరాజ కృతులు, పదములు (క్షేత్రయ్య), జావళీలు - వీనిని సాహిత్య భాగములుగా నంగీకరించుటకు పెక్కుమంది విమర్శకులు సుముఖులు కారు. ఈ కృతుల వ్యాప్తి అందలి సంగీతము వలననే కాని, సాహిత్యము వలన కాదని ఈ విమర్శకుల దృఢ నిశ్చయము.

ఏ సాహిత్యమందైనను వచనముకన్న ముందు కవిత్వ మావిర్భవించును. ఈ కవిత్వములో కూడ మొట్టమొదట జానపద కవిత్వమే పుట్టును. ఇది క్రమపరిణామమున దేశి కవిత్వమగును. ఆ దేశి, మార్గ కవిత్వముగను మాఱును. ఇంకను సూక్ష్మముగా నిరూపింపవలెనన్నచో, మార్గ కవిత్వ పరిణామక్రమ మీ క్రింది రీతిని జరగియుండవచ్చును:-

పామర దేశి → జాతిదేశి → నిబద్ధదేశి → అనిబద్ధమార్గ → నిబద్ధమార్గ

పై చర్చల వలన వీరగాథలు దేశిసాహిత్యమున, కవితావిభాగమున, అనిబద్ధ లేక శుద్ధ దేశిలో జానపదశాఖకు చెందునని విస్పష్ట మగుచున్నది. ఇట నొక ముఖ్యవిషయము గమనింప వలసియున్నది. వీరగాథ లనగా తరతరముల నుండి ఒక జాతిలో మౌఖిక ప్రసరణమున వచ్చుచున్న సాంప్రదాయక వీరగాథలే (Traditional Ballads) కాని, ఆధునికములగు బుఱ్ఱకథలు కానేరవు. ఈ బుఱ్ఱకథలు సాంప్రదాయక వీరగాథల కనుకరణములు మాత్రమే. అసంవేద్య కర్తృత్వము, మౌఖిక ప్రసరణము, శైలీ సారళ్యము, ఇతివృత్త సారళ్యము, జానపద సన్నిహితత్త్వము, బహుజనాదరపాత్రత - ఇత్యాది వీరగాథా ముఖ్యలక్షణము లీ బుఱ్ఱకథలలో మృగ్యము. కావున నా పరిశోధన ప్రమేయము ప్రధానముగా సాంప్రదాయక వీరగాథలకే సంబంధించి యుండును. ఈ సాంప్రదాయక వీరగాథలను 'జనరంజక వీరగాథలు' (Popular Ballads) అనియు పిలువ వచ్చును. వీరగాథలనగా సాంప్రదాయక వీరగాథలే యను విషయమును సూచించుటకు, ఆంగ్ల సాహిత్యమున 'Ballad' శబ్దమునకు 'Traditional', 'Popular', 'Communal' అను విశేషణములను చేర్చి ప్రయోగించుచుందురు. ఇంతవఱకును వివరించిన ఆంధ్రవాఙ్మయములోని వివిధ ప్రక్రియలను, అందు వీరగాథల స్థానమును ఇట్లు నిరూపింప వచ్చును:-




సాహిత్యము
దేశి సాహిత్యము
మార్గ సాహిత్యము
కవిత్వము
వచనము
కవిత్వము
వచనము
అనిబద్ధదేశి
నిబద్ధదేశి
జానపదదేశి/పామరదేశి
జాతిదేశి
పల్లె పాటలు లేక జానపద గేయములు
వీరగాథలు లేక జానపద గేయకథలు
తెలుగు దేశికవిత్వము
అనిబద్ధదేశి
(లేక శుద్ధదేశి)
నిబద్ధదేశి
పామరదేశి లేక జానపదము
జాతిదేశి
పల్లె పాటలు, లేక
జానపద గేయములు
వీరగాథలు, లేక
జానపద గేయకథలు
స్త్రీల
పాటలు
పిల్లల
పాటలు
సామెతలు,
పొడుపుకథలు
రామదాసు
భజనకీర్తనలు
ముక్తకములు
కథలు




గ్రీకుల మతమున కవిత్వము త్రివిధము : గేయము లేక భావగీతము (Lyric), ఇతిహాసము(Epic), రూపకము(Dramatic). పాడుబడునది గేయము; కథను చెప్పునది ఇతిహాసము; పాత్రలను నటింప జేయునది రూపకము. ఇందు మొదటి దానిలో కవి స్పష్టగోచరుడు; రెండవదానిలో అస్పష్టగోచరుడు; మూడవ దానిలో కవి అగోచరుడు. ఆంగ్ల విమర్శకులు 'Ballad' అను దానిని పైన తెల్పిన త్రివిధ కవితా ప్రక్రియలలో ఇతిహాసములోని అంతశ్శాఖగా నిరూపించి, ఇది 'కథ' +'గేయము' అను రెండింటి సమ్యక్ సమ్మేళనమునకు లక్ష్యమనిరి.

The supreme illustration of this blending of story and song is the ballad ................ we think of it today as a song that tells a story usually of popular origin.[17]

---

17. *Bliss Perry, 'A study of Poetry', Ch. viii, p. 276.*

ఇతిహాసముతో గేయము కలియుట వలన వీరగాథ యేర్పడినది. (నాటకములో భావగీతి యొక్క ఆత్మాశ్రయ లక్షణము కలియుటవలన స్వగత మేర్పడినది). ఐతిహాసిక విభాగమగు వీరగాథకు రూపక లక్షణములను గలవు. ఆత్మాశ్రయ వివర్జనమున ఇది అచ్చముగా రూపకమును పోలియుండును. పాశ్చాత్య సారస్వతమున వీరగాథ, ఆఖ్యాన కవిత్వము (Narrative Poetry)న ఇతిహాసమునకు సోదరిగా చూపబడినది.




'Lyric - Epic - Dramatic అను త్రివిధమగు గ్రీకుల కవిత్వవిభజనము ఆంధ్ర కర్ణాటాది ద్రావిడభాషలలో మార్గ - దేశి కవిత్వముల రెండింటికిని వర్తించును. ముఖ్యముగా ఆంధ్ర సాహిత్యమున మార్గ కవిత్వముకన్న దేశికవిత్వమునకే ఈ విభజన బాగుగా అన్వయించునని చెప్పవచ్చును. ఏలయన, తెలుగు మార్గకవిత్వములో భావకవిత్వము, నాటకకవిత్వము అత్యాధునికములు. మహాభారతాదులగు ఇతిహాసములు మాత్రము పూర్వము నుండియు గలవు.

కాని ఈ మూడింటికిని మూలరూపములు దేశికవిత్వమున ప్రాచీనకాలమునుండియు కానవచ్చుచున్నవి. భావకవిత్వమునకు మూలరూపము జానపదగేయము లేక పల్లెపాట; ఇతిహాసమునకు మూలము వీరగాథ; మార్గ నాటకమునకు మూలము వీథినాటకము లేక యక్ష గానము. (తమిళ, కన్నడ సాహిత్యములకు కూడ ఇట్టి మూలరూపములను చూపవచ్చును.) గ్రీకుల కవితా విభజనమును తెలుగున కన్వయించినచో నిట్లుండును:-




ఆంధ్రసాహిత్యమున వీరగాథ దేశికవితాశాఖకు చెందిన ప్రముఖ ప్రక్రియ! మార్గ కవిత్వమందలి ఇతిహాసమునకు ఉషస్సంకల్పము! దేశద్రిమ్మరులగు జానపద గాయకభిక్షువుల జీవనోపాధి! జానపదగేయములు, స్త్రీలపాటలు, భజనకీర్తనలు, యక్షగానములు, వీథినాటకములు, హరికథలు - మున్నగునవి దీని సోదర శాఖలు!!

వర్తమాన కాలమున జానపదుల ఆచారవ్యవహారముల పైనను, సంగీత సాహిత్యముల పైనను వివిధ దేశములలో పరిశోధనలు విరివిగా కొనసాగుచున్నవి. నాగరకుల వాఙ్మయమందెన్ని శాఖలున్నవో, వాని యన్నిటికిని మూలమనదగినవి జానపదులలో కాన్పించుచున్నవి. నాగరకులు కృత్రిమ వాతావరణములో పెంచుకొను కోడి, పంది, గొఱ్ఱె మున్నగు జంతువు లన్నిటికిని మూల జాతులైనవి నేటికిని అరణ్యములలో 'అడవి కోడి', 'అడవి పంది', 'అడవి గొఱ్ఱె' మున్నగు పేర్లతోనున్నట్లే, నాగరకుల సాహిత్య ప్రక్రియల మూలరూపములు జానపదులయందుండుటలో ఆశ్చర్యము లేదు. కాబట్టి జానపదులను గూర్చిన సమస్త విషయములను పరిశోధకులు నేడు ప్రత్యేకరాశిగా ప్రోగుచేసి, దానిని 'Folklore' అని వ్యవహరించుచున్నారు. ఈ ఆంగ్ల శబ్దము డా॥ బి. రామరాజుగారిచే 'జానపద వాఙ్మయము' లేక 'సాంప్రదాయక విజ్ఞానము' అని ఆంధ్రీకరింప బడినది. ఇందు జానపద వాఙ్మయమను శబ్దమే సమంజసమైనదిగా నున్నది. ఏలయన,

Folklore శబ్దము ఇటీవలి వఱకును ఒక్క జానపదుల ఆచారవ్యవహారములకు మాత్రమే పరిమితమై యుండెడిది. కాని నేడు దాని యర్థము అతి విస్తృతమై జానపదులకు సంబంధించిన ప్రతి విషయమును సమీకరించుకొని మహాసాగరమైనది! నేడు Folklore అనగా జానపదగేయములు, వీరగాథలు, జానపద వచనకథలు, 'మూఢ విశ్వాసములు, ఆచారవ్యవహారములు, మంత్ర తంత్రములు, శాస్త్రవిజ్ఞానము అనగా భౌతిక పారమార్థిక విషయములపై జానపదవాసుల పరిజ్ఞానము, వారి భావములు, పొడుపుకథలు, సామెతలు, వినోదములు, వేడుకలు, ఆటలు,[18] పండుగలు, పబ్బములు, నృత్యములు మొదలగున వన్నియును గతార్థములే యగును. కావున Folklore శబ్దమునకు సాంప్రదాయక విజ్ఞానమను ఆంధ్రీకరణము కన్న, జానపద వాఙ్మయమనునదే సమంజసమైనది; లేదా 'జానపద విజ్ఞానము'/'జానపద సంస్కృతి' / 'జానపద సంపద' అనినను సరిపోవును. ఈ విధముగా Folklore శబ్దము విస్తృతమైనది కావున, శిష్ట వాఙ్మయమున వీరగాథల స్థానమును నిరూపించినట్లే, ఈ జానపద విజ్ఞానమునందును వాని స్థానమును నిర్ధేశించుట సమంజసము కాగలదు.

జానపద విజ్ఞానము లేక జానపద వాఙ్మయమును 'సారస్వతము-భాష' అని రెండుగా విభజింప వచ్చును. భాషలో మాండలిక వృత్తిపదములు, జానపదుల నుడికారములు, పదబంధములు, మున్నగునవి చేరును. జానపద సారస్వతము 'సాహిత్యము-శాస్త్రములు' అని మఱల ద్వివిధము. జానపదుల ఆచారములు, నమ్మకములు, మంత్ర తంత్రములు మున్నగునవి జానపద శాస్త్రమునకు సంబంధించినవి. ఈ శాస్త్రవిజ్ఞానమునే 'సాంప్రదాయక విజ్ఞాన' మనియు పిలువవచ్చును. జానపద సాహిత్యమున జానపద గేయములు, వీరగాథలు కలసి కవిత్వశాఖకును, జానపద వచనకథలు (Folktales) వచనశాఖకును చెందును. ఇట్లు వీరగాథలు జానపద విజ్ఞానములో జానపద సాహిత్యమున కవితాశాఖకు చెందిన ప్రముఖ ప్రక్రియగా గుర్తింపవచ్చును.

నేడు జానపద సాహిత్యమునకు ప్రత్యేకముగా గ్రంథాలయములు నెలకొల్పుచున్నారు. వీనిని 'జానపద గ్రంథాలయములు (Folk libraries) అందురు. అట్లే జానపద విజ్ఞానములోని వివిధ కళలకు సంబంధించిన వస్తు ప్రదర్శనశాలలను నిర్మించుచున్నారు. వీనిని 'జానపదవస్తు ప్రదర్శన శాలలు' (Folk museums) అందురు.

ఈ ప్రకరణమున జరుపబడిన వివిధ చర్చల పిండితార్థమిది:-

వీరగాథాకవితాప్రక్రియ ప్రపంచమున ప్రతిసాహిత్యమందును గాననగును. ఆంధ్ర సాహిత్యమున మనము గర్వింప దగినన్ని వీరగాథలున్నవి. ఇవి మన సాహిత్యమున గల మార్గ-దేశి

*18. డా॥ బి. రామరాజుగారు, తెలుగు జానపద గేయ సాహిత్యము, పుట-9.*

విభాగములలో దేశికి చెందినవి. దేశిసాహిత్యమందలి కవిత్వము నిబద్ధానిబద్ధములచే మఱల రెండు విధములు. ఇందు వీరగాథలు అనిబద్ధ (శుద్ధ) దేశికి చెందును. ఇంకను సూక్ష్మ పరిశీలనముచే అనిబద్ధ దేశిలో 'పామరదేశి' (జానపద దేశి లేక జానపదము) - 'జాతిదేశి' అని మఱి రెండు శాఖలను గుర్తింపవచ్చును. ఇందు వీరగాథలు పామరదేశికి చెందినవి. పల్లె పాటలు (జానపద గేయములు) వీని సోదర శాఖలు, ఈ వీరగాథలు మార్గ కవిత్వములోని ఇతిహాస ప్రక్రియకు మూలకందముగా భావింప బడుచున్నవి. జానపద విజ్ఞానము లేక జానపద వాఙ్మయము (Folk-lore) నుండి జానపద భాషను జానపద శాస్త్రములను తప్పించినచో, జానపద సాహిత్యము (Folk literature) మిగులును. ఈ జానపద సాహిత్యమున గేయములు (Folksongs), గేయకథలు (Ballads), వచనకథలు (Folktales) అను మూడు ప్రక్రియలున్నవి. ఇందలి గేయకథాప్రక్రియయే వీరగాథలు!!.




* * * * *

రెండవ ప్రకరణము

# వీరగాథా నిర్వచనము

ఆంగ్ల సాహిత్యమున వీరగాథా ప్రక్రియను 'Ballads' అందురు. ఈ Ballad శబ్దము 'నృత్యము చేయు' అను నర్థముగల 'balla:re' అను అర్వాచీన లాటిను (Late Latin) శబ్దము నుండి ఏర్పడి, ఫ్రెంచిభాష ద్వారా ఆంగ్లమున ప్రవేశించినది. దీని యుచ్చారణము b æ : l ǎ ḍ.

'Ball' అను ఆంగ్లశబ్దమునకు పూర్వము 'నృత్యము' అను నర్థముండెడిది. నేడాయర్థము నశించి, 'నృత్యము కొఱకై కూడిన సమావేశము' అను నర్థము వచ్చినది. 'Bal' అను ప్రాచీన ఫ్రెంచిభాషాపదము మధ్యఫ్రెంచి(Medieval French) భాషలో 'baler' అయినది. ఇది పూర్వాధునిక ఫ్రెంచి (Early Modern French) భాషలో 'baller' అయినది. దీనికి 'నృత్యము చేయు' అని యర్థము. పైన తెల్పిన 'balla:re' అను అర్వాచీన లాటిను శబ్దమే కాక, 'ballein', 'ballizein' అను గ్రీకు శబ్దములును ఇట్టి యర్థమునే యిచ్చుచున్నవి. 'వాడు గిరగిర తిరుగును' (he whirls about)అను నర్థము నిచ్చు ''బల్‌బలీతి''అను సంస్కృత శబ్దము వీనికి సన్నిహితమైనదిగా భావింపవచ్చును. వీని యన్నింటికిని ఇండోయూరోపియన్ మూలరూపము *'bal' -

అర్వాచీన లాటినుభాష క్రీ.శ.180-600 మధ్యకాలము నాటిది. ఇందలి balla:re శబ్దము ప్రాచీన 'ప్రొవెన్షల్ (provencal) భాషలో "balar" అయి, ఇది మఱల "balada" గా మాఱినది. దీనికి 'నృత్య గీతము' అని యర్థము. ఇది మధ్య ఫ్రెంచిభాషలో "balade" గా మాఱినది. ఈ రూపము యథాతథముగా మధ్యాంగ్లభాష (Middle English)లోనికి ప్రవేశించినది. ఈ "balade" శబ్దము పూర్వాధునిక ఫ్రెంచి, ఆధునిక ఫ్రెంచి భాషలలో "ballade" అని కాగా, ఆధునికాంగ్ల భాషలో "ballad" గా మారినది[1].

ఈ రూపనిష్పత్తి (derivation)ని పరిశీలింపగా Ballad శబ్దమునకు నృత్యముతో కొంత సంబంధమున్నదని తెలియుచున్నది. ఈ సంబంధమైనను ప్రాచీనకాలమున నున్నది కాని నేడు లేదు. Ballad శబ్దమునకు మొట్టమొదట 'నృత్యము చేయునప్పుడు సహాయకారిగా నుండు పాట, (a song intended as the accompaniment to a dance) అను నర్థముండెడిది.

---

1. *Origins - A Short Etymological Dictionary of Modern English*
   *- Eric Partidge, London, 1959.*

కాని ఈ యర్థము నశించి చాలకాలమైనది. తరువాత 'ప్రేమాది అనుభూతులను వెలువరించుచు నొకటి రెండు చరణములలో వ్రాయబడి, పాడుటకనువైన నిరాడంబరగీతము' అను నర్థము వచ్చినది. పిమ్మట 'భావగీతి రూపమున గాని, కథాత్మకముగ గాని ఉండి, తఱచుగా పెద్ద కాగితము (Board sheet) పై ముద్రింపబడెడి జనరంజక గీతము' అను నర్థము వచ్చినది. ఎలిజబెత్ యుగమువారు భావగీతములకును కథాత్మక గీతములకును భేదమును పాటింపలేదు. 'కథను చెప్పెడి జానపదగేయము' (a folk song that tells a sotry)[2] అను ఆధునికార్థమున Ballad ను నిర్వచించుటకు మొదట ప్రయత్నించిన వాడు కౌపర్ (Couper) మహాకవి. ఈతడు క్రీ.శ. 1783వ సంవత్సరమున ఒకానొక లేఖలో Ballad ను ఇట్లు నిర్వచించినాడు: "The ballad is a species of poetry, I believe, peculiar to this country..... Simplicity and ease are its proper characteristics.[3] ఏమైనను, శతాబ్దముల తరబడి ఈ శబ్ద మొక నిశ్చితార్థమున గాక, అస్తవ్యస్తముగా ప్రయోగింపబడుచు వచ్చినది. అందుచే ఈ Ballad ప్రక్రియకు నేటికిని విస్పందేహమై అర్థవంతమైన నామము కుదురక, ఈ Ballad శబ్దమునకు ముందు 'Traditional', 'Popular', 'Communal' -ఇత్యాది విశేషణములను చేర్చి చెప్పుకొనవలసిన పరిస్థితి యేర్పడినది.[4]

Ballad శబ్దమునకు ఆక్స్‌ఫర్డ్ పదకోశమున 'A popular song' అనియు 'A simple spiritual poem in short stanzas.... in which some popular story is graphically narrated' అనియు నర్థము లొసంగబడినవి. ప్రాచీనకాలమున 'మిల్టను', 'ఎడిసన్' లే కాక, 'జాన్సను' పండితుడు సహితము Ballad అనగా 'song' అని మాత్రమే అర్థము చెప్పి ఊరకొనెను.

Ballad శబ్దమును పోలినట్టివే యగు Ballade (bala:d), Ballet (ba:le, rarely bæ:let) అను మఱి రెండు శబ్దము లున్నవి. ఈ రెండును గూడ balla:re నుండి పుట్టినట్టివే యైనను, అర్థ విషయమున నేడు Ballad శబ్దముతో భేదించుచున్నవి. Ballade అనునది ఒక నిర్ణీతమగు ఛందమున వ్రాయబడు నృత్తగీతము.[5] ఇది ఫ్రెంచిసాహిత్యమున తఱచుగా

---

2. *G.H. Gerould, The Ballad of Tradition, 1932.*
3. *Frank Sidgwick, Introduction to 'Popular Ballads of Olden Time'.*
4. *"Centuries of use and misuse of the word have left us no unequivocal name for the ballad, and we are forced to qualify it with epithets. 'Traditional' might be deemed sufficient; but 'popular' or 'communal' is more definite. -Ibid.*
5. *A verse form, frequently represented in French literature. It consists most often of three stanzas of eight or ten lines apiece and an envoy of four, five or six lines. Three or four rhymes only occur throughout the poem, and the same refrain ends each stanza. - The Reader's Encylopaedia, p. 70.*

గాననగును. ఆంగ్లసాహిత్యమున మొదట ఈ ప్రక్రియను ప్రవేశపెట్టినవాడు ఛాసర్. స్విన్ బరన్ కవి రచించిన 'A ballade of Dreamland' అనునది యీ ప్రక్రియకు చక్కని ఉదాహరణము. రాజసభలలో పాడబడు 'Carole' అను నృత్తగీతము కూడ ballade అగును. ఈ 'బలాడ్' (ballade) మొదట ఫ్రాన్సు దేశమున తలయెత్తి క్రీ.శ. 14, 15 శతాబ్దముల నాటికి ఆంగ్ల దేశమునకు వ్యాపించినది. చారిత్రకముగా నూహించినచో ఈ 'బలాడ్' శబ్దము నుండియే 'బ్యాలెడ్' శబ్దము పుట్టినదని చెప్పవచ్చును.

ఇక రెండవ పదమగు Ballet అనునది నృత్యరూపకము[6]. ఇందు నృత్యము మూకాభినయము నుండును. ఇది మొదట ఇతర దేశస్థుల దుస్తులను ఆచారములను నాటకీయముగా వివరించుటకు ప్రయోగింపబడుచుండెడిది. కాని నేడిది పూర్తిగా నృత్య కౌశలమును వెల్లడించు కళాప్రదర్శనముగా మాఱినది. పూర్వ మీ 'బాలే' (Ballet) శబ్దము నకును, 'బ్యాలెడ్' (Ballad) శబ్దమునకును 'నృత్యము చేయుచు పాడెడి పాట' అని ఒకే యర్థముండెడిది. కాని నేడీ రెండు శబ్దములును భిన్నార్థములు కలవి. 'బ్యాలెడ్' అనునది 'పాట రూపమున చెప్పబడు కథ' కాగా, 'బాలే' అనునది 'నృత్యరూపమున చెప్పబడు కథ'[7].

'బ్యాలెడ్' అనునది 'నృత్యము చేయు' అను నర్థముగల 'బల్లారె' అను శబ్దమునుండి పుట్టుట, ఇదే శబ్దమునుండి పుట్టిన 'బలాడ్', 'బాలే' అను మఱిరెండు నృత్య సంబంధములగు పదములతో ఈ 'బ్యాలెడ్' శబ్దమొకప్పుడు సన్నిహితముగా నుండుట - పురస్కరించుకొని కొందఱు విమర్శకులు దీనిని నృత్య పరిణామముగా భావించి ఇట్లు నిర్వచించినారు:

(Ballad is) "a song originally created co-operatively in the dance improvisations of the common people and handed down in popular tradition." [8]

కాని 'బ్యాలెడ్' ఆదిమ మానవుల నృత్యమునుండి పరిణామము చెందినదనుట సమంజసము కాదు. ప్రాక్తన మానవుడు నిర్భరానందమున ఏదో ఒక భావమును వెలువరించుచు

6. *A theatrical representation, consisting of dancing and pantomime, originally employed to illustrate dramatically the costumes and manners of other nations, but now for the most part regarded as an artistic exhibition of skill in dancing.*
*-Oxford English Dictionary*

7. *As a ballad is now a story told in verse, so a ballet is now a story told in a dance. Originally the two were one, and the ballad was a song while the singers were dancing.*
*-Henry B. Wheatley, F.S.A.,*
*General Introduction to 'Reliques of Ancient English Poetry', Vol.I, p. xxxi.*

8. *Prof. Louise Pound, The Encyclopedia Americana, Vol. III, p. 94 b*

చిన్న పాటను పాడియుండును గాని, ఒక కథను అల్లుచు పెద్ద పాటను పాడియుండడు[9]. 'బ్యాలెడ్' శబ్దమునకు 'జానపద కథాగేయ' మనెడి ఆధునికార్థము 'బ్యాలెడ్' శబ్దోత్పత్తిని బట్టి రాలేదు. ఈ యర్థము ఇతర భాషాపదముల ననుకరించుట వలనను, ఎరవు తెచ్చుకొనుట వలనను కాలక్రమమున నేర్పడినది.

నృత్యము నుండి 'బ్యాలెడ్' పుట్టక పోయినను నృత్య లక్షణము మాత్రము కొంచెము దీనిలో కలదని చెప్పవచ్చును. వీరావేశమున దీనిని పాడునప్పుడు కాళ్ళకు గజ్జెలు కట్టుకొన్న కథకుడు రసస్ఫోరకములగు ఘట్టములందు చిందులు త్రొక్కుట, గంతులు వేయుట గమనింప దగ్గది[10].

ఈ 'బ్యాలెడ్' శబ్దము ఆంగ్లదేశమున కొన్ని శతాబ్దములపాటు చాల విశృంఖలముగాను అస్తవ్యస్తముగాను ప్రయోగింపబడినది. 'బ్యాలెడ్' అనుదానికిని 'సాంగ్' అనుదానికిని హస్తిమశకాంతరమున్నను ఈ అంతరము పాటింపబడెడిది కాదు. ఒక్క కథా గేయమునకే కాక అన్ని రకముల పాటలకును బ్యాలెడ్ శబ్దము వాడబడినది. ఎలిజబెత్ యుగమున ప్రణయ గీతములు, చిన్నచిన్న నీతిగీతములు, వ్యంగ్యగీతములు, మతగీతములు, విషాదగీతములు, వీధిగీతములు - ఇత్యాది అన్ని రకముల భావగీతములకును, 'బ్యాలెడ్' శబ్ద మెక్కువగా నుపయోగింపబడినది. కాని నిజమున కివేవియును 'బ్యాలెడ్స్' కావు[11]. ఎలిజబెత్ యుగమున 'బ్యాలెడ్' శబ్దము కథాగేయములకు చాల సకృత్తుగా ప్రయోగింపబడినది. పదునేడు, పదునెనిమిది శతాబ్దముల మధ్యకాలమున 'బ్యాలెడ్' వీథుల వెంబడి పాడబడు సామాన్య గీతముగా నిర్వచింపబడినది[12]. పదునెనిమిదవ శతాబ్దపు చివరిభాగమునకు గాని 'బ్యాలెడ్'

---

9. *తెలుగులో గూడ కథారహితములగు చిన్న చిన్న వీరగీతములు* ***(Balladlings)*** *మాత్రమే నేడు కోలాటపు కోపులుగా లభించుచున్నవి. కథాత్మకములగు బొబ్బిలిపాటవంటి వేవియు కోలాటపు పాటలుగా లేవు. ఇది ముఖ్యముగా గమనింప దగ్గది.*

10. *They were sung or recited, sometimes with the accompaniment of a dance, to small groups of people.*

*- Oxford Junior Encyclopaedia, Vol. XIII, p. 36.*

11. *A ballad is a short traditional narrative poem sung, with or without accompaniment of dance, in assemblies of the people. The term is also used for any simple, romantic, and sentimental song (the material of so-called ballad concerts) or any popular or scurrilous poem, but these pieces are not to be reckoned true ballads.*

*- Chambers's Encyclopaedia, Vol,II, p. 72.*

12. *"A common song sung up and down the street."*

*- The Encyclopedia Americana, Vol. III, p. 94b.*

శబ్దము కథాగేయమునకు ప్రత్యేకింపబడలేదు. పూర్వకాలమున నెట్లు ప్రయోగింపబడినను నేడు మాత్రము 'బ్యాలెడ్' అనగా ప్రజలలో పుట్టిన కథాగేయ మనియే యర్థము[13].

కవిత్వమును నిర్వచించుట మిక్కిలి కష్టమైన పని. అసలు కవిత్వ మనిర్వచనీయమైన దనువారును గలరు. ఈ 'బ్యాలెడ్' నిర్వచనము కవితా నిర్వచనముకన్న కష్టతరమైనది. విమర్శనా ప్రక్రియయందు ఆరితేరిన పాశ్చాత్యపండితులే ఈ విషయమున తబ్బిబ్బులు పడక తప్పలేదు. 'బ్యాలెడ్'ను నిర్వచించుటకు బదులు, ప్రఖ్యాతములైన కొన్ని 'బ్యాలెడ్స్' ను పేర్కొని, ''ఇట్టివి బ్యాలెడ్స్ అనబడును'' అని సిద్ధాంతము చేసిరి.

"In spite of Socrates and his logic we may venture to say, in answer to the question 'What is a ballad?'-- 'A ballad is 'The Milldams of Binnorie and Sir Partick Spens and The Douglas Tragedy and Lord Randal and Childe Maurice and things of that sort."[14]

అయినను బ్యాలెడ్ ను నిర్వచింప ప్రయత్నించినవారు లేకపోలేదు.

'A traditional ballad is a folk-song which tells a story'.[15]

ఇది స్థూలనిర్వచనమే కాని సూక్ష్మనిర్వచనము కాదు. బ్యాలెడ్‌ను జానపదగేయ మాత్రముగా చెప్పి ఊరకొనుటకు కొందఱు పండితులు సమ్మతింపరు.

"Ballad, a term often loosely used of folk-song in general but referring in a stricter sense to a traditional narrative composed in lyric stanzas and often including a refrain. The story is told objectively, touching only the peaks of the action, and episodes and details are often given in cumulative repetition."[16]

''సాహిత్య వ్యవహారమున సరళ కథాత్మక గేయము 'బ్యాలెడ్' అనబడును. దీని రచయిత సాధారణముగా అజ్ఞాతుడుగనే యుండును. కొన్ని పట్ల కర్తృనామము తెలియుటయు గలదు. సాధారణ వ్యవహారమున అన్ని రకముల గేయములను 'బ్యాలెడ్స్' అనుట పరిపాటి.

13. *The word' ballad' like 'ode' and 'sonnet' is very ancient and has been used in various senses. We think of it today as a song that tells a story, usually of popular origin.*
*-Bliss Perry, A study of Poetry, Ch. VIII, p. 276.*
14. *Prof. W. P. Ker, 'On the history of the Ballads', Proceedings of the British Academy, Vol. IV, 1909-1910, p.179.*
15. *Oxford Junior Encyclopaedia, Vol. XII, p. 36.*
16. *Archer Taylor, 'Ballad', Collier's Encyclopaedia , Vol. 3, p.18.*

ఒక్కొక్కప్పుడు సంగీతప్రధానములగు రచనలను సహితము ఈ పేరున పిలుచుట జరుగుచున్నది.'' - ఇది ప్రొఫెసర్ లూయిస్ పౌండ్ (Prof. Louise Pound) ఇచ్చిన నిర్వచనము[17]. కాని యిందలి సాధారణ వ్యవహారము నేడు పనికిరాదు. ఈ క్రింది నిర్వచనము సంక్షిప్తమైనను సమర్థవంతమైన దనవచ్చును:

"Ballad is a short poem that tells a story of some heroic deed, romance, or event of history or legend."[18]

అయినను ఈ నిర్వచనమున వీరగాథయొక్క ముఖ్యలక్షణములలో నొకటియగు గేయాంశము మాత్రము విస్మరింపబడినది.

బ్యాలెడ్‌కు కొన్ని ముఖ్యలక్షణములున్నవి. అనామకర్తృకమై యుండుట (ఒకవేళ కర్త తెలిసినను అతనికి ప్రాముఖ్యముండదు), చిన్న కథను సరళరీతిని వివరించుట, మాత్రాచ్ఛందమున వ్రాయబడుట, మౌఖికప్రచారమున కనువై యుండుట, ప్రబంధములలో గాననగు ప్రౌఢశిల్పము లేకుండుట - ఇత్యాదులు దీని లక్షణములలో ప్రధానములైనవి. కొందఱు విద్వాంసులు బ్యాలెడ్‌ను నిర్వచింపలేక, పై లక్షణములను వరుసగా నేకరువు పెట్టిరి. ఈ లక్షణముల సహాయమున ఈ రకమగు సాహిత్యము నూహింపవచ్చునని వీరి యభిప్రాయము. లక్ష్యములుగా కొన్ని ప్రసిద్ధములగు బ్యాలెడ్స్ సంకలన గ్రంథములను గూడ ఈ లక్షణముల క్రింద నిచ్చిరి. G.G. Smith ఇచ్చిన ఈ క్రింది నిర్వచన మట్టి వానిలో నొకటి యనవచ్చును.

"Ballad, the name given to a type of verse of unknown authorship, dealing with episode or simple motif rather than sustained theme, written in a stanzaic form more or less fixed and suitable for oral transmission, and in its expression and treatment showing little or nothing of the finesse of deliberate art. This is not an attempt at definition, for that is hard indeed, if not impossible. The familiar hints as to the character of the ballad, that it is 'short', 'adapted for singing', 'simple in plot and metrical structure', and more emphatically, that it is 'impersonal', help us to indentify the 'genre'. For practical purposes it is that kind of verse preserved in Sir Walter Scott's 'Minstrelsy of the Scottish Border' and in Prof. Child's 'English and Scottish Popular Ballads.[19]

ఏమైనను బ్యాలెడ్ అనుదానికి పూర్తిగా సంతృప్తికరమైన నిర్వచనమును బడయుట దుర్లభము. శబ్దోత్పత్తిని బట్టి దీని యర్థము 'నృత్త గీతము' (dancing song). కాని ఇప్పుడు

---

17. *See, The Encyclopedia Americana, Vol. III, p. 94b.*
18. *The World Book of Encyclopaedia, Vol. 2, p.65.*
19. *Encyclopaedia Britannica, Vol.2, p.993.*

ఈ యర్థము నెవ్వరును అంగీకరింపరు. 'కథాకథనము చేయు జానపదగేయము' (a folk song that tells a story) అనునది సర్వజనాంగీకారమైనదని అనవచ్చును. కాని దీని నింకను వివరించి చెప్పవలెను. ఈ జానపద కథాగేయము నిరాడంబరమగు కూర్పును కలిగియుండుననియు, ఒకేఒక ముఖ్యసంఘటనను చర్చించుననియు, పరాశ్రయమైనదనియు, పామరజన రంజకమైనదనియు, మౌఖికప్రచారమున నుండునదనియు, అనామకర్తృకమనియు, లఘుచరణములు(stanzas) కలిగియుండుననియు, తఱచుగా పునరావృత్తులను పునరుక్తులను కలిగియుండుననియు వ్యాఖ్యానింపవలెను. అప్పుడు కాని 'బ్యాలెడ్' అననేమో సరిగా బోధపడదు. ఎంతటి సంపూర్ణ నిర్వచనమైనను, బ్యాలెడ్ సంకలన గ్రంథములు వివరించునంతటి స్పష్టముగా ఈ ప్రక్రియను వివరింపజాలదనుట మాత్రము సత్యము[20].

ఈ క్రింది నిర్వచనము పై చర్చ లన్నింటికిని సారభూతమైనదని చెప్పవచ్చును.

"The word ballad is derived through the medium of French from Late Latin ballare, 'to dance', and thus meant originally a song sung to the rhythmic movement of a dancing chorus -- ..... The name is sometimes applied to a simple song, usually of a romantic or sentimental nature, in two or more verses, each sung to the same mealody. But in literature the name Ballad means more particularly a simple, spirited, narrative poem in short stanzas of two or four lines (without counting the burden or refrain), in which a story is told in straight forward verse, often with great elaborateness and detail in incident, but always with graphic simplicity and force."[21]

ఈ 'బ్యాలెడ్' ప్రక్రియను ఇతర సాహిత్య ప్రక్రియలతో, ముఖ్యముగా Lyric, Epic అనువానితో పోల్చి చూచినచో దీని స్వరూపము మఱింత స్పష్టపడును.

## LYRIC (SONG) -- BALLAD

పాశ్చాత్య విమర్శకుల మతమున కవిత్వము త్రివిధము: ఆఖ్యాన కవిత్వము(Narrative Poetry) భావకవిత్వము(Lyrical poetry), నాటకకవిత్వము(Dramatic poetry).

20. *But no definition, even if it were perfect, would tell as much as a reference to the great collections of ballads made in the last century. When we speak of ballads, we mean such poems as are found in the volumes of Child and Grundtvig...*
*- W.P.Ker, 'On the history of the Ballads', Proceedings of the British Academy, Vol. IV, 1909-1910, p.179.*

21. *The Home University Encyclopaedia, edited by C. Ralph Taylor, New York, 1956, p. 376.*

ఆఖ్యాన కవిత్వమునకును నాటక కవిత్వమునకును భిన్నమైనదానినంతటిని భావకవిత్వమని స్థూలముగా చెప్పుట పరిపాటి. కాని భావగీతి (Lyric) ని ప్రత్యేకముగా పరిశీలించినచో పై స్థూల నిర్దేశము పనికిరాదని తెలియగలదు. కవియొక్క ఆత్మీయానుభవమును గాని, ఆలోచనను గాని వెలువరించు గీతము మాత్రమే భావగీత మగును. ఈ భావగీతముయొక్క ప్రాథమిక రూపము పాట (song)[22]. నాగరకత పెరిగినకొలది దీనియందు ప్రౌఢత్వము చొరబడి Ode, Elegy, Sonnet అను వివిధ ప్రక్రియలు బయలుదేరినవి. మనము బ్యాలెడ్‌తో పోల్చునది భావగీతి ప్రాథమిక స్వరూపమగు పాటనే కాని, ఇతర ప్రౌఢప్రక్రియలను గాదు.

ఆంగ్లదేశమున 'బ్యాలెడ్' శబ్దము శతాబ్దములతరబడి అస్తవ్యస్తముగా ప్రతి గీతములకును ప్రయోగింపబడినదని ముందు తెలిపియున్నాను. ఎలిజబెత్ యుగమునకు జెందిన Deloney అనునాతడు 'The Fair Flower of Northemberland', 'Flodden Field'- అను ప్రసిద్ధమగు బ్యాలెడ్స్‌ను 'songs' గా పేర్కొన్నాడు. Sir Philip Sidney అనునాతడు 'Chevy Chase' ('The Douglas Tragedy') అను సుప్రసిద్ధమగు బ్యాలెడ్‌ను ప్రశంసించుచు దానిని 'song' గా సంబోధించినాడు[23]. దీనిని బట్టి 'బ్యాలెడ్'కును పాటకును అభేదము పాటింపబడినదని తెలియుచున్నది.

ఆంగ్లసాహిత్యమున మొట్టమొదట బ్యాలెడ్స్‌ను సేకరించి ప్రకటించినవాడు థామస్ పెర్సీ (Thomas Percy) అను మతప్రచారకుడు. ఇతడు క్రీ.శ. 1765లో 'Reliques of Ancient English Poetry' అను బ్యాలెడ్ సంకలన గ్రంథమును ప్రకటించెను. కాని ఈ గ్రంథమునందాతడు కథాగేయములకును శుద్ధగీతముల(pure lyrics)కును భేదమును పాటింపలేదు. ఈ భేదమును ముందు కొంతవఱకును సూచించినవాడు 'విలియమ్ షెన్‌స్టోన్' (William Shenstone). ఇతడు 1761లో 'బ్యాలెడ్' వేఱు, 'సాంగ్' వేఱు అని చెప్పినాడు. ఆ తరువాత 'పెర్సీ' సమకాలికుడగు 'జోసెఫ్ రిట్సన్' (Joseph Ritson) క్రీ.శ. 1783లో - అనుభూతిని వివరించునవియు, పదచమత్కారమును గలవియు, వర్ణనాత్మకములును అగు శుద్ధ గీతములకును; మనము నేడు బ్యాలెడ్స్ అని పిలుచుకున్న కథాత్మక గేయములకును గల భేదమును విస్పష్ట మొనర్చినాడు. తరువాతి కాలమున 'విలియమ్ మదర్ వెల్' (William

---

22. *Lyrical Poetry is characterized on the one hand by its association with music, and on the other by the personal or subjective feeling which it normally expresses. Its simplest and most typical form is the song.*
 *- Raymond M. Alden, Encyclopedia Americana, Vol. 17, p. 569.*

23. *'I never heard the old song of Percy and Douglas that I found not my heart moved more than with a trumpet'.*
 *- Apologie for Poetrie, 1595.*

Mother Well), చైల్డ్ (Child) అనువారు రిట్సన్‌ను బలపఱిచిరి. పిమ్మట బ్యాలెడ్స్ అనగా 'పాడుట కనువైన చిన్న కథాత్మక గేయములు' అను ఆధునికార్థము స్థిరపడినది. దీనినిబట్టి అసంఖ్యాకములగు భావగీతికా సమూహములో కథను చెప్పు గీతములను బ్యాలెడ్స్‌గా ప్రత్యేకింప వచ్చునని తెలియుచున్నది[24].

అయినను ఒక్కొక్కప్పుడు బ్యాలెడ్స్‌కును శుద్ధ భావగీతములకును మధ్యగల భేదమును నిరూపించుట కష్టమగును. బ్యాలెడ్స్ తమలోగల ధారావాహి కథాకథనమును పోగొట్టుకొని శుద్ధ భావగీతములగును. దీనికి వ్యతిరిక్తము గూడ సంభవించునని కొందఱు తలంచుచున్నారు. అనగా శుద్ధ భావగీతములు. అవి ఏవిధముగా నుద్భవించినవైనను, కథా కథనమును గ్రహించి బ్యాలెడ్స్ అగుననుట. దీనిని 'ఐతిహాసిక క్రమము' (Epic Process) అందురు. కాని దీనికి తగినంత సాక్ష్యము లేదు. కావున బ్యాలెడ్స్ అనునవి శుద్ధగీతములుగా మాఱుట కవకాశమున్నది కాని, శుద్ధగీతములు బ్యాలెడ్స్‌గా మాఱుట కవకాశము తక్కువ యని తలపవచ్చును.

సాధారణ గీతమునకును, బ్యాలెడ్ అను దానికిని మధ్య గల భేదమును విస్పష్టముగా గిరిగీచి చెప్పెడి విధానము ఇటీవలి కాలమున బయలుదేరినది. డాక్టర్ జాన్సన్ తన శబ్దకోశమున బ్యాలెడ్ అనుదానికి 'a song' అని మాత్రమే అర్థము వ్రాసినాడు. తరువాతి కాలమున దీనిని 'ప్రజల జిహ్వాగ్రములపై తాండవమాడు గీతము' గా నర్థము చేసికొనినారు. ఏమైనను బ్యాలెడ్స్ అన్నియును పాటలే కాని, పాటలన్నియును బ్యాలెడ్స్ మాత్రము కానేరవు[25]. కథను చెప్పెడి పాటలు మాత్రమే బ్యాలెడ్స్ అగును. మామూలు పాటకును, బ్యాలెడ్‌కును చాల భేదమున్నది. ఇది నీతివాక్యము - సామెతల మధ్యనున్న భేదమువంటిదని కొందఱును, పల్లెలోని బెస్తవానికిని అంతర్జాతీయ మహావీరునకును మధ్య గల భేదమువంటిదని మఱికొందఱును[26] చమత్కరించినారు. భావగీతము (lyric) లేక పాట (song) ఆత్మాశ్రయ కవిత్వమునకు

---

24. *Out of the immense mass of lyrical poetry those that tell a story are singled out as ballads*

*- The Encyclopedia Americana, Vol. III, p.95.*

25. *All ballads are songs, but all songs are not ballads, and the difference between a ballad and a song is something the same as that between a proverb and an apophthegm, for the ballad like the proverb should be upon many lips.*

*- Henry B. Wheatley, General Introduction to 'Reliques of Ancient English Poetry', p. xxxiii.*

26. *A gulf is fixed between song and ballad even wider than the distance between a remote village fisherman and an international hero. This gulf, moreover, is quite as formidable with regard to style and structure.*

*- F.B. Gummere, The Popular Ballad, p.42.*

చెందినది. బ్యాలెడ్ అనునది కథాకథనమున్న భావగీతము లేదా పాట అగుటచే అది పరాశ్రయ కవిత్వమునకు చెందినది. బ్యాలెడ్‌లో ఆత్మానుభూతిని వెలువరించుటకు ఏమాత్రమును తావు లేదు[27]. ఆత్మీయతాముద్ర ఎచ్చటనైనను బలవంతముగా ప్రవేశించియుండినచో అది మౌఖిక ప్రసరణమున త్యజింపబడును.

పై చర్చను బట్టి Lyric - Ballad అనువాని సంబంధము నిట్లూహింపవచ్చును: బాహ్య స్వరూపమున బ్యాలెడ్ భావగీతిని పోలియుండును. ప్రాచీన భావగీతము 'లైర్' (lyre) అను వాద్యముతో పాడబడుచుండినను, ఆధునిక భావగీతము చదువదగినదే. కాని బ్యాలెడ్ ఎప్పుడును పాడదగినదే కాని చదువదగినది కాదు. Lyric అను దానికి ప్రాచీన కాలమున 'lyre అను వాద్యముతో పాడబడు పాట' అని యర్థముండెడిది. ఇప్పుడాయర్థము నశించి, 'ఆత్మాశ్రయ కవిత్వ' మను నర్థము వచ్చినది. పాడబడెడి పూర్వ స్వరూపమును 'Song Lyrics' అనియు, చదువబడెడి ఆధునిక రూపములను 'Reflective Lyrics' అనియు పాశ్చాత్య విమర్శకులు వ్యవహరించుచున్నారు. Sonnet, Ode, Elegy - మున్నగు రూపములన్నియును Reflective Lyrics లోని వివిధ ప్రక్రియలు. భావగీతి ప్రాచీనార్థము నేటికిని 'బ్యాలెడ్' విషయమున అన్వర్థమగును. వివిధ వాద్యముల సహాయముననే బ్యాలెడ్స్‌ను గానము చేయుదురు. కావున బ్యాలెడ్ బాహ్య స్వరూపమునందును, సంగీతాంశమునందును lyric ను పోలియుండి, కథాకథనమును కలిగియుండుటచే ఆంతర స్వరూపమున భేదించు చున్నది. Lyric ఆత్మాశ్రయ కవిత్వము కాగా, బ్యాలెడ్ ఆత్మాశ్రయత్వము ఏమాత్రమును సహింపని పరాశ్రయ కవితాప్రక్రియ యగుచున్నది.

## EPIC -- BALLAD

ఇక బ్యాలెడ్‌ను Epic అను కవితాప్రక్రియతో పోల్చి చూతము. 'ఎపిక్' అనగా ఇతిహాసము. ఇది కథాత్మకమగు సుదీర్ఘ కవితాప్రక్రియ. దీనినిట్లు నిర్వచింతురు-

An epic is a noble poem which, in continuous narrative, elaborates the great achievements of one or more heroes of history or tradition."[28]

'హోమర్' రచించిన Iliad, Odyssey అను గ్రీకు మహాకావ్యములు, Beowulf అను ఆంగ్లకావ్యము, సంస్కృతములోని రామాయణ మహాభారతములు ఇట్టి యితిహాసముల

---

27. *The ballad, like the fairy-tale, Common Property; personal reflection has no place in it; and any intrusive subjectivity is worked out in the process of oral transmission.*
*- J. Kinsley, Cassell's Encyclopaedia of Literature, Vol. I, p.41.*

28. *Oxford Junior Encyclopaedia, Vol. xii, p. 133.*

కుదాహరణములు. ఒక దేశముయొక్క సంపూర్ణజీవితము కాని, ఒక యుగముయొక్క సమగ్రచరిత్ర కాని ఇందలి కథావస్తువులుగా నుండును. ఇవి విజ్ఞాన సర్వస్వములన్నను అతిశయోక్తి కాదు.

ఇట్టి 'ఎపిక్' వలెనే, 'బ్యాలెడ్' కూడ కథాత్మకరచనమే. అయినను రెండింటికిని స్పష్టమైన భేదములున్నవి.

(1) ఇతిహాసములు సవిస్తరములై సూక్ష్మాతిసూక్ష్మ వర్ణనలతో నొప్పును. ఒక పెద్ద దేశమును గాని రాజ్యాంగమును గాని దృష్టియందుంచుకొని, అనేక సంఘటనలు వివరించుచు వ్రాయబడిన మహాకావ్యములు. 'బ్యాలెడ్స్' అనునవి ఒకే సంఘటన నుద్దేశించి సంక్షిప్త పరిధిలో వ్రాయబడిన లఘు కావ్యములు[29].

(2) ఇతిహాసములు సుదీర్ఘములు. ఒక వేయి పంక్తుల నుండి 150 వేల పంక్తుల వఱకును ఉండును. బ్యాలెడ్స్ లఘుకృతులు. ఎంత పెద్ద బ్యాలెడ్ అయినను రెండు వేల పంక్తులకు మించదు.

(3) ఇతిహాసములలో ధీరోదాత్తుడగు నొక వీరునియొక్క గాని, అనేక వీరులయొక్క గాని సాహసాద్భుత కృత్యము లుదాత్తముగా వర్ణింపబడియుండును. బ్యాలెడ్స్‌లో నాయకుడు ధీరోదాత్తుడుగనే యుండవలెనను నియమము లేదు. గజదొంగలు, బందిపోట్లు, మోసగాండ్రు - మొదలగు నెట్టివారైనను నాయకులుగా స్వీకరింపబడుదురు. ఇట్టివారు కావించిన సాహసకృత్య మెట్టిదైనను వర్ణింపబడును[30].

(4) ఇతిహాసముయొక్క పరిధి విస్తృతమైనదగుటచే సులభమైనదనవచ్చును. బ్యాలెడ్‌యొక్క పరిధి సంక్షిప్తమైనదగుటచే క్లిష్టమైనదని చెప్పవచ్చును. ఈ రెండు ప్రక్రియలయొక్క సాహిత్యోద్దేశ్యములును భిన్నములు. ఇతిహాసమున నుండు ఉదాత్త వస్తు - ఉదాత్త వర్ణన - ఉతాద్త ఛందఃప్రక్రియలు బ్యాలెడ్‌నందుండవు. అయినను బ్యాలెడ్ సాహిత్యోద్దేశము మాత్రము

29. *The Ballad is a shorter narrative, intended to be recited (in early days perhaps more commonly sung) at a single sitting, and dealing with a simple adventure or episode of popular story.*
*- Raymond M. Alden, Encyclopedia Americana, Vol. 17, p.569.*

30. *Its aim, whether recited or sung, or sung and danced, is to tell a good story about anybody or anything, no matter what or whom.*
*-T.F. Henderson, The Ballad in Literature, p.7.*

ఉదాత్తమైనదియు, రసవంతమైనదియు నగుటచే దీనికి న్యూనత రాదని చెప్పవచ్చును.

"The aim of the ballad was more restricted than that of epic verse, and its method more complex and more dramatic. It sought to impress by the vivid representation of a single event, to bring home to the hearer its wonder, its pathos, its fatefulness, or its horror. It did so aided by music, instrumental often as well as vocal, and it often added to the emotional impression by the device of the refrain sung by a chorus, and at one time probably danced as well as sung."[31]

(5) ఇతిహాసములు చదువుట కుద్దేశించినవి. బ్యాలెడ్స్ పాడుట కుద్దేశించినవి.

(6) ప్రాచీనమైన ఇతిహాసములన్నియు అంతకన్న ప్రాచీనములైన బ్యాలెడ్స్‌నుండి ఏర్పడినవనియు, ఈ పరిణామమును 'ఐతిహాసిక క్రమము' అని చెప్పవలె ననియు కొందఱు విమర్శకులు తలచుచున్నారు. ఇది వివాదాస్పదమైనది.

పై చర్చను బట్టి Epic--Ballad అను ప్రక్రియలకు కథాకథన విషయమందు మాత్రమే కొంత సామ్యమున్నదని తెలియుచున్నది. 'ఎపిక్' లోని కథాకథనము అనేక సంఘటనల వర్ణనతో అతివిస్తృతమైనదిగా నుండును. బ్యాలెడ్‌లోని కథాకథనము ఒకే సంఘటనావర్ణనతో సంక్షిప్తమైనదిగా నుండును. కాబట్టి 'ఎపిక్' అనునది పద్యరూపమునన్నున్న నవలగాను, బ్యాలెడ్ అనునది పద్యరూపమున (ఇటు 'పద్య' శబ్దమునకు 'ఛందస్సుతో కూడిన' లేదా 'వచన భిన్నమైన' అని మాత్రమే అర్థము) నున్న చిన్నకథ (short story in verse)[32] గాను తలపనగును. కాని ఎపిక్-బ్యాలెడ్ అను రెండును పరాశ్రయ కవిత్వమున కుదాహరణములే!

ఈ విధముగా 'బ్యాలెడ్' ప్రక్రియను Lyric, Epic అను ప్రక్రియలతో జేర్చి తులనాత్మకముగా పరిశీలించుట వలన దీని నిర్వచనము మఱింత స్పష్టమగుచున్నది. 'బ్యాలెడ్' బాహ్య స్వరూపమున 'లిరిక్'ను, ఆంతర స్వరూపమున 'ఎపిక్' ను పోలియున్నది. ఇందు 'లిరిక్' లోవలె గేయత్వమున్నది; 'ఎపిక్' లోవలె కథాకథనమున్నది. అనగా బ్యాలెడ్ సగము లిరిక్ ప్రక్రియతోను, సగము ఎపిక్ ప్రక్రియతోను సంవదించుచున్నది[33]. కావుననే T.F. Henderson

31. *Ibid., p.8.*
32. *W.H. Hudson, An Introduction to the Study of Literature, p. 104.*
33. *Of simple metrical form and dealing with some strongly emotional event, the ballad is half-way between the lyric and the epic.*
*- Hutchinson's Twentieth Century Encyclopaedia, p. iii.*

అను విమర్శకుడు బ్యాలెడ్‌కు "lyric-epic" అని పేరిడినాడు. ఈ రెండు ప్రక్రియలతోడి సంబంధమును దృష్టిలో నుంచుకొని బ్యాలెడ్‌ను కొందఱు విమర్శకు లీ క్రింది విధముగా నిర్వచించిరి-

"It is not a narrative poem only; it is a narrative poem lyrical in form, or a lyrical poem with a narrative body in it. And it is a lyrical narrative, not of the ambitious kind, like Pindar, but simple, and adapted for simple audiences and for oral tradition, from one generation to another."[34]

'Ballad, poetical composition narrative in matter and lyrical in form which generally recounts some legend or story'.[35]

'But a ballad is not a song. Usually it holds a story; it is the fragment of an epic.[36]

ఇతిహాసము మిక్కిలి దీర్ఘమైనది. భావగీతి మిక్కిలి హ్రస్వమైనది. కాని బ్యాలెడ్ ఇతిహాసమంత సుదీర్ఘమును గాదు, భావగీతియంత సంక్షిప్తమును గాదు. ఇతిహాసముతో పోల్చి చూచినప్పుడు బ్యాలెడ్ అనగా 'భావగీతి రూపముననున్న చిన్న ఇతిహాసము' (Short epic in lyrical from); భావగీతితో పోల్చినప్పుడు 'ఐతిహాసిక కథనముగల పెద్ద భావగీతము' (Long lyric with epic narration). ఈ విధముగా బ్యాలెడ్ అనునది ఇతిహాస భావగీతముల సమ్మేళనమున జనించినట్టిదిగా భావింపదగును[37]. కావుననే పలువురు విమర్శకులు బ్యాలెడ్‌ను వివరించు సందర్భములందు 'Lyrical Narrative', 'Narrative Lyric', 'Lyrical Story', 'Narrative Song', 'Story Song' అను పదములను ప్రయోగించియున్నారు. ఆంగ్ల సాహిత్యమున గల వివిధ ప్రక్రియలలో బ్యాలెడ్స్ నిట్లు నిరూపింపవచ్చును. (ఇది స్థూల ప్రదర్శనము మాత్రమే. సూక్ష్మప్రదర్శనమునకు చూడుడు : వెనుకటి ప్రకరణము - 'ఆముఖము').

---

34. *W. P. Ker, 'On the history of the Ballads', P.B.A., Vol. IV, 1909-1910, p.179.*
35. *Everyman's Encyclopaedia, Vol.I, p.709.*
36. *Emile Legouis and Luis Cazamian, A history of English Literature, p.175.*
37. *The supreme illustration of this blending of story and song is ballad.*
*-Bliss Perry, A study of Poerty, p. 276.*




ఇతర పాశ్చాత్య సాహిత్యములందును 'బ్యాలెడ్' కవితాప్రక్రియ కలదు కాని, 'బ్యాలెడ్' అను శబ్దమునకు సమానార్థకమగు శబ్దములు మాత్రము పెక్కు సాహిత్యములందు లేవు. ఫ్రాన్సు దేశమున బ్యాలెడ్సుకు ప్రత్యేక నామము లేదు. అట కథాగేయములను, శుద్ధగేయములను కలిపి 'Chansons Populaires' అని ఒకే పేరుతో వ్యవహరింతురు. ఈ పేరుకు 'Folksongs', 'Street songs' - అని యర్థము. ఇదే విధముగా జర్మను దేశమున 'Volkslieder' అను పదమున్నది కాని దీనికి 'జానపద గేయములు' (Folksongs) అని మాత్రమే అర్థము. ఈ జర్మనులు కథాగేయములకు ప్రత్యేకముగా Ballade (ba'la:də) అను శబ్దము నాంగ్ల భాషనుండి గ్రహించి ప్రయోగించుచున్నారు. డేనిష్ భాషలో సాంప్రదాయక కథాగేయము (Traditional Ballad) ను "folk-eviser" అని పిలుతురు. స్కాండినేవియా (నార్వే - స్వీడన్) అంతటను ఇదే పేరును వాడుచున్నారు. బ్యాలెడ్ సంపదలో ప్రపంచమున ప్రథమశ్రేణికి జెందిన స్పెయిన్ దేశములో బ్యాలెడ్కు ఎనిమిది రకముల పేర్లు వ్యాప్తియందున్నవి:-

*Balada or Balata*
*Copla*
*Trova*
*Cantinela*
*Cancion*
*Chanzoneta*

} = *Ballad*

| | | |
|---|---|---|
| *Jacara* | = | *Merry Ballad* |
| *Romance* | = | *Historic Ballad* |

పోర్చుగీస్ భాషలో ***Ballada*** **(ba-la'-da)** శబ్దము వాడబడుచున్నది. గ్రీకు భాషలో ***Tpayovoc*** అనియు, లాటిన్ భాషలో ***Carmen*** అనియు, ఇటాలియన్ భాషలో ***Ballata, Canzone, Romanza*** అను శబ్దములను ప్రయోగింపబడుచున్నవి. (ఇందు లాటిన్ పదమునకు **'Song'** అని మాత్రమే అర్థమున్నది. 'బ్యాలెడ్'కు సరియైన పదము ఆ భాషలో లేదు). ***'Brittany'*** (ఫ్రాన్సులో ఒక రాష్ట్రము) లో బ్యాలెడ్‌ను ***'Gwerzou'*** అందురు. ఫ్రాన్సు, కాటలోనియా(**Catlonia**), ప్రోవెన్స్ (**Provence**), ఉత్తర ఇటలీ దేశములందు బ్యాలెడ్సుకు ప్రత్యేకనామము లేక జానపద గేయములతో కలిపియే వాడబడుచున్నవి.

ఇంతవఱకును 'బ్యాలెడ్' ప్రక్రియయొక్క స్వరూప నిర్వచనములను గూర్చి పాశ్చాత్య విమర్శకుల మతములను చర్చించితిమి. ఇప్పుడు పాశ్చాత్య సాహిత్యములలోని ఈ బ్యాలెడ్ ప్రక్రియను పోలిన ప్రక్రియ ప్రాచ్యదేశ సాహిత్యములలో - ముఖ్యముగా మన ఆంధ్రభాషలో ఎట్లున్నదో పరిశీలింతము.

వీరుని సాహసములను వర్ణించు గేయమును అరబిక్ భాషలో 'హమాసా' అందురు. పర్షియన్ భాషలో యుద్ధగీతమును 'రజ్మియా' అనియు, యుద్ధములో పుట్టిన కవిత్వమును 'రజ్మియా షాయరీ' లేక 'రజ్మియా నజమ్' అనియు పిలుతురు. ఈమహమ్మదీయ భాషలలో చక్రవర్తులను మహాపురుషులను కీర్తించు గీతమును 'ఖసీదా' అందురు. ఉర్దూభాషలో వీర గీతమును 'మర్సియా' అందురు. ఈ మర్సియాలు హసేన్, హుసేన్ అను వీరుల మరణమునకై విలపించు దుఃఖగీతములు. ఇవి మొహరమ్ పండుగలలో ఎక్కువగా పాడబడును. కావున పై భాషలోని 'హమానా', 'రజ్మియా', 'మర్సియా' అను పదములు ఆంగ్లములోని బ్యాలెడ్‌కు సమానార్థకములని తెలియుచున్నది. జాపనీస్ భాషలో బ్యాలెడ్‌ను 'నొగటారి' అందురని కొన్ని వీర కావ్యముల పేర్లనుబట్టి ఊహింపబడుచున్నది.

భారతదేశమున సంస్కృతభాషలో వీరుని ప్రస్తుతించు గేయమును 'గాథా' అనియు, 'గాథా నారాశంసీ' అనియు వ్యవహరింతురు. ఆధునిక భారత భాషలలో (ముఖ్యముగా దక్షిణ భారత భాషలలో ) 'ఫోక్ సాంగ్స్' అను ఆంగ్లశబ్దమునకు సమానార్థకములగు శబ్దములు కొల్లలుగానున్నవి కాని, 'బ్యాలెడ్' ప్రక్రియను ప్రత్యేకముగా సూచించు శబ్దములు చాల తక్కువ. కొన్ని భాషలలో అసలు లేనే లేవు. ఔత్తరాహులు 'లోక సాహిత్య', 'లోక గీత్', 'గ్రామ గీత్' అను శబ్దములను ఫోక్ సాంగ్స్ పరముగా వాడుచున్నారు. రాజస్థానీ మాండలికమున వీరుని గూర్చిన గేయకథను 'రాసో' అందురు. ఇది 'రాసఉ' అను ప్రాకృతశబ్ద భవము. ఈ రాసో శబ్దము బ్యాలెడ్

శబ్దమునకు సరిగా సమానార్థకమైనది. పృథ్వీరాజ రాసో, బీసల్‌దేవ రాసో, హమ్మీర్ రాసో, విజయపాల్ రాసో, పరమాల్ రాసో మున్నగునవి హిందీ సాహిత్యమందలి ప్రసిద్ధమగు బ్యాలెడ్సు. ఈ రాసోలను 'దేశద్రిమ్మరు'[38] లగు గాయకభిక్షువులు పాడుచుందురు. వీరిని 'చారణులు' అందురు. చారణులు పాడు గీతములు కావున వీనికి 'చారణ గీతము' లనియు పేరు. పంజాబీ భాషలో 'వార్' (Vaar) అను శబ్దము బ్యాలెడ్ పరముగా వాడబడుచున్నది. 'జంగ్‌నామా' పదము కూడ ఈ యర్థమునే యిచ్చుచున్నది. జమ్మూ భాషలోని 'Baarans' అను పదము, ఘర్‌వాల్ (హిందీ మాండలికము) లోని 'Pawara' అను పదము, మరాఠీ భాషలోని 'పొవాడా' (Powada), మధ్య ప్రదేశ్‌లోని 'బాన్స్‌గీత్' (Bans Geet) మున్నగున వన్నియును బ్యాలెడ్ పర్యాయ పదములే!

ఇట్లు ఉత్తరాదిని ఆర్యభాషలలో కొన్ని శబ్దములు బ్యాలెడ్ ప్రక్రియను ప్రత్యేకముగా సూచించుచున్నను, ద్రావిడ భాషలలో బ్యాలెడ్ పరముగా నొక్క పదమైనను లేకుండుట శోచనీయము. ఫ్రెంచి భాషలోవలెనే ద్రావిడ భాషలలో గూడ బ్యాలెడ్ ప్రక్రియను ప్రత్యేకముగా సూచింపక జానపద గేయములతో కలిపి వ్యవహరించుట పరిపాటిగా నున్నది. తమిళ మలయాళములలో 'నాట్టు పాడల్‌గళ్' అను పదము, కన్నడమున 'హళ్ళియ హాడుగళు', తెలుగున 'పల్లెపాటలు' లేక 'జానపద గేయములు' (ఇది పల్లెపాటలకు పండితులు చేసిన తర్జుమా) - మున్నగు పదములు ఈ భాషలలో వ్యవహారమున నున్నవి. బ్యాలెడ్ ప్రక్రియకూడ వీనియందే గతార్థముగా భావింపబడుచు వచ్చినది. నిజమునకు పై పదములు 'ఫోక్ సాంగ్స్' అను శబ్దమునకు మాత్రమే సమానార్థకములు. కాని 'ఫోక్ సాంగ్' వేఱు, 'బ్యాలెడ్' వేఱు అని పాశ్చాత్య విమర్శకులు క్రిందటి శతాబ్దమందే నిష్కర్షగా తేల్చివైచిరి. కావున ద్రావిడభాషలలోని ఆధునిక విమర్శకులు కొందఱు 'బ్యాలెడ్' అను మాటకు సమానార్థకముగా నుండునట్లు క్రొత్త పదములను వెదక నారంభించిరి. బ్యాలెడ్ అనగా కథాఖ్యానముచేయు గేయమని పాశ్చాత్యులు నిర్వచించివారు గావున, ఆ యర్థమును సూచించు రీతిగా కొన్ని పదములను కల్పించిరి. ఇట్లు కల్పింపబడిన పదములలో తమిళమున 'కదైపాది పాడల్‌గళ్' (= కథను పాదిగిన పాటలు), కన్నడమున 'కథేహాడు' (=కథాగేయము. ఉదా: 'గోవిన కథేహాడు' =గోవు కథాగేయము)- అనునవి బ్యాలెడ్ పరముగా వాడబడుచున్నవి. మలయాళమున సంస్కృతప్రభావ మెక్కువగా నుండుటచే 'వీరగాథ' అను సంస్కృత శబ్దము బ్యాలెడ్ పరముగా ప్రచారమునకు వచ్చుచున్నది.

---

38. *'దేశద్రిమ్మరులు' అనునది దుష్టసమాసమైనను పుష్టికరమగు అర్థము నిచ్చుచున్నది. కావున సర్వత్ర దీనినే ప్రయోగించుచున్నాను. 'దేశ సంచారులు' వంటి శిష్ట సమాసములలో అర్థపుష్టి లేదు.* "Itinerant minstrels" *అను పదమునకు ''దేశద్రిమ్మరులగు గాయక భిక్షువులు'' అనునది సమంజసమగు ఆంధ్రీకరణమని నా యభిప్రాయము.*

ఇట్లే తెలుగున కూడ బ్యాలెడ్‌ను సూచించుటకు 'పల్లెపాట', 'జానపద గేయము' అను మాటలు గాక ప్రత్యేక శబ్దమును సృజించుకొనవలసిన ఆవశ్యకమున్నది.

బ్యాలెడ్ అను నాంగ్లశబ్దమునకు సరియగు తెలుగుశబ్దము లేదని చెప్పవలసియున్నది. 'మీ తెలుగుసాహిత్యమున బ్యాలెడ్స్ ఉన్నవా?' అను ప్రశ్నకు వెంటనే సమాధానము చెప్పగలము కాని, 'బ్యాలెడ్ అనుమాటకు సమానార్థకమైన తెలుగుమాట యేది?' అని ప్రశ్నించినచో నిరుత్తరుల మగుదుము. పరశురామునికథలు, అంకమ్మకథలు, పల్నాటివీరకథలు, కాటమరాజుకథలు, బొబ్బిలికథ, దేశింగురాజుకథ, బాలనాగమ్మకథ, కాంభోజరాజుకథ, ముగ్గురు మరాఠీలకథ, కామమ్మకథ, లక్ష్మమ్మకథ, చిన్నమ్మకథ, సర్వాయిపాపడుకథ, చిన్నపరెడ్డి కథ - ఇత్యాదులు తెలుగులో నున్న బ్యాలెడ్స్ అని యెవరయినను చెప్పగలరు. అయినచో బ్యాలెడ్ శబ్దమునకు సమానార్థకమగు తెలుగు శబ్దమేది?

ఇట్టి తెలుగు శబ్దమును నిరూపించుటకు ముందు పాశ్చాత్య విమర్శకులు 'బ్యాలెడ్' ప్రక్రియను గూర్చి సలిపిన పై చర్చల నన్నింటిని నిశితముగా పరిశీలింపవలసియున్నది. 'బ్యాలెడ్'కు పర్యాయ పదములుగా పాశ్చాత్యులు 'lyric-epic', 'lyrical narrative', 'narrative lyric', 'lyrical story', 'narrative song', 'story song' - అను శబ్దములను ప్రయోగించిరని తెలిసి కొంటిమి. ఈ 'బ్యాలెడ్' శబ్దమునకే పాశ్చాత్య విమర్శకులు వివరణాత్మకముగా ఈ క్రింది వాక్యములను వాడియున్నారు.

'a short epic in lyrical form'-- 'a long lyric with epic narration' -- 'short story in verse' -- 'a folk-song that tells a story' -- 'a song with narration'.

ఈ వాక్యములను పరిశీలించినచో తెలుగున 'బ్యాలెడ్'కు సమానార్థక శబ్దము నేర్పఱచుకొనుట సులభమే కాగలదు. 'గేయేతిహాసము,, ఐతిహాసిక గేయము, గేయకథ, కథాగేయము, కథా గీతము, జానపద గేయకథ, జానపద కథాగేయము' - అను మాటలను తెలుగున నుపయోగింప వచ్చును. కాని ఇవన్నియును, 'బ్యాలెడ్' అనుమాటకు వివరణాత్మక ఆంధ్రీకరణములే కాని సంగ్రహానువాదములు కానేరవు. 'బ్యాలెడ్' వలెనే ఒకేఒక మాటగానుండు తెలుగుశబ్దము నూహింపవలెను.

తెలుగులో ప్రతి 'బ్యాలెడ్' పేరునకును చివర 'కథ' అను శబ్దము విధిగా నుండి తీరును. (బొబ్బిలి<u>కథ</u>, దేసింగురాజు<u>కథ</u>, బాలనాగమ్మ<u>కథ</u>, కాంభోజరాజు<u>కథ</u>, లక్ష్మమ్మ<u>కథ</u>, మొదలైనవి). తెలుగుభాషరాని భాషాశాస్త్రవేత్తలకు ఈ పేర్లు చూపించినచో వీనిలో చివర సమానాంశముగా నున్న 'కథ' అను శబ్దము తెలుగులో 'బ్యాలెడ్' పరముగా వాడబడుచున్నదని వెంటనే చెప్పగలరు. కావున ఆంగ్లములోని 'బ్యాలెడ్'కు తెలుగులో 'కథ' సమానార్థకమని తలపవచ్చును.

తెలుగు జానపదులలో 'ఫోక్ సాంగ్' పరముగా 'పాట', 'పదము', అను మాటలును, 'బ్యాలెడ్' పరముగా 'కత' అను మాటయు వ్యవహారమున నున్నవి. నేను పెక్కుమంది జంగములను పరిశీలించితిని. వారు 'బ్యాలెడ్'ను గురించి మాటాడునప్పుడు ఈ విధముగా నందురు: 'మాపిటికి నాకు కత ఉంది' - 'రేపు ఆ ఊళ్ళో కత ఒప్పుకున్నా' - 'తిరనాళ్ళకి మా రెడ్డి కత సెప్పిత్తా నన్నాడు' ఇత్యాది పరిభాషను బట్టి గాయక భిక్షువుల (Minstrels)లో 'బ్యాలెడ్' పరముగా 'కత' అను శబ్దము వ్యవహరింపబడుచున్నదని నిశ్చయింపవచ్చును.

తెలుగు విమర్శకులలో మొట్టమొదట ఈ 'బ్యాలెడ్స్' ప్రసక్తి తెచ్చిన మహనీయుడు సి.పి. బ్రౌనుదొరగారు. ఈయన క్రీ.శ. 1841లో బ్యాలెడ్సును ప్రత్యేక కవితాశాఖగా నిరూపించి, **'Ballads'** అను మాటకు కుండలీకరణమున **'Cathalu'** అని తెలుగు శబ్దమును రోమను లిపిలో వ్రాసి, ఈ కథల కుదాహరణములుగా బొబ్బిలికథను, పల్నాటికథలలోని నాగమ్మకథను పేర్కొన్నాడు[39]. తెలుగున గల 'బ్యాలెడ్స్' అన్నింటను చివర 'కథ' అని యుండుటయే ఇట్టి ఆంధ్రీకరణమునకు కారణమై యుండును.

ప్రజామధ్యమునకు పోయి, వారు పాడుచుండగా 'బ్యాలెడ్సు' వ్రాసికొన్న ప్రాచీన దేశి కవితా సంచయనకారులలో జె.యె.బోయల్ **(J.A.Boyle)** దొర ఒకడు[40]. ఇతడు రాయలసీమలో ప్రభుత్వోద్యోగిగా నుండి క్రీ.శ. 1874లో సర్వాయిపాపడుకథను, మఱియైదు శృంగార జానపదగేయములను (కపిలపాటలను) సేకరించినాడు. ఇందు సర్వాయిపాపడుకథ మాత్రమే 'బ్యాలెడ్' అగును. తక్కినవి 'ఫోక్ సాంగ్స్' మాత్రమే. కాని ఈ దొర తాను సేకరించిన పై ఆఱు పాటలపైనను ఒక వ్యాసమును వ్రాసి, అన్నింటికిని కలిపి **'Telugu Ballad Poetry'**

---

39. *Finally there are other ballads (cathalu) of great length framed in a peculiar chant on principles different from all other sorts of poetry. Some of these, as the Bobbili-catha or Ranga Rao Charitra, the Nagamma Catha and the like are chiefly preserved by oral recitation without having been until now committed to writing. These are every where popular though despised, as illiterate, by professed scholars.*
*-C.P.Brown, Asiatic Journal, Vol. 34, 1841.*

40. *తెలుగులో బ్యాలెడ్స్ సేకరించినవారిలో బోయల్‌దొర ద్వితీయుడగుచున్నాడు. ఇందు ప్రప్రథముడు సి.పి.బ్రౌనుదొరగారే. ఈ బ్రౌనుదొర 1842 ప్రాంతమున ఒక జంగమును నెలరోజులు తన దగ్గఱ నుంచుకొని, ఆతనిచే బొబ్బిలికథ, కొమారరామునికథ, కామమ్మకథ అను మూడు బ్యాలెడ్స్ పాడించి, వానిని యథాతథముగా గ్రంథస్థము చేయించినాడు. ఈ బ్రౌనుదొరగారే, మఱియొక కాపువానిచే 'బాల విక్రమార్కుని పెండ్లి' అను కథను పాడించి దానిని గూడ గ్రంథస్థము చేయించినారు. ఇవన్నియును నేడు మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున గలవు. కాబట్టి 1874లో సర్వాయిపాపనికథను సేకరించిన బోయల్‌దొర, బ్రౌను తరువాత చెప్పదగినవాడే!*

అని నామకరణము చేసినాడు[41]. ఇందు సర్వాయిపాపనికథను తప్పించినచో తక్కిన కపిల పాటలైదును జానపదగేయములగును గాని బ్యాలెడ్స్ కానేరవు గదా! తెలుగు విమర్శకులందఱును 'బ్యాలెడ్స్'ను జానపదగేయములుగా వ్యవహరించుచుండగా, ఈ దొరగారు జానపద గేయములను 'బ్యాలెడ్స్' గా వ్యవహరించినాడు. బోయల్‌దొర వ్యాసమంతయును ఆంగ్ల భాషలో నుండుటచే బ్యాలెడ్ శబ్దమునకు తెలుగుశబ్దమును చెప్పవలసిన ఆవశ్యక మాతనికి కలుగలేదు. పైగా, తనకు తెలుగులో పూర్తిపరిచయము లేదని అతడు వ్రాసికొన్నాడు. బ్రౌనుదొరకు తెలుగుభాషలో ప్రవేశముండుటచే కుండలీకరణమున 'కథలు' అని వ్రాయగలుగుటయే కాక బ్యాలెడ్స్‌కు ఉదాహరణములను గూడ నీయగలిగెను.

క్రీ.శ. 1911 లో అక్కిరాజు ఉమాకాంతంగారు 'పల్నాటి వీరచరిత్ర' అను పేరుతో శ్రీనాథకృతమగు 'బాలచంద్రుని యుద్ధము'ను పరిష్కరించి ప్రకటించినారు. దీనికి వారు ఆంగ్లమునను తెలుగునను గూడ విపుల పీఠికలను వెలయించినారు. ఆంగ్లపీఠికలో పల్నాటి వీరచరిత్రను 'బ్యాలెడ్' అని చెప్పిన వీరు, తెలుగుపీఠికలో దానికి సమానార్థకముగా 'పదము', 'పద కావ్యము', 'వీరచరిత్ర', 'వీరకథలు' అను నాలుగు శబ్దములను ప్రయోగించినారు.[42]

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు స్త్రీలపాటలను 'బ్యాలెడ్స్'ను కలిపి 'పద రచనలు' అనినారు. "మఱియు కుచ్చెలకథ, లంకాయాగము, బొబ్బిలికథ, లంకాసారథి మొదలగు వందలకొలది పదములుగల గొప్ప <u>పద రచన</u>లను సర్వాంధ్రదేశమున నుండి సేకరించి, మేలేర్చి, యందుండి పరిగ్రాహ్యము గ్రహించి, భావి వాఙ్మయ వికాసమునకు యువకవులు ప్రయత్నింతురుగాక యని కోరుచున్నాను."[43] (ఇందు 'పంక్తులు' అను నర్థమున గూడ శాస్త్రిగారు 'పద' శబ్దమునే ప్రయోగించినారు).

---

41. *Indian Antiquary, Vol. III, p.1. (1874).*

42. *(1) 'వారి ప్రథమ భూమిక' లో ఈ క్రింది వాక్యములున్నవి: - "అచ్చటచ్చట మహాశూరుల చరిత్రమును పాటల రూపమున పదముల రూపమున నిసర్గ కవులు కీర్తించి యున్నారు. ...బొబ్బిలి కథాదులిట్టివే...." పుట 1.*
   *"శ్రీనాథుడిట్టి పదకావ్యమును రచించుటకు గల కారణమును గూర్చి..." పుట 69.*
   *"శ్రీనాథునికిఁబిమ్మట వీరచరిత్రమును వీరభద్రుడు పద్యమయముగను, మల్లయ్య, బలరామిసెట్టి కొడుకు కొండయ్య యను నిరువురు ద్విపదిగాను రచించిరి." పుట 76.*
   *(2) వారి ద్వితీయ భూమికలో ఈ క్రింది వాక్యములున్నవి:*
   *"వీరచరిత్ర కర్త సాధారణ దశను అతిక్రమించలేదు" - పుట 10.*
   *"సాధారణంగా పిచ్చికుంట జాతివారు ఈ వీరకథలను కీర్తిస్తుంటారు." -పుట 29.*

43. *సింహావలోకనము, పుట 52.*

1953 డిసెంబరు నెలలో శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు 'దేశి సారస్వత విభూతి' అను ఉత్తమ వ్యాసమును ప్రకటించిరి. ఇందు సమస్త దేశిప్రక్రియలను వారు ఆమూలాగ్రముగ చర్చించిరి. ఇందు 'బ్యాలెడ్' ప్రక్రియను చెప్పవలసిన చోట్ల శ్రీపాదవారు 'వీరగాథలు, వీరకథా వాఙ్మయము, జానపద కావ్యము, వీరచరిత్ర, వీరకథలు, గేయకథలు' - మున్నగు మాటలను ప్రయోగించిరి[44].

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పరిష్కరించిన 'కాటమరాజుకథ' ను 1953లో మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము వారు ప్రకటించినారు. దానికి మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఆంగ్లాంధ్రభాషలలో రెండు పీఠికలను వ్రాసినారు. ఆంగ్లపీఠికలోవారు కాటమరాజుకథను ''Historical Ballad'' అని అతిసులభముగా చెప్పగలిగిరి కాని, ఆంధ్రభూమికలో దీనికి సరియగు నొక్క మాట తోచక, 'అసావాదిత్యోబ్రహ్మ' అను రీతిలో 'కడు ప్రసిద్ధమై గానము చేయబడుచున్న ద్విపద ప్రబంధము'' అని వివరించి తప్పుకొనినారు.

1954లో 'జానపద గేయవాఙ్మయ పరిచయము'ను ప్రకటించిన శ్రీహరి ఆదిశేషువు గారు 'బ్యాలెడ్సు'ను జానపద గేయములుగనే సంభావించినారు. వీరీ గ్రంథమున గేయకథలను 'వీరకథా వాఙ్మయము, సాహసికకథా వాఙ్మయము, కరుణరసాత్మక కథావాఙ్మయము, అద్భుతరసప్రధాన కథావాఙ్మయము, శైవకథా వాఙ్మయము' ఇత్యాది పేర్లతో వర్గీకరించిరి. ఈ విభజనమునుబట్టి వీరు 'బ్యాలెడ్' కవిత్వమును 'కథావాఙ్మయము' అను పేరుతో వ్యవహరించిరని ఊహింపనగును.

1956లో మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము వారు 'బొబ్బిలియుద్ధ కథ' అను 'బ్యాలెడ్'ను ప్రకటించిరి. దీనికి మల్లంపల్లివారు ఆంగ్లపీఠికను, ఆంధ్ర పీఠికను కూడ వ్రాసిరి. ఆంగ్లపీఠికలో 'బ్యాలెడ్' అనుట అతి సులభము కదా! తెలుగుపీఠికలో మల్లంపల్లివారు కాటమరాజు కథ విషయమున పట్టిన ద్రావిడ ప్రాణాయామమును కొంత తగ్గించి, 'జానపద గేయకథా వాఙ్మయము' అను మాటను బ్యాలెడ్ కవిత్వపరముగా వాడిరి. ఈ సంవత్సరములోనే వేటూరి ఆనందమూర్తిగారు (ప్రభాకరశాస్త్రిగారి పుత్రులు) 'అగుమంచికథ' ను పరిష్కరించి 'పరిశోధన' పత్రికలో ప్రకటించిరి. అందు అగుమంచికథాశీర్షిక క్రింద కుండలీకరణమున 'ప్రాచీన జానపద కావ్యము' అని వ్రాసిరి. 'Traditional Ballad' అను దానికిది ఆంధ్రీకరణమువలె నున్నది.

జానపద సాహిత్యముపై విశేషపరిశ్రమ చేసిన డాక్టరు బి. రామరాజుగారు 1958లో తమ పరిశోధక వ్యాసమును 'తెలుగు జానపద గేయ సాహిత్యము' అను పేరుతో గ్రంథ రూపమున

---

44. చూ. కిన్నెర, డిసెంబరు - *1953*, పుటలు *554-557*.

ప్రకటించిరి. వీరును ఆదిశేషువుగారివలెనే 'బ్యాలెడ్'ను జానపదగేయముగనే సంభావించి నట్లున్నది. ఉత్పత్తిచర్చయందు గాని, లక్షణనిరూపణమందు గాని 'బ్యాలెడ్' ప్రత్యేకతను వీరు గుర్తింపక, జానపదగేయములనే దృష్టియందుంచుకొని ముందునకు సాగిరి. జానపదగేయ లక్షణాదులను సమర్థించుటకై సుప్రసిద్ధ బ్యాలెడ్ విమర్శక గ్రంథముల[45] నుండి అనేక వాక్యముల నుదాహరించిరి. తెలుగులో అతిప్రసిద్ధమగు బ్యాలెడ్ - బొబ్బిలి కథను గూర్చి చెప్పుచు 'సిసలైన జానపదగేయమున కుండవలసిన లక్షణములన్నియు దీని కున్నవి[46] అనిరి. ఈ కారణములనుబట్టి రామరాజుగారు జానపద గేయమునకును - బ్యాలెడ్‌కును అభేదమును పాటించిరని స్పష్టమగుచున్నది. కాని కొన్నితావులలో బ్యాలెడ్ ప్రక్రియను తప్పక చెప్పవలసి వచ్చినప్పుడు 'కథాగేయము, వీరగీతములు, చారిత్రక గీతములు' అను శబ్దముల నుపయోగించిరి.[47]

1960లో శ్రీ నేదునూరి గంగాధరంగారు 'జానపద గేయవాఙ్మయ వ్యాసావళి' అను గ్రంథమును ప్రకటించిరి. అందు 'వీరపదాలు' అనుమాట 'బ్యాలెడ్' పరముగా ప్రయోగింపబడినది.

1961లో విజ్ఞానసర్వస్వము (నాలుగవ సంపుటము)న జానపద సాహిత్యముపై శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు 'జానపద గేయ-గేయకథా వాఙ్మయము' అనుపేర ఒక చక్కని వ్యాసమును వ్రాసిరి. ఇందు వీరు ప్రప్రథమముగా 'బ్యాలెడ్' అనునది మామూలు పాట (song) కంటె భిన్నమైనదని సూచించిరి. జానపద గేయవాఙ్మయ మంతటిని వీరు 'విడిగేయములు' (Songs), 'కథాగేయములు' (Ballads) అను రెండు ప్రధాన భాగములుగా విడదీసిరి. జానపద గేయము వేఱు, జానపద గేయకథ వేఱు అని శ్రీపాదవారి శీర్షికయే నిరూపించుచున్నది. వీరు 'బ్యాలెడ్' పరముగా 'జానపద గేయకథ' అను మాట నుపయోగించిరని దీనిని బట్టి చెప్పవచ్చును.

1961లోనే ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు పల్నాటి వీరచరిత్రను పరిష్కరించినారు. (దీనిని విశాలాంధ్ర ప్రచురణాలయమువారు ప్రకటించిరి). ఇందు 'పల్నాటి వీరచరిత్ర' అను ముఖశీర్షిక క్రింద కుండలీకరణమున 'పద కావ్యము' అని వ్రాసినారు.

---

45. *'The Popular Ballad' by F.B. Gummere.*
*'The Ballad in Literature' by T.F. Henderson.*
*'English and Scottish Ballads' by F.J. Child.*

46. తెలుగు జానపదగేయ సాహిత్యము, పుట 235.

47. అదే., పుటలు 21,155.

దీనికి వారు వ్రాసిన పీఠికలో 'బ్యాలెడ్' అనుదానికి 'పదము', 'పద కావ్యము' అనియు, 'Ballad Poetry' అను మాటకు 'పద కవిత్వము' అనియు తెనుగుచేసినట్లు తెలియుచున్నది.

మొత్తముమీద తెలుగువిమర్శకులలో నెక్కువమంది 'బ్యాలెడ్' కు ప్రత్యేకమగు తెలుగు శబ్దమును సృజింపక, దానిని జానపదగేయమాత్రముగనే పరిగణించిరని చెప్పవలసి యున్నది. శ్రామికులు, కర్షకులు పాడుకొను చిన్నచిన్న పాటలు, బాలబాలికల పాటలు, సంచార గాయక భిక్షువులు పాడెడి వీరరసప్రధానములగు సుదీర్ఘ కథాగేయములు, స్త్రీల విడిపాటలు, స్త్రీల కథలపాటలు, రామదాసు భజనకీర్తనలు, హరీహరీ పదములు, జంగంకథలు, బుఱ్ఱకథలు - ఇత్యాది సమస్తమును కలగాపులగము చేసి 'జానపద గేయములు' (Folksongs) అని పేరిడినారు. పల్నాటి వీరచరిత్ర స్వచ్ఛమగు 'బ్యాలెడ్' అగుటచే దాని పరిష్కర్తలకు మాత్రము 'జానపద గేయము' అని స్థూలముగా చెప్పి తప్పించుకొనుటకు వీలు కలుగలేదు. 'బ్యాలెడ్' అనుదానికి తెలుగున ప్రత్యేకశబ్దమును వెదకుకొనవలసివచ్చినది. ఇందులకు వారు 'పదము' అనుదానిని గైకొనిరి. ఇంతకు మించి తెలుగున బ్యాలెడ్ శబ్దమునకు ఆంధ్రీకరణ ప్రయత్నము జరుగలేదని చెప్పవలెను.

'బ్యాలెడ్స్' జానపద సాహిత్యమున నొక భాగమని వెనకటి అధ్యాయమున నిరూపించితిని. ఆంగ్లమున గల 'Folk literature' అను మాటకు 'జానపద సాహిత్య' మనునది ఆంధ్రీకరణ మనవచ్చును. ఈ ఆంధ్రీకరణ విషయమున గూడ తెలుగువిమర్శకులలో నేకవాక్యత లేదు. ఈ సాహిత్యమును పలువురు పలువిధముల నామములతో నిరూపించిరి. 'ప్రజా వాఙ్మయము, పద వాఙ్మయము, అనాదృత వాఙ్మయము, గేయ రచనలు, మధుర కవితలు, దేశి సారస్వతము, జానపద వాఙ్మయము, జానపద సాహిత్యము' అనునవి Folk literature కు సమానార్థకములుగా తెలుగున వాడబడుచున్నవి. ఈ పదములలో 'జానపద సాహిత్య' మనునదే సమంజసమైనదనియు, సహేతుకమైనదనియు, Folk literature అను ఆంగ్లశబ్దమునకు సరియగు సమానార్థకమనియు రామరాజుగారు చర్చించి నిరూపించియున్నారు.[48] ఈ జానపద సాహిత్యమున కవితావిభాగమున గల రెండు ప్రధాన భాగములలో 'బ్యాలెడ్సు' ఒక భాగము. జానపద గేయములు (Folksongs) మఱియొక భాగము. కథాత్మకములై పరాశ్రయములు గాను, వీరరసప్రధానములుగాను నుండు గేయములు 'బ్యాలెడ్సు'; కథారహితములై ఆత్మాశ్రయములుగా నేదేని యొక భావమును మాత్రము వెలువరించుచు, శృంగారరస ప్రధానముగానుండు గేయములు జానపదగేయములు లేక పల్లెపాటలు. కావున 'బ్యాలెడ్' వేఱు, 'ఫోక్ సాంగ్' వేఱు. రెండును రెండు ప్రత్యేక జానపద కవితాప్రక్రియలు. కావుననే ఆంగ్లమున ఈ రెంటికిని రెండు ప్రత్యేక శబ్దములున్నవి. 'ఫోక్ సాంగ్' అను ఆంగ్ల శబ్దమునకు

48. అదే., పుట 9.

'జానపద గేయము' అను మాట తెలుగున ప్రచారమున నున్నది. (దీనిని 'పల్లెపాట' అనియు పిలుచుట కలదు). 'బ్యాలెడ్' అను ఆంగ్లశబ్దమునకు మాత్రము ఇదమిత్థమను నామ మింతవఱకును నిర్ణయింపబడలేదు. ఈ పరిస్థితి ఒక్క తెలుగుననే కాదు, తక్కిన ద్రావిడ భాషలయందంతట నిట్లే యున్నది. 'బ్యాలెడ్సు'ను గూడ 'జానపద గేయములు', 'పల్లెపాటలు' అను పేర్లతోనే పిలుచుట సంభవించుచున్నది. ఇది సరికాదు. పల్లెపాటకన్న భిన్నమైన 'బ్యాలెడ్'కు ప్రత్యేకనామముండవలెను.

**Ballad -- Folksong** అనువానిని తెలుగువిమర్శకులు కలగాపులగము చేసినను, ఆంధ్ర జానపదులు మాత్రము **Ballad** పరముగా 'కత'ను, **'Folksong'** పరముగా 'పాట, పదము' అను మాటలను ఉపయోగించుచున్నారని తెలిసికొంటిమి. కాని ఈ 'కత' లో బ్యాలెడ్ యొక్క గేయస్వరూపము సూచితమగుటలేదు.

తెలుగు విమర్శకులు 'బ్యాలెడ్' శబ్దమునకు ప్రత్యేకమగు తెలుగుశబ్దమును సృజింపక పోయినను, సంపూర్ణ లక్షణములతో నొప్పుచున్న కొన్ని 'బ్యాలెడ్స్' ను గూర్చి చెప్పవలసి వచ్చినప్పుడు మాత్రము ఎడనెడ కొన్ని శబ్దములను ప్రయోగించియుండుట పైన గమనించితిమి. ''కథలు, పదము, పదకావ్యము, వీరచరిత్ర, వీరకథలు, వీరగాథలు, జానపద కావ్యము, గేయకథలు, కథాగేయములు, వీరగీతములు, చారిత్రక గీతములు, వీరపదములు'' - ఇవి మన విమర్శకులు, విద్వాంసులు క్వాచిత్కముగా నుపయోగించిన శబ్దములు. వీనిలో ఏ శబ్దము 'బ్యాలెడ్' అను ఆంగ్లశబ్దమునకు పుష్టికరమగు నాంధ్రీకరణమగునో పరిశీలింప వలసియున్నది.

## కథ- వీరకథ

'కథ' అను మాటలో 'బ్యాలెడ్' యొక్క గేయస్వరూపము సూచింపబడుట లేదు. కథ అనగా వచన రూపముననున్న కథ కూడ కావచ్చును. జానపద వచనకథల (**Folktales**) పేర్ల చివర కూడ కథాశబ్దమున్నది (పరమానందయ్యశిష్యుల కథలు, భట్టి విక్రమార్కునికథలు, కాశీ మజిలీ కథలు మొదలైనవి). కాని ఈ వచనకథల పేర్లకు చివర కథాశబ్దము సాధారణముగా బహువచన రూపమున నుండును. 'బ్యాలెడ్స్' లో ఎక్కువగా ఏకవచన రూపముననే ఉండును.

జానపద వచనకథలకే కాక కొన్ని యక్షగానములకు గూడ కథాశబ్దము నామాంతమున గానవచ్చుచున్నది. ఇది 'బ్యాలెడ్స్'లో వలెనే ఏకవచన రూపమున నుండుట మఱింత క్లేశమును కలిగించుచున్నది. ఉదా: బాలెంతకథ, గొల్లకథ, ఎఱుకులకథ, రాధకథ, సత్యభామకథ - మున్నగునవన్నియును యక్షగానములు. అందుచే కథాశబ్దము 'బ్యాలెడ్' కు మాత్రమే పరమితమగు శబ్దము కాదు. దీనికి 'వీర' విశేషణమును చేర్చినను 'బ్యాలెడ్' లోని గేయస్వరూపము సూచితమగుట లేదు.

## పదము, పదకావ్యము, వీరపదము

'పదము' అనునది తెలుగునగల అసంఖ్యాకములగు 'బ్యాలెడ్స్' లో నొక అంతశ్శాఖ మాత్రమే. 'హరిహరీ నారాయ ణాది నారాయణా, కరుణించి మమ్మేలు కమలలోచనుడ' అను జంపెవరుసలో వ్రాయబడిన 'బ్యాలెడ్స్'ను మాత్రమే పదములనుట పరిపాటి. వీని శీర్షికాంతమున 'పద' శబ్దము చేర్చియే వాడుచుందురు. లక్ష్మణమూర్ఛ పదము, సుందర కాండ పదము, అంగదరాయబారముపదము, శశిరేఖాపరిణయపదము మున్నగునవి ఉదాహరణములు. ఈ పదములు విశాఖ, శ్రీకాకుళ మండలముల నుండి క్రీ.శ. 1850 తరువాత వచ్చినవి. ఇవన్నియును పౌరాణికేతివృత్తములు కలిగియుండును. కావున ఈ 'పద' శబ్దమును 'బ్యాలెడ్'పరముగా నుపయోగించినచో నవ్యాప్తి దోషము పట్టును. జంపెవరుసలలో గాక, ద్విపదవికార రచనలలో నున్న శక్తికథలు, పల్నాటికథలు, కాటమరాజుకథలు, బొబ్బిలిపాట వరుసలో నున్న ఇతరకథలు, జంగంకథలు, బుఱ్ఱకథలు మున్నగునవి దీని పరిధినుండి తప్పిపోగలవు.

'పదకావ్య' మను శబ్దము గూడ సరికాదు. రచనా విధానమునను, కవిత్వమునను కొంత బిగి యున్నవి మాత్రమే కావ్య శబ్దమున కర్హములు. పల్నాటికథలలోను, కాటమరాజుకథలలోను మాత్రమే ఇట్టి కవిత్వపుబిగి యున్నది. వీనిని చదివికూడ ఆనందింపవచ్చును. బొబ్బిలికథాదు లిట్టివి కావు. వీనిని పాడునప్పుడు విని ఆనందింప వలసినదే. ఇట్టి వానిని కావ్యములనుట కుదురదు.

'వీరపదము' గూడ పరిమితార్థమునే యిచ్చును. కరుణరసప్రధానములగు పేరంటాండ్రకథలు, పౌరాణికేతివృత్తములుగల కథలు, కల్పనాప్రధానములగు కథలు 'బ్యాలెడ్స్'లో కలవు. వీనికి 'వీర' శబ్దము పుష్టి నీయజాలదు. పదశబ్దమే పరిమితార్థము నిచ్చునప్పుడు 'వీర' విశేషణము వలన ప్రయోజనము లేదు.

'పద' శబ్దమును స్వీకరించినచో వేఱొక చిక్కు కూడ ఉన్నది. అభినయప్రధానము లగు శృంగారగీతములను (క్షేత్రయ్య పదములను) 'పదము' అనుట తెలుగున పరిపాటి. కావున 'బ్యాలెడ్' కు 'పద' మను నాంధ్రీకరణమును స్వీకరించినచో నర్థక్లేశము సంప్రాప్తమగును.

## వీరచరిత్ర, చారిత్రక గీతము

'వీరచరిత్ర' యనగా 'వీరుని గూర్చిన చరిత్ర' యని పరిమితార్థము. ఇది వచనములో నుండవచ్చును. లేదా పదములలో నుండవచ్చును. 'వీరుని గూర్చి గేయరూపముననున్న కథా కథనము' అను నర్థమీశబ్దములో లేదు.

'బ్యాలెడ్సు' అన్నియును చరిత్రకు సంబంధించి యుండవు. వీనిలో సాంఘికము లును, పౌరాణికములును, జానపద కల్పనలును అగు రచన లెన్నియో కలవు. కావున 'చారిత్రక గీత' మనునదియు నర్థవంతము కాజాలదు.

## వీరగీతము

'వీరునకు సంబంధించిన పాట' అని దీని అవయవార్థము. 'బ్యాలెడ్' యొక్క కథాఖ్యానమను ముఖ్యలక్షణ మిందు సూచింపబడుట లేదు. కథాఖ్యానము విపులముగా లేని చిన్న చిన్న 'బ్యాలెడ్స్'(Balladlings) కు ఈ వీరగీత శబ్దము పనికివచ్చును.

## గేయకథ, కథాగేయము

ఇవి కొంతవఱకును అర్థవంతములగు ఆంధ్రీకరణములన వచ్చును. 'గేయరూపముననున్న కథ', 'కథాకథనముచేయు గేయము' అనునర్థమిచ్చుటచే 'బ్యాలెడ్' స్వరూప మీ శబ్దములలో చక్కగా నిరూపింపబడుచున్నది. కాని ఇది యెక్కువగా వీరునకు సంబంధించిన సాహసములను వర్ణించుననియు, వీరరసప్రధానముగా సాగుననియు, మౌఖిక సంప్రదాయమున జీవించియుండుననియు ఈ మాటలలో తెలియవచ్చుట లేదు. ఏ ఆధునిక కవియైనను గేయరూపమున కథను వ్రాయవచ్చును. గురజాడ అప్పారావుగారు 'పూర్ణమ్మ కథ'ను గేయరూపముననే వ్రాసిరి. డా॥ సి. నారాయణరెడ్డిగారు 'కర్పూర వసంతరాయలు' కథను గేయరూపమున రచించిరి. కాని అంతమాత్రమున నివి 'బ్యాలెడ్స్' కానేరవు కదా! మౌఖిక ప్రసరణమున ఒక తరమునుండి మఱియొక తరమునకు సంక్రమించు గేయకథలే 'బ్యాలెడ్స్' అగును. ఈ యర్థము పై శబ్దములలో కానరాదు.

## జానపద కావ్యము

కావ్య శబ్దము ప్రౌఢత్వమును సూచించును. ఇది మార్గకవిత్వమునందు మాత్రమే ప్రయోగింపదగు శబ్దము. జానపద రచనలలో పల్నాటికథలు, కాటమరాజుకథలు కొంత సాహిత్య ప్రౌఢిమను ప్రదర్శించినను తక్కిన వేవియును కావ్యనామార్హములుగావు.

## జానపద గేయకథ, జానపద కథాగేయము

ఇవి బ్యాలెడ్‌కు సంపూర్ణమగు నాంధ్రీకరణములు. జానపద గేయముకన్న 'బ్యాలెడ్' భిన్నమైనదనుట నివి చక్కగా నిరూపించును. 'బ్యాలెడ్' జానపదులకు సంబంధించిన రచన అనియు, గేయరూపమున నుండుననియు, కథాకథనము చేయుననియు ఈ మాటలను బట్టి స్పష్టముగా తెలియుచున్నది. కావున నివి సమర్థవంతమగు నాంధ్రీకరణములే. 'బ్యాలెడ్'కు 'జానపద గేయకథ' అను నాంధ్రీకరణమును మొదట శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు

సూచించిరి.[49] ఏమైనను ఈ 'జానపద గేయకథ, జానపద కథాగేయము' అను మాటలు **'a folksong that tells a story'** అను వివరణాత్మక ఆంగ్లవాక్యమునకు ఆంధ్రీకరణములే కాని, **'Ballad'** అను ఒకే ఒక మాటకు ఆంధ్రీకరణములు కాజాలవు.

## ఇతర శబ్దములు

'బ్యాలెడ్' శబ్దమునకు ఒకే ఒక మాటగానుండు శబ్దములలో 'బొబ్బిలికథ, జంగంకథ, తంబుఱకథ, డక్కీకథ, బుఱ్ఱకథ, తందనానకథ' - అనువానిని కొందఱు సూచించుచున్నారు. కాని వీని యన్నింటను అవ్యాప్తిదోషము హెచ్చుగానున్నది. విశాఖ, శ్రీకాకుళ మండలము లలో ఏ 'బ్యాలెడ్' నైనను 'బొబ్బిలికథ, బొబ్బిలిపదము' అను పేర్లతో పిలుచుట కలదు. తెలుగు 'బ్యాలెడ్స్' లో బొబ్బిలికథ శిరోభూషణమగుటచే ఈ శబ్దము ఆ ప్రాంతములలో సాధారణ వాచకమైనది. బొబ్బిలికథ వరుసలోనున్న 'బ్యాలెడ్సు'ను ఈ పేరుతో పిలువవచ్చును కాని, ద్విపదవికారములుగను, జంపెవరుసలలోను నుండు 'బ్యాలెడ్సు'ను ఈ పేరుతో పిలుచుట సమంజసము కాదు. 'బొబ్బిలికథవంటివి బ్యాలెడ్సు' అని ఉదాహరణపూర్వక నిర్వచన మిచ్చుటకు ఈ శబ్దము మిక్కిలి సమర్థవంతమైనదనుటలో మాత్రము సందేహములేదు.

జంగములు పాడు కథలు 'జంగంకథ' లని మొదట వాడబడుచుండెడిది. కాని కాలక్రమమున నిదియొక ప్రక్రియగా వెలసినది. యక్షగానము, హరికథలవలె నిదియును ఒక ప్రత్యేక రచనాప్రక్రియ. తెలుగు 'బ్యాలెడ్స్' లో నిదియొక శాఖ మాత్రమే. అన్నింటికిని ఈ శబ్దమును వాడుట కుదురదు. జంగములు కాక, వీరవిద్యావంతులు, కొమ్ములవారు, బవనీలు, పంబలవారు - పాడు 'బాలెడ్సు' చాలగలవు. అందుచే 'జంగంకథ' అనుశబ్దమందు అవ్యాప్తి దోషమున్నది.

తంబుఱకథ, డక్కీకథ - అనుపేర్లు గాథాకారులుపయోగించు వాద్యములను బట్టి వచ్చినవి. తంబుఱ డక్కీలతో చెప్పు 'బ్యాలెడ్స్' కొన్ని మాత్రమే కలవు. అన్నింటికిని ఈ వాద్యములే ఉపయోగింపరు. అంకమ్మకథలను, పల్నాటివీరకథలను, కాటమరాజుకథలను వీరణములు వాయించుచు, తిత్తి ఊదుచు చెప్పుదురు. పరశురామునికథలను జముకులు వాయించుచు పాడుదురు. కావున ఈ శబ్దములును 'బ్యాలెడ్' శబ్దమున కాంధ్రీకరణములుగా నుపయోగపడవు.

'బుఱ్ఱకథ, తందనానకథ' లు సాంప్రదాయకముగావచ్చు 'బ్యాలెడ్సు'కు అనుకరణములే కాని మూలరూపములు కావు. బుఱ్ఱకథలు రాజకీయ పక్షములవారిచే నిటీవలి కాలమున సృజింపబడినవి. ఇందు మౌఖికప్రసరణము, బహుజనాదరపాత్రత, సరళశైలి,

---

*49. చూ. విజ్ఞాన సర్వస్వము, నాల్గవ సంపుటము, పుట 805.*

స్థానికేతివృత్తము మొదలగు 'బ్యాలెడ్' ముఖ్య లక్షణములు వ్యంగ్యము. తందనానకథలు పది సంవత్సరముల క్రిందట నుండి తెలంగాణమున పండితులు సృజించుచున్నట్టివి. మార్గకావ్యము లను తందనాన వరుసలలోనికి దించుచున్నారు. 'తందనాన రామాయణము, తందనాన జైమినిభారతము, తందనాన కృష్ణలీలలు' మున్నగునవిట్టివి. ఇవి జానపదుల కవిత్వమునకు పండితులు చేసిన అనుకరణములే కాని, జానపదులలో సహజముగా పుట్టిన సాంప్రదాయక కథలు కావు. కావున 'తందనాన కథ' అనునది 'బ్యాలెడ్' పరముగా నుపయోగింప వీలులేనిది. పైగా 'బ్యాలెడ్స్' అన్నియును తందనాన వరుసలోనే ఉండవు. వానిలో పెక్కు వరుసలున్నవి.

## వీరగాథ

ఇది ఆంగ్లములోని 'బ్యాలెడ్' శబ్దమునకు సరిగా సరిపోవు మాట. దీనిని మొదట సూచించిన కీర్తి శ్రీపాదవారిదే. 'దేశి సారస్వత విభూతి' అను వ్యాసమున శ్రీపాదవారిట్లనిరి: 'శైవమత విజృంభణతో సరస్వతి అయిన ఆంధ్రవాఙ్మయంలో వీరగాథలు ఒక శాఖ'[50]. ఈ వీరగాథల కుదాహరణముగా వీరు పల్నాటివీరచరిత్ర, మాహురమ్మకథ, మాతపురాణము, గౌతమపురాణము, మఱ్ఱిచెట్లకథ, రేణుకయుద్ధము, కాకతమ్మకథ, అంకమ్మకథ, గంగానమ్మకథ, మాతంగికథ, పరశురామ పురాణము, కాటరాజుకథ, భట్టు రాయబారము, కోటపాటి తాటివృక్షం తెచ్చే కథ, వల్లురాజు యుద్ధము, అగుమంచికథ, కొమారరామునికథ, గాంధారికథ, బాలనాగమ్మకథ, వరాహావతారచరిత్ర, బంగారుతిమ్మరాజు కథ, చిన్నమ్మకథ, కాంభోజరాజుకథ, లక్ష్మమ్మకథ - అనువానిని గూర్చి చరించిరి. ఈ ఉదాహరణములను బట్టి కూడ 'వీరగాథ' అనునది 'బ్యాలెడ్' కు ముమ్మార్తుల సరిపోలు తెలుగుశబ్దమని తేలుచున్నది.

'వీరగాథ' అనునది 'వీర'+'గాథ' అను రెండు శబ్దముల కలయికతో నేర్పడిన సమస్తపదము. ఇందు 'వీర' శబ్దము విశేషణము. 'బ్యాలెడ్' వీరరసప్రధానముగా నుండుననుట నిది సూచించును. 'గాథ' అనునది 'బ్యాలెడ్' యథార్థ సంఘటన నితివృత్తముగా కలిగియుండుననియు, అది గేయరూపమున నుండుననియు సూచించును. 'కథ' అనునది కల్పితము కావచ్చును. 'గాథ' అనగా యథార్థముగా జరగినదని యర్థము. ఇది చరిత్ర వంటిది. 'బ్యాలెడ్సు'లో చాలభాగము యథార్థసంఘటనాజన్యములే. 'గాథ' అను శబ్దమునకు 'ఐతిహాసికగీత' మను నర్థముండుటచే 'బ్యాలెడ్' యొక్క గేయస్వరూపము, ఇతిహాసము తోడి సంబంధము గూడ నిరూపితమగుచున్నది. కావున 'వీరగాథ'యను శబ్దము ఆంగ్లములోని 'బ్యాలెడ్'కు సర్వవిధముల సరిపోవు శబ్దము!

---

*50. కిన్నెర, డిసెంబరు - 1953, పుట 554.*
*'పల్లె పదాలు' అను జానపదగేయ సంకలనమునందు గూడ శ్రీపాదవారు 'వీరగాథలు' అను విభాగమును సూచించినారు.*

'వీ' అను శబ్దమునకు ఋగ్వేదములో, (మిత్రునివలె గాని శత్రువువలె గాని) 'వెళ్ళు', 'సమీపించు' అను నర్థములున్నవి[51]. ఇందు 'శత్రువువలె మీదపడు, ముట్టడించు' అను నర్థము వీరగాథల కన్వయించును. అధర్వణ వేదములోను,తైత్తరీయ సంహితలోను, బ్రాహ్మణము లోను ఇదే యర్థమున నున్నది.

'ఈర్' అను మూలరూపమునకు, 'వి' అను ఉపసర్గ చేరి 'వీర్' అను శబ్ద మేర్పడినది. దీనికి ఋగ్వేదములో 'to split, break into pieces, tear open, divide, a - sunder' అను నర్థములున్నవి. ఈ 'వీర్' శబ్దము నుండి 'వీరాయతే' అను నామధాతు వేర్పడినది. దీనికి ఋగ్వేదమునను, తైత్తరీయ బ్రాహ్మణములోను 'to be powerful or valiant', 'display heroism' అను నర్థములున్నవి.

'వీర' అను శబ్దము ఋగ్వేదాదులలో 'మనుష్యుడు, ముఖ్యముగా ధైర్యముగల లేక శక్తిగల మనుష్యుడు, వీరుడు, ముఖ్యుడు' అను నర్థములతో ప్రయోగింపబడినది. ఈ వీర శబ్ద మొక్కొక్కప్పుడు 'ఇంద్రుడు, విష్ణువు' మున్నగు దేవతల పరముగాగూడ ప్రయోగింప బడినది. ఇది బహువచనమున 'మనుష్యులు, అనుచరులు' అను నర్థమిచ్చును.[52]

ఇట్లు విశేషణమైన 'వీర' శబ్దమేకాక, విశేష్యమైన 'గాథ' శబ్దమును మిక్కిలి అర్థవంతమైనదిగా నున్నది. అసలు ఈ 'గాథ' శబ్దమొక్కటియే 'బ్యాలెడ్' అను ఆంగ్ల శబ్దములోని యర్థమునంతను గర్భితమొనర్చుకొని యున్నది. కావున 'వీర' విశేషణము లేకున్నను ఇది సమర్థవంతమగు నాంధ్రీకరణమే యనవచ్చును. స్పష్టత కొఱకు మాత్రమే వీరశబ్దము చేర్చనగును.

పుంలింగమున 'గాథ' అను రూపము, స్త్రీలింగమున 'గాథా' అను రూపము ఉండును. ఈ రెండును ఋగ్వేదమున 'పాట' అను నర్థమున ప్రయోగింపబడినవి. ఈ పాట ఋగ్యజుస్సామవేదములకు సంబంధించిన పాట కాదనియు; శునశ్శేపోపాఖ్యానము, సుపర్ణాఖ్యానము వంటి ప్రాచీనాఖ్యానములకును, కథలకును సంబంధించిన ఇతిహాస కవిత్వమందలి పాట అనియు; అధర్వణవేదము, తైత్తరీయసంహిత, తైత్తరీయబ్రాహ్మణము, శతపథబ్రాహ్మణము మున్నగువానిలో వివరింపబడినది[53]. ఈ గాథ, గాథా శబ్దములనుండి 'గాథక, గాథికా, గాథాకార, గాథా నారాశంసీ' అను శబ్దము లేర్పడినవి.

---

51. *Vi = to go, approach (either as a friend, i.e., 'seek or take eagerly, grasp, seize, accept, enjoy', or as an enemy, i.e., 'fall upon, attack, assail, visit, punish, avenge')*
*-Sanskrit-English Dictionary, by M.M. Williams, Oxford, 1956.*

52. *Ibid.*
53. *Ibid.*

పుంలింగమగు 'గాథక' శబ్దము కాశికావృత్తియందును, రాజతరంగిణియందును, 'పురాణములను గానముచేయువాడు' అను నర్థమున ప్రయోగింపబడినది. స్త్రీలింగమగు 'గాథికా' శబ్దము యాజ్ఞవల్క్యములోను, మహాభారతములోను, రత్నావళిలోను 'ఐతిహాసిక గీతము' అను నర్థము కలదు.

'గాథాకార' శబ్దమునకు 'గేయరచయిత' యనియు, 'గాయకు'డనియు నర్థము లున్నవి. 'గాథా' శబ్దమునకు 'నారాశంసీ' అను శబ్దము చేర్చగా 'గాథా నారాశంసీ' అను స్త్రీలింగ ద్వివచన మేర్పడినది. Ballad అను ఆంగ్లశబ్దమున కిది సిసలైన యర్థము నిచ్చుచున్నది. 'గాథా నారాశంసీ' యనగా 'వీరప్రశంస చేయు ఐతిహాసిక గీతములు' అని మైత్రాయణీ సంహితలో గలదు('epic songs and particularly those in praise of men or heroes')[54].

కాబట్టి 'గాథ, వీరగాథ, గాథా నారాశంసీ' అను శబ్దములు Ballad అను ఆంగ్ల శబ్దమునకు సరియైన ఆంధ్రీకరణములనవలెను. (వీనిలో నేను 'వీరగాథా' శబ్దమును స్వీకరించుచున్నాను).

ఇట్లు Ballad శబ్దమునకు చేసిన ఆంధ్రీకరణచర్చలోకూడ కొంత నిర్వచనము బయటపడినది. వీరరసప్రధానమైన జానపద గేయరూపమున నుండు కథ వీరగాథ యని చెప్పవచ్చును. ఏమైనను పాశ్చాత్యవిమర్శకులు తలపోసినట్లే తెలుగునగూడ వీరగాథను నిర్వచించుటకన్న కొన్ని ప్రసిద్ధ వీరగాథలనుగాని, వీరగాథా సంకలన గ్రంథములనుగాని పేర్కొని, ''ఇట్టివి వీరగాథ లనబడును'' అని చెప్పినచో వీరగాథ యననేమియో సులభముగా తెలియగలదు.

''బవనీలు (బైండ్లవారు లేక ఆసాదివారు) పాడెడి పరశురామునికథలు; పంబలవారు పాడెడి అంకమ్మకథలు; వీరవిద్యావంతులు, పిచ్చుకుంట్లు పాడెడి పల్నాటివీరకథలు; కొమ్ములవారు, గొల్లలు పాడెడి కాటమరాజుకథలు; జంగములు, పూసల బలిజలు, శారకాండ్రు పాడెడి బొబ్బిలికథ, దేశింగురాజుకథ, బాలనాగమ్మకథ, కాంభోజరాజుకథ, ముగ్గురు మరాటీలకథ, కామమ్మకథ, లక్ష్మమ్మకథ, చిన్నమ్మకథ, సర్వాయిపాపడుకథ, సదాశివరెడ్డి కథ, కొమారరాముడుకథ మున్నగునవియు; పెద్దేటి గొల్లలు, గుఱ్ఱముల నాడించువారు పాడెడి చిన్నపరెడ్డికథ; విశాఖపట్టణమునుండి పుట్టిన పదములు; గుంటూరు మండలమునుండి పుట్టిన జంగంకథలు - ఇత్యాదులు తెలుగులో 'వీరగాథ' లనబడును''.

సంకలన గ్రంథములను బట్టి వీరగాథా నిర్వచనము చేయవలెనన్నచో నిట్లు చెప్పవలెను:

54. *Ibid.*

''అక్కిరాజు ఉమాకాంతంగారు ప్రకటించిన బాలచంద్రుని యుద్ధము; మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమువారు ప్రకటించిన కాటమరాజు కథ, బొబ్బిలియుద్ధ కథ, కుమరరామునికథ; విశాలాంధ్ర ప్రచురణాలయమువారు ప్రకటించిన పల్నాటి వీర చరిత్ర; వీనియన్నిటికంటెను ముఖ్యముగా పట్టణములలో వీథులప్రక్కన నేలపైపఱచి కారుచౌకగా నమ్మెడి పెద్దబొబ్బిలిరాజుకథ, దేసింగురాజుకథ, బాలనాగమ్మకథ, కాంభోజరాజుకథ, కామమ్మకథ, లక్ష్మమ్మకథ, చిన్నమ్మకథ, సన్యాసమ్మకథ, కమ్మవారి పణతి-పసల బాలరాజు కథ; లక్ష్మణమూర్ఛ, సుందరకాండ మున్నగు పదములు; సిరియాళ మహారాజు చరిత్ర, భల్లాణరాయచరిత్ర మున్నగు జంగంకథలు మొదలగు గుజిలీప్రతులు; బవనీలు, వీరవిద్యావంతులు, పిచ్చుకుంట్లు, కొమ్ములవారు, గొల్లలు, ఇత్యాదుల ఇండ్లలోనుండు తాళపత్ర గ్రంథములు; మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున గల శక్తికథల వ్రాతప్రతులు, పల్నాటి వీరకథల వ్రాత ప్రతులు, కాటమరాజు కథల వ్రాతప్రతులు - ఇవన్నియును తెలుగులో వీరగాథలనబడును''.

పైవిధముగా లక్ష్యపూర్వక నిర్వచనములు సులభగ్రాహ్యములైనను, వీరగాథను తెలుగునగల ఇతర సాహిత్యప్రక్రియలతో పోల్చుటవలనగూడ నిర్వచనము మఱింత స్పష్టము కాగలదు.

## ఇతిహాసము – వీరగాథ

పాశ్చాత్యవిమర్శకుల మతమున వీరగాథ యనగా గేయరూపముననున్న చిన్న ఇతిహాసము. దీని నైతిహాసికఖండ మనియు చెప్పిరి. గ్రీకు, లాటిను, ఆంగ్ల భాషలలో గల ప్రాచీనేతిహాసములు, అంతకన్నను ప్రాచీనములైన వీరగాథలనుండి పుట్టినవని కొందఱ సిద్ధాంతము. మఱికొందఱు ఈ సిద్ధాంతమును ఖండించుచున్నారు. ప్రపంచమున ఏ సాహిత్యమందైనను ఇతిహాసయుగము తరువాతనే వీరగాథాయుగము ప్రారంభమైనదనియు, అందుచే వీరగాథలు ఇతిహాసములకన్న అర్వాచీనములే కాని ప్రాచీనములు కానేరవనియు వీరి వాదము.

సంస్కృత సాహిత్యము పై వాదములలో మొదటిదానిని సమర్థించుచుండగా, మన తెలుగు సాహిత్యము రెండవదానిని బలపఱుచుచున్నది. కురుక్షేత్రమున కౌరవపాండవ సంగ్రామము జరగిన తరువాత వ్యాసమహర్షి 'జయము' అను వీరగాథను రచించెనట. దానిని వైశంపాయనాది శిష్యులు పాడుచు, చేర్పులు, కూర్పులు గావించి, 'భారతము'గా మార్చిరట. దానిని సూతులవారు వ్యాఖ్యానములతో, ధర్మోపన్యాసములతో, రాజనీతిప్రశంసలతో పెంపొనర్చి గానముచేయగా 'మహాభారత'మను ఇతిహాసమైనదట. వేదములోని 'దాశరాజ యుద్ధము' వంటి ఆఖ్యానములు వీరగాథలే యని పలువురు విమర్శకుల భావన.

తెలుగున నిట్టి 'ఐతిహాసిక క్రమము' జరుగలేదు. సంస్కృత భారతము క్రీ.శ. 11వ శతాబ్దములో ఆంధ్రీకరింపబడినది. దీనికి పూర్వమున్న వీరగాథలేవియు తెలుగున లభించుట లేదు. 11వ శతాబ్దమునకు చాలకాలము తరువాతనే భారత సంబంధులగు వీరగాథలు పుట్టినవి. అసలు తెలుగులో భారతసంబంధమగు వీరగాథలు చాల తక్కువ. రామాయణమునకు సంబంధించిన గాథలే యధికము. స్త్రీల రామాయణ కథాగేయములు మాత్రము రంగనాథ రామాయణముకన్న ముందే పుట్టియుండును. నేడు లభించుచున్న వీరగాథలలో పల్నాటి వీరచరిత్రయే ప్రాచీనమైనదిగా తోచుచున్నది. ఇది కాకతీయ ప్రతాపరుద్రుని కాలము (13వ శతాబ్దము) నాటికే ఓరుగల్లు వీథులలో పాడబడుచున్నట్లుగా క్రీడాభిరామకర్త సాక్ష్యమిచ్చు చున్నాడు. తెలుగున మిక్కిలి ప్రసిద్ధికెక్కిన వీరగాథలలో నెక్కువ భాగము 18,19 శతాబ్దముల లోనివే. రామాయణ భారత భాగవత సంబంధములైన పదములు, జంగం కథలు కూడ 19వ శతాబ్దము ఉత్తరార్ధమున, 20వ శతాబ్ది పూర్వార్ధమున బయలుదేరినవే కాని, నన్నయాదుల భారతమునకు గాని, రంగనాథుని (గోన బుద్ధారెడ్డి?) రామాయణమునకు గాని, పోతన భాగవతమునకు గాని ముందున్నవి కావు. ఇట్లు తెలుగులో వీరగాథలు ఇతిహాసముల కన్న అర్వాచీనము లగుటయే కాక, వానికి యథాతథానుకరణములుగా కూడ నున్నవి.

సంస్కృతేతిహాసములు వీరగాథలవలెనే అద్యంతమొకే సులభచ్ఛందమున వ్రాయబడి పాడుకొనుటకనుకూలముగా నుండును. తెలుగులోని ఇతిహాసములు ప్రౌఢశిల్ప సమన్వితములు. జానపదులకు దూరమైనవి. వీని కృత్రిమ వాతావరణమునకును, వీరగాథల నిసర్గ వాతావరణమునకును చాల భేదమున్నది. నన్నయాదుల భారతము నూటికి నూఱుపాళ్ళును మార్గపద్ధతికి చెందినవి. వీరగాథలు నూటికి నూఱుపాళ్ళను దేశిపద్ధతికి చెందినవి. ఇతిహాసములు లిపిబద్ధములై పండిత సంసేవ్యములుగా నుండును. వీరగాథలు మౌఖిక ప్రసరణమున జీవించుచు పామరుల కాహ్లాదమును కలిగించుచున్నవి (సానుభూతితో విన్నచో సహృదయులగు పండితులను కూడ నివి యలరింపగలవు).

## ప్రబంధము – వీరగాథ

ఇతిహాసములతోనే కాక, అష్టాదశవర్ణనాది ప్రకృష్ట బంధములతో శిల్పకళాప్రౌఢితో ప్రయత్నపూర్వకముగా వ్రాయబడిన ప్రబంధములవంటి ఉన్నత ప్రక్రియతో కూడ వీరగాథా కవిత్వమును పోల్చవచ్చును. ప్రబంధములవలెనే వీరగాథలును ఒక ప్రత్యేకమగు రూపములో నుండును. ప్రబంధములన్నియు నొకే మూసలో తయారుచేసినట్లుండును. అట్లే వీరగాథ లన్నియు నొకే తీరులో నిర్మింపబడినట్లుండును. ఒకే రకమగు కథాప్రణాళిక, ఒకేతీరులో వర్ణనలు, పదప్రయోగములు జరుగుచుండును. పరస్పర భిన్నములగు వీరగాథలలో గూడ సమానాంశము లుండును. ఈ సమానాంశములను 'వీరగాథా సాధారణ ప్రయోగములు'

(Ballad Commonplaces) అందురు. ఇవి మార్గకవిత్వములోని కవిసమయములవంటివే అని తలపనగును. లేదా ప్రబంధలక్షణములవంటి వనియు భావింపవచ్చును. అయినను వీరగాథలు ప్రబంధములవలె కాల్పనిక వాతావరణమున నుండవు. వీని నిసర్గ మాధుర్యము ముందు ప్రబంధములు సిగ్గుపడవలసినదే. ప్రబంధములు గోరంతను కొండంతలుగా చేసి చెప్పును. వీరగాథలు యథార్థ సంఘటనలు వర్ణించును. ప్రబంధేతివృత్తము కాల్పనికము; వీరగాథలు సహజ దేశీయేతివృత్తమును స్వీకరించును.

## ద్విపద కావ్యము - వీరగాథ

వస్తుస్వీకారములోను, ఛందస్సులోను ఈ రెండు కవితాశాఖలకును మిక్కిలి సామ్యమున్నది. రెండును దేశికవితాశాఖకు చెందినవే. పాల్కురికి సోమనాథుడు తనకు పూర్వమున్న బసవేశ్వర పండితారాధ్యుల చరిత్రలను గ్రహించి ద్విపద కావ్యములను రచించి నాడు. ఇందు పలువురు శివభక్తుల మహిమలను తెల్పు కథలు కూడ చేర్పబడినవి. తన బసవపురాణ గ్రంథమునకు ప్రాచీన కాలమునుండియు భక్తులు పాడుచున్న పాటలే ఆధారములని యతడు తెల్పియున్నాడు[55]. కావున పాల్కురికి ద్విపద కావ్యములకు మూలము మౌఖిక ప్రసరణమునయున్న పాటలును, వీరగాథలును అని చెప్పవచ్చును. అసలు ''ద్విపద'' యను ఛందస్సే వీరగాథలనుండి ఏర్పడినదను జానపద కవితా ప్రియులును గలరు. ''తొలి రోజుల్లో ఈ కథలు నాలుగు 'కిటతకిట' ఆవృతాల పాదాలతో జంపెలనే పేరుతో ఉండేవనీ, పాల్కురికి వంటి శివకవు లీ దేశిపద్ధతిని కొద్దిగా సంస్కరించి ద్విపద ప్రబంధాలు రచించారనీ నా విశ్వాసము''[56] అని శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు వ్రాసియున్నారు.

తన కాలమున ప్రజలలో ప్రసిద్ధికెక్కిన శైవభక్తుల గాథలను సోమనాథుడు ద్విపద రూపమున గ్రంథస్థము చేసినాడు. ఆ ప్రాచీనగాథలు నేడు లభింపకున్నను, నేటి జంగములు సోమనాథుని ద్విపద కావ్యములోని శివభక్తులకథలను తెలిసికొని, వానిని రగడరూపమున గానము చేయుచున్నారు. 'నిజలింగ చిక్కయ్యకథ, రుద్రాక్ష మాహాత్మ్యము, కక్కయ్యగారికథ, మడివాళ్ల మాచయ్యకథ, కూన పాండ్యరాయడు, చిఱుతొండనంబికథ (సిరియాళునికథ) - ఇత్యాది జంగంకథలన్నియు నిట్టివే.

ఇట్టి పరస్పర సంబంధ మున్నను పాల్కురికి ద్విపద కావ్యములు వీర గాథలు కానేరవు. ఇవి ప్రయత్నపూర్వకముగా పాండిత్యప్రకర్షతో వ్రాసిన ప్రౌఢకావ్యములు. 'పటు గద్య పద్య

---

55. 'అతత బసవ పురాతన భక్త గీతార్థ సమితియే మాతృక గాగ' - వేటూరి పరిష్కృత బసవ పురాణము, పుట 5.

56. విజ్ఞాన సర్వస్వము, నాలుగవ సంపుటము, పుట 805.

ప్రబంధ సామ్యముగc, గావ్యకళాప్రౌఢిc గల్పింతు ద్విపద' అని సోమనాథుడు కంఠోక్తిగా చెప్పుకొన్నాడు. పల్నాటి వీరచరిత్ర, కాటమరాజు చరిత్రలవలె ఈ పాల్కురికి ద్విపదలను యథాతథముగా పాడువారు లేరు. ప్రజలచే పాడబడుట వీరగాథల ముఖ్యలక్షణములలో నొకటి. ఈ సూత్రముతో చూచినచో రంగనాథ రామాయణము గాని, గౌరన హరిశ్చంద్ర నవనాథ చరిత్రలు గాని, కాసె సర్వప్ప సిద్ధేశ్వరచరిత్ర గాని వీరగాథలు కానేరవు. రంగనాథ రామాయణమును పూర్వము తోలుబొమ్మలాటలవారు పాడుచుండెడివారు. దీనికి బొమ్మలాట రామాయణమనియు నామాంతరము గలదు. అయినను, వీరవిద్యావంతులు పల్నాటికథలను పాడినట్లుగా, ఈ బొమ్మలాటవారు రంగనాథ రామాయణము నాద్యంతము పాడెడివారు కారు. ఏదో ఘట్టమున తమ ప్రదర్శనకు సంబంధించిన భాగమును మాత్రము పాడెడివారని తోచుచున్నది. ఏమైనను బొమ్మలాట ప్రదర్శనప్రధానమైనదేకాని, సాహిత్య ప్రధానమైనది కాదు. కావున పై ద్విపద కావ్యము లన్నియును నిబద్ధ దేశికవిత్వమునకు చెందినవి. మరికొందఱు విమర్శకులు వీనిని మార్గ సాహిత్యములోనికే నెట్టివేయుచున్నారు. వీరగాథలు శుద్ధ దేశికవిత్వమునకు చెందినవి. నన్నెచోడుని కుమారసంభవ కావ్యములోను దేశి యున్నది; పాల్కురికి సోమనాథుని బసవపురాణమందును దేశియున్నది; పల్నాటి వీరచరిత్రలోను దేశియున్నది. కాని ఈ దేశితనములందు భేదమున్నది. 'మార్గ-దేశి' విభాగ మాత్రమున నిది స్పష్టముకాదు. అందుచే 'నిబద్ధ-అనిబద్ధ' భేదములను గూడ వీని కన్వయింపవలెను. కేవలము లక్షణానుసారియైనది నిబద్ధము; ఇంచుక స్వాతంత్ర్యచ్ఛాయలతో గూడినది అనిబద్ధము. నన్నయది నిబద్ధ మార్గ కవితాపద్ధతి, నన్నెచోడునిది అనిబద్ధ మార్గకవితాపద్ధతి. అదే పాల్కురికి సోమనాథుని ద్విపద కావ్యములు నిబద్ధదేశికిని, పల్నాటి వీరచరిత్రాదులు అనిబద్ధదేశికిని చెందును. ఈ అనిబద్ధదేశినే 'శుద్ధ దేశి' అనియు పిలువవచ్చును. నన్నయ కవిత్వము నూటికి నూఱుపాళ్ళును మార్గము కాగా, పల్నాటి వీరచరిత్రాదులు నూటికి నూఱుపాళ్ళును దేశి. నన్నెచోడుని కావ్యమున మూడువంతులు మార్గమును, ఒకవంతు దేశియును గలదు. అట్లే పాల్కురికి ద్విపద కావ్యములలో మూడువంతులు దేశియు నొకవంతు మార్గమునుగలదు.[57]

ద్విపద కావ్యములకును - వీరగాథలకును గల భేదమును ఆచార్య పింగళి లక్ష్మీకాంతం గారు స్పష్టముగా నిరూపించియున్నారు:

''దేశి శబ్ద వాచ్యమైన వాఙ్మయమునకు ప్రధాన లక్షణములు మూడు: ఇతివృత్తము, భాష, ఛందస్సు - మూడును దేశీయములై యుండుట. ఇతివృత్తము ఎక్కడనుండియో ఎరవు

57. చూ. ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారి 'ఆంధ్ర వాఙ్మయారంభదశ', ప్రథమ సంపుటము (ప్రాఙ్నన్నయ యుగము), పుటలు 382, 383.

తెచ్చుకొన్నది కాక, కేవలము దేశీయ వృత్తాంతము కావలెను. భాషయు, జానుతెనుగు అనుపించు కొనదగిన, సజీవ వ్యావహారికభాష కావలయును. ఒకవేళ ఈ భాషలో కొంత సంస్కృత పదజాలము కలిసినను, అది తెనుగుతనము దాల్చి సుబోధమైన తత్సమపదజాలమే కావలె కాని, నిఘంటు సహాయ మపేక్షించెడి సంస్కృత శబ్దజాలము కాకూడదు. ఛందస్సు కూడ దేశీయ చ్ఛందమే అయి యుండవలెను... మార్గకవిత్వమును నిరసించి దేశికవిత్వమునకై కంకణము కట్టుకొన్న పాల్కురికి సోమనాథుడు సహితము ఈ మూడు లక్షణములను సర్వత్ర సాధింప లేకపోయెను. బసవపురాణములోని ఇతివృత్తము ఆంధ్రదేశములోనిది కాదు. అతని భాషలో దేశీయ పదజాల మెంత యున్నదో సంస్కృత పదజాలమును అంతేయున్నది. మఱియు అతని గ్రంథములు పద్య ప్రబంధములవలె, సాహిత్యపరులకు సంసేవ్యములు కాని, సామాన్య ప్రజలకు సుబోధములు కావు. సోమనాథుని తరువాత వెలసిన తెలుగు ద్విపద కావ్యములన్నియు ఈ ప్రమాణమునుబట్టి చూచినచో ఒక ఛందస్సులో దేశీయములు కాని, తక్కిన గుణములలో మార్గకవిత్వమునకు జెందినవే. కాగా ఈ దేశికవితాశబ్దమును అన్నిట సార్థకముచేసిన కావ్యములలో ఈ పల్నాటి వీరచరిత్ర మొదటిది, మేటి.''[58]

కొన్ని వీరగాథలలో ద్విపదయే ఛందస్సుగానున్నను, స్వచ్ఛమైన ద్విపదచ్ఛందమునగల వీరగాథలు చాల అరుదుగానున్నవి. వీరగాథారచయిత మొదట ద్విపదలో వ్రాసినను, పామరులు పాడుటలో యతిప్రాసలు నశించి, చివరి సూర్యగణము పొడిగింపబడి వికారము నొందును. ఇట్లు పాడునప్పుడు ద్విపదలో ప్రాస జాఱిపోవుటచే రచన మంజరిగా మాఱును. కాని కొందఱు కవులే మొదట మంజరిలో వ్రాసిన వీరగాథలును కొన్ని గలవు. వీనియందు గూడ ఆ లక్షణము నిలువదు. వీరగాథ ద్విపదలో వ్రాయబడినను, మంజరిలో వ్రాయబడినను పాడునప్పుడు మాత్రము నాలుగు 'కిటతకిట'ల ఆవృతము లొక పాదముగా సాగును. సంగీత శాస్త్రమున దీనిని 'ఖండగతి' యందురు. ఇది ఆద్యంత ప్రాసలు తీసివేసిన ద్విరదగతి రగడకు సమానము. దీనిని 'జంపెవరుస'యని కొందఱు పేర్కొనిరి. కాని నేడు హరిహరీ పదముల వరుసను మాత్రమే జంపెవరుస యందురు. యక్షగానములలో గూడ హరిహరీపదములవంటి జంపెవరుసయే కానబడుచున్నది. ద్విపదలో వ్రాయబడిన రచన పాడుటలో ఖండగతిగా మాఱినదా? లేక ఖండగతిలో పాడబడు వీరగాథలనుండి కవులు ద్విపదను సృజించిరా? - అను ప్రశ్నలకు సరియైన సమాధానము చెప్పలేము. రెండును సంభావ్యములే. ఏమైనను శిష్టకవులు రచించిన ద్విపద కావ్యములు వీరగాథలు కానేరవు. వీనిని కొంతవఱకును 'సాహిత్య గాథలు' (Literary Ballads) లేక 'కళాత్మక గాథలు' (Art Ballads) అని పిలువవచ్చును.

---

*58. పల్నాటి వీరచరిత్ర, విశాలాంధ్ర ప్రచురణము, పీఠిక, పుటలు 26,27.*

## వీరకావ్యము - వీరగాథ

ప్రబంధములవలె కాల్పనికేతివృత్తమునుగాక, దేశీయేతివృత్తమునే స్వీకరించి రచించిన కావ్యములును గలవు. ఇందు వీరరసము కూడ ప్రధానముగా పోషింబడుచున్నది. ధూర్జటి 'కృష్ణరాయ విజయము', దిట్టకవి నారాయణకవి 'రంగరాయ చరిత్ర', ముదిగొండ వీరభద్రకవి 'వీర భాగవతము', గుఱ్ఱంకొండ భక్తవత్సలకవి 'కాటమరాజు చరిత్ర' మున్నగునవి యిట్టి వీర కావ్యములు. దేశీయేతివృత్తముతో వీరరసప్రధానముగానున్నంత మాత్రమున నిట్టివి వీర గాథలు కానేరవు. ఇందలి ఛందస్సు, భాష మార్గపద్ధతికి చెందినవి. వీనికి ప్రజాసామాన్యమున వ్యాప్తిలేదు. వీర భాగవతము, కాటమరాజు చరిత్ర - మున్నగు కావ్యములు ప్రసిద్ధికెక్కిన వీరగాథలను చూచి పద్యరూపమున వెలయించినట్టివి. రంగరాయ చరిత్ర కూడ నట్టిదే కావచ్చును.

## యక్షగానము- వీరగాథ

ద్విపద కావ్యమువలెనే యక్షగానమును వీరగాథతో నెక్కువ సమానాంశములను గలిగి యున్నది. రెండును దేశికవితాశాఖకు చెందిన ప్రక్రియలే. యక్షగానము గేయరూపమున నున్న నాటకము కాగా, వీరగాథ గేయరూపముననున్న చిన్న ఇతిహాసము. రెండును పాడబడునవే! రెండును సంగీత సాహిత్యముల సమ్మేళనమున కుదాహరణములే!

జక్కుల (జాతి) వారి పాటలనుండి యక్షగానములు పరిణమించినవను వాదమున్నది. ఈ జక్కులవారికిని 'అక్కలపాట' లేక 'కామేశ్వరి పాట' అను వీర గాథకును సంబంధమున్నది. పూర్వమీపాటను జక్కులవారే పాడెడివారనుటకు క్రీడాభిరామమున సాక్ష్యమున్నది. దీనిని బట్టి వీరగాథల నుండియే యక్షగానప్రక్రియ పరిణమించినదని చెప్పవలసియున్నది.

యక్షగానమునకును వీరగాథలలో నొక శాఖయగు 'జంగంకథల'కును రచనా విధానమున ఎక్కువ పోలికలున్నవి. జంగంకథలలో గూడ యక్షగానమందువలెనే కీర్తనలు, దరువులు, గద్యపద్యములు, కందార్ధ సీసార్ధములు నుండును. ఈ రెండింటికిని మఱియొక సామ్యముగూడ కలదు. 'జంగముకథలు గానరూపకథాఖ్యానమున కుద్దిష్టములు. యక్షగానములు కాలక్రమమున రంగప్రదర్శనల కెక్కినవికాని వాని ప్రాథమికస్థితి గానప్రధాన కథాఖ్యాన పద్ధతియే కదా'![59].

20వ శతాబ్ది ప్రారంభముననే జంగంకథలు బయలుదేరినవి. అంతకుముందు జంగం కథలున్నట్లుగా సాక్ష్యములు లేవు. కావున యక్షగానములను చూచియే ఇవి పుట్టియుండును.

---

*59. డ్యాక్టర్ యస్వీ. జోగారావుగారు, ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర, పుట 133.*

కృష్ణామండలమున పూర్వము వీథినాటకములాడిన మాలదాసరులే నేడు జంగంకథలను పాడుచున్నారు. జంగంకథ - యక్షగానముల సాదృశ్యములనుబట్టి కొందఱు కొన్ని జంగం కథలను యక్షగానములుగా భ్రమించుట తటస్థించినది. సారంగధర, యక్షప్రశ్నలు, బిల్హణీయము అను జంగంకథలను యక్షగానములని ప్రకటనకర్తలే కాక కవులును భ్రమించిరి.

జంగంకథలయందు యక్షగానములలోవలె దరువులు, కీర్తనలు, గద్యపద్యములు ఉండును గాని ద్విపద ఉండదు. వీనిలో ప్రధానముగా నుండునది 'రగడ'. ఇది కథాకథనమునకు మిక్కిలి అనువైన రచనాంగము. ప్రాచీన యక్షగానములందలి 'రేకులు' కొన్ని రగడవికారములే యైనను, యక్షగానములందు రగడనుపయోగించుట తక్కువేయని చెప్పవలెను. యక్షగానము లలో కథాఖ్యానము ద్విపదలో జరుగును. కొన్ని యక్షగానములలో గాననగు 'గజల్', 'డోరా' 'డోరాగజల్ మట్టు' అను పార్సీమట్టులే జంగంకథలలో 'రగడ' అను పేరుతో ప్రత్యక్షమైనవని చెప్పవచ్చును. యక్షగానమునుండి జంగంకథారచన పరిణమించియుండు ననుట కిది దృష్టాంతము కాగలదు.

యక్షగాన - వీరగాథల సామ్యములే కాక, భేదములును పరిశీలింప తగ్గవి. యక్షగానము ఆదిలో జక్కులు పాడు పాటగా శుద్ధదేశిప్రక్రియగా నవతరించినను, నేడు ద్విపద కావ్యముల వలెనే ఇదియును ప్రౌఢత్వమును గడించుకొన్నది. ఇది దేశిలో నిబద్ధవిభాగమునకు చెందును. వీరగాథ శుద్ధదేశి అని పైన నిరూపించితిని. సంగీతసాహిత్యములు రెండింటియందును సమానమేయైనను, ''యక్షగానము గానప్రధానమైనది. ప్రదర్శనమున నృత్తనృత్యాత్మక మైనది''[60]. వీరగాథలలో కథాఖ్యానమే ప్రధానము. గానము అనుషంగికము. నృత్తము, ప్రదర్శనము చాల స్వల్పముగనుండును.

## హరికథ – వీరగాథ

గానరూపమున కథాఖ్యానమే ప్రధానముగాగల వేఱొక ప్రక్రియ హరికథ. ఇందు యక్షగానమువలె ప్రదర్శనముండదు. జంగంకథకు యక్షగానముకన్నను సన్నిహితమైనది హరికథయనవచ్చును. హరికథలో గద్యపద్యములు, కీర్తనలు, దరువులు ఉండును. కథాకథనము 'మంజరి' లేక 'మంజుగతి' అను ప్రత్యేకచ్ఛందమున సాగును. దీనికిని జంగంకథలోని 'రగడ'కును చాల సాదృశ్యమున్నది. హరికథలో సంగీతము, కొద్దిపాటి నృత్యము ఉండును. మంజరి - రగడ అను ఛందోభేదము తప్ప, తక్కిన విషయములలో హరికథ జంగంకథలు అభిన్నములని చెప్పవచ్చును. రెండింటను పౌరాణికేతివృత్తములే యుండును. ఆధునిక కాలమున రాజకీయప్రభావముచే జంగంకథ బుఱ్ఱకథగా పరిణమించగా, హరికథ కూడ బుఱ్ఱకథ

---

*60. అదే., పుట 59.*

వంటి రాజకీయేతివృత్తమును స్వీకరింపసాగినది. ఫలితముగా గాంధీ హరికథ, నెహ్రూ హరికథ, ఇత్యాదులు వెలసినవి.

ఇన్ని సాదృశ్యములున్నను హరికథ వీరగాథ కానేరదు. జంగంకథ యనునది సువిశాలమగు వీరగాథలలో నిటీవలి కాలమున బయలుదేరిన ఒక చిన్న ఉపశాఖ మాత్రమే. ఇందలి పద్యములు, కీర్తనలు, దరువులు మున్నగు ప్రౌఢ ప్రక్రియలు మహారాష్ట్రుల 'కాలక్షేపము' లనుబట్టియు, దక్షిణాది యక్షగానములనుబట్టియు వచ్చినవేకాని స్వతస్సిద్ధములుగా వీరగాథలలో నున్నవి కావు. వీరగాథలు వీరరసప్రధానమగు స్థానిక సంఘటనలతో నొప్పుచు, నాద్యంత మొకే ఛందస్సులో నడచును. ఈ ముఖ్యలక్షణములు హరికథలలో గానరావు. హరికథలు పౌరాణికేతి వృత్తముతో, భక్తిరసప్రధానముగా, విభిన్న ఛందస్సులలో సాగు రచనలు. ఆద్యంతము ఒకే ఛందస్సులో సాగిన 'శ్రీతిరుపతి రథోత్సవ మాహాత్మ్యము' (1917), 'కుచేలుని చరిత్రము (1933) ఉన్నను వీనియందలి ఛందస్సు (తొహరా లేక డోరా) దేశి ఛందస్సు కాదు. మహారాష్ట్రులనుండి ఎరవుతెచ్చుకొన్నది. సంగీతముకూడ హరికథలలో నెక్కువగనే ఉండును. హరికథ ఒక్క ప్రదర్శన విషయమున తప్ప, తక్కిన వానిలో యక్షగానము వంటి నిబద్ధ దేశి ప్రక్రియయే! హరికథా రచయితలు దీనిని యక్షగానమనియే సంభావించిరి.

## కీర్తనల కథలు – వీరగాథలు

పాటలో కొంత సంగీతచ్ఛాయ కలసినచో కీర్తన యగును. ఈ కీర్తనలు మార్గకవిత్వము నకు దేశికవిత్వమునకు కూడలి స్థానములు. ఇంకను సూక్ష్మముగా చెప్పవలెనన్నచో జానపద కవిత్వమునకును నిబద్ధదేశికిని నడుమ నుండునవి. వీనిని 'జాతిదేశి' అనవచ్చును. పాల్కురికి సోమనాథుని కాలమునాటి పాటలు 15వ శతాబ్దము నాటికి కీర్తనలుగా పరిణమించి యుండును. తరువాత తాళ్ళపాక కవులు, రామదాసు మున్నగువారు వీని నభివృద్ధిచేసిరి.

కీర్తనలు, యక్షగానములలోను, హరికథలలోను, జంగంకథలలోను ప్రయోగింప బడుచుండును. దరువు లెక్కువగా వీథినాటకములలోను, తెలంగాణమందలి చిరుతల కథలలోను కాననగును. ఇట్లు వివిధప్రక్రియలలో నంతర్భాగములుగనే కాక, కేవలము ఆద్యంతము కీర్తనలతో చెప్పిన కథలును కొన్ని గలవు. గేయరూపముననున్న కథయే వీరగాథయను నిర్వచనప్రకారము ఈ కీర్తనల కథలు కూడ వీరగాథలు కావలెను; కాని కావు.

కీర్తనలు రెండు రకములు. సంగీతము ప్రవేశించినను, సాహిత్యముపై దృష్టి విడువకుండ రచింపబడిన కీర్తన లొక రకము; సాహిత్యము నప్రధానముగా జేసి, సంగీత ప్రధానముగా పెరిగిన కీర్తనలు రెండవ రకము. రామదాసు కీర్తనలు, అన్నమాచార్యుని కీర్తనలు, ఆధ్యాత్మ రామాయణ కీర్తనలు మొదటి రకమున కుదాహరణములు. త్యాగరాజ కీర్తనలు రెండవ

వర్గమునకు చెందును. (ఇట్లు సంగీతము పెంచుకొన్న కీర్తనను 'కృతి' యందురు. కావున 'త్యాగరాజ కృతులు' అనుట సమంజసము).

రామదాసు కీర్తనలకు మధ్య మధ్య 'డోరాల' రూపమున కథను ప్రవేశపెట్టి, శ్రీహరి భజన సింగరిదాసు అనునతడు 'రామదాసు చరిత్రము' అను కీర్తనలకథను రచించెను. దీనికి తరువాతి కాలమున వచనములు, శ్రీరామస్తుతిపాదకములు, దాశరథీ శతక పద్యములు చేర్చ బడినవి. ఇది 1908లో టి. చెంగల్వరాయనాయుడుగారిచే ప్రకటింపబడెను. ఇది వీరగాథ యగునా? త్యాగరాజు కొన్ని కృతుల రూపమున 'నౌకాచరిత్రము', 'ప్రహ్లాద భక్తి విజయము' అను కథాత్మక రచనలు చేసినాడు. ఇవి వీరగాథలగునా?

త్యాగరాజాదుల కృతులు సాహిత్య పరిధినుండి సంగీతములోనికి తప్పుకొనిన రచనలు కావున వానికిట ప్రసక్తి లేదు. అవి 'సంగీత గాథలు' (Musuical Ballads). రామదాసు కీర్తనలు జానపదగేయములవంటి సరళరచనలు. వీనికి పామరులలో గూడ విశేష వ్యాప్తి గలదు. ఇట్టి సులభ కీర్తనలతో కథ చెప్పినప్పు డది ఏమగును? ఇవి వీరగాథలవలెనే అనిబద్ధదేశికి చెందినవి (స్త్రీల పాటలును ఇట్టివే). అయినను, ఇవన్నియు జానపదగేయములకు సన్నిహితమైనవే కాని, అచ్చముగా జానపదగేయములు కావు. సంగీతమం దేమాత్రమును ప్రవేశములేనివారు రామదాసుకీర్తనలను పాడలేరు. పామరులలో గూడ విశిష్టులే వీనిని పాడగలరు. కావున నివి అనిబద్ధదేశిలో గూడ 'జాతిదేశి' అను ప్రత్యేక వర్గమునకు చెందునని వెనుకటి ప్రకరణమున నిరూపించితిని. (వీరగాథలు జానపదశాఖకు చెందినవి). ఇట్టి కీర్తనలతో చెప్పబడిన కథలు హరికథలవంటివి. భక్తుల చరిత్రలు ఇతివృత్తముగా కలవి యగుటచే శాంతరస ప్రధానములు. ఇవి హరిభక్తులచే ప్రయత్నపూర్వకముగా రచింపబడినవే కాని పామరులలో సహజముగా పుట్టినవి కావు.

ఈ కీర్తనల కథలు వీరగాథలవలె ఆద్యంత మొకే ఛందస్సున నుండవు. కేవలము రామదాసుకీర్తనలతోనే కథనల్లినచో బాగుగనే యుండును. కాని యిందు డోరాలు గద్య పద్యములు ప్రవేశించి ప్రౌఢరూపమును దాల్చినది. సరళములగు బొబ్బిలికథ వంటి వీరగాథల నుండి జంగంకథలను ప్రౌఢప్రక్రియ పరిణమించినట్లే, జానపద గేయమువంటి రామదాసు కీర్తనలనుండి పరిణమించిన ప్రౌఢరూపము లీ కీర్తనల కథలు. ఇవి హరికథలకు పూర్వ రూపములు. ఇందలి డోరాలే తరువాతి కాలమున హరికథలలో 'మంజరి', 'మంజాగతి' అను పేరవచ్చినవి. ఈ డోరాలకు బదులు వీనిలో 'రగడ' నుపయోగించియున్నచో నివి కూడ జంగం కథలలో జేరిపోయి యుండెడివి. కావున డోరాలతో కథాఖ్యానము చేయునట్టి ఈ కీర్తనల కథలు హరికథలగును గాని వీరగాథలు కానేరవు. ఈ కీర్తనల కథలను ఆంగ్లమందలి 'Lyrical Ballads' తో పోల్పవచ్చును.

హరిభజన సింగరిదాను, తూము నృసింహదాసు కలిసి రచించిన 'తూము నృసింహదాసు చరిత్రము' (1888), శ్రీమాన్ భద్రాచలం తిరుమల రాఘవాచార్యులవారి 'కుచేలోపాఖ్యానము' (1891), జంగశేషదాస బాలకవి 'రుక్మిణీకల్యాణచరిత్ర సంకీర్తనలు' (1892), బో. సుదర్శనదాసు 'కుచేలోపాఖ్యానము'(1900), జనమంచి లక్ష్మీనారాయణ శర్మగారి 'గౌతమోపాఖ్యానము' (1904), సింగరిదాసు రచించిన 'రామదాసు చరిత్రము' (1908), వరగంటి వెంకటరమణయ్య 'గోమాబాయి చరిత్ర' (1907), నరసింహదాసు రచించిన 'పెద్దదాసు చరిత్రము' (1912), కేశవ సుదర్శనాచార్యులు రచించిన 'కబీరుదాసు చరిత్రము'(1920), మంత్రి సన్యాసమ్మ పట్నాయకులు రచించిన 'నలచరిత్ర సంకీర్తన' (1929) - మున్నగునవి ముద్రితములైన కొన్ని కీర్తనలకథలు. ఇవన్నియును మహారాష్ట్రుల కాలక్షేపములకు ప్రతిబింబములు; నేటి హరికథలకు పూర్వరూపములు. వీనిలో గాన ప్రాధాన్యమున్నది. వీరగాథలలో కథాకథనమునకే ప్రాధాన్యము. సంగీతజ్ఞానము లేనివారిని కీర్తనల గాథలు పాడి మెప్పించలేము. పాల్కురికి సోమనాథుడు పేర్కొనిన 'సిరియాళుని కథ', క్రీడాభిరామకర్త చెప్పిన 'విద్దికూచి రామాయణము' కీర్తనల గాథలని విమర్శకులు భావించుచున్నారు.

## నాటకము - వీరగాథ

ఆత్మాశ్రయ కవిత్వ (Subjective Poetry)మగు భావగీతములో కవి, స్వీయఘోషను వెలార్చుచు స్పష్టముగా గోచరించును. పరాశ్రయ కవిత్వము (Objective Poetry)నకు చెందిన ఇతిహాసములో కవి పాత్రలచేత కథ నడుపుచు అదృశ్యుడుగా నున్నను, మధ్య మధ్య తానుగా వ్యాఖ్యానము చేయుచు ప్రత్యక్షమగుచుండును. కాని నాటకము నూటికి నూఱుపాళ్ళును పరాశ్రయకవిత్వమే. ఇందు కవి ఎక్కడను కనబడడు. కథాకథనమంతయు పాత్రలచేతనే నడిపించును. వీరగాథ కథాఖ్యానమున ఇతిహాసమును పోలియున్నను, పరాశ్రయతా లక్షణమున మాత్రము ఇతిహాసమువలె అసమగ్రముగా నుండక, నాటకము వంటి సంపూర్ణ పరాశ్రయతా లక్షణముతో నొప్పుచుండును. అనగా వీరగాథలు బాహ్య స్వరూపమున భావగీతివంటివి; ఆంతర రూపమున ఇతిహాసమువంటివి; పరాశ్రయతాగుణమున నాటకము వంటివి[61].

61. *They have an epic element in that they are narrative and objective. Like lyric poetry they are of song quality, and brevity is usual... Ballads are dramatic in that they emphasize action and focus on situations or episodes. The story is unfolded in happenings and speech. Other dramatic or semidramatic elements are the use of suspense and climax and the characteristic impersonality of the authorship.*

*-Prof. Louise Pound, The Encyclopedia Americana, Vol.III, p.96.*

నాటకములోవలనే వీరగాథలోకూడ సంభాషణ లుండును. కొన్ని వీరగాథలు కేవలము సంభాషణతోనే కొనసాగినవి కూడ. వీరగాథలను పాడుటలో కొంత నటన కూడ ప్రదర్శింపబడును. గాథాకారులు నాటకములోని నటులవలనే వేషధారణము చేయుదురు. పల్నాటి వీరకథలను పాడు 'వీరవిద్యావంతులు' పల్నాటి వీరునివలెనే పంద్రెండు బిరుదులతో వేషమును ధరించి, కత్తి డాలు చేతబట్టి, ఆవేశముతో చిందులు త్రొక్కుచు, నటించుచుందురు. రాజస్థాన్ రాసోలలో గూడ గాథాగాన మిట్లు నటనతో కలిసియే యున్నది. మన కాటమరాజు కథలలోను, జంగంకథలలోను గూడ వేషధారణమును నటనయు కనబడును. వేషము లేకుండ గాథాగానముండదు. నాటకములోవలెనే వీరగాథలోగూడ కథాఖ్యానమంతయు ఒకేఒక సంఘటనపై కేంద్రీకృతమై యుండును.

"Just as in a drama, there is one action. The whole interest is focused on a situation and its outcome. If a series of events is revealed, it is only as these events relate to this central situation or its outcome. The story unfolds swiftly and dramatically, and is revealed not only narration, but by dialogue (some times, as in 'Edward, Edward' and 'Lord Randal', entirely by dialogue). Sudden transitions from one time to another, or from one person to another, focus the central situation from different angles, and forward the action dramatically"[62]

నాటకములో విధిగా నుండు ఉత్కంఠ, పతాక సన్నివేశము అనునవి వీరగాథలలోను గానవగును. వీరగాథకు, నాటకముతో నింత సన్నిహిత సంబంధముండుటచేతనే J. M. Steadman (Jr) అను విమర్శకుడు స్వల్పమగు మార్పులు చేసినచో వీరగాథ నాటకముగా నగునని చెప్పినాడు.

Is is clear, I think, that the ballad, contained dramatic elements strong enough to cause it to develop easily into drama. A little more stress on the action that accompanied the singing of the ballad, an additional development of the mimetic tendency at the expense of the songlike qualities, was all that was required to transform the ballad into a drama."[63]

ఇట్లెంత దగ్గఱ సంబంధమున్నను నాటకము వీరగాథ కానేరదు. వీరగాథ నాటకము కానేరదు. రెండింటికిని ఒక ముఖ్యభేదమున్నది. నాటకములో నటన ప్రధానము; కథ వివిధ

62. *Oxford Junior Encyclopaedia, Vol. XII, p.37.*

63. *The Dramatization of the Robin Hood Ballads, Modern Philology, Vol.17, 1919-20, p.10.*

పాత్రల అభినయ రూపమున తెలుపబడును. కాని, వీరగాథలో కథాఖ్యానమే ప్రధానమైనది. ఇది గానరూపమున తెలుపబడును. ఇందు అభినయము ఉపాంగము మాత్రమే. ఇది చాల స్వల్పముగా నుండును. కారెంపూడి వీరోత్సవములలో పాడబడు పల్నాటి వీరకథలలో మాత్రము ఈ అభినయము సాధారణ వీరగాథల కన్న కొంచె మధికముగా నున్నది. కాబట్టి, సంపూర్ణ పరాశ్రయత్వము, ఏక సంఘటన, నటన, సంభాషణలు, ఉత్కంఠ, పతాక సన్నివేశము - మొదలగు నాటకలక్షణము లెన్నియున్నను, ముఖ్యముగా గానరూప కథాఖ్యానోద్దిష్టమగు వీరగాథ నాటకము కానేరదు. తెలుగులో నాటకము మార్గకవితాప్రక్రియ. వీరగాథ ఏ సాహిత్యమందైనను దేశికవితాప్రక్రియయే!

## జానపద కథ – వీరగాథ

జానపదకథ ( Folktale) కును వీరగాథకును మిక్కిలి సన్నిహిత సంబంధమున్నది. రెండును జానపదులలో సహజ సిద్ధములే. రెండింటను కథాకథనమున్నది. బహుజనాదర పాత్రత రెండింటికిని గలదు. జానపదకథ వచనరూపమున నుండును. వీరగాథ గేయరూపమున నుండును. ఇంతియ భేదము. (అద్భుత కథ- fairy tale - కూడ జానపద కథలలో నొక శాఖయే). అంత మాత్రమున వచనరూపమున నున్న జానపదకథను గేయరూపమునకు మలచినచో వీరగాథయగునని తలంపరాదు. వచనరూప గేయరూపములు బాహ్యముగా గాన్పించు భేదము మాత్రమే. ఆంతరముగా నీ రెండింటికిని కొన్ని ముఖ్య భేదములున్నవి:-

(1) కథాకథనము రెండింటను ప్రత్యక్షమగుచున్నను, జానపదకథలోని కథా కథనమునకును, వీరగాథలోని కథాకథనమునకును భేదమున్నది. కథాకథనమే సర్వస్వముగా భాసిల్లునది జానపదకథ; దీని కథాఖ్యానమున కవితాస్పర్శ యుండవలసిన యవసరము లేదు. కథాకథనశిల్పము పుష్కలముగ నున్న చాలును. కాని వీరగాథలోని కథాఖ్యానమిట్టిది కాదు. వీరగాథలో కథాకథన మొకభాగమే కాని, అదియే సర్వస్వమును గాదు. ఆఖ్యానమున కవితా స్పర్శ యుండితీరవలెను.

(2) జానపదకథలో కథాఖ్యానము సుదీర్ఘముగా నుండి, అనేక ఉపకథలను కలిగి, శ్లిష్టముగా అల్లబడి యుండును. వీరగాథలో నిట్లుగాక, ఒకేఒక కథ సరళముగా వివరింపబడును. వీరగాథావృత్తములు ( Ballad -Cycles) లో మాత్రము ఒకటి రెండు ఉపకథలు ప్రత్యక్షమగుట కలదు. ఇది సకృత్తు. పల్నాటి వీరకథలవంటి గాథావృత్తములలో నిట్లుపకథలు కొన్ని వచ్చినను కథాకథనమున శ్లిష్టత గోచరింపదు.

(3) జానపదకథలోని వచనమున కొక నిర్ణీతమగు శైలి లేదు. కథకు లోపము రాకుండ శైలి ఏవిధముగానైనను ఉండవచ్చును. కాని వీరగాథ యిట్టిది కాదు. దీనికి నిర్ణీతమగు శైలీ స్వరూపములున్నవి. ఇది యొక ప్రత్యేక కవితాప్రక్రియ.[64]

(4) జానపదకథ ఎప్పుడును సుఖాంతముగనే ఉండును. కాని వీరగాథ సాధారణముగా విషాదాంతముగనే ఉండును.

స్పష్టమగు పై భేదములనుబట్టి వచనరూపముననున్న జానపదకథలు గాని, అద్భుత కథలు(Fairy tales)కాని, కాల్పనిక కథలు(Romances)కాని గేయరూపమునకు మార్చబడి నంత మాత్రమున వీరగాథలు కానేరవనుట స్పష్టము.

"Thus a number of fairy tales are unfit for ballads because there is too much matter in them, too many adventures. For the same reason, the ballad is generally different in plot from the narrative romances. Further the ballad has no fondness for the happy ending, which is generally right in the fairy tale"[65]

## స్త్రీల గేయకథలు - వీరగాథలు

స్త్రీలపాటలలో లాలిపాటలు, జోలపాటలు, మంగళహారతులు, నలుగుపాటలు, పెండ్లిపాటలు, తలుపుదగ్గరపాటలు, అప్పగింతలపాటలు మున్నగునవి విడిగేయములు. ఈ స్త్రీలపాటలలో ఇట్టి విడిగేయములే కాక, రామాయణ, భారత, భాగవతములకు సంబంధించిన కథలపాటలును గలవు. స్త్రీలపాటలను తెలుగువిమర్శకులు జానపదగేయములుగనే సంభావించిరి. కావున కథాఖ్యానముచేయు స్త్రీలపాటలు వీరగాథలే కావలెను కదా!

స్త్రీలపాటలు, రామదాసు భజన కీర్తనలవలెనే, జానపదగేయములవలె నుండునవే కాని, జానపదగేయములు కావు. వీని నగ్రవర్ణములకు చెందిన స్త్రీలు గృహములలో పాడుకొందురు. పనిపాటులు చేసికొను జానపదస్త్రీలు వీనిని పాడలేరు. వీని భాష జానపద గేయములకన్న ఉన్నతముగా నుండును. సంగీతాంశము కూడ వీనిలో హెచ్చు. (నందిరాజు చలపతిరావుగారు ప్రకటించిన స్త్రీలపాటల మూడు సంపుటములలోను అన్ని పాటలకును రాగ, తాళ నిర్దేశము చేసియున్నారు). స్త్రీల గేయకథలను జానపద స్త్రీలేకాక, దేశద్రిమ్మరులగు

64. *A ballad is not the same thing as a fairy tale. The tale may be told in any language, in any style, without losing itself. But the ballad is a poem, i.e., it has a form of its own, belonging to a particular order of poetry.*
*-W.P.Ker, On the history of the Ballad, P.B.A., Vol.IV, 1909-1910, p.194.*

65. *Ibid., p.193.*

భిక్షువులును పాడుటలేదు. వీనిలో అన్నియును పౌరాణికేతివృత్తములు గలవే కాని చారిత్రక సాంఘిక సంఘటనలను వర్ణించునవి కావు. ఇవి వీరగాథలవలె వీరరసప్రధానములును గావు. ఇంచుమించు అన్నింటను శృంగారమే హెచ్చు. వీథులలో పామరజన సమూహముల యెదుట వాద్యసహితముగా పాడబడుట కూడ వీరగాథల లక్షణము. ఈ స్త్రీలపాటలు అగ్రవర్ణముల వారి గృహములను దాటి బయటకు రావు. వీనిని పాడుటలో వాద్యము లుపయోగింపబడవు. అందుచే స్త్రీల గేయకథలను 'గృహజీవన గాథలు' (Domestic Ballads) అనవచ్చును గాని 'జనరంజక వీరగాథలు' (Popular Ballads) అనలేము. వీరగాథలు, అనిబద్ధదేశిలో జానపద శాఖకు చెందినవి కాగా, స్త్రీల పాటలు అంతకంటె ఉన్నతమగు 'జాతిదేశి' కి చెందినవి యగును.

ఈ స్త్రీల గేయకథలలో 'కుశలవుల యుద్ధము', 'కుశలవ కుచ్చల కథ' అనురెండు పాటలు మాత్రము వీరరసప్రధానముగా సాగిన గేయకథలు. 'కామేశ్వరిపాట' కూడ వీరరస ప్రధానము కాకపోయినను ఆవేశప్రధానమైనది. దీనిని పాడునప్పుడు కొందఱు స్త్రీలకు పూనకము వచ్చుట కలదు. శైవభక్తుడగు 'కుమ్మరి గుండయ్యకథ'ను గూడ స్త్రీలు పాటగా పాడుచున్నారు. స్త్రీలపాటలలో గల పై నాలుగు కథాగేయములను వీరగాథలుగా పరిగ్రహింప వచ్చునేమో. ఏమైనను ఇవి అగ్రవర్ణములవారి గృహములలోనే యున్నవి కాని వీథులలో ప్రజలముందు ప్రచారము కాలేదు. ఇట్టి స్త్రీల కథాగేయములు వీరగాథల పరిధిలోనికి రాకుండ నుండుటకై వీరగాథల కొక పర్యాయపదము నూహింపవలెను. వీథులలో నాడబడు నాటకములు 'వీథినాటకము'లైనట్లే, వీథులలో పాడబడు కథలు 'వీథి కథ' లగుననియు, లేదా బయట చెప్పబడు కథలు కావున వీనిని 'బయలు కతలు' అనవచ్చుననియు ఆచార్య జి.యన్. రెడ్డిగారు సూచించుచున్నారు. వీథినాటకమును రాయలసీమలో 'బయలాట' అందురు. బయట ఆడబడు నాటకము గావున 'బయలాట' అన్వర్థనామమే యగును. కావున వీరగాథలను 'బయలు కతలు' అనుట గూడ అర్థవంతమే కాగలదు. పైగా జానపదులలో వీరగాథాపరముగా నున్న 'కత' అను శబ్దమును మన్నించినవారమగుదుము. ఆంగ్లములోని 'Ballad' శబ్దమునకు 'వీరగాథ' సంస్కృత సమము కాగా, 'బయలు కత' అచ్చమైన జానుతెనుగు కాగలదు. 'వీథి కథ' లేక 'బయలు కత' అను పేరుచే, జాతిదేశికి చెందినవియు, జానపదరచనలకన్న ఉన్నత భాషలో నుండునవియు, అగ్రవర్ణములలో మాత్రమే ప్రచారమున నున్నవియు, గృహాంతరములలో మాత్రమే పాడబడునవియు, శృంగారరసప్రధానములైనవియు నగు స్త్రీల కథలపాటలు వీరగాథల పరిధినుండి పరిహరింపబడును.

## పల్లెపాటలు (జానపద గేయములు) – వీరగాథలు

''జనపద మనగా పల్లెటూరు.... జనపదములయందుండువారు జానపదులు. వారు పాడుకొనెడి పాటలు లేదా గేయములు జానపద గేయము లనబడును. వీనినే ఇంగ్లీషులో

'Folksongs' అందురు''[66]. ఈ జానపద గేయములు పల్లెపాటలనియు వ్యవహరింపబడు చుండును. ఈ పల్లెపాటలు వీరగాథలకు సోదరశాఖలు. ఇవి ఆత్మాశ్రయపరములగు ముక్తకగీతములు. వీనికిని వీరగాథలకును ప్రధానభేదములు కొన్ని కలవు. (1) జానపద గేయములు కుఱుచగా నుండును. వీరగాథలు పొడవుగా నుండును. (2) జానపదగేయములు కథారహితములు, వీరగాథలు కథాసహితములు. ఫలితముగా జానపద గేయములు ఆత్మాశ్రయ కవిత్వము (Subjective Poetry) నకు చెందును. వీరగాథలు పరాశ్రయ కవిత్వము (Objective Poetry) నకు చెందును. (3) జానపద గేయము లెక్కువగా శృంగారరసప్రధానములు, వీరగాథ లెక్కువగా వీరరసప్రధానములు. (4) జానపదగేయములు స్థిర నివాసులైన పల్లెప్రజలచే పాడబడును. వీరగాథలు దేశద్రిమ్మరులగు గాయక భిక్షువుల (Ministrels)చే పాడబడును.

జానపద గేయములలో కథ ప్రవేశించినదో వీరగాథ యగుననియు, కథను చెప్పు జానపద గేయమే వీరగాథ యనియు కొందఱు విమర్శకులు నిర్వచించియున్నారు. మఱికొందఱు దీని నంగీకరించుట లేదు. జానపద గేయములో నెంత కథ ప్రవేశించినను అది లఘువీరగాథ (Balladling)ను మించి పైకి పోలేదనియు, వీరగాథ ఒక ప్రత్యేక ప్రక్రియయేకాని జానపద గేయము నుండి పరిణమించినది కాదనియు వీరు తలచుచున్నారు. వీరగాథోత్పత్తి వివాదాస్పదమైనది. అయినను వీరగాథ జానపద విజ్ఞానములోని ఒక ప్రక్రియ అనుటలో సందేహము లేదు.[67]

జానపద గేయము భావకవిత్వమునకును, వీరగాథ ఇతిహాసమునకును మూలరూపము అని పాశ్చాత్యవిమర్శకుల భావన. ఏమైనను వీరగాథను వీరరసప్రధానమైన కథాత్మక జానపద గేయముగా చెప్పవచ్చును. వీరగాథ యనగా 'జానపద గేయకథ, జానపద కథాగేయము' అనుట సమంజసమే కాగలదు. అయినను మామూలు జానపద గేయముకన్న వీరగాథ భిన్నమైనదనుట మఱవరాదు. వీరగాథలను జానపద గేయములుగా సంభావించిన రామరాజుగారే వీరగాథల ప్రత్యేకతను గుర్తింపక తప్పలేదు. ''జానపద గేయవాఙ్మయమున చరిత్రకు సంబంధించిన గేయముల కొక విశిష్టస్థానము గలదు. వస్తువునందును, శైలియందును, కథాకథనపద్ధతి యందును తక్కిన జానపద గేయములకన్న నివి భిన్నముగా నుండును.[68]

---

*66. డా॥ బి. రామరాజుగారు, తెలుగు జానపద గేయ సాహిత్యము, పుట 1.*

*67. The origin of ballad is a controversial subject. Even then, it is a folk-song - a long narrative, and as much a part of folk-lore.*

*-Syam Parmar, 'Ballad singing in India', Folklore, Vol. V, No.8, August, 1964.*

*68. తెలుగు జానపద గేయ సాహిత్యము, పుట 155.*

## అభ్యుదయ గేయములు - వీరగాథలు

ఆధునిక కాలమున శ్రీ శ్రీ గురుత్వమున బయలుదేరిన అభ్యుదయ కవిత్వమునకు 'ప్రజాకవిత్వ' మని పేరు. ఇట ప్రజాకవిత్వ మనగా 'ప్రజల కవిత్వ' మని యర్థము కాదు. 'ప్రజలను గుఱించిన కవిత్వ' మని మాత్రమే యర్థము. ప్రజలకవిత్వమనగా జానపదకవిత్వమే యగును. ఈ అభ్యుదయ కవిత్వము భాషాపాండిత్యముగల నాగరకకవులచే ప్రజల సమస్యలపై వ్రాయబడును. ఇది శిష్టులచే చదువబడును. పామరులచే పాడబడదు. అందుచే ఈ అభ్యుదయ కవిత్వము గేయరూపమున నున్నను రౌద్రకరుణములు ప్రదర్శించుచున్నను, ఇందలి కథాత్మక రచనలు (పి. విజయలక్ష్మి, 'విషాద భారతము'; శ్రీ శ్రీ 'బాటసారి' గేయము మొలగునవి) వీరగాథలు కానేరవు.

ఈ అభ్యుదయ గేయములకు 'గేయము' లన్న పేరు 'నేతిబీర' వంటిది. ఇవి చదువ బడునే కాని పాడబడవు. ఇందలి భాషయు మార్గభూయిష్ఠమే కాని ప్రజల భాషకాదు. ఇందు కథాత్మక రచనలు చాల తక్కువ. ఇవి ప్రజలను గూర్చిన కథలు చెప్పక, రాజకీయ ప్రచార ధోరణిని హెచ్చుగా ప్రదర్శించును. అందుచే సకృత్తుగా నున్న అభ్యుదయ గేయకథలు కూడ వీరగాథలు కానేరవు. పూర్ణమ్మ కథ, కర్పూర వసంతరాయలు మున్నగు గేయకథలు కూడ విద్యావంతులగు శిష్టుల నుద్దేశించి రచించినవే కాని, పామరులు పాడుకొనుటకై వ్రాసినవి కావు. ఇవియును వీరగాథలు కానేరవు.

ఇట్లు వీరగాథను సాహిత్యమునగల ఇతర ప్రక్రియలతో పోల్చుటవలన నిర్వచనము మఱింత స్పష్టమగుచున్నది. ''వీరగాథయనగా జానపదగేయ స్వరూపమున నుండి, గానరూప కథాఖ్యానోద్దిష్టమై, విశేష మౌఖికప్రచారము కలిగి, మార్గ-దేశి కవితాభేదములలో దేశికి - అందునను అనిబద్ధదేశిలో జానపదశాఖకు చెందిన, నిసర్గమధురమును నిరాడంబరమునైన, పరాశ్రయకవిత్వమగు విశిష్ట సాహిత్యప్రక్రియ.'' దీనిని కేవలము ప్రాచీనకావ్యముల కనుకరణముగా గాని, కవిత్వరూపమున నున్న జానపదసంపదగా గాని తలచుట సరికాదు. డబ్లియు. పి. కెర్ (W.P. Ker) అను విమర్శకుడు దీని ప్రత్యేకత నిట్లు చెప్పెను:-

"The ballads are not merely a limb of the great mediaeval body of romance, they are a separate form. They are not mere versified folklore, because their form-the 'Idea' of a Ballad--makes them reject some of the most delightful fairy as unfit for their poetical scope. They are not degradations of longer stories, for even when they have the same plot, they make a different thing of it......'The Ballad' is a 'form', and the essence of it is shown in two ways; in the power of taking up new subjects, and treating them according to the laws of the Ballad; and in the lyrical beauty, which is utterly unlike the beauty either of

epic poetry or of the longer sort of romance. It is something with a life of its own,..."[69]

తెలుగులో జానపద గేయములను నిర్వచించినవారు, విమర్శించినవారు కలరు కాని, వీరగాథలను నిర్వచించినవారు లేరనవచ్చును. డా॥ బి. రామరాజుగారు వీరగాథను జానపదగేయ మాత్రముగనే భావించి, జానపదగేయ నిర్వచనము చేసి, ఆ జానపద గేయములలో చరిత్రకు సంబంధించినవి 'చారిత్రక గీతములు' లేక 'వీరగీతములు' అని తెల్పిరి[70]. ఆంగ్లమున ఇట్టిగీతములను 'Historical Ballads' అనియు 'Heroic Ballads' అనియు వ్యవహరించు చున్నారనికూడ రామరాజుగారు సూచించియున్నారు కాని Ballad అనుమాటకు సమానార్థకమగు ఆంధ్రశబ్దమును వీరు తెలుపలేదు. దీనిని బట్టి 'Ballad' అనగా జానపద గేయమనియే రామరాజుగారు భావించిరని తలపవలసియున్నది.

పల్నాటి వీరచరిత్ర పీఠికలో ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు మాత్రము వీరగాథను 'పద' మను పేర సంభావించి, యిట్లు నిర్వచించిరి:

''ఏ దేశమందైనను, ఏ కాలమందైనను తలచిన మాత్రమున 'ఓహో' యని తలూపింపజాలు సాంఘిక చారిత్రక వృత్తాంతములెన్నో జరుగుచుండును. మనలో గూడ పుణ్యాత్ములగు కొందఱు కవులు అట్టి గాథలను కొన్నిటిని కావ్యములుగా రచించి, ఆంధ్ర సాహిత్య కేదారమున పంటలు పండించిరి. ఆ కావ్యములను ఒకరు చదువగా వినుట గాని, లేదా మనమే చదువుకొనుటగాని కాకుండ, తంబుఱ శ్రుతితో కంఠమును మేళవించి, డక్కీని లయబద్ధముగా మ్రోగించుచు, పాటగా పాడునపుడు విన్నచో హృదయావర్జన మనెడి కావ్య గుణము ఇమ్మడిగా ముమ్మడిగా పెంపొందును. ఈ పాడదగిన కావ్యమునకు పదమని పేరు.''[71]

ఇది తెలుగున గల ఒకేఒక వీరగాథా నిర్వచనము. అయినను ఇది తెలుగున గల వీరగాథలన్నిటికిని వర్తించునదిగా లేదు. ఈ నిర్వచనమునుబట్టి చారిత్రక సాంఘికేతివృత్తము లతో నుండునవి మాత్రమే వీరగాథలని భావింపవలసియున్నది. వీరగాథ లెక్కువగా సాంఘిక చారిత్రక సంఘటనా జన్యములనుట సత్యమే. అయినను ఇతరేతివృత్తములతోగల వీరగాథలును గలవు. ఎల్లమ్మ కథలు, అంకమ్మ కథలు మున్నగు శక్తి కథలు; లక్ష్మణమూర్ఛ, గంగావివాహము, సుందరకాండము మున్నగు పదములు; శ్రీయాళ చరిత్ర, భల్లాణరాయని చరిత్ర,శశిరేఖా

69. *On the history of the Ballads, Proceedings of the British Academy, Vol. IV, 1909-1910, p.203.*

70. *తెలుగు జానపదగేయ సాహిత్యము, పుట 155.*

71. *పల్నాటి వీరచరిత్ర (విశాలాంధ్ర ప్రచురణము), పీఠిక, పుటలు 20,21.*

పరిణయము మున్నగు జంగంకథలును పింగళివారి నిర్వచనమునకు లొంగుటలేదు. ఈ నిర్వచనము సాంఘిక చారిత్రక వీరగాథలను - ముఖ్యముగా లక్ష్మమ్మ కథ, పల్నాటి వీరచరిత్ర లను దృష్టిలో నుంచుకొని చెప్పిన నిర్వచనముగా నున్నది. పుణ్యాత్ములగు కవులే వీరగాథా రచయితలనుటయు సరికాదు. అన్ని వీరగాథలును కవులచేతనే రచింపబడలేదు. కొన్ని గాథలకు జంగములే కర్తలు. జంగముల ఆశుధారనుండియే పెక్కు వీరగాథలు పుట్టినవి. కావున పై నిర్వచనమునకు మఱికొన్ని విశేషణములను చేర్చుకొనినప్పుడు కాని అది సమగ్రము కానేరదు.

''జానపదగేయ రూపముననుండి, ఎక్కువగా సాంఘిక చారిత్రక సంఘటనా జన్యమైన ఇతివృత్తమును స్వీకరించి, సరళభాషలో, గానయోగ్యముగా, కథాఖ్యాన ప్రధానముగా కొనసాగుచు, వీరాద్భుత కరుణ రసములను పోషించుచు, అప్రధాన కర్తృకముగా వెలసి, సంచార గాయక భిక్షువులచే పాడబడుచు, జనపదములందు మిక్కిలి ప్రసిద్ధికెక్కి, మౌఖిక ప్రసరణమున ఆయా ప్రాంతములందంతటను వ్యాపించియుండు నిసర్గ మధుర నిరాడంబర కథాగేయమే 'సాంప్రదాయక వీరగాథ' (Traditional Ballad) లేక 'జనరంజక వీరగాథ' (Popular Ballad). బొబ్బిలికథ, దేసింగురాజుకథ, బాలనాగమ్మకథ, కాంభోజరాజుకథ, ఆరె మరాటీలకథ, లక్ష్మమ్మకథ, కామమ్మకథ, చిన్నమ్మకథ, సర్వాయిపాపడుకథ, చిన్నపరెడ్డికథ, సదాశివరెడ్డికథ, కొమార రాముడుకథ మున్నగునవి తెలుగులో అతిప్రసిద్ధములైన సాంప్రదాయక వీరగాథలు''.

ఇట్టి వీరగాథలు కొన్ని ఒక ప్రధాన దైవమును గాని, దైవసమానడగు వ్యక్తిని గాని ఆధారముగా జేసికొని, అతనిపైనను, అతని బంధుమిత్రాదులపైనను అనేక విధములుగా నుద్భవించి, అవియన్నియు నొక పెద్ద ఇతిహాసమువలె క్రమబద్ధముగా నా ప్రధాన పురుషుని చుట్టును వ్యాపించి యుండును. ఇట్టి వీరగాథలను 'వీరగాథావృత్తము' లేక 'వీరగాథాచక్రము' అని పిలువవచ్చును. పాశ్చాత్య విమర్శకు లిట్టి గాథామాలికను 'Ballad - Cycle' అందురు. తెలుగులో పరశురాముని పైనను అంకమ్మ పైనను, బ్రహ్మనాయని పైనను, కాటమరాజు పైనను ఇట్టి వీరగాథావృత్తములున్నవి. వీనిని పరశురాముని కథాచక్రమనియు, అంకమ్మ కథాచక్ర మనియు, పల్నాటి వీరకథాచక్రమనియు, కాటమరాజు కథాచక్రమనియు పిలువవచ్చును. సెర్బియన్ భాషలో 'Kossovo' (1383) అను వీరునిపైనను, ఇంగ్లండులో 'రాబిన్‌హుడ్' పైనను, అమెరికాలో 'జెస్సీజేమ్సు' (Jesse James) 'యాంకీ డూడిల్' (Yankee Doodle) అను వీరులపైనను ఇట్టి వీరగాథావృత్తము లున్నవి.

వీరగాథలు సాధారణముగా రెండు మూడు రాత్రులు పాడబడుచుండును. వీర గాథవృత్తములను పాడుటకు వారములు, నెలలు కూడ పట్టును. కాని ఒక గంటలోపుననే పూర్తియగు వీరగాథలును కొన్నిగలవు. వీనిలో కథాకథనము లఘువుగా నుండును. కొన్నింటిలో

కథ కేవలము సూచనామాత్రముగా నుండుటయు కలదు. ఇట్టివి పాడుట కొన్ని నిమిషముల లోనే పూర్తియగును. ఇట్టి లఘురచనలను 'వీరగాథానికలు' లేక 'లఘువీరగాథలు' అని పిలువ వచ్చును. పాశ్చాత్యు లీ ప్రక్రియను 'Balladlings' అందురు. గుత్తాల గోపిరెడ్డి పాట, మానంది రెడ్డి పాట, బుడ్డా వేంగళరెడ్డి పాట, నారసింహారెడ్డి పాట, బండోళ్ళ గురవన్న పాట - ఇత్యాదులు తెలుగులో గల వీరగాథానికలు. వీరగాథలు కొన్ని కథనమును తగ్గించుకొని వీరగాథానిక లగుటయు కలదు. జానపదు లీ లఘురచనలను 'కత' అను పేరుతో వ్యవహరింపరు. 'పాట', 'పదము' అని మాత్రమే పిలుతురు.

ఇంతవఱకును జరపిన చర్చల సారాంశమేమనగా - 'Ballad' శబ్దము 'balla:re' అను లాటిను శబ్దము నుండి పుట్టినది. దీనికి మొదట 'నృత్తగీతము' అనునర్థమున్నను నేడాయర్థము నశించి, 'గేయరూపమున నున్న కథ' అనునర్థము వ్యాపించియున్నది. Ballad అనునది బాహ్య స్వరూపమున lyric ను, ఆంతర స్వరూపమున epic ను పోలియుండునని పాశ్చాత్యులు నిర్ణయించిరి. ఇది గేయరూపమున నున్న చిన్న ఇతిహాసము, లేదా కథాత్మకమగు పెద్ద గేయము. Ballad శబ్దమునకు సరియైన తెలుగు శబ్దము 'వీరగాథ'. జానపద గేయరూపమున నుండి, వీరరస ప్రధానమగు కథను చెప్పుచు, సంచార గాయకభిక్షువులచే పాడబడు సరళ కథాగేయమే వీరగాథయని తెలుగున నిర్వచింపవచ్చును. బొబ్బిలికథ వంటివి దీనికి చక్కని లక్ష్యములు. పల్నాటి వీరచరిత్ర వంటివి వీరగాథావృత్తములకును, గుత్తాలగోపిరెడ్డిపాట వంటివి వీరగాథానికలకును ఉదాహరణములు.

| | |
|---|---|
| గేయము + కథాకథనము (Song)+(Narration) | = గేయకథ లేక కథాగేయము లేక వీరగాథ (Ballad) |
| జానపదగేయము + కథాకథనము (Folksong)+(Narration) | = జానపద గేయకథ, లేక జానపద కథాగేయము లేక జానపద వీరగాథ (Folk/Popular Ballad) |
| స్త్రీల పాట + కథాకథనము | = స్త్రీల గేయకథ లేక గృహజీవన గాథ (Women's Ballad or Domestic Ballad) |
| కీర్తన + కథాకథనము | = కీర్తనల గాథ (Lyrical Ballad) |
| కృతి + కథాకథనము | = సంగీత గాథ (Musical Ballad) |
| ద్విపద లేక ఆధునికగేయము + కథాకథనము | = సాహిత్యగాథ లేక కళాగాథ (Literary Ballad or Art Ballad) |
| జానపద గేయానుకరణము+ రాజకీయ కథాకథనము | = బుఱ్ఱకథ (Political Ballad or Ballad-Imitation) |

Ballad = వీరగాథ, లేక జానపద గేయకథ లేక జానపద కథాగేయము

Traditional Ballad = సాంప్రదాయక వీరగాథ

Popular Ballad = జనరంజక వీరగాథ లేక జనప్రియ వీరగాథ

Ballad - Cycle = వీరగాథావృత్తము లేక వీరగాథాచక్రము

Balladling = వీరగాథానిక లేక లఘువీరగాథ

## Ballad శబ్దమునుండి యేర్పడిన ఇతర శబ్దములు - అర్థములు

Ballader = వీరగాథా రచయిత, గాథాకారుడు

Balladic = వీరగాథలకు సంబంధించిన

Ballading = వీరగాథలను వ్రాయుట లేక కూర్చుట

Balladism = వీరగాథా లక్షణములు

Balladist or Ballader = వీరగాథా రచయిత, గాథాకారుడు, వీరగాథలను తయారు చేయువాడు.

Balladize = (అకర్మకము) వీరగాథలుగా తయారగు
(సకర్మకము) వీరగాథగా చేయు, వీరగాథగా మార్చు

Ballad-monger = వీరగాథల నమ్ముకొని జీవించువాడు, (ఈ శబ్దమును షేక్స్పియర్ మహాకవి 'వీరగాథా రచయిత' అను నర్థమున ఏహ్యభావముతో ప్రయోగించినాడు).

Balladry = వీరగాథా కవిత్వము.

## సంస్కృతము:

గాథ, గాథా = పాట, (వేదములలోని పాటవంటిది కాదు. ప్రాచీనేతిహాసములకు ఆఖ్యానములకు సంబంధించిన పాట).

గాథక = గాయకుడు, పురాణములను గానము చేయువాడు

గాథికా = ఐతిహాసిక గీతము

గాథాకార = గేయ రచయిత, గాయకుడు

గాథా నారాశంసీ = వీరప్రశంస చేయు నైతిహాసిక గీతము

తెలుగు

| | | |
|---|---|---|
| గాథ | = | చరిత్ర, గానము, పాట |
| గాథకుడు | = | గాయకుడు, పాడెడివాడు. |

## వీరశబ్ద విశేషణపూర్వక పదములు

సంస్కృతము:

| | | |
|---|---|---|
| వీర | = | రాహువు, శివుడు, ఇంద్రుడు, కుమారస్వామి, కుబేరుడు, శూరుడు. |
| వీర వృక్ష | = | భల్లాటవృక్షము, మద్దిచెట్టు |
| వీర జయన్తికా | = | వీర నృత్యము |
| వీర పాణ | = | యుద్ధవీరుల త్రాగుడు |

తెలుగు:

| | | |
|---|---|---|
| వీర రేణువు | = | భీముడు |
| వీర వట్టము | = | వీరులు ధరించు బిరుదవట్టము |
| వీర పట్టము | = | వీరులు ధరించెడి ఒక విధమైన వేషము |
| వీరాశంసనము | = | భయంకరమైన యుద్ధభూమి |
| వీరంధరము | = | చర్మ కవచము |
| వీర పానము | = | యుద్ధమునకు పూర్వము ఉద్రేకము కలిగించుటకు గాని, యుద్ధానంతరము ఖేదమును బాపుకొనుటకు గాని యుద్ధభటులు త్రాగెడి మద్యము |
| వీరణ యురుమ | = | (వీరణము + ఉరుమ) చర్మవాద్య విశేషము |
| వీర తరము | = | బాణము |
| వీర తాంబూలము | = | యుద్ధమునకు పోవుటకు ముందు రాజు వీరునకు అనుజ్ఞాపూర్వకముగా నిచ్చెడి తాంబూలము |
| వీర తాయెతు | = | వీరులు కట్టుకొను తాయెతు |
| వీర గాథ | = | శూరుని గూర్చిన కథాగేయము. |

* * * * *

మూడవ ప్రకరణము

# వీరగాథల ప్రాచీనత

కవిత్వోత్పత్తిని బట్టియు, ఛందశ్శాస్త్ర క్రమపరిణామమును బట్టియు, సంస్కృత ప్రాకృతములు, గ్రీకు, తమిళము - ఇత్యాది అతిప్రాచీన సాహిత్యములను బట్టియు, సంగీత శాస్త్రమున వచ్చు దేశిరాగముల ప్రసక్తిని బట్టియు, మార్గసాహిత్యమున వచ్చు గేయప్రసక్తిని బట్టియు వీరగాథలు అతిప్రాచీనమైన కవితాప్రక్రియగా గానవచ్చుచున్నవి.

## కవిత్వోత్పత్తి

ప్రాక్తనమానవులు వినోదము కొఱకు గాని, మతాచారమును నెఱవేర్చుటకు గాని గుమిగూడి వలయనృత్యము (ring dance) చేయుచు పాడిన పాటయే మొదటి వీరగాథ యనియు, ఇదియే కవిత్వమున కంకుర్పాణ మనియు, ఈ గాథానృత్యము (ballad dance) నుండియే సంగీతము, నాట్యము అను మఱిరెండు కళలు కూడ ఉద్భూతములైన వనియు హెర్డర్ (Herder), గ్రిమ్ సోదరులు (Brothers Grimm) మున్నగువారి సిద్ధాంతము. దీనిని బట్టి కవిత్వమునకే ఆది రూపమైన వీరగాథయొక్క ప్రాచీనతను వేఱుగా చెప్పపనిలేదు. కాని ప్రాక్తనమానవుడు ప్రకృతిని జూచి, ఆనంద పారవశ్యముననో లేక భయవిహ్వలతచేతనో, ఆత్మాశ్రయమగు నేదో భావమును వెలువరించు చిన్నపాట (songlet) ను పాడియుండు ననుట సమంజసము కాని, పరాశ్రయమును ఆఖ్యానాత్మకమును అగు గేయకథ (ballad) పాడియుండుననుట క్రమవిరుద్ధమని A.W. Schlegel, T.F. Henderson, Prof. Louise Pound మున్నగు విమర్శకులు భావించుచున్నారు. భావాత్మకమగు గేయము ముందా? లేక కథాత్మకమగు గేయము ముందా? అనునది నిశ్చయముగా తేల్చి చెప్పజాలము. కథాకథనశక్తి ప్రాక్తన మానవునకు లేదనుట సమంజసము కాదు. ఆదిమానవుడు కొండ గుహలలో నివసించునప్పుడే కవిత్వము పుట్టినదనియు, అది కథాఖ్యానముతోడనే పుట్టినదనియు, కొందఱు పాశ్చాత్య విమర్శకులు భావించుచున్నారు. గిరిగహ్వరవాసియగు ప్రాక్తనమానవుడు ప్రాతఃకాలమున లేచి, ఆయుధములను దీసికొని, కుటుంబసభ్యులు తనకు వీడ్కోలీయగా, వేటకుబోయి సాయంకాలమగువఱకును కష్టపడి వేటాడి, తాను చంపిన జంతువును తీసికొని తన కొండ గుహకు వచ్చెడి వాడనియు, చీకటిపడగా ఆ గుహముందర పెద్ద మంట వేసి, ఆ మంటలో తాను చంపిన జంతువును కాల్చుచు, ఆ యాదిమానవుడు తన కుటుంబసభ్యులతో ఆ జంతువును తా నెట్లు కష్టపడి చంపెనో వివరించుచు, లయాత్మకములును, ఉత్సాహజనకము

లును అగు మాటలతో వర్ణించి చెప్పెడివాడనియు భావింపబడుచున్నది.[1] ఈ లయాత్మక వర్ణనమే కవిత్వమునకు బీజప్రాయమని కొందఱు విజ్ఞులు తలచుచున్నారు. ప్రాక్తనమానవుడు కూడ ఊహాబలము గల కళాకారుఁడే.[2] ఈ యాదిమానవుని లయాత్మక వర్ణనలో కొంత కథాకథనమును ఇమిడియుండునని ఊహింపవచ్చును. కాబట్టి, మానవుని కథాకథనశక్తి ఆధునికమైనది కాదు.[3] గిరిగహ్వరవాసియగు ప్రాక్తనమానవునకే ఈ శక్తి కలదని తోచుచున్నది. అందుచే గేయము అతి ప్రాచీనమనియు, గేయకథ అర్వాచీనమనియు సిద్ధాంతీకరించుట సమంజసముగా దోపదు. గేయ మెప్పుడు పుట్టినదో, గేయకథయు నప్పుడే పుట్టినది. వీని ముందు వెనుకలను నిర్ణయింప వలనుపడదు. ఈ తర్జనభర్జనలకన్న నివి రెండును పద్యకవితకంటె ప్రాచీనములని గుర్తించిన చాలును.

## ఛందస్సు

ఏ సాహిత్యమందైనను ముందు పాటలు, తరువాత పద్యములు, ఆ పిమ్మట వచనమును ఆవిర్భవించుననుట సత్యము. కాని "ఛందశ్శాస్త్ర మధికముగా పద్యములను గూర్చియే ప్రపంచించియున్నది కాని, గేయములనుగూర్చి వివరించియుండలేదు. గేయములకు సంబంధించిన వివరణ మధికముగా సంగీత శాస్త్రమందు విస్తరింపబడి యున్నది.... గేయము మాత్రాబద్ధమయినది. పద్యము అక్షరబద్ధమయినది. మాత్రాబద్ధత్వము గేయముయొక్క ప్రాచీనతకు సూచకము. గేయములోని ప్రతిపాదమందును అక్షరములు సమానముగా నుండవు. పాడునప్పుడు ఉపయుక్తమగు కాలమునుబట్టి మాత్రాసంఖ్య సరిపోవును. అక్షరబద్ధమగు

---

1. *R.A. Scott-James, The Making of Literature, pb. Martin Secker & Warburg Ltd., London, 1958, pp. 16-21.*

2. *It is evident that the most primitive critic must have the imagination of the artist. His sight, too, must be keen. It may be, even, that having in his own mind's eye some form clearer and harder than that he sees before him he may complain that the drawing falls short in this, exceeds in that--measuring the created thing before him against the half-created form fashioned in his own mind. He, too, must have the artist's vision... -Ibid. p.20.*

3. *It is immensely old - goes back to neolithic times, perhaps to palaeolithic. Neanderthal man listened to stories, if one may judge by the shape of his skull. The primitive audience was an audience of shock-heads, gaping round the camp-fire, fatigued with contending against the mammoth or the woolly rhinoceros, and only kept awake by suspense. What would happen next? The novelist droned on, and as soon as the audience guessed what happened next, they either fell asleep or killed him.*

   *- E. M. Forster, Aspects of The Novel, Pb. Edward Arnold Ltd., London, 1961, p. 28.*

పద్యమందు పాదములందన్నింటను అక్షరములు సరిగా సమానముగా నుండును. కావున మాత్రలుకూడ సమానముగనే యుండును. ఈ అక్షరబద్ధత్వము విశేష నియమమగుటవలన గేయముకన్న పద్యముయొక్క అర్వాచీనతను సూచించును. నియమములు ప్రథమదశలో తక్కువగానే యుండును. వాని పెరుగుదల క్రమక్రమముగా నుండును.''[4] కావున గేయ స్వరూపమున నుండు వీరగాథలు పద్యకవిత్వముకన్న ముందుగనే పుట్టియుండవలెను. లోకమున ఏ సాహిత్యమును పరిశీలించినను అదిముందు పాటలతోనే ప్రారంభమగుచున్నట్లు స్పష్టమగుచున్నది.

## ఆర్యుల ఆగమనము

క్రీ.పూ. 3000 సంవత్సరముల నాటికి ఆర్యులు మన దేశమునకు వచ్చుట ప్రారంభ మైనదని చరిత్రకారుల యభిప్రాయము. అప్పటికి నల్లజాతులవారు - అందునను ముఖ్యముగా ద్రావిడులును, వారితోపాటు సవరలు మొదలయిన ఆదివాసులును - భారతదేశ మందంతటను వ్యాపించియుండిరి. నిషాదులు, నాగులు, యాదవులు, ఎక్కువగా నుత్తర దేశమున నుండిరి. ఆర్యులు మొదట సింధునదీ మైదానమును, పిమ్మట గంగానదీ మైదానమును ఆక్రమించుకొనిరి. అక్కడనున్న ఆదివాసులను కొండలలోనికి తఱిమివేసిరి. (వీరే తరువాత కొండజాతులుగా పరిణమించిరి). ద్రావిడులు దక్షిణప్రాంతమునకు సర్దుకొనిరి. దేశీయులగు నల్లజాతులలో నిషాదులు, నాగులు మాత్రము కొండజాతులకన్న కొద్దిగా ఎక్కువ నాగరకత కలవారు. ఆర్యులు వీరితో వర్తకవ్యాపారములు చేసెడివారు. యాదవులు ఈ నిషాద నాగులకన్నను నాగరకులు. ఆర్యులు వచ్చునాటికే వీరు స్వదేశ సంస్థానములను పరిపాలించు చుండిరి. ఆర్యులు ఈ యాదవులతో సంధి చేసికొనిరి. ద్రావిడులతో యుద్ధము చేసి, వారిని దక్షిణ దేశమునకు తఱిమి వేసిరి. ఆర్యులకును ఈ నల్లజాతులకును జరగిన సంఘర్షణలో అనేక వీరగాథలు పుట్టియుండును. రామాయణము ఆర్యద్రావిడ యుద్ధమున పుట్టిన వీరకావ్యము కావచ్చును.

ఇట్లు ఉత్తర హిందూస్థానమున వ్యాపించిన ఆర్యులలో, వర్గకలహములు, అంతః కలహములు బయలుదేరినవి. ముఖ్యముగా గంగానదీ మైదానమున నున్న ఆర్య రాజ్యములలో 'పురోహితవర్గము - రాజవర్గము' అను రెండు వర్గము లేర్పడి, ఔన్నత్యమునకై పరస్పరము పోటీపడినవి. తత్ఫలితమే వసిష్ఠ విశ్వామిత్రుల తగవు - 'హరిశ్చంద్రుని కథ'. ఇది క్రీ. పూ. 8వ శతాబ్దమున జరగిన సంఘటనగా విమర్శకు లూహించుచున్నారు. ఆర్యుల అంతః కలహములలో అతిప్రధానమైన మహాభారతయుద్ధము తరువాత, రాజవర్గము మిక్కిలి బలహీనపడినది. పరశురాముని విజృంభణము కూడ పురోహిత - రాజవర్గముల ఘర్షణ చిత్రణమే కావచ్చును.[5]

4. *శ్రీ సంపత్కుమార్, ఛందో వికాసము, పుట 5.*
5. *చూ. తెలుగు విజ్ఞాన సర్వస్వము, సంపుటి-1, పుట 312.*

క్రీ.పూ. 1000-500 మధ్యకాలమున ఆర్యనాగరకత, వైదికమతము ఉత్తరదేశము నుండి దక్షిణదేశమునకు అగస్త్యునివంటి మహర్షులవలన వ్యాపించినది. ఆర్యావర్తమందలి పురోహిత వర్గమువారు కొందఱు ప్రశాంతస్థలములలో తపస్సుచేసికొను నిమిత్తము దక్షిణ దేశమందలి అరణ్యములలో నాశ్రమముల నేర్పఱుచుకొని, ద్రావిడరాజ్యములలో వైదిక మతవ్యాప్తిని చేసిరి. ఈ మతవ్యాప్తిలో కొందఱు మునులు ద్రావిడకన్యలను గూడ వివాహమాడి యుందురు. అరుంధతి, రేణుక మొదలగు వారిట్టి కన్యలే కావచ్చును. ద్రావిడులు తమయింటి ఆడుబిడ్డలపై మక్కువతో, భక్తితో పాటలు అల్లి పాడుకొనియుందురు. నేడు ప్రచారముననున్న 'ఆరంజోతికథ', 'ఎల్లమ్మకథ' ఇట్టివే కానోపును.

''ఆర్యులు రాజ్యసంపాదనకొఱకు యుద్ధములు చేసిన కాలములో పంజాబునుండి క్రమముగా గుజరాతునకు, మధ్యప్రదేశమునకు వ్యాపించిరి. పిమ్మట ఆర్యులు పశ్చిమతీరమున నున్న కేరళము (చేరమండలము) లో కూడ వలసలు స్థాపించుకొనిరి. బ్రాహ్మణులు ప్రవేశింపక పూర్వము, నేటి మలబారు, కెనరా జిల్లాలు కలిసిన కేరళము 64 చిన్న రాజ్యములు కలిసిన సంయుక్త ప్రభుత్వ పాలనక్రింద నుండెను. కార్తవీర్యార్జునుని జయించి, ఆర్యులకు పరశురాముడే కేరళమును సంపాదించి పెట్టెనని పురాణగాథ. ఆ సంఘటన క్రీ.పూ. 1176లో జరిగినది. మలబారులో ఆనాటినుండి పరశురామశకము ఆరంభమై నేటికిని అమలులో నున్నది.''[6] కాబట్టి పరశురాముని కథలు క్రీ.పూ. 1176 నుండియు ద్రావిడజాతులలో వ్యాప్తియందున్నవని ఊహింపనగును.

ఆర్యద్రావిడ సంఘర్షణలో పుట్టిన వీరగాథయే 'రామాయణము'. ఆర్యుల అంతః కలహములలో 'మహాభారతము', వర్గకలహ ఫలితముగా 'హరిశ్చంద్రుని కథ' ఉద్భవించి యుండును. 'ఎల్లమ్మకథలు' (పరశురామునికథలు), 'ఆరంజోతికథ' - దక్షిణదేశమున వైదికమతవ్యాప్తి ఫలితములు కావచ్చును. కావున క్రీ. పూ. నుండియు వీరగాథలు భారతదేశమున వ్యాప్తియందున్నవని ఊహింపనగును.

## వేద కాలము

ప్రపంచమున వేదములకన్న ప్రాచీనమైన సాహిత్యము కానరాదు. వేదకాలము క్రీ.పూ.5000 లేదా 4000 సంవత్సరములై యుండునని భారతీయుల విశ్వాసము.[7] ఈ అతి

---

6. *చూ. తెలుగు విజ్ఞాన సర్వస్వము, సంపుటి-1, పుట 316.*

7. *వేదములు అపౌరుషేయములని భారతీయుల నమ్మకము. కాని పాశ్చాత్య విమర్శకులు ''వేద రచన క్రీ. పూ. 1400 ప్రాంతములో ప్రారంభమై ఉండవచ్చునని ఊహించుచున్నారు. క్రీ. పూ. 600 ప్రాంతమువాడైన బుద్ధుని కాలమునకు వేదరచన పూర్తి అయినది. (సింధులోయ*

ప్రాచీనములగు వేదములలోనే వీరగాథా బీజములు కన్పట్టుచున్నవి. ఋగ్యజుస్సామాథర్వణము లను చతుర్వేదములలో ఋగ్వేదము ప్రాచీనతమమైనది. ఇది భారతీయ విద్యలకు ఓంకార మనియు, సకల ప్రపంచ వాఙ్మయమునకు శ్రీకారమనియు పెద్దల అభిప్రాయము. ఇందు 10,472 ఋక్కులున్నవి. ఇవన్నియును ప్రార్థనలు. ఈ ప్రార్థనలలోనే వీరగాథా బీజములున్నవి. ఈ ఋగ్వేదకవులు దేవతల నాహ్వానించుచు, తమకు దీర్ఘాయుర్దాయము, కుటుంబసౌఖ్యము, వీరసంతతి, యుద్ధములో విజయప్రాప్తి, ఐశ్వర్యము ఒసగుడని మాత్రమే ఆ దేవతలను ప్రార్థింతురు. ఈ లోకమునుండి విముక్తి కొఱకుగాని, స్వర్గప్రాప్తి కొఱకుగాని ప్రార్థించినట్లు ఎచ్చటను. గానరాదు. ఇంద్రుడు గొప్ప వీరుడుగా వేదములందు ప్రశంసింపబడినాడు. ''ఋగ్వేదమున కథాత్మకములయిన కొన్ని ఋక్కులున్నవి. అట్లే పద్యగద్యమయములయిన చిన్నకథలు బ్రాహ్మణములందు కూడ కనిపించును. వీనికి 'గాథలు', 'నారాశంసులు', 'ఇతిహాసములు'- మున్నగు పేర్లు కలవు. నిరుక్తమందును, బృహద్దేవతయందును కొన్ని కథలు వ్రాయబడినవి.''[8]

వేదములు ప్రాచీనార్యుల జానపద వాఙ్మయమని పలువురు ప్రాక్పశ్చిమ పరిశోధకులు తలంచుచున్నారు. ఇందున్న ఉపాఖ్యానములు జానపద గేయకథల వంటివే. దాశరాజ్ఞ యుద్ధము వంటి ఉపాఖ్యానములను వీరగాథలనుటలో విప్రతిపత్తి లేదు.[9]

ఋగ్వేదమంతయు ప్రార్థనలు కాగా, సామవేదమంతయు గేయములు. సంగీత శాస్త్రమునకు ప్రధాన బీజారోపణము ఈ సామవేదగేయములలోనే జరగినది. ఇట్లు వేదములు గేయములకు, వీరగాథలకు, సంగీతమునకు ఉద్గమస్థానము లగుచున్నవి.

## ఇతిహాస కాలము

సంస్కృతభాషలో రామాయణ మహాభారతములు, గ్రీకుభాషలో 'ఇలియడ్', 'ఒడిస్సీ'లు ప్రపంచమున అతిప్రాచీనములైన ఇతిహాసములు. వీరగాథలే క్రమపరిణామమున ఇతిహాసము లగునని 'హార్వర్డ్' సంప్రదాయమునకు చెందిన విమర్శకుల అభిప్రాయము. వీరగాథలు మొదట 'గాథావృత్తములు' (Ballad-Cycles) గా నేర్పడుననియు, ఈ

---

*నాగరకత కంటె వేదములే ప్రాచీనతరములని కొందఱును, రెండును సమానమని మఱి కొందఱును భావించుచున్నారు). బాలగంగాధర తిలక్ వేదములలోని ఖగోళశాస్త్రీ యాంశముల నాధారముగ చేసికొని వేదకాలము క్రీ.పూ. 5000 లేదా 4000 సం.లై ఉండవచ్చునని నిర్ణయించెను.'' - విజ్ఞాన సర్వస్వము, సంపుటము 7, పుట 702.*

8. *విజ్ఞాన సర్వస్వము, సం. 6, పుట 204.*
9. *చూ. తెలుగు జానపదగేయ సాహిత్యము, పుట 32.*

గాథావృత్తములే ఇతిహాసములుగా పరిణమించుననియు వీరి మతము. దీనిని 'ఐతిహాసిక క్రమము' (Epic-Process) అందురు. పైన తెల్పిన నాలుగు ప్రాచీనేతిహాసములును ఇట్టి క్రమమున ఏర్పడినవే కావచ్చును.

సంస్కృతమున వైదిక సారస్వతము తరువాత, లౌకిక సారస్వతమున మొదట రామాయణము పుట్టినది. సంస్కృత సాహిత్యమున ఈ రామాయణమును ఆదికావ్య మనుటయు, వాల్మీకిని ఆదికవి యనుటయు పరిపాటి. వైదిక సంస్కృతమున ఋగ్వేదమువలె, లౌకిక సంస్కృతమున నిదియే ప్రథమకావ్యము.[10] ఇది ఆర్య ద్రావిడ సంఘర్షణను చిత్రించు వీరకావ్యము. ఇది కేవలము పాఠ్యమేకాక గేయమనియు, తంత్రీలయ సమన్వితమనియు వాల్మీకిమహర్షి పేర్కొన్నాడు. ఇది కవినోట ఆశువుగా ప్రారంభింపబడుటచేతను, గేయానుకూలమగు అనుష్టుప్పు ఛందస్సులో వ్రాయబడుటచేతను, కుశలవులచే తంత్రీలయ సమన్వితముగా గానము చేయబడుటచేతను, దీని ప్రాథమికరూపము వీరగాథయని నిశ్చయముగా చెప్పవచ్చును.

మహాభారతము కలియుగారంభమున (క్రీ.పూ.3101) రచింపబడినదని భారతీయులు విశ్వసించుచుండగా, క్రీ.పూ. 5-1 శతాబ్దముల నడుమ వెలసినదని పాశ్చాత్యులు తలచుచున్నారు.[11] దీని ప్రాథమికరూపము 'జయము'. వ్యాసుడు జయమను వీరగాథను

10. ''రామాయణ రచనాకాలమును గూర్చి భిన్నాభిప్రాయము లున్నవి. రాముడు త్రేతాయుగమున నివసించినవాడగుట చేతను, వాల్మీకి రాముని జీవితకాలముననే రామాయణమును రచించుట చేతను, అది ద్వాపరయుగారంభమునకు పూర్వమే రచింపబడెనని భారతీయుల అభిప్రాయము. పాశ్చాత్య విమర్శకులకును, తదనుయాయులును అది క్రీ.పూ. 10-5 శతాబ్దుల నడుమ రచింపబడియుండునని తలంచుచున్నారు. రామాయణము ఎప్పుడు రచింపబడెనో ఇదమిత్థమని నిర్ణయించుటకు వీలులేకపోయినను, క్రీ.పూ. 3101 ప్రాంతమున రచింపబడెనని తలంపబడు మహాభారతమున వాల్మీకి ప్రాచీనమహర్షిగ పేర్కొనబడి యుండుట చేతను రామాయణ కథాంశములు అందు కనబడుచుండుట చేతను, అది అంతకు పూర్వమే రచితమై ఉండునని పలువురి అభిప్రాయము''

- విజ్ఞాన సర్వస్వము, సంపుటి-6, పుట 206.

11. ''రామాయణ రచనాకాలము విషయమున వలెనే భారత రచనాకాలము విషయమున కూడ అభిప్రాయ భేదము లున్నవి. కురుక్షేత్ర సంగ్రామము కలియుగారంభమునకు పూర్వము జరిగెను. క్రీ. పూ. 3101 ప్రాంతము కలియుగారంభము. యుద్ధము ముగిసిన కొలది కాలమునకే వ్యాసుడు గ్రంథము రచించెను. అందుచే అది క్రీ.పూ.3100 ప్రాంతమున రచింప బడెనని చెప్పవచ్చును. కాని పాశ్చాత్య విమర్శకులు ఈ కాలమును అంగీకరింపరు. భారతము క్రీ.పూ. 5-1 శతాబ్దుల నడుమ ఎప్పుడో రచింపబడియుండునని వారి అభిప్రాయము.

- విజ్ఞాన సర్వస్వము, సంపుటి-6, పుటలు 206-207

వ్రాయగా, ఆతని శిష్యుడగు వైశంపాయనుడు దానిని పెంపుచేసి భారతముగా జేసెననియు, సూతుడు ఈ భారతమును మఱింత పెంపుచేసి మహాభారతముగా నొనర్చెననియు ననుటలో నభిప్రాయభేదము లేదు. ఈ రామాయణ మహాభారతములలో నలునికథ, హరిశ్చంద్రునికథ మున్నగు పూర్వకథలు చెప్పబడియున్నవి. కావున రామాయణ మహాభారతముల రచనకు పూర్వమే కొన్నికథలు ప్రజలలో ప్రచారమున నుండినవని తెలియుచున్నది.

రామాయణ మహాభారతముల ప్రాథమిక రూపములు వీరగాథలై యుండుననుటకు సంగీతచరిత్రలో నొక ప్రబలదృష్టాంత మగపడుచున్నది. సంగీతశాస్త్రాభివృద్ధికి ప్రధాన బీజారోపణము - స్వరసప్తకముతో గూడిన స్థాయిపరిజ్ఞానము సామవేద కాలములో జరగినది. ఇదియే సంగీతచరిత్రలో ప్రథమయుగము. సామవేదకాలము క్రీ.పూ.2500-1500 నడుమయని చరిత్రకారుల నమ్మకము. ఇట్లు సామవేదమునుండి బయలుదేరిన సంగీతమును గుఱించి 'గాంధర్వవేద' మనెడి ఉపవేదము బయలుదేరినది. సంగీతచరిత్రలో సామవేదకాలము తరువాత వచ్చిన యుగమును 'గాంధర్వ యుగము' లేక 'మార్గ యుగము' అందురు. ఈ మార్గ (గాంధర్వ)పద్ధతి సంగీతమునకు బ్రహ్మకర్తయట. ఇదంతయు శివస్తుతిపరమైన సంగీతము. "ఈ శివసంబంధమైన మార్గ సంగీతానికి కొంచెం ముందుగానే 'ఆఖ్యాన గానం' వ్యవహారంలో ఉండేది. ప్రసిద్ధేతిహాసాలయిన రామాయణ మహాభారతాలను ఆఖ్యానగానానికి ఉపయోగించే వారు. ఇద్దరు గాయకులు వీణను వంతగా బెట్టుకొని ఏడువిధాలైన జాతుల (ఆనాటి రాగాల)లో ఆఖ్యానాలను గానంచేసేవారు"[12] ఈ ఆఖ్యాన గానమును 'గాంధార గ్రామము' అనియు బిలిచెడివారు. ఇట్లు గానము చేసెడిజంటను 'కుశీలవులు' అనెడివారట. ఆదికావ్యమగు రామాయణమును మొదట గానముచేసినవారు కుశలవులుకాన, తరువాత వచ్చిన ఆఖ్యాన గాయకు లందఱకును ఈ పేరు స్థిరపడియుండును. ఈ ఆఖ్యాన గానము భరతుని నాట్యశాస్త్రము వెలయువఱకు (క్రీ.శ. 400 ప్రాంతమువఱకు) ప్రచారమున నున్నది. దీనినిబట్టి సామవేదకాలము నాటికే భారతదేశమున వీరగాథలు, వీరగాథాగానము వ్యాప్తి యందున్నవని తెలియుచున్నది. రామాయణ మహాభారతములు, మొదట వీరగాథలుగా పాడబడుచుండెనను విషయము కూడ దీనివలన స్పష్టమగుచున్నది.

మన దేశమున తంత్రీవాద్యములు, వాయువాద్యములు, తాళవాద్యములు, వేదకాలము నుండియు నుండెడివి. ఈ విషయముకూడ గాథాగాన ప్రాచీనతను నిరూపించుచున్నది.

## 'వీర' శబ్ద ప్రాచీనత

'వీర' శబ్ద ప్రాచీనతమబట్టి కూడ వీరగాథల ప్రాచీనత నూహింపవచ్చును. ఈ శబ్దము అతి ప్రాచీనమైనదిగా గన్పట్టుచున్నది. ఋగ్వేదమున ఇంద్రునకు 'వీర' అను సంబోధనము

*12. శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావు, ఆంధ్ర వాగ్గేయకార చరిత్ర, పుట 21.*

కలదు. శ్రుతులలో అగ్నికి గూడ 'వీరు'డను ప్రశంస గలదు. కొన్నిచోట్ల ఈ వీర శబ్దము పుత్రపరముగా కూడ వ్యాఖ్యానింపబడినది. వీరశబ్దము క్షత్రియవాచియని కొందఱందరు. వీరభార్య అయినను, వీరమాత అయినను కానటువంటి స్త్రీచేతి అన్నమును తినకూడదని మనువు నిషేధించినాడు. మహాభాష్యములో అనేక స్థలములలో వీరశబ్దము ప్రస్తావించబడినది. శాస్త్రములలో గూడ వీరత్వప్రసక్తి కలదు. మంగళాదులు, మంగళ మధ్యములు, మంగళాంతములు అయిన శాస్త్రములు ప్రసిద్ధిచెందుచున్నవనియు, అవి ఆయుష్మత్పురుషకములు, వీరపురుషకములు అగుచున్నవనియు పతంజలి వీరత్వమును సంభావించినాడు. మంత్రశాస్త్రములో ఈ శబ్దము సాధకపరముగా నన్వితమగుచున్నది. యోగ శాస్త్రములో గూడ ఈ వీరశబ్దము స్వీకరింపబడి 'వీరాసనము' అనునొక యాసనము ప్రతిపాదింపబడినది. వీరాసనములలో గూర్చుండి ధ్యానించెడి ఋషులను కాళిదాసుమహాకవి రఘువంశమున వర్ణించినాడు. శృంగార సందర్భములో గోపికలు శ్రీ కృష్ణుని ( ఓ వీరుడా! మా మనస్సులలో మన్మథుని ప్రభవింపజేయుచున్నావు' అనునర్థముతో) వీరశబ్దముతో సంబోధించినట్లు భాగవతమున గలదు. రామాయణమున జనకుడు తన పుత్రికను 'వీరశుల్క' అని ప్రకటించినాడు. వీరమాతృత్వము, వీరపత్నీత్వము మిక్కిలి ఆరాధ్యమైనవిగా ప్రాచీన కాలములో సంభావితమగుచుండెడివి. మహాభారతమున శ్రీకృష్ణుడు కుంతిని వీరజననిగా, వీరభార్యగా అభినందించినాడు. శివోద్భూతుడగు వీరభద్రుని వీరత్వము ప్రసిద్ధము. తదారాధకులు ఇప్పటికిని వీరాంగమును ఉద్బోధకముగా వెలయించుచున్నారు. విష్ణువుయొక్క పది అవతారములలోను నృసింహుడు, శ్రీరాముడు, పరశురాముడు, బలరాముడు యుద్ధ వీరులే![13] కావున వీరారాధనము భారతదేశమునకు నూతనముగాదు. తత్ఫలితముగా వీరగాథలును నూతనములు కాజాలవు.

## ప్రాకృతములు

జైనులు, బౌద్ధులు తమ తమ మతప్రచారములకు తమ కాలమునాటి జానపద భాషా సాహిత్యములకు దగ్గఱగానుండునట్లుగా కావ్యములను వ్రాసిరి. జానపదులలో వ్యాప్తిగాంచి యుండిన వాఙ్మయము ననుకరించుచు జాతకకథలు మున్నగునవి రచించిరి. జైనులు ప్రాకృతభాషలను - అందునను అపభ్రంశమును, బౌద్ధులు పాళీభాషను వాడిరి. జైనమత స్థాపకుడగు మహావీరుడు క్రీ.పూ. 599-527 సంవత్సరముల మధ్య జీవించినవాడు; బౌద్ధమతస్థాపకుడగు బుద్ధుడు క్రీ.పూ. 600-483 సంవత్సరముల మధ్య జీవించినవాడు. అందువలన క్రీస్తు పూర్వమే ప్రాకృత, పాళీ భాషలలో జానపద సాహిత్యము విశేషముగా నుండియుండునని ఊహింపవచ్చును.

13. చూ. అక్కిరాజు ఉమాకాంతంగారి 'వీరచరిత్ర, ద్వితీయ భూమిక', పుటలు 52-55.

ప్రాకృతములలో 'మహారాష్ట్రీ, శౌరసేనీ, మాగధి' - వీనికి గలిగిన ప్రాధాన్యము ఇతర ప్రాకృత భాషా బేధములకు లేదు. కాని జైనులు తమ రచనలవలన 'అర్ధమాగధి' భాషను వ్యాప్తికి తెచ్చిరి. ప్రాకృత భాషలనుండి కాలక్రమమున భిన్నమండలములలో అపభ్రంశ భాష లేర్పడినవి. ప్రాకృతములకు పరిణత రూపములైన ఈ యపభ్రంశముల నన్నిటిని సమష్టిగా 'అపభ్రంశ'మని వ్యవహరింతురు. ఈ అపభ్రంశములలో వీరశృంగారాత్మకములగు రచనలున్నవి. ఇందలి 'చర్చరీ', 'రాస', 'ఫాగు' అనుకావ్య ప్రక్రియలు జానపద సాహిత్యమునకు సన్నిహితముగా నుండును. 'చర్చరీ' యే 'జాజరపాట'. 'రాస'ము వీరగాథ కావచ్చును. (ఇదియే తరువాతి కాలమున హిందీభాషలో 'రాసో' అయినది). ''జంబుస్వామి రాసము, రేవంతిగిరి రాసము, కచూలి రాసము, గౌతమ రాసము'' - మొదలగునవి అపభ్రంశమున గల గాథలు. అపభ్రంశము జానపదులభాష యనవచ్చును. ఇది ప్రధానముగా జానసామాన్యమును దృష్టియందుంచుకొని వ్రాయబడినది. మహారాష్ట్రీ ప్రాకృతమున జైనులు కథాసాహిత్యము నెక్కువగ సృజించిరి.

పాటలీపుత్రమున మాటాడబడిన భాష పాళీ కావచ్చును. 'ఛుల్లవగ్గ'లో బుద్ధునిగాథ లున్నవి. బుద్ధుడు మారునితో పోరి జయించిన గాథ 'మార సంయుత్తము'న గలదు. బౌద్ధ ధర్మమును, భావములను సులభముగా గ్రహించుటకు 'థేర గాథలు, థేరీ గాథలు' ఉన్నవి. 'బుద్ధవంశము'న గౌతమ బుద్ధుని పూర్వజన్మల కథలు 24 ఉన్నవి.

ఏమైనను జైన బౌద్ధములు శాంతరసప్రధానములైన మతములు. వీనిలో ఆవేశము పాలు ఏకొంచెమును లేదు. అందుచే ఈ సాహిత్యములలో వీరగాథలు మృగ్యము. వీని శాంతమున కనుగుణముగా వచనకథలే ఉన్నవి కాని, ఆవేశమున కనుగుణమగు గేయకథలు లేవు. శైవమతము విజృంభించు వఱకును ప్రశస్తమగు వీరగాథలు పుట్టలేదు.

క్రీ.శ. ఒకటవ శతాబ్దమున 'గుణాఢ్యుడు' అనుకవి 'బృహత్కథ'ను రచించెను. ఇది 'పైశాచీ'భాషలో వ్రాయబడినది. పైశాచీభాష ప్రాకృతభేదములలో నొకటి. కాబట్టి పిశాచము లనువారు గుణాఢ్యుని కాలమున అరణ్యవాసులుగా నున్న ఒక జానపదుల గుంపు కావచ్చును. ఈ జానపదులు చెప్పుకొనెడి వచనకథలను, పాడుకొనెడి గేయకథల (Ballads)ను ఆధారముగా జేసికొని గుణాఢ్యుడు 'బృహత్కథ'ను వ్రాసియుండును.

పైశాచీ ప్రాకృతములో వ్రాయబడిన గుణాఢ్యుని 'బృహత్కథ' నేడు లభించుటలేదు. దీని నాధారముగా గొని సంస్కృతభాషలో సోమదేవుడు శ్లోకములలో రచించిన 'కథాసరిత్సాగరము' మాత్రము లభించుచున్నది. (దీనిని వేదంవారు తెలుగు వచనములోనికి అనువదించిరి.)

కాళిదాసుని కాలమునాటికి వత్సరాజగు ఉదయనుని వీరగాథలు పల్లెలలో విశేషవ్యాప్తి నందియున్నవనుటకు ప్రబలనిదర్శన మున్నది. మేఘసందేశ కావ్యములో యక్షుడు మేఘుని

నిర్వింధ్యనుండి ఉజ్జయినీ నగరమునకు బంపుచు, మార్గమధ్యమున చూడదగిన విశేషములలో, వత్సరాజుయొక్క వాసవదత్తాహరణము మొదలయిన అద్భుతకథల తత్త్వము నెఱిగిన వారయిన గ్రామవృద్ధులు గల అవంతీదేశమును పేర్కొనుచున్నాడు:

> ప్రాప్యావన్తీ నుదయన కథా కోవిద గ్రామవృద్ధాన్
> పూర్వోద్దిష్టా మనుసర పురీం శ్రీ విశాలాం విశాలాం...[14]

ఈ గ్రామవృద్ధులు తమ తండ్రితాతలనుండియు అనుశ్రుతముగా వచ్చుచున్న వత్సరాజు సాహస గాథలను, వానకాలమున అరుగులమీదకాని, చలిమంటలయొద్దకాని చేరిన జనసమూహము లకు చెప్పుచుండెడివారని వేదం వేంకటరాయశాస్త్రిగారి వ్యాఖ్యానమువలన తెలియుచున్నది.[15] ఈ సాహసిక గాథలు, వచనకథలు (Folktales)గా నుండెనో, లేక గేయకథలు (Ballads)గా నుండెనో చెప్పలేము కాని, పల్లీయులకు సహజమైన ప్రాకృతభాషలో నున్న కథలని మాత్రము చెప్పవచ్చును. ఈ ఉదయనుని సాహసగాథ గుణాఢ్యుని 'బృహత్కథ'లో గూడ నున్నది. కాబట్టి గుణాఢ్యుడు తన కథలను జానపదులనుండి గ్రహించెననుట విదితము.

సంస్కృతమున గేయకథలున్నవో లేవో నిశ్చయముగా తెలియుటలేదు కాని, వచన కథలున్నవని మాత్రము స్పష్టముగా తెలియుచున్నది. పంచతంత్రము, కాదంబరి, దశకుమార చరిత్ర, భోజరాజుకథలు, విక్రమార్కునికథలు - ఇత్యాదులు సంస్కృతమునగల వచనకథలు. బృహత్కథవలెనే వీనికి మూలములు ప్రాకృతభాషా సాహిత్యములై యుండవచ్చును. ఈ వచనకథలలో కొన్ని జానపదులలో గేయరూపమున గూడ ప్రసిద్ధిగాంచియుండునని ఊహింప వచ్చును. ఏలయన, జానపదులెప్పుడును నృత్య ప్రియులుగను, సంగీతప్రియులుగను ఉందురు.

---

14. *మేఘసందేశః, ప్రథమస్సర్గః, 31వ శ్లోకము.*
*దీనికి వేదం వేంకటరాయ శాస్త్రిగారిచ్చిన తాత్పర్యమిట్లున్నది: ''నిర్వింధ్యను దాటి అవంతీ దేశము ప్రవేశింపుము. వత్సరాజు వాసవదత్తను హరించుట మొదలైన విచిత్ర కథలను ఎఱిఁగిన వృద్ధులు ఆ దేశమందలి గ్రామములలో ఇప్పటికిని ఉన్నారు. నీవు కూడ వానిని వినవచ్చును. పిమ్మట తద్రాజధానియైన విశాలానగరమును దర్శింపుము.''*
- *వేదంవారి టీకతోనున్న మేఘసందేశము, 1927, పుట 66.*

15. *''కథాకోవిద గ్రామవృద్ధాన్ - నిర్వింధ్యనుండి విశాలానగరమునకు పోవు దారిలో గ్రామములలో నీవు వాన గురియుచున్నప్పుడు జనులు అరుగులమీదఁ గాని చలిమంటలయొద్దఁగాని చేరి, 'కోవిద' - చక్కఁగా ఎఱిఁగిన వృద్ధులు కథలు చెప్పుటయు, ఇతరులు వినుటయుఁగా వినోదించుచుందురు. అప్పుడు నీవును విని ఆహ్లాదింపవచ్చును.''*
-*వేదంవారి టీకతోనున్న మేఘసందేశము, 1927, పుట 66.*

వీరు కేవలము లయరహితములైన వచన కథలలో తృప్తినొందరు. ఆట పాటలపై వీరికి మోజు. అందుచే విచిత్ర కల్పనలతో నొప్పు వచన కథలు జానపదులలో గేయరూపమున గూడ నుండియుండును. వచనరూపముననున్న కాశీమజిలీకథలలో చాలభాగము నేడు కృష్ణాగోదావరీ మండలములలో జంగములచే గేయరూపమున పాడబడుచుండుట ఇందులకు నిదర్శనము.

## ఆధునిక ఆర్యభాషలు

ప్రాకృతము మాండలిక భేదముల ననుసరించి ఎనిమిది విధములుగా మారినది. ఈ అష్టవిధ ప్రాకృతములనుండి ఇంచుమించు క్రీ.శ. 11వ శతాబ్ద ప్రాంతమున హిందీ, బెంగాలీ, నేపాలీ, కాశ్మీరీ, పంజాబీ, గుజరాతీ, మరాఠీ, సింహళీ - అను ఆధునిక ఆర్యభాషలు పరిణమించినవి. ఈ భాషలు ప్రాకృత భేద రూపములుగా నున్నప్పుడే వీనిలో గేయసంపద ఉండి యుండును. హిందీ 11వ శతాబ్దమున కావ్యభాషగా రూపొందినను, అంతకు పూర్వము నుండియు బృందావనము (వ్రజ ప్రాంతము), రాజస్థానము, అయోధ్య, పాటలీపుత్రము, కాశీ, ప్రయాగ, మొదలగు ప్రాంతములలో, విశేషముగా గ్రామములలో అనుశ్రుత - అనాదృత సాహిత్యము ప్రజల కంఠములలో వినిపించెడిది. (చూ. బాలశౌరిరెడ్డిగారు రచించిన 'హిందీ జానపద వాఙ్మయము' అను వ్యాసము, కిన్నెర, జనవరి, 1955).

ఎచ్చట వీరజాతులుండునో ఆచ్చట వీరగాథ లధికముగా నుండును. భారతదేశమున రాజపుత్రస్థానము వీరులకు పుట్టినిల్లగుటచే వీరగాథలకును ఇదియే పుట్టినిల్లగుచున్నది. భారతదేశమందలి వీరజాతులన్నియు రాజపుత్రస్థానమునుండి వ్యాపించినట్టివే. క్రీ.పూ. రెండవ శతాబ్దమునాటికే రాజపుత్ర రాజ్యము లున్నవి. రాజపుత్రులనగా ఒక్క భారతదేశములోని క్షత్రియులే కాక, ప్రపంచములోని వీరజాతులన్నియు గలిసిన పిండిత సార సాంద్ర వీరకులముగా నెఱుగవలెను.[16] క్రీ.పూ. 2వ శతాబ్దములో దండెత్తి వచ్చిన బాక్ట్రియన్ గ్రీకులు రాజపుత్ర స్థానములోని చిత్తూరు, ఉదయపూరుల యొద్ద రాజ్యములు స్థాపించుకొనిరి. క్రీ.శ. 2-4 శతాబ్దముల మధ్య శాక్యులు దక్షిణ రాజపుత్ర స్థానమునకు వచ్చిరి. క్రీ.శ. 4-6 శతాబ్దుల మధ్య గుప్తులు, హూణులు, రాజపుత్రస్థానమునకు వచ్చి స్థిరపడిరి. ఈ విదేశీయు లందఱును

---

*16. ''క్షత్రియ వృత్తిని అవలంబించిన యోధవర్గమువారు రాజపుత్ర నామము పొందిరనియు, వారి నాయకులు స్థాపించిన స్వతంత్ర రాజ్యములే రాజపుత్ర రాజ్యములనియు పెక్కుమంది చరిత్ర రచయితల అభిప్రాయము. కులభేదముల వలన ఏర్పడిన దేశీయ క్షత్రియులే కాక, మన దేశముపై దండెత్తి, జయము పొంది, ఇక్కడ రాజ్యములను స్థాపించుకొనిన విదేశ జాతుల వీరులెందరో హిందూధర్మమును అవలంబించి, క్షత్రియ ధర్మము నునుష్ఠించి రాజపుత్రులైరి.''*
*- తెలుగు విజ్ఞాన సర్వస్వము, సంపుటి - 1, పుట 328.*

హిందూధర్మము నవలంబించినవారే! 6వ శతాబ్దమున, హర్షుని మరణానంతరము వీరందఱును స్వతంత్రులై రాజపుత్రులైరి. ఎల్లవేళల వీరిలో వీరు కలహించుచు, ఎన్నియో వీరగాథల పుట్టుకకు కారకులైరి. 'చారణు'లను గాథాకారులు ఈ వీరగాథలను ఆర్యావర్తము నందంతటను వ్యాపింపజేసిరి. హిందీసాహిత్యమునకు శ్రీకారము చుట్టిన 'రాసో' లన్నియును ఈ రాజస్థానీ మాండలీకోద్భవములే!

క్రీ.శ. 11వ శతాబ్దమునాటికి ఈ రాజపుత్రులలో నాలుగు ప్రధానశాఖ లేర్పడినవి: సోలంకులు లేక చాళుక్యులు (994-1240), పారమారులు (950-1200), ప్రతీహారులు (740-1036), చౌహానులు (1180-1193). పారమారులలో ముఖ్యుడు భోజుడు (1018-1060). ఇతనిపై అనేక కథలు వ్యాప్తియందున్నవి. చౌహానులలో పృథ్వీరాజు (1180-1193) అగ్రజుడు. ఈతడు మహావీరుడు. ఈతని సాహసములపై 'పృథ్వీరాజ రాసో' అను అత్యుత్తమ వీరగాథ ఆర్యావర్తమున వ్యాప్తియందున్నది.

పంజాబీ సాహిత్యమున కొన్ని ప్రాచీన వీరగాథలు కానవచ్చుచున్నవి. ఈ వీరగాథలు శాల్బాహనుని కుమారులయిన 'పురాణ, రిసాలూ' లకు సంబంధించినవి. ఈ శాల్బాహనుడు ప్రతిష్ఠానపురము నేలిన శాలివాహనుడనియు, అతడు పంజాబును జయించిన పిమ్మట సయాల్కోట నగరమును స్థాపించెననియు చెప్పుదురు. శాలివాహనుల పరిపాలన క్రీ.పూ. 3వ శతాబ్దము నుండి ప్రారంభమైనది. కాబట్టి ఇవి చాల ప్రాచీనమైన వీరగాథలు కావలెను. ఈ 'పురాణ, రిసాలూ' సోదరుల గాథలు పంజాబునందేకాక, ఉత్తర హిందూస్థానమందంత టను వ్యాప్తియందున్నవి. అట్లే 'హీర్-రాంఝా'ల ప్రణయగాథ కూడ ఉత్తర హిందూస్థాన మందలి జానపద సాహిత్యమున ప్రధానముగా గానవచ్చుచున్నది. జనవ్యవహారమును బట్టి చూడ ఈ కథ మిక్కిలి ప్రాచీనమైనదిగా తోచుచున్నది. అస్సామీ సాహిత్యమున క్రీ.శ. 7వ శతాబ్దము నాటికి చైనీయ వీరుడగు 'చిన్వాంగ్ షిహ్మాన్' వీరకృత్యములను గుఱించిన ఒక గేయము ప్రచారమున నున్నదని హ్యూనిత్సాంగ్ వ్రాసియున్నాడు.

## లక్షణ గ్రంథములు

క్రీ.శ. 400 ప్రాంతమువాడైన భరతుని నాట్యశాస్త్రమున 'ధ్రువాధ్యాయము' ప్రత్యేకముగా నున్నది. ఇందు ఆనాటి ప్రజలలో వ్యవహారమున నున్న 'ధ్రువా గానము' అనబడు గేయరచనల ఫణితులను గుఱించి చెప్పబడినది. ఒకటి రెండు వందల వఱకు ధ్రువా రీతులను భరతుడు సలక్షణముగా వివరించినాడు. ధ్రువా శబ్ద పరిణామమే దరువు. ధ్రువా రీతులలో 'ద్రుత గతి' ఒక భేదము. (ఇది పల్నాటి వీరకథాగానమున నుపయోగింపబడుచుండినట్లు

(క్రీడాభిరామకర్త సాక్ష్యమిచ్చుచున్నాడు). ఇట్లు భరతునికాలమున జానపద కవితలు, ధ్రువా గానములుగా సభాగౌరవస్థాయికి తేబడినవి.

ఇట్లు భరతుడు జనవ్యవహారమున నున్న గేయములను సేకరించి, లక్షణము నేర్పఱుపగా, క్రీ.శ. 6వ శతాబ్దమువాడైన మతంగమహర్షి జనవ్యవహారములోని రాగములను క్రోడీకరించి, తనకు ముందున్న గ్రామ, జాతి పద్ధతులతో సమన్వయపఱిచి, 'బృహద్దేశి' అను సంగీత లక్షణగ్రంథమును రచించెను. ఇందు ''టక్క, భోట్ట, సౌరాష్ట్ర, గుజ్జరి, ఆంధ్రి, మాలవి'' - ఇత్యాది దేశిరాగముల స్వరూపము ప్రపంచింపబడినది. రాగములే కాక, ''కథాఖ్య ప్రబంధము, గద్యప్రబంధము, గాథా, ద్విపదమ్, దండకమ్, వస్తు, క్రౌంచపదమ్, హంసపదమ్'' మొదలగు దేశిప్రబంధములు నలుబది వఱకును బృహద్దేశిలో తెలుపబడినవి.

అభినవగుప్తాచార్యుడు తన అభినవ భారతిలో 'రాగ కావ్యములు' అను ప్రబంధము లను గుఱించి చెప్పినాడు. టక్క రాగములో పాడవలసిన 'రాఘవ విజయము'ను కకుభ రాగములో పాడవలసిన 'మారీచ వధ'ను ఈ రాగ కావ్యములకు దృష్టాంతములుగా పేర్కొనినాడు. ఈ రెండును ఆనాడు వ్యాప్తియందున్న వీరగాథలు కావచ్చును.

ఇట్లు సంగీతచరిత్రలో ఆఖ్యాన యుగము, ధ్రువాగాన యుగము, రాగకావ్య యుగము- అను విభజనము ప్రాచీనకాలమున ప్రజాసామాన్యమున వీరగాథలు వ్యాప్తియందున్న వనుటకు ప్రముఖ నిదర్శనము లగుచున్నవి.

## ప్రాచీన విదేశ సాహిత్యములు

మన సంస్కృతముతో నించుమించు సమానమైన ప్రాచీనత, ఔన్నత్యము కలిగిన సాహిత్యము గ్రీకుసాహిత్యము. మన వేదముల వలెనే ఈ సాహిత్యముకూడ చాలకాలముపాటు మౌఖిక సంప్రదాయముననే నిలిచియున్నది. క్రీ.శ. 5వ శతాబ్దమున కాని ఇది లిఖితము కాలేదు. ఇందు ఐతిహాసిక పౌరాణిక సంప్రదాయముల కలయికతో వీరకావ్యములు బయలుదేరినవి. వానిలో మొదటిది ''ఇలియడ్''. ఇది క్రీ.పూ. 10వ శతాబ్దమున గ్రుడ్డివాడైన హోమర్‌చే రచితమని కొందఱును, రచితము కాదు సంకలితమని మఱికొందఱును భావించుచున్నారు. ఇందు ట్రాయ్‌నగరము ముఖ్యపట్టణముగాగల 'ఇలియం' అను ఆసియాదేశముతో గ్రీకులు పదేండ్లు పోరాడి జయించిన వీరగాథ వర్ణితము. ఈ యుద్ధానంతరము తుపానులకు గుఱియై, దారితప్పి గృహమును వెదకుచు బయలుదేరిన 'యులిసీస్' యొక్కయు, అతని అనుయాయుల యొక్కయు గాథలను హోమర్ ''ఒడిస్సీ'' అను పేర రచించెను. ఈ ఇలియెడ్, ఒడిస్సీ అను వీర కావ్యములను హోమర్ గ్రంథరూపమున లిఖింపలేదు. వీథులవెంట పాడుకొనుచు పోయెను.

ఈ గాథలు ప్రజలలో మౌఖిక సంప్రదాయమున జీవించుచువచ్చినవి. వీనిని తరువాతివారు సేకరించిరి. 'ప్లేటో' వీనిని పరిష్కరించి లిఖిత రూపమున ప్రజలకు అందించినాడు. కావున నివి రెండును ఐతిహాసిక క్రమమున నేర్పడిన కావ్యములనుటలో సందేహము లేదు. ఇవి హోమరుచే రచితములు కాక, సంకలనము చేయబడినవను వాదమొకటి ఉండుట చేతను, ఈ గాథలు అంధ గాయక కవియగు హోమరుచే వీథులలో పాడబడినవని నిశ్చయముగా తెలియుట చేతను, హోమరు తరువాత చాలకాలమునకు గాని ఇవి లిఖితములు గాకపోవుటచేతను, ఈ రెండు కావ్యములును, వీర గాథా వృత్తములని కూడ నిర్ధరింపవచ్చును.

మన వేదములలోవలెనే గ్రీకుల గేయములలో గానగుణము ప్రధానము. సరళము. సుగమము నైన భాషలో, సహజ శబ్దయోజనతో, సామాన్యమానవుల హర్షవిషాదములను, సంయోగ వియోగములను, రాగ క్రోధములను చిత్రించిన ఈ గేయములు నేటికిని సజీవములు గనే కన్పించుచున్నవి. క్రీ.పూ. 6వ శతాబ్దమున విజయసంబంధమగు సన్నివేశములలో పాడబడు 'కోరస్' అను బృందగీతములు బయలుదేరినవి. ఒలింపిక్ నగరమున జరగెడి పోటీలలో పిండార్ రచించిన 'ఓడ్స్' అను వీరగీతములు పాడబడెడివి.

లాటిన్ సాహిత్యము క్రీ.పూ.239-169 సంవత్సరములలో నున్న 'క్వింతున్ ఎన్నియుస్' అను కవితో ప్రారంభమైనది. ఇతడు 19 సర్గలలో 600 పద్యములతో నొక వీర కావ్యమును రచించెను. దీనికి ప్రాచీన వీరగాథలే ఆధారములై యుండును. ఇదియును ఐతిహాసిక క్రమమున నేర్పడిన కావ్యమే కావచ్చును.

ఆంగ్లోశాక్షను భాషలో అతి ప్రాచీనకాలము నుండియు మౌఖిక సంప్రదాయమున ఎన్నియో వీరగాథలు వ్యాపించియున్నవి. ఇవి అన్నియు క్రీ.శ. 8వ శతాబ్దమున ఒక అజ్ఞాతకవిచే ''బేవుల్ఫ్'' (Beowulf) అను పేర సంకలనము చేయబడినవి.

జర్మను భాషలో గూడ మన వేదములవంటి అలిఖిత ప్రాచీన సాహిత్యమున్నది. దీనిని ''ఎడ్డా'' అని పిలుతురు. అనాదికాలములో నివసించిన జర్మనుజాతి జీవితమును ఇది యెంతయో చక్కగా చిత్రించుచున్నది. వేదములలోవలె ఇందును ఎన్నియో స్తుతులున్నవి. వానిలో కొన్ని దేవతాస్తుతులు. మఱికొన్ని ఆనాటి జర్మను వీరుల కీర్తిపరంపరలను స్తుతించుచు వివరించెడి పాటలు.[17]

హిబ్రూ సాహిత్యము కూడ అతి ప్రాచీనకాలము నుండియు మౌఖిక సంప్రదాయము ననే జీవించుచు వచ్చినది. అందుచే దీనిలో చాలభాగము నష్టమయినది. ఇందలి 'సృష్టి

---

*17. చూ. డ్క్టర్ వి. యన్. శర్మగారి వ్యాసము 'జర్మను సాహిత్యంలోని కొన్ని ఘట్టాలు',*
*- కిన్నెర, జనవరి 1955, పుట 139.*

జ్ఞానఫలము, సోదరుని చంపిన కెయిన్, నోవా, బేబెల్ గోపురము' - మొదలగు గాథలు, ప్రాచీన కాలపు జానపద సాహిత్యమనకు సంబంధించి యుండునని విమర్శకులు ఊహించుచున్నారు.

ప్రపంచమున నేటి సజీవభాషలలో అత్యంతప్రాచీనమగు సాహిత్యము కలది చైనీయ భాష. ఇందు క్రీ.పూ. 1523 నుండి సాహిత్యమున్నది. ఏ సాహిత్యమైనను పాటలతోనే ప్రారంభమగునను సిద్ధాంతము ననుసరించి, చైనీయ భాషలో క్రీ.పూ. వందలకొలది సంవత్సరముల నుండియు గేయములు ఉండి యుండవచ్చును.

క్రీ.శ. 6వ శతాబ్దమున మహమ్మదుప్రవక్త మరణించిన తరువాత, ఖలీఫా అధికారమునకై ప్రవక్త దౌహిత్రులగు 'హసన్-హుసేను' లకును, ప్రవక్త జామాతయగు 'యజీద్' అనువానికిని ఇరాక్ దేశములోని 'కర్బ్లా' రణరంగమున గొప్ప యుద్ధము జరిగెను. ఆ యుద్ధములో హసన్ హుసేనులు మరణించిరి. వారిని తలుచుకొని దుఃఖించు గీతములే మొహరము గీతములు. ఈ గీతములను 'షహదత్ నామా' అందురు. మరణించిన వీరునిపై ఇట్లు కరుణరస పూరితముగా పాడబడు గీతములను ఆంగ్లమున **'Coronaches, or Ballads of lamenting'** అందురు. ఇవి వీరగాథలలో నొక వర్గము. కావున 'షహదత్ నామా' వీరగాథలనుట నిశ్చయము. ప్రపంచమున నేడు లభించుచున్న వీరగాథలలో నివియే ప్రాచీనమైనవిగా తోచుచున్నది.

## ద్రావిడ భాషలు

భారతదేశమున గల జీవద్భాషలలో తమిళము ప్రాచీనతమమైనది. ఇందలి 'సంగమ్ యుగము' క్రీ.పూ. వేలకొలది సంవత్సరముల నాటిదని తలపబడుచున్నది. ఈ సంగపు కృతులలో ''ఎట్టుత్తొగై'' లో కొందఱు వీరయోధులను గుఱించి వర్ణింపబడినది. బృహత్పురాణములలో మొదటిదగు ''జీవక చింతామణి'' లో ఉత్తరభారత (ఆర్యావర్త) రాజకుమారుడగు 'జీవకు' ని వీరవిహారములు వర్ణింపబడినవి. కాని ఈ జీవక చింతామణి నేడు ఇతిహాసముగనే ప్రచారమున నున్నది. 'కణ్ణకి' అను వీరవనిత గాథతో ''సిలప్పదికారమ్'' రచింపబడినది. ఇది నేటికిని జానపదులలో పాడబడుచునేయున్నది. క్రీ.శ. 4-5 శతాబ్దముల నాటికి తమిళదేశమున శైవమతము విశేషముగ వ్యాపించినది. ఈ మతమున అనేకులు భక్తి వీరమును ప్రదర్శించిరి. వీరి కథలు ఆనాటి ప్రజలలో ఆ బాలగోపాలము కీర్తింపబడుచుండినవి. అట్టివారిలో అఱువది ముగ్గురు భక్తుల గాథలు ''అరువత్తు మూవరు నాయన్మార్లు'' అను పేర అశేషఖ్యాతి నార్జించినవి. ప్రాచీన శాసనములలో ఈ వీరభక్తుల పేర్లున్నవి. 'పెరియ పురాణము' అను గ్రంథములో ఈ భక్తుల కథలున్నవి. క్రీ.శ. 7వ శతాబ్దమునాటి సిరియాలునికథ ఒక్క తమిళముననే కాక, కర్ణాటాంధ్రములందును మిక్కిలి ప్రచారమందినది.

భారతీయ సాహిత్యములలో సంస్కృత తమిళముల తరువాత ప్రాచీనతరమైనది కన్నడ సాహిత్యము. దీని ప్రథమదశ వీరపురుషులను కీర్తించు శాసములతో ప్రారంభమగుచున్నది. ఈ శాసనములలోకెల్ల ప్రాచీనతమమైనది క్రీ.శ. 450వ సంవత్సరమునకు చెందిన 'హల్మిడి శాసనము'.

## తెలుగు

తెలుగున లిఖితసాహిత్యము, కావ్యభాష క్రీ.శ. 11వ శతాబ్దమున నన్నయభట్టు (1022-1063)తో ప్రారంభమైనదని పలువుర మతము. ప్రాఙ్నన్నయ యుగమున అలిఖితమగు దేశిసాహిత్యము ఉండియుండునని వీరి భావన. మరికొందఱు విమర్శకులు ప్రాఙ్నన్నయ యుగమున మౌఖిక సాహిత్యమేకాక గ్రంథస్థ సాహిత్యమును గలదని తలంచుచున్నారు. నన్నయకు పూర్వముగల శాసనములలో పండరంగని అద్దంకి శాసనము (క్రీ.శ. 848)నను, యుద్ధమల్లుని బెజవాడ శాసనము (క్రీ.శ. 934) నను పద్యములు కన్పించుచున్నవి. 'ప్రబంధ రత్నావళి', 'సకలనీతి సమ్మతము' అను సంకలన గ్రంథములలో నుదాహరింపబడిన ''పద్మకవి, గణాంకుశకవి, క్షేమేంద్రకవి, భోజరాజు'' - మున్నగువారు ప్రాఙ్నన్నయయుగపు కవులుగా తెలియవచ్చుచున్నారు.

11వ శతాబ్దమునాటి 'యాప్పిరంగలమ్' అను తమిళ ఛందో గ్రంథమున 'వాంచియార్' అను తెలుగు లక్షణకర్త పేర్కొనబడినాడు. ఇతడు తెలుగున ఛందోగ్రంథము వ్రాసినట్లు చెప్పబడినది. ఈ వాంచియార్ నన్నయకు పూర్వుడు కావచ్చును. సంస్కృతమున యతి కేవలము విశ్రమస్థానము మాత్రమే; అక్షరసామ్యము లేదు. ప్రాసనియమము, మాత్రాగణములు సంస్కృతమున లేవు. కాగా, పాల్కురికి సోమనాథుడు యతిప్రాసలను గూర్చియు, మాత్రాగణములను గూర్చియు తెల్పు ప్రాచీన ఛందస్సూత్రములను పేర్కొనినాడు.[18] సంస్కృతమున లేని యతిప్రాసల నియమములు, మాత్రాగణ ఛందస్సులు తమిళ కర్ణాట సోదర ద్రావిడభాషలలో అతి ప్రాచీనకాలము నుండియు గన్పట్టుచున్నవి. దీనినిబట్టి తెలుగున యతిప్రాసలు, మాత్రాగణచ్ఛందస్సు ప్రాచీనకాలము నుండియు గలవనియు, ఈ ఛందస్సును బట్టి వెలసిన కావ్యములును ఉండియుండుననియు తలంపవచ్చును. నన్నయకు పూర్వమే యతిప్రాసలు పద్యరచన కలవనుటకు తెలుగులో 'ము విభక్తిక యతి' కూడ ప్రమాణమని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు నిరూపించి యున్నారు.[19]

---

*18.* చూ. పండితారాధ్య చరిత్ర, కృత్యవతరణిక.

*19.* చూ. సింహావలోకనము, పుట 5.

ఇట్లు నన్నయకు పూర్వము కావ్యకవితయే కలదని నిశ్చయముగా తెలియుచుండ, జానపదకవిత ఉన్నదా లేదా అను సంశయమునకు తావులేదు. కవిత్వోత్పత్తిని బట్టియు, సాహిత్య పరిణామమును బట్టియు, సోదరభాషలను బట్టియు, శాసనములను బట్టియు, నన్నయకు మిక్కిలి సమీపస్థులైన నన్నెచోడ, పాల్కురికి సోమనాథుల కావ్యములలోని గేయప్రసక్తిని బట్టియు ప్రాఙ్నన్నయ యుగమున జానపద గేయములు, వీరగాథలు కోకొల్లలుగా నుండి యుండునని తెలియుచున్నది. నన్నయకుముందు పాటలు, పదములు, కొన్ని తెలుగుల పద్యములు మొదలగు పాండిత్య నిరపేక్షములగు రచనములును, వానిని బంధించు ఛందో వ్యాకరణ విధులును కొన్ని కలవనుట నిశ్చయమని వేటూరివారు సెలవిచ్చినారు.[20]

ప్రాఙ్నన్నయ యుగముపై సమగ్ర పరిశోధన చేసిన ఆచార్య దివాకర్ల వేంకటావధాని గారు, నన్నయకు పూర్వము తెలుగులో 'శాసనకవిత, పద గేయ రూపమైన దేశికవిత, మార్గపద్ధతికి చెందిన కావ్య కవిత' - అను మూడు తెలుగుల కవిత్వము కలదని సప్రమాణముగా నిరూపించియున్నారు.[21] కవితాప్రాదుర్భావమును బట్టి ఊహించినప్పుడు, ప్రాఙ్నన్నయ యుగమున పాటలు (songs), పదములు(ballads) తప్పక ఉండి తీరవలెనని తేలును. ''అసలు సంతోష విషాదాది భావములు ముమ్మరముగాఁ గలుగునపుడు మానవుల నోట లయాన్వితమైన భాషయే వెలువడునని విమర్శకులు చెప్పుదురు. వ్యాధుఁడు క్రౌంచ మిథునమునం దొక దానిని వధింపఁగాఁ జూచి శోకోద్రిక్తుఁడైన వాల్మీకి నోట నప్రయత్న పూర్వకముగా ఛందోమయమైన వాక్కు వెలువడుట యందఱెఱిఁగినట్టిదే. అట్లే నన్నయకుఁ బూర్వముండిన యాంధ్రులుకూడ సంతోషమో విషాదమో యతిశయముగాఁ గల్గినప్పుడు పాటరూపముననో, పదరూపముననో వెలువరించియుందు రనుటలో విప్రతిపత్తి యుండదు.''[22]

ప్రముఖ విమర్శకులు డాక్టర్ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు దేశిసారస్వత విభూతిని ప్రశంసించుచు ''ఏ వాఙ్మయములోనైనా ముందు పాటలూ, తర్వాత పద్యాలూ; ఆ పిమ్మటనే వచనమూ ఆవిర్భవిస్తాయి; కాబట్టి నన్నయగారికి ముందు చాలాకాలమునుంచీ పాటలు ఉండి యుండాలి'' అని నొక్కివక్కాణించు చున్నారు.[23]

---

20. అదే., పుట 2.
21. చూ. ప్రాఙ్నన్నయ యుగము, 'పూర్వ చాళుక్య యుగమువందలి ఆంధ్రవాఙ్మయ స్వరూపము' అను ప్రకరణము.
22. చూ. ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు, ప్రాఙ్నన్నయ యుగము, పుట 116.
23. చూ. కిన్నెర, జనవరి 1955, పుట 92.

సాహిత్య పరిణామ చరిత్రను పరిశీలించినను, నన్నయకుముందు పాటలు, పాటల కథలు వ్యాప్తియందున్నవనుట ధ్రువపడును. ''నిజమునకు ఒక దేశమున సర్వలక్షణ సంపన్నమై, పరిపుష్టమైన వాఙ్మయము బయలుదేరుటకు ఎంతోకాలము ముందుగానే పదవాఙ్మయము బయలుదేరును. నేటికిని లిపికూడ లేని భాషలెన్నో యున్నవి. కాని, ఆ భాషలు మాటాడువారికి పదవాఙ్మయయము లేదనలేము. కాబట్టి నన్నయకు పూర్వము పదవాఙ్మయము చాల నుండవచ్చును.''[24] కాని దానికి పండితాదరము లేకపోవుటచే గ్రంథరూపమున మనకందలేదు.

నన్నయకు పూర్వము కవులు తరువోజలు, మధ్యాక్కరలు, రగడలు రచించు చుండెడివారనియు, సీసపద్యమునకు ముడి ఛందస్సు అనిపించెడి ఛందస్సులో పాటలుండెడి వనియు, ముఖలింగములోని 'సుకవీంద్ర స్తుత్య నిత్యోదయః' అను శాసనఖండమును బట్టి నాటి కవులు దేవాలయములలో స్తుతులు చేయుచుండెడివారనియు శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు అభిప్రాయపడుచున్నారు.[25]

తమిళ కర్ణాటాది సోదర ద్రావిడభాషల సాహిత్యచరిత్రలను పరిశీలించినప్పుడు కూడ, తెలుగులో నన్నయకు ముందు నుండియు జానపదరచన లున్నవని తెలియును. సాహితీ తపస్వులగు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ఇట్టి తులనాత్మక పరిశీలనము చేసి, తెలుగులో పాటలు, పదములు ప్రాథమిక రచనలని నిరూపించియున్నారు. ('పాట, పదము, గేయము, గీతము' అను నాల్గు శబ్దములకును 'సాంగ్' అని ఒకటే అర్థమైనను, మన తెలుగు విమర్శకులలో కొందఱు 'పాటలు, పదములు' అని రెండు శబ్దముల నొకే చోట ప్రయోగించుటను బట్టి, 'పాటలు' అనగా సాంగ్స్ అనియు, 'పదములు' అనగా 'బ్యాలెడ్స్' అనియు గ్రహింపవలసి యున్నది). ''ప్రాచీనతమమయిన యరవకవితలోఁ బద్యచరణమునకు 'అడి' అని పేరు. అడి యనఁగా 'అడుగు' - పాదము, చరణము. అరవమున పద్యమునకు 'పాట్టు' అని పేరు. ద్రవిడమున నతి ప్రాచీన మనఁబడు శిలప్పదికారము వృత్తములతోఁగాక యిట్టి పాట్టులతోనే యున్నది. నేఁడు మన తెనుఁగున గానవచ్చు లంకాయాగము, కుచ్చెలకథ, ఏలలు, ధవళములు, గొబ్బిపదములు మొదలగు పదములవలె నవి కొంచెముగా సంగీతవాసనతోఁ జదువఁదగినవై యుండును. అవి మాత్రాగణ ఘటితములు కాబట్టి హ్రస్వ దీర్ఘాక్షర ప్రస్తారపుఁబొందికతో, గానానుకూలముగా నుండును. మన లంకాయాగము, కుచ్చెలకథ మొదలగు పదరచనలవలె నవి వందలకొలది 'అడిగళ్' - చరణములుగలవై పాడుగువాఱియుండును. ఆ విధముగాఁదొలుత కర్ణాటాంధ్రములలోఁ గూడ 'పాటలు, పదాలు' ప్రాథమిక రచనలయి యుండును.''[26]

---

24. *శ్రీ చాగంటి గోపాలకృష్ణమూర్తి, తెలుగు విజ్ఞాన సర్వస్వము, 3వ సంపుటము, పుట 579.*

25. *చూ. కిన్నెర, డిసెంబరు 1953, పుట 553.*

26. *సింహావలోకనము, పుటలు 32-33.*

ప్రాఙ్నన్నయ యుగమున చందోబద్ధములగు శాసనములు కొన్ని లభించుచున్నవి. వీనిలో క్రీ.శ. 848 నాటి పండరంగని అద్దంకిశాసనము మొదటిది. ఇందు తరువోజ పద్యమున్నది. దీనిని బట్టి నన్నయకు పూర్వముగల ఛందస్సులలో తరువోజ ప్రాచీనమైనదిగా తలపవచ్చును. కాని పద్యముల క్రమపరిణామమును బట్టి పరిశీలించినచో సీసపద్యముకన్న తరువోజయు, ఈ తరువోజకన్న ద్విపదయు, ఈ ద్విపదకన్న మంజరీద్విపదయు ప్రాచీనములని తెలియుచున్నది.[27] ఈ మంజరీద్విపదకు మాతృక యనదగు గేయరచన యొకటి అతి ప్రాచీనకాలము నుండియు గన్పట్టుచున్నది. ''కిటతకిట - కిటతకిట - కిటతకిట - కిటతకిట'' అను రీతిలో ఐదుమాత్రల ఆవృత్తులు నాలుగు గల పంక్తి ఈ మంజరీద్విపదకు మాతృకగా నూహింపవచ్చును. దీనిని సంగీతశాస్త్రమున 'ఖండగతి' అందురు; ఛందశ్శాస్త్రమున 'ద్విరదగతి రగడ' అందురు. తెలుగున లభించుచున్న అతిప్రాచీన శాసములలో నొకటియగు మాలెపాడు శిలాశాసనము (క్రీ.శ. 615నాటిది) లో ద్విరగతి రగడ (ఖండగతి) గర్భితమై యున్నట్లు కనబడుచున్నది.[28] కాబట్టి 5 మాత్రల ఆవృత్తులు నాలుగొక పాదముగా సాగు 'ఖండగతి'లేక 'ద్విరదగతి రగడ' నుండి మంజరీద్విపద, ద్విపద, తరువోజ,

---

27. *ఉపలబ్ధములగు తెలుగు ఛందస్సులలో తరువోజ ప్రాచీనమైనదిగా గన్పట్టుచున్నను, ఈ తరువోజకన్న ద్విపదయే ప్రాచీనమైనదని తెలుగు ఛందోవికాస కర్తయగు శ్రీ సంపత్కుమార్ నిరూపించుచున్నారు. ''...పద్యము లేర్పడు సంప్రదాయమును బట్టి చూచినచో, చిన్న చిన్న పాదములుగల పద్యములే మొదటివనియు, పెద్ద పెద్ద పాదములుగల పద్యములు తరువాత ఏర్పడినవనియు చెప్పవచ్చును... పరిశీలించి చూచినచో తరువోజ కన్నను ప్రాచీనమైనది ద్విపదయని చెప్పుటకు వీలు కలుగుచున్నది. ద్విపదయందు రెండు పాదములుండుటయు, అవియు నాల్గు గణములు మాత్రమే గల చిన్న పాదములగుటయు, ఇట్టి ద్విపదలు వరుసగా ఎన్నైనను వ్రాయుటకు వీలగుటయు, దీనికి గానయోగ్యత యుండుటయు కూడ దీనియొక్క ప్రాచీనతను సమర్థించుచున్నది. దానియొక్క రెట్టింపు వలన ఏర్పడిన తరువోజయు గేయరూపమే యగుచున్నది... సీస పద్యముగూడ ద్విపదయొక్క పరిణామ రూపమేయని చెప్పవచ్చును. ద్విపద తరువోజగా పరిణమించిన తరువాత సీసపద్యముగా అది పరిణమించినదని తోచుచున్నది.* - *తెలుగు ఛందోవికాసము, పుటలు 31-34*

    *ఇట్టి ప్రాచీనతమమగు ద్విపదకు మంజరీ ద్విపదయే మాతృకయని శ్రీ సంపత్కుమార్ సూచించినారు. ''ఒక విధముగా చూచినచో మంజరీ ద్విపదయే ద్విపదయొక్క మొదటి స్వరూపమని చెప్పవచ్చును. రెండు పాదములకు పద్యములందువలె ప్రాస నియతముగా నుండుట యన్నది గేయలక్షణము కాదు. గేయ విషయమున ప్రాసాదులన్నియు నైచ్ఛికములే, లయానుసారియైన మాత్రా సంఖ్య మాత్రమే నియతమనవచ్చును.*

    *- తెలుగు ఛందోవికాసము, పుట 102.*

28. *చూ. దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారి వ్యాసము ''తొలి తెలుగుశాసనం - దేశికవిత'', పరిశోధన, 1వ సంచిక.*

సీసము అను ఛందస్సులు క్రమక్రమముగా పరిణమించియుండు ననుటకు ఈ శాసన నిదర్శనము తోడ్పడుచున్నది. ప్రాచీనాంధ్ర వీరగాథ లెక్కువగా ఈ ఖండగతిలోనే కానవచ్చు చున్నవి. ఈ ఖండగతిరచన ప్రాఙ్నన్నయయుగపు మాలెపాడు శిలాశాసనములో గనబడుచున్నది కావున, వీరగాథలు నన్నయకు పూర్వము నుండియు గలవని తలపవచ్చును.

నన్నయకు మిక్కిలి సమీపస్థుడగు నన్నెచోడమహాకవి తన కుమారసంభవ కావ్యమున తెలుగు సాహిత్యమున ప్రప్రథమముగా మార్గ-దేశి కవితల ప్రసక్తి తీసికొని వచ్చుటయేకాక, ఆయా సందర్భములను పురస్కరించుకొని ''అంకమాలికలు, ఊయలపాటలు, ఆలతులు, గౌడుగీతములు, రోకటిపాటలు, ఎఱుకులపాటలు'' పేర్కొన్నాడు. క్రీ.శ. 12వ శతాబ్ది ఉత్తరార్ధమునకు జెందిన పాల్కురికి సోమనాథమహాకవి తన బసవపురాణ పండితారాధ్య చరిత్రలలో జానపదుల గేయములను, గేయకథలను, నాటకములను, నృత్యములను, వేడుకలను, వినోదములను కొల్లలు కొల్లలుగా ప్రసక్తికి తెచ్చినాడు. ఈ యిరువురు కవుల గేయ ప్రసక్తులను బట్టి ప్రాఙ్నన్నయ యుగము దేశికవితలో ఎంత సుసంపన్నమైనదో తేటతెల్లమగు చున్నది.

ఒక జాతి యేర్పడి నప్పటి నుండియు, దాని భాషకు లిపియున్నను లేకపోయినను, పాటలు, కథలు, పాటలకథలు నిశ్చయముగా నుండును. కోయ, చెంచు, సవర - ఇత్యాదిజాతుల భాషలకు నేటికిని లిపి లేదు. అయినను వానిలో పాటలకు పదములకు కొదువ లేదు. కాబట్టి ఆంధ్రజాతి యేర్పడిన నాటి నుండియు పాటలతో, పదములతో జానపద కవిత్వము పుష్కలముగా నుండియుండును. ఈ ఆంధ్రజాతిభాషకు సుస్థిరరూపము 6,7 శతాబ్దము లలో గలిగినట్లు శాసనములను బట్టి తెలియుచున్నది. కావున ఆ కాలమునాటికి జానపద కవిత్వమున కొంతభాగము దేశికవిత్వముగా మాఱియుండును. శాసనములలోని ఛందస్సులు, ద్విపదలు, తరువోజలు, రగడలు ఇట్టి పరిణామమును సూచించుచున్నవి. క్రమక్రమముగా జాతి నాగరకతాభివృద్ధిని గాంచగా, పండిత - పామరభేదము పెరిగిపోయి, ఈ దేశికవిత్వమే పండిత కవిత్వముగా పరిణమించి, ప్రత్యేకముగా నావిర్భవించును. తెలుగున నిట్టి శిష్టకావ్య కవిత్వము క్రీ.శ. 11వ శతాబ్దమున నన్నయతో ప్రారంభమైనది.

లిపి ఉన్న భాషనే మన పూర్వులు 'భాష'గా పరిగణించిరి. కాని భాషా పరిగణనకు లిపి ప్రధానము కాదనియు, ఒక జాతి వ్యవహారమున నున్నదే భాష యనియు నేటి భాషాశాస్త్రవేత్తల మతము. జాతి యేర్పడుటతోనే భాషయు నేర్పడును. భాషయేర్పడుటతోనే జానపద కవిత్వ మేర్పడును. ఇట్లు భాషయు, జానపద కవిత్వమును ఏర్పడిన కొంతకాలమునకుగాని లిపి యేర్పడదు. లిపి యేర్పడిన తరువాత జానపదకవితలో కొంతభాగము దేశికవితగా పరిణతి చెందును. ఈ దేశికవిత నుండియే మఱికొంత కాలమునకు ఇతిహాసములతోడి మార్గకవిత పరిణమించును. ఇది జాతి నాగరకతాభివృద్ధి ననుసరించి జరుగునది. జాతియంతయు

నొకేమాఱు నాగరకము కాలేదు కావున నేటి నాగరక సంఘములందు సహితము జానపద కవిత్వము కొన్ని నిమ్న కులములలో తలదాచుకొనియున్నది. జాతియంతయు నాగరకమగు నాటికి ఈ జానపద కవిత్వము నిరాశ్రయమై మటుమాయము కావచ్చును!

ఈ ప్రకరణమందలి ముఖ్యాంశములివి:

''గిరిగహ్వరవాసియగు ప్రాక్తనమానవుని లయాత్మక భాషణమునుండి కాని, నృత్తగీతమునుండి కాని కవిత్వము పుట్టియుండును. దీని ప్రాథమిక రూపము శుద్ధగేయము. దీనితో కథాకథనము కలిసి వీరగాథ యేర్పడియుండును. ఈ గేయములు, కథాగేయములు, పద్యకవిత్వముకన్న ప్రాచీనములనుటలో సందేహము లేదు. గేయముల ఛందస్సులో పద్యముల ఛందస్సుకన్న నియమములు తక్కువగ నుండుట కూడ, గేయముల ప్రాచీనతకు పోషకమగు చున్నది. క్రీ.పూ. 3000 సంవత్సరములనాడు ఆర్యులు మన దేశమునకు వచ్చుట ప్రారంభించిరి. అప్పటికి మన దేశమునన్ను నల్లజాతులతో - ముఖ్యముగా ద్రావిడులతో ఆర్యులు యుద్ధములు చేసిరి. ఈ ఆర్యద్రావిడ సంఘర్షణలో అనేక వీరగాథలు పుట్టియుండును. అట్టి వానిలో రామాయణమొకటి. ఆర్యుల అంతఃకలహములలో (రాజవర్గములోని అంతః కలహము) మహాభారతము, వర్గకలహములలో (పురోహితవర్గము - రాజవర్గముల కలహము) హరిశ్చంద్రునికథ పుట్టినవని చెప్పవచ్చును. క్రీ.పూ. 5000-4000 సంవత్సరములకు చెందిన వేదములలో వీరగాథా బీజములున్నవి. ఈ వేదములు ప్రాచీనార్యుల జానపద వాఙ్మయమని విమర్శకుల తలంపు. ఇందలి ఉపాఖ్యానములు వీరగాథలే! త్రేతాయుగమున రచింపబడిన రామాయణము, క్రీ.పూ. 3100 ప్రాంతమున రచింపబడిన మహాభారతము - ఈ రెండును ప్రాచీన వీరగాథలనుండి ఐతిహాసిక క్రమమున నేర్పడి యుండును. 'వీర' శబ్ద ప్రాచీనతను బట్టికూడ వీరగాథలు ప్రాచీనములని తలంపవచ్చును. వివిధ ప్రాకృతములలో వీరగాథ లుండి యుండును. అపభ్రంశములోని 'రాసములు' వీరగాథలు కావచ్చును. క్రీ.శ. 1వ శతాబ్దమునాటి గుణాఢ్యుని 'బృహత్కథ', 'పిశాచము' లనబడు జానపదుల ముఖస్థ సాహిత్యము నుండి నిర్మింపబడి యుండును. ఈ పిశాచములు ఆదిమ ద్రావిడులని అనుమానింప వీలున్నది. కాళిదాసుకాలమున వత్సరాజగు ఉదయనుని సాహస గాథలు పల్లెలలో ప్రచారమున నున్నవి. క్రీ.పూ. 2వ శతాబ్దము నుండియు రాజస్థాన్‌లో వీరగాథలున్నవని తలపవచ్చును. గ్రీకు, లాటిన్, ఆంగ్లోశాక్సన్, జర్మన్, హీబ్రూ, చైనీస్ - మున్నగు ప్రాచీన విదేశ సాహిత్యములందు కూడ వీరగాథ లున్నవనుటకు సాక్ష్యములున్నవి. భారతదేశమున తమిళము, కన్నడము, పంజాబీ, అస్సామీ భాషలలో ప్రాచీన వీరగాథలున్నవని తెలియుచున్నది. సంగీత నాట్య శాస్త్ర గ్రంథములలోని దేశి రాగముల, గేయముల ప్రసక్తిని బట్టి కూడ వీరగాథల ప్రాచీనత తెలియనగును. తెలుగులో ప్రాఙ్నన్నయ యుగమున గేయములు, వీరగాథలు కలవనుటకు ప్రబలమగు తార్కాణము లున్నవి.

నాలుగవ ప్రకరణము

# వీరగాథల ఉత్పత్తి కర్తృత్వములు

శూరుల జన్మము, సురల జన్మము, ఏరుల జన్మముల వలెనే వీరగాథల జన్మము కూడ ఎఱుగ శక్యము గాకున్నది. వీరగాథల ఉత్పత్తి కర్తృత్వములను నిరూపించు ప్రత్యక్ష సాక్ష్యములు పూజ్యము; ఫలితముగా విమర్శకులలో ఏకవాక్యతయు శూన్యమే. ఉత్పత్తి కర్తృత్వములను గూర్చిన ఈ అయోమయ పరిస్థితిని వివరించుచు ఒక పాశ్చాత్య విమర్శకు డిట్లు వాపోయినాడు:

In regard to its genesis, its development and the character of its authorship, we are met, at the outset, with the difficulty of a lack of direct evidence. There is no record as to how this species of verse originated or as to how it found its way into different countries. Here we have nothing to guide us but vague incidental statements and inferences founded on a variety of considerations which are still, more or less, subjects of dispute.[1]

వీరగాథలను సేకరించిన ప్రాచీన విమర్శకులు, అవి సేకరింపబడిన తారీఖులను గుర్తించినారు కాని వాని యుత్పత్తినిగూర్చి పట్టించుకొనలేదు. వీరగాథల యుత్పత్తి కర్తృత్వములు దుర్జ్ఞేయమగుట కిదియొక కారణము కావచ్చును. వీరగాథల మౌఖికప్రసరణము (oral transmission ) కూడ వీని యుత్పత్తి తెలియరామికి మఱియొక కారణము. చారిత్రక సంఘటనలు సహితము ఈ మౌఖిక ప్రసరణమున అనేకములగు మార్పులకు లోనై కల్పితగాథల వలె కన్పట్టుచున్నవి.

వీరగాథల ఉత్పత్తినిగూర్చి పాశ్చాత్య విమర్శకులలో అనేక సిద్ధాంతములు, వానికి పూర్వపక్షములు బయలుదేరినవి. వీరగాథలు అత్యంత ప్రాచీనములని కొందఱు తలంపగా, అట్టి ప్రాచీనగాథలేవియు లభ్యమగుటలేదని మఱికొందఱు తిరస్కరించిరి. ప్రాచీన వచనకథ (tale) వలెనే వీరగాథయు జానపదుల వినోదకల్పనమనియు, జానపదుల ఆశుకవితాసృష్టి యనియు కొందఱు భావింపగా, ఇది మూఢసిద్ధాంతమని ప్రత్యర్థులు కొట్టివేసిరి. ఆదిమ మానవుని లయాత్మక భాషణమునుండి వీరగాథ పుట్టినదని కొందఱు సిద్ధాంతము చేసిరి. కాని లయాత్మక భాషణములో వర్ణన యుండునే కాని కథాకథన ముండదనుట పూర్వపక్షము. ప్రాక్తనమానవుని నృత్తగీతమునుండి వీరగాథ పరిణమించెనని మఱియొక సిద్ధాంతము. ఇట్టి నృత్తగీతమునుండి శుద్ధగేయ ముద్భవించును గాని కథాగేయము పుట్టదని పూర్వపక్షుల వాదన.

1. *T.F. Henderson, The Ballad in Literature, Preface, p.v.*

వీరగాథలు అత్యంత ప్రాచీన కాలమున ఆదిమసంఘములలో నుద్భవించియుండునని గాథాకవితా ప్రియుల సాధారణ విశ్వాసము. ఒక విధముగా ఈ విశ్వాసము సమంజసమైనదే. కాని ప్రపంచమున ఏ సాహిత్యమందును అతిప్రాచీనము లనదగిన వీరగాథలు లభ్యమగుటలేదు. ఆంగ్లమున 'ప్రొఫెసర్ ఛైల్డు' (Prof. Child) సేకరించిన 'English and Scottish Ballads' (1857-59) అను వీరగాథా సంకలన గ్రంథములో ఒక్క 'Judas' అను గాథ మాత్రమే 13వ శతాబ్దమునాటిది. (ఈ 'జూడాస్' అనునది శుద్ధగేయమే కాని కథాగేయము కాదని వాదించు విమర్శకులును గలరు). మఱి నాలుగు గాథలు 15వ శతాబ్దము నాటివి. తక్కిన 300 గాథలును అర్వాచీనములే! హిందీలో పృథ్వీరాజ రాసో 12వ శతాబ్దము నాటిది. తెలుగులో పల్నాటి వీర చరిత్రయును అదేకాలమునాటి సంఘటన. ఇంతకన్న ప్రాచీనములైన లిఖిత వీరగాథలు లభ్యమగుట లేదు.

'సిగ్నర్ ఎ. బార్టొలీ' (Signor A. Bartoli) వంటి విమర్శకులు కొందఱు వీరగాథలు ప్రాచీనయుగములవారి ఆశుకవితాసృష్టియనియు, ప్రజాహృదయములనుండి సహజసిద్ధముగా, ఆత్మీయతాముద్రారహితముగా, సార్వజనీనస్వభావముతో నుద్భవించిన కవిత్వమనియు భావించిరి. మఱికొందఱు ఇంతకన్నను వెనుకకు బోయి వీరగాథను అతి ప్రాచీనమైన వచనకథతో ముడిపెట్టి, ఇది జానపదుల వినోదకల్పనము ('Popular imagination' and 'folk fancy') అనియు తలంచిరి. కాని 'ఎమ్.జీన్‌రాయ్' (M. Jeanroy) వంటి విమర్శకులు మఱికొందఱు ఇట్టి తలపులను అతిలోక మౌఢ్యములని ఖండించిరి.[2] వీరగాథను ప్రజాసమూహము కలిసికట్టుగా ఆశుధారగా సృజించెనను వాదమును వీరంగీకరింపరు. కవితానుభూతిని పంచుకొనుటలో మాత్రమే పదిమంది మనసులు కలియునుగాని, కవితాసృష్టి విషయమున అంతమంది కలియుట కష్టమని ఈ ప్రతిపక్షుల భావము. నేడు లభించుచున్న అన్నిరకముల వీరగాథలలోను కొందఱు వైయక్తికకవుల పనివానితనము స్పష్ట గోచరమగుచున్న దనియు, ఎంతటి ప్రాథమికులైనను ప్రాక్తనసంఘమనగా ఆనాటి కవులే యనవచ్చుననియు, ఆ కవులే వీరగాథలను నిర్మించి యుందురనియు వీరిమతము.

మిసెస్ మార్గరెట్ (Mrs. Margaret) వంటి విమర్శకులు కొందఱు లయనుండి కవిత్వము పుట్టినదనియు, దాని ప్రాథమికరూపమే వీరగాథలనియు తలచుచున్నారు. లయ వ్యామోహము (love of rhythm) మానవుని సహజగుణములలో నొకటి. ఈ లయ నుండియే కవిత్వము, సంగీతము, నాట్యము - అను కళలు మూడును ఏకకాలమున నుద్భవించి యుండుననుట సిద్ధాంతము. నేటి ప్రపంచమున గల ఏ అనాగరక సంఘమును పరిశీలించినను

---

2. *See 'The Ballad Literature' by T.F.Henderson, p.58.*

ఈ సిద్ధాంతసత్యము రుజువగును.[3] ఆదిమమానవుని లయాత్మక భాషణమునుండి కవిత్వము పరిణమించియుండుననుట ఒక సిద్ధాంతము. (చూ. 'వీరగాథల ప్రాచీనత' అను వెనుకటి ప్రకరణము). ఇట్లు పుట్టిన కవిత్వముయొక్క ప్రాథమిక స్వరూపము నృత్తగీతము (dance-song). సాహిత్యములో వీరగాథల ఆదిస్వరూపము గూడ ఇదియేయని వీరి సిద్ధాంతము.

"The ballad, like the popular tale ('marchen'), is, as a dance song, an invention of the folk, with savage origins and direct modern survivals."[4]

'Ballad' అను ఆంగ్లశబ్దముయొక్క రూపనిష్పత్తిని దృష్టిలోనుంచుకొని కొందఱు విమర్శకులు వీరగాథలు నృత్యమునుండి పరిణమించినవని భావించుచున్నారు. "The name ballad, hardly a good one for the lyric species now bearing it, derives from the late Latin and Italian 'ballata', from 'ballare', to dance. It has the same parentage as 'ballade' and 'ballet'. Partly because of this derivation, the assumption arose that the ballad, or lyrical narrative, developed from the dance."[5]

'బలాడ్' (ballade) అనగా ఒక ప్రత్యేకమగు ఛందస్సులో వ్రాయబడిన నృత్తగీతము; 'బాలే' (ballet) అనగా నృత్యరూపమున చెప్పబడు కథ. ఈ రెండు శబ్దములును 'బ్యాలెడ్' (ballad) శబ్దమునకు తోబుట్టువులగుట కూడ వీరగాథల నృత్యావిర్భూతత్వమునకు పోషకమగుచున్నదని ఈ విమర్శకుల నమ్మకము.

వీరగాథలు నృత్యపరిణామ రూపములనుటకు మఱియొక ముఖ్యకారణమున్నది. క్రీ.శ. 1100 ప్రాంతమున ఐరోపాఖండమున నొక వింతపద్ధతి (fashion) వ్యాపించినది. పాటతోగూడిన నృత్తములపై (నృత్తగీతముల పై) ఐరోపాలోని వివిధదేశములవారికి మోజు హెచ్చినది. ఇవి మొట్టమొదట 'ప్రొవెన్స్' (Provence) రాష్ట్రమున పుట్టి క్రీ.శ. 1100 లో ఫ్రాన్సు దేశమంతటను వ్యాపించినవి. ఫ్రాన్సుదేశమున కొక మహాశక్తి యున్నది. ఎట్టి వింతభావములనైనను, ఎట్టి వింతపద్ధతులనైనను క్షణములో ప్రపంచమంతటను వ్యాపింపజేయ సమర్థమైనది ఒక్క ఫ్రాన్సుదేశమే! 12వ శతాబ్దమున ఈ గాననృత్తములు (singing dances) ఫ్రాన్సుదేశమునుండి మహాప్రవాహమువలె వ్యాపించి ఉత్తర ఐరోపాదేశము లన్నిటిని

---

3. *"Any one who has read anything about savages -African or South American or any other savages - must know in a general way that poetry, music and dancing have the same origin. They spring up together out of man's instinctive love of rhythm" - Mrs. Margaret L. Woods, Essays by Divers Hands, Vol. VI. p.25.*
4. *Nelson's Perpetual Loose-leaf Encyclopaedia, Vol. I., p. 542.*
5. *Prof. Louise Pound, The Encyclopedia Americana, Vol. III, p.94b.*

ముంచెత్తివేసినవి. గేయనృత్తముల యీ వింతపద్ధతి గొప్ప తిరుగుబాటువలె ఐరోపా కవిత్వమంతటిని తారుమారు చేసివైచినది. ఈ నృత్తగీతములే ఐరోపాఖండమున వీరగాథల యుత్పత్తికి హేతుభూతములైనవి. డెన్మార్కు దేశమున నిట్టి నృత్తగీతములకు గేయములనుగాక గేయకథలనే ఉపయోగింపసాగిరి. ఈ దేశమున జానపదులుగాక నాగరకవర్గములవారే వీరగాథలను నృత్తమునకుపయోగించిరి. (అయినను డెన్మార్కు దేశము నుండియే అత్యుత్తమమైన వీరగాథలు వచ్చినవి. డేనిష్ స్త్రీలు ప్రాచీన వీరగాథలనన్నింటిని సేకరించి భద్రపఱిచియున్నారు. డెన్మార్కు దేశ సాహిత్యమంతయు వీరగాథకవిత్వ విశ్వరూపమే! ఈ డెన్మార్కు దేశభాగమైన 'ఫేరో' (Faeroe) ద్వీపములలో ప్రాచీనకాలమున నృత్తమున కుపయోగించిన వీరగాథలు లభించుటయేకాక, నేటికిని ఆ ద్వీపములలో నృత్తమునకు సహాయముగా వీరగాథలనే ఉపయోగించుచున్నారు.

ఇట్లు పైవిధముగా Ballad శబ్ద రూపనిష్పత్తిని బట్టియు, క్రీ.శ. 12వ శతాబ్దమున నృత్తగీతములు ఐరోపాఖండమందంతటను వ్యాపించుటను బట్టియు, వీరగాథలు ప్రాక్తన మానవుని నృత్తగీత పరిణతములని కొందఱు విమర్శకులు నిశ్చయించిరి. కాగా, ప్రపంచమున ప్రతి సాహిత్యమందును ఈ వీరగాథలే కవిత్వమునకు శ్రీకారము చుట్టినవని కూడ తీర్మానించిరి.

Ballad శబ్దమునకు 'నృత్తగీత' మను ప్రాచీనార్థము నేడు వ్యవహారమున లేదు. నేడు Ballad అనగా 'జానపద గేయకథ' అనియే యర్థము. ఇట్టి కథాత్మక గేయము ప్రాక్తనమానవ నృత్త పరిణత మనుటను గాని, ఇదియే కవిత్వమునకు శ్రీకారమనుటను గాని, మఱికొందఱు విమర్శకులు వ్యతిరేకించుచున్నారు. ఆనందవివశుడైన ప్రాక్తనమానవుడునర్తించు నప్పుడు సుఖదుఃఖాది భావములను వెలువరించుచు నొక చిన్నగేయము నాలపించియుండునుగాని, దీర్ఘ కథనముతోనొప్పు వీరగాథ నల్లియుండుననుట స్వభావవిరుద్ధమని వీరి వాదము. ఈ ప్రాక్తనమానవ నృత్తము వివిధగేయముల కుద్గమస్థానమగును కాని, కథాగేయమునకు కానేరదు.[6] Ballad, Ballade, Ballet - అను మూడు శబ్దములకును 'నర్తించు' అనునర్థముగల ballare అను లాటిను శబ్ద మొక్కటే మూలరూపమనుట సత్యమే. ఈ మూడు శబ్దములకును పూర్వకాలమున 'నృత్తగీతము' అను ఒక యర్థముండుట కూడ నిజమే. అంతమాత్రమున వీరగాథాప్రక్రియ నృత్తమునుండి పరిణమించినదని చెప్పజాలము. రూపనిష్పత్తి Ballad అను శబ్దోత్పత్తిని మాత్రమే తెలుపును గాని, Ballad ప్రక్రియాపరిణామమును నిరూపించునది కాజాలదు. Ballad, Ballade, Ballet అను మూడింటికిని పూర్వకాలమున ఒకే యర్థమున్నను

6. *"In reality, dance genesis has more immediate connection with other types of song than the narrative." -Ibid.*

నేడు ఈ మూడును మూడు భిన్నార్థములతో మూడు భిన్నప్రక్రియలుగా స్థిరపడినవి. Ballade అనునది 'రాజాస్థానములలో నృత్యముచేయునప్పుడు పాడు పాట; Ballad అనునది 'గేయరూపమున తెలుపబడు కథ'; Ballet అనునది 'నృత్యరూపమున తెలుపబడు కథ' (తెలుగు సాహిత్యమున క్షేత్రయ్యపదము Ballade అనుదానికిని, బొబ్బిలికథ Ballad అనుదానికిని, సుగ్రీవవిజయము యక్షగానము Ballet అను దానికిని ఉదాహరణములుగా పేర్కొనవచ్చును). కాబట్టి Ballad శబ్దరూప నిష్పత్తి కాని, దానికి Ballade, Ballet శబ్దములతో గల సహోదరత్వము కాని వీరగాథలు నృత్యమునుండి పుట్టినవనుటను సమర్థింపవు. ఆంగ్లసాహిత్యమున నేడు లభించుచున్న ప్రాచీనగాథలు (Judas, St.Stephen and Herod) మతమునకు సంబంధించినవిగా నున్నవి కాని, నృత్యమునకు సంబంధించినవిగా లేవు.[7]

వీరగాథలు అతి ప్రాచీనము లనియు, ఇవియే కవిత్వమునకు శ్రీకారము లనియు తెలుపుటను గూడ విమర్శకులలో ప్రత్యర్థులంగీకరించుట లేదు. ఏలయన, మానవ స్వభావమును బట్టి గేయమే ప్రాచీనమగును కాని, గేయకథ కానేరదని వీరి భావన.

"Ballads are often termed the oldest and most universal form of poetry. This is untrue if the name is set apart for narrative lyrics. The song proper is the primitive form. Early poetry suggests happenings by allusion rather than in more direct and dramatic form. The ballad, as a species of lyric, emerged rather late in literary history, perhaps in the 11th or 12th century."[8]

'గేయకథ' యను నర్థమున నేడు లభించుచున్న వీరగాథలు అర్వాచీనములే కాని ప్రాచీనములు కావు. డెన్మార్కుదేశమున 12వ శతాబ్దమునను, రష్యాలో 13వ శతాబ్దమునను, స్పెయిన్, స్కాట్లండ్, ఇంగ్లండ్ దేశములలో 14వ శతాబ్దమునను వీరగాథలు బయలుదేరినవి. జెకోస్లవేకియా దేశమున వీరగాథలు మిక్కిలి అర్వాచీన కాలమున పుట్టినవి. ఇవి ప్రాచీన జర్మను వీరగాథలనుండి పరిణమించినట్టివి. కావున వీరగాథయే కవిత్వమునకు శ్రీకారమని చెప్పుటకు వీలుపడదని ఈ ప్రత్యర్థుల మతము.

మొత్తముమీద పాశ్చాత్య విమర్శకులలో వీరగాథల ఉత్పత్తిని గుఱించిన చర్చల కన్న, వీరగాథల కర్తృత్వమును గూర్చిన సిద్ధాంత రాద్ధాంతములే హెచ్చుగా నున్నవి. ఈ కర్తృత్వ చర్చయందే ఉత్పత్తి నిర్ణయములును గర్భితమై యుండును.

వీరగాథల కర్తృత్వమును గూర్చి పాశ్చాత్యులలో ప్రధానముగా రెండు సిద్ధాంతములు వ్యాప్తియందున్నవి: (1) సామూహిక కర్తృత్వ సిద్ధాంతము (Communal theory),

7. *"The earliest English texts associate themselves not with dancing but with religious edification." - Ibid., pp.95-96.*

8. *Dictionary of World Literary Terms, pp.34-35.*

(2) వైయక్తిక కర్తృత్వ సిద్ధాంతము (Individual theory). ఇందు వైయక్తిక కర్తృత్వ సిద్ధాంతములో మఱల రెండు ఉపశాఖలున్నవి: (అ) జంగమ సిద్ధాంతము (Minstrel theory), (ఆ) కళాకార సిద్ధాంతము(Artistic theory). క్రీ.శ. 1765 ప్రాంతములో జంగమ సిద్ధాంతమును, ఆ 18వ శతాబ్దముననే సామూహిక కర్తృత్వ సిద్ధాంతమును, 19వ శతాబ్ది ఉత్తరార్ధమున కళాకార సిద్ధాంతమును తలయెత్తినవి.

## 1. సామూహిక కర్తృత్వ సిద్ధాంతము

నృత్యమునకై గుమిగూడిన జానపదులు ఆశువుగా వీరగాథలను సృజింతురనుట ఈ సిద్ధాంత సారాంశము. దీనికి 'జానపద సిద్ధాంతము' (Folk theory) అనియు, 'అస్పష్ట సిద్ధాంతము' (Nebular theory) అనియు నామాంతరములున్నవి. ఈ సిద్ధాంతమును లేవనెత్తి బలపఱిచిన వారిలో జర్మనీ దేశములో Herder, Brothers Grimm (Jacob Grimm and Wilhelm Grimm) అను పండితులును, ఇంగ్లండు దేశమున Andrew Lang, Prof. F.J.Child, W.M. Hart అనువారును, అమెరికా దేశమున F. B. Gummere, Prof. G. L. Kittredge అను విద్వాంసులును గలరు. Svend Grundtvig అను డేనిష్ పండితుడును ఈ సామూహిక కర్తృత్వ సిద్ధాంతమునే బలపఱిచెను. ఇతడు డెన్మార్క్ దేశమున వేలకొలది వీరగాథలను సేకరించిన మహాపరిశోధకుడు.

వీరగాథలు జానపదుల సామూహిక కర్తృత్వమున పుట్టినవను సిద్ధాంతము చాల కాలమునుండి ప్రచారమందుచున్నది. "The conception that the ballad is something originally composed more or less spontaneously by dancing improvising throngs of peasantry or common folk has long been adhered to and is still embedded in literary histories. Ballads were differentiated from other poetry as 'springing mysteriously from the heart of the people'."[9]

నృత్యము కొఱకై గ్రామీణు లొకచో గుమిగూడి, ఆశువుగా నొక పాటను పాడుదురనియు, ఇట్లు పాడునప్పుడు ఆ సమూహమంతయు నొకే కవివలె ప్రవర్తించుననియు, జానపదులు పాడిన ఇట్టి పాటయే వీరగాథయనియు ఈ సిద్ధాంతము తెలుపుచున్నది. ఇది క్రీ.శ. 18వ శతాబ్దమున జర్మనీ దేశమున మొట్టమొదటిసారిగా తలయెత్తినది. 'హెర్డర్' ( Herder), 'గ్రిమ్ సోదరులు' ఈ వాదమునకు మూలపురుషులు. ఐరోపాఖండమున జానపద సిద్ధాంతమును వ్యాపింపజేసినవారిలో హెర్డర్ పండితుడు ప్రథముడు. ప్రాక్తనవీరుల

9. *The Encyclopedia Americana, Vol. III, p.95.*

సాహసములు ప్రజాముఖమున కవిత్వమైనవని ఈతని నమ్మకము.[10] గ్రిమ్ సోదరులు ప్రాక్తన జానపద సమూహము కవిత్వమును సృజించునని తెల్పిరి.[11] ప్రసిద్ధ సంఘటనమునుండి పుట్టిన సామూహికోద్రేకముతో ఈ కవిత్వసృష్టి జరుగును. ఇట్లు జనించిన కవిత్వమే వీరగాథలని వీరి యభిప్రాయము.

ఇంగ్లండు దేశమున ఈ సామూహిక కర్తృత్వ సిద్ధాంతమును వ్యాపింపజేసినవాడు Andrew Lang. ఇతడు నాగరకసంఘముల జానపదసంపద (Folklore) నుండి లక్ష్యముల నెన్నింటినో చూపి ఈ వాదమును బలపఱిచినాడు. F. J. Child కూడ ఈ జానపద సిద్ధాంతమును సమర్థించెను. వీరగాథ ఒకవేళ, సామూహిక కర్తృత్వమున గాక, వైయక్తిక కర్తృత్వముననే జనించినదని తలంచినను, ఆ వ్యక్తికి కవిగా ఏ మాత్రమును ప్రత్యేకత యుండదనియు, ఆ గాథ మౌఖికప్రచార మందునప్పుడు ప్రతివారును తమకు తోచిన రీతిని మార్చివేయుదురనియు, ఆ రచనపై మొదటికవి ముద్ర చెఱిగిపోవుననియు, కావున అట్టి వీరగాథను సామూహిక కర్తృకముగానే తలపవలెననియు 'ఛైల్డు' పండితుడు భావించెను. వీరగాథలు నేడు అజ్ఞాత కర్తృకములుగా నుండుట కిదియే కారణమని అతడు చెప్పెను.[12]

అమెరికా దేశమున ఈ సామూహిక కర్తృత్వ వాదమును మనస్ఫూర్తిగా సమర్థించిన వాడు F. B. Gummere పండితుడు. కవిత్వము సాంఘికముగా జనించినదనియు, వీరగాథ జానపదుల సామూహిక ప్రతిభకు నిదర్శనమనియు, ఇది మొదట నృత్యరూపమునను, బృందగానరూపమునను పుట్టినదనియు 'గుమ్రే' పండితుని అభిప్రాయము.[13] జానపద

---

10. *"Traditions of chivalry, he says, became poetry in the mouth of the people" - Frank Sidgwick, Introduction to 'Popular Ballads of the Olden Time.'*

11. *Jacob Grimm suggested that the folk actually made the song, referring to them as "das dichtende Volk"(the 'creative' or 'poetic' folk) and by inversion this phrase has become the dramatic and quotable "Das Volk dichtet" ('the folk creates poetry'). Some scholars have explained this process of poetic composition as a communal reaction to the emotion aroused by a striking event "*
*-Collier's Encyclopaedia, Vol. 3, p.19.*

12. *"Though a man and not a people has composed them, still the author counts for nothing, and it is not by mere accident, but with the best reason, that they have come down to us anonymous."*
*- Cited by Frank Sidgwick in his Introduction to 'Popular Ballads of the Olden Time'.*

13. *The most whole-hearted supporter of the communal theory has been Prof. F. B. Gummere, who in his account of the 'rise of poetry as a social institution' claims the ballad as evidence of a co-operative folk-intelligence, first expressing itself in dance and choral song." -Encyclopaedia Britannica, Volume 2, p.994.*

సంఘము వీరగాథను నిర్మించు తీరును G.L. Kittredge అను పండితుడిట్లు నిరూపించినాడు:
ఏదైన ఉత్సవ కాలమున జానపదసంఘ మొకచో గూమిగూడును. అప్పుడు -

'Different members of the throng, one after another, may chant each verse, composed on the spur of the moment and the sum of these various contributions makes a song. This is communal composition, though each verse taken by itself, is the work of an individual. A song made in this way is no man's property and has no individual author. The folk is its author.'[14]

ఒకవేళ, వీరగాథ ఆదిలో వైయక్తిక కర్తృకమేయైనను, మౌఖిక ప్రసరణమున వ్యాపించునప్పుడు అనేకుల మార్పులకు చేర్పులకు లోనై, సామూహిక కర్తృకమగునని ఈ 'కిట్రెడ్జ్' పండితుడు తలంచుచున్నాడు.[15] 'The Hangman's Tree' అను వీరగాథ ఎట్లేర్పడి యుండునో ఊహించి ఈ పండితుడు దానిని చిత్రరూపమున ప్రదర్శించినాడు. వీరగాథకు తొలికర్త జానపదుడే కాని, ప్రత్యేక కవి లేదా జంగము కాడనియు, ఈ జానపదుడు కూడ ఏకాంతముగా కూర్చుండి, దీనిని సృజింపక, రసావేశమున నర్తించు సమూహమున కెదురుగా ఆశువుగా పాడియుండుననియు 'కిట్రెడ్జ్' భావించుచున్నాడు.

'హార్వర్డ్ సంప్రదాయము' (Harvard School) జానపదుల ఆశురచనల నుండి ఐతిహాసిక క్రమము (Epic Process)న వీరగాథ లేర్పడెనని నిర్ణయించెను. జానపదుల ఆశువునందు కథనము ప్రవేశించి వీరగాథ కాగా, ఇట్టి వీరగాథలు కొన్ని ఒక ప్రసిద్ధపురుషుని చుట్టును అల్లబడి వీరగాథావృత్తము (Ballad-Cycle)గా నేర్పడును. ఈ గాథావృత్తమే క్రమపరిణామమున ఇతిహాసమగును. దీనిని ఐతిహాసికక్రమ మందురు. అనగా జానపదుల ఆశువునుండి వీరగాథలును, ఆ వీరగాథలనుండి ఇతిహాసములును ఏర్పడునని ఈ సంప్రదాయజ్ఞుల నమ్మకము.

---

14. *G.L. Kittredge, Introduction, English and Scottish Ballads, ed., F.J. Child.*

15. *He allows an initial creation by an individual author but holds that "the processes of oral tradition amount to a second act of composition" - "a collective composition" - "of an inextricably complicated character", which is not to be indentified with the corruption by scribes and editors of a classical text; that the original author is not a professional poet or minstrel but a member of the folk, and that the composition is not a solitary act but oral improvisation before an audience "in close emotional contact".*

*-Encyclopaedia Britannica, Vol.2, p.994.*

ఈ సామూహిక కర్తృత్వ సిద్ధాంతము మొట్టమొదట జర్మను దేశమున పుట్టినదైనను, జర్మను, ఇంగ్లండు దేశములకన్న అమెరికా దేశమందే యెక్కువ కాలము ప్రచారము నందినది.[16]

## 2. వైయక్తిక కర్తృత్వ సిద్ధాంతము

వీరగాథలు ప్రాక్తన జానపద సంఘములచే గాక, మధ్యయుగములలో ప్రత్యేక కవులచే సృష్టింపబడిన వనుటయు, ఈ గాథల ఇతివృత్తములన్నియు ప్రాచీనేతిహాసములనుండి గ్రహింపబడిన వనుటయు ఈ సిద్ధాంతములోని సారాంశము. ఇది సామూహిక కర్తృత్వ సిద్ధాంతమునకు సరిగా వ్యతిరేకమైన దగుటచే దీనిని పాశ్చాత్యులు 'సామూహిక వ్యతిరేక సిద్ధాంతము' (Anti-communal theory) అని కూడ పిలుచుచున్నారు. ఈ సిద్ధాంతము వీరగాథలు ప్రాచీనసాహిత్యమున కనుకరణములుగా పుట్టినవని చెప్పుచుండుటచే, దీనిని 'సాహిత్య సిద్ధాంతము' (Literary theory) అనియు పిలుచుట కలదు.

ఈ సాహిత్య సిద్ధాంత వాదులలో కొందఱు, మధ్యయుగములలోని జంగములు, లేదా సంచార గాయక భిక్షువులు (Minstrels) ప్రాచీన సాహిత్యమున కనుకరణములుగా వీరగాథలను సృజించియుందురని భావించుచున్నారు. వీరి వాదమును 'జంగమ సిద్ధాంతము' (Minstrel

16. *జానపదుల సామూహిక వలయ నృత్యము (Communal ring dance) నుండి వీరగాథ పుట్టినదను పాశ్చాత్య సిద్ధాంతమును భారత దేశ భాషలలో హిందీయందు గల 'రాసో' శబ్దము కూడ బలపఱుచుచున్నది. ఇది 'రాసక' అను ప్రాకృత శబ్ద భవము. దీనికి 'గుండ్రముగా చేరి నృత్యము చేయుట' అని యర్థము. కృష్ణుడు గోపికలతో చేసిన 'రాసక్రీడ' కూడ వలయ నృత్యమే. మధ్య కృష్ణుని ఉంచుకొని చుట్టును గోపికలు చేరి నృత్యము చేసిరి. నేడు హిందీ సాహిత్యమున 'రాసో' అనగా 'Ballad' అని యర్థము. గుజరాతీ భాషలోని 'గర్బో' శబ్దము, తెలుగున గల 'గొబ్బి' శబ్దము కూడ వలయ నృత్యమును సూచించునట్టివే. వెన్నెలలో జానపద స్త్రీలు వలయాకారమున తిరుగుచు, చప్పట్లు చఱుచుచు, ఒక ప్రక్కకు వంగుచు లేచుచు, పాటలు పాడుట ఆంధ్రదేశమున నేటికిని గలదు. ఇట్టి పాటలను తెలంగాణమున ''చుట్టు కాముడు పాటలు'' అని పిలుతురు. కాముని పున్నమనాడు ఎక్కువగా పాడబడుటచే ఇందలి 'కాముడు' శబ్దము ఈ పాటలు వెన్నెలలో పాడబడుననుటను సూచించును. 'చుట్టు' శబ్దము 'వలయాకారమున తిరుగుచు పాడుదు'రని తెల్పును. ఇట్లు వెన్నెలలో వలయ నృత్యమున పాడబడు పాటలను రాయలసీమలో 'జక్కికలు' అందురు. (ఇవి ఒకప్పుడు జక్కులచే పాడబడుచుండెడివి కాబోలు). కొఱవి గోపరాజు (క్రీ.శ. 1450) పేర్కొనిన 'వెన్నెల గుడి పాట' కూడ వలయ నృత్యమునే సూచించుచున్నది. 'వెన్నెలలో గుండ్రముగా తిరుగుచు పాడెడి పాట' అని దీని యర్థము. పైన పేర్కొనిన వన్నియును 'వెన్నెల పదములే!, వెన్నెలలో పాడబడుటచే నివి వెన్నెల పదములై యుండును.*

theory) అందురు. మఱి కొందఱు సాహిత్య సిద్ధాంత వాదులు కళాకారులగు ప్రత్యేక కవులే సాహిత్యానుకరణములుగా వీరగాథలను వెలయించిరని తలచుచున్నారు. వీరి వాదమును 'కళాకార సిద్ధాంతము' (Artistic theory) అందురు. కాబట్టి వైయక్తిక కర్తృత్వ లేక సాహిత్య సిద్ధాంతములో జంగమ సిద్ధాంతము, కళాకార సిద్ధాంతము - అను రెండు ఉప సిద్ధాంతము లున్నవని గమనింపవలెను.

**(అ) జంగమ సిద్ధాంతము:** ఆంగ్ల సాహిత్యమున మొట్టమొదటిసారిగా వీరగాథలను సేకరించిన మహనీయుడు 'థామస్ పెర్సీ' (Thomas Percy) అను మతాధికారి. ఈతని సంకలన గ్రంథము "Reliques of Ancient English Poetry" క్రీ.శ. 1765లో ప్రకటింపబడినది. అప్పటినుండియే ఆంగ్లసాహిత్యమున వీరగాథలు విమర్శకుల దృష్టికి వచ్చినవి. ఈ 'పెర్సీ' పండితుడు వీరగాథలు ప్రాచీన శిష్టసాహిత్యమునుండి యేర్పడినవనియు, దేశ ద్రిమ్మరులగు జానపదగాయకులే వీని కర్తలనియు భావించెను. ఈతడే కాక 'జోసెఫ్ రిట్సన్' (Joseph Ritson), 'సర్ వాల్టర్ స్కాట్' (Sir Walter Scott), తరువాత వచ్చిన గాథాసంచయనకారు లందఱును 'పెర్సీ' అభిప్రాయముతో నేకీభవించిరి.[17]

'జోసెఫ్ రిట్సన్' వీరగాథలు జంగమకృతములని అంగీకరించినను, అవి అతి ప్రాచీనము లనుట మాత్రము అంగీకరించుట లేదు. వీరగాథలన్నియును ఎలిజబెత్ యుగమునకు తరువాతివేయని అతని అభిప్రాయము.

'పెర్సీ' అభిప్రాయమును వెంటనే అంగీకరించినవాడు 'సర్ వాల్టర్ స్కాట్'. ఇతడు వీరగాథలు జంగముల స్వకపోల కల్పితములైనను కావచ్చును. లేదా ప్రాచీన సాంప్రదాయక వచన కథల నుండి పరిగ్రహింపబడిన వైనను కావలెను - అని తలంచెను.[18]

కొన్ని సాహిత్య చరిత్రలను - ముఖ్యముగా స్పెయిన్, జర్మనీ దేశముల సాహిత్యములను పరిశీలింపగా వీరగాథలు అంతకు పూర్వము ఆయా సాహిత్యములలో గల ఇతిహాసములనుండి

---

17. *"Percy, his opponent Ritson, Scott, and indeed all the collectors and editors were of opinion, not withstanding disagreement on minor points, that the ballads were the work of the minstrels and were derived from earlier and more 'literary' work."* *-Encyclopaedia Britannica, Vol.2, p.994.*

18. *"Sir Walter Scott was quite ready to accept the ballads as the productions of the minstrels, either as 'the occasional effusions of some self-taught bard'; or as abridged from the tales of tradition after the days when, as Alfred de Musset says, 'our old romances spread their wings of gold towards the enchanted world".* *-Frank Sidgwick, Introduction, Popular Ballads of the Olden Time.*

యేర్పడినట్లుగా స్పష్టమగుచున్నది. జానపదగాయకులు, మతప్రచారకులు ఈ ప్రాచీనేతిహాసములలోని ఇతివృత్తములను స్వీకరించి వీరగాథల నల్లియుండురు. (తెలుగులో శైవమత ప్రచారమున కుద్దేశించిన జంగంకథలను, రామాయణ భారత భాగవతాది ప్రాచీన సాహిత్యమునుండి సృజింపబడిన గేయకథలను ఇట స్మరింపదగును).

'సి.హెచ్.ఫిర్త్' (C. H. Firth) అను ఆంగ్లాచార్యుడు గూడ 'పెర్సీ' అభిప్రాయముతో నేకీభవించుచు ఈ జంగమ సిద్ధాంతమును బలపఱచుచున్నాడు.

"Another English scholar, Professor C.H. Firth, suggested that such ballads as those of the Percys, Stanleys and Howards were made by minstrels attached to these baronial houses to celebrate ancestral or contemporary adventures."[19]

ఫ్రాంక్ సిడ్గ్విక్ (Frank Sidgwick) అను నాతడు కూడ దేశద్రిమ్మరులగు జంగముల చేతనే వీరగాథలు సృజింపబడినవని నమ్ముచున్నాడు:

"The theory of the 'artistic' school is that the ballads and folksongs are the productions of skalds, minstrels, bards, troubadours or other vagrant professional singers and reciters of various periods."[20]

ఇట్లు సృజింపబడిన గాథలు మౌఖిక ప్రసరణమున చెప్పరాని మార్పులకు లోనగునని అంగీకరించుచున్నాడు. ఇతడు తన జంగమ సిద్ధాంతమునే 'కళాకార సిద్ధాంత' మని పిలిచినాడు.

**(ఆ) కళాకార సిద్ధాంతము:** A.W. Schlegel, W. J. Courthope (1895), T.F.Henderson, G.G. Smith (1900), Prof.. Louise Pound, Prof. W.P.Ker, Gaston Paris, Nyrop అను పండితులును, స్కాండినేవియా విద్వాంసులును, మధ్యయుగముల కవులే వీరగాథలను సృజించిరని భావించిరి. క్రీ.శ. 1895 ప్రాంతములో జానపద సిద్ధాంతమును ఖండించుచు ఈ కళాకార సిద్ధాంతము తలయెత్తినది.

వీరగాథలు జానపద సమూహములందు తమంతతామే ఏర్పడు ననెడి గ్రిమ్‌సోదరుల సిద్ధాంతమును A.W. Schlegel తీవ్రముగా ఖండించెను. వీరగాథలు వైయక్తిక కర్తృకములే యనియు, ఒక ప్రత్యేక కవిచే శిల్పదృష్టితో వ్రాయబడినవనియు ఈతని నమ్మకము. జి.ఎల్. కిట్రెడ్జి, ఎఫ్.జె. ఛైల్డు వంటివారు వీరగాథలు ఆదిలో వైయక్తిక కర్తృకములైనను, మౌఖిక

19. *The Encyclopedia Americana, Vol. III, p.95..*
20. *Introduction, Popular Ballads of the Olden Time.*

సంప్రదాయమున సామూహిక కర్తృకములుగనే తయారగుననియు, మొదటి కవి కేమాత్రమును ప్రాముఖ్యముండదనియు తీర్మానించగా, ఈ Schlegel పండితుడు వీరి అభిప్రాయములకు సరిగా వ్యతిరేకముగా నాలోచించుచున్నాడు. వీరగాథా నిర్మాణమున ఎందఱు చేతులు కలిపినను వారందఱును అప్రధానులే యనియు, మొట్టమొదట దానిని తీర్చిదిద్దినవాని వైయక్తికప్రతిభ, శిల్పము దానియందు ప్రత్యక్షమగుచునే యుండుననియు వాదించినాడు. తన వాదము నొక మహోన్నత గోపుర నిర్మాణముతో పోల్చి చెప్పినాడు:

"To Schlegel we owe the famous image in which popular poetry is a tower, and poet an architect. Hundreds may fetch and carry, but all are useless without the direction of the architect."[21]

క్రీ.శ. 1895లో W. J. Courthope అను ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయ కవిత్వాచార్యుడు సామూహిక కర్తృత్వ సిద్ధాంతమును అస్పష్టభావము(vague idea)గా నిరసించినాడు. ఇతడువీరగాథలను ప్రత్యేకకవులు ప్రాచీన సాహసిక కావ్యముల (Romances) నుండి ముఖ్య ఘట్టములను గ్రహించి ఏర్పఱిచి యుందురని భావించినాడు.[22] ఈతడు 'హార్వర్డ్' సంప్రదాయములోని 'ఐతిహాసిక క్రమము' (Epic Process)ను గూడ ఖండించినాడు. జానపదుల లఘ్వాశుగీతములనుండి దీర్ఘ వీరగాథ లేర్పడినవనుట కన్న, సుదీర్ఘ శిష్టకావ్యముల నుండి సంక్షిప్త రూపమున వీరగాథ లేర్పడినవని నిశ్చయించినాడు.[23] ప్రపంచమున ప్రతి సాహిత్య చరిత్రయందును ఇతిహాసయుగము తరువాతనే వీరగాథాయుగము కనబడుచుండుట ఈ కారణము చేతనే.

T. F. Henderson అను విమర్శకుడు పై ఆచార్యుని భావమును సమర్థించినాడు. వీరగాథలను జానపద సమూహములు సృజించిన వనుట సరికాదనియు, ఈ కథలు మొదట నాగరక సంఘముల చేతనే పాడబడుచుండెడివనియు, స్కాట్లండు, డెన్మార్క్ దేశములందు 'కెరోల్' (carole) రూపమున ఇవి అగ్రవర్ణములవారిచే పాడబడుచున్నట్లు దృష్టాంతములు

21. *Frank Sidgwick, Popular Ballads of the Olden time, Introduction.*

22. *"......the ballad 'was usually a precis of a romance' by a selection of 'the salient points' and that it developed 'certain poetical features of its own' by reason of this relationship".*

*- Encyclopaedia Britannica, Vol.2, p. 994.*

23. *W. J. Courthope, Oxford Professor of Poetry, believed in an opposite process, from length to brevity, rather than from brevity to elaboration. He thought that ballads were the relics of romances.*

*- The Encyclopedia Americana, Vol. III, p. 95.*

కలవనియు, ఇవి క్రమక్రమముగా క్షీణించి జానపదుల హస్తగతములైనవనియు ఈతని అభిప్రాయము.

క్రీ.శ. 1900లో G. G. Smith అనునాతడు వీరగాథ (Ballad) - సాహసిక కావ్యము (Romance)ల పరస్పర సంబంధమును ఇతివృత్త దృష్టితోడను, ఛందస్సు దృష్టితోడను కూలంకషముగా చర్చించి, వీరగాథలు 'మధ్యయుగములనాటి శిష్టసాహిత్య శిథిలభాగములు' ('part of the literary debris of the middle ages')అని నిర్వహించినాడు. ఈ సాహిత్య మాతృక సిద్ధాంతమును 1909లో W. P. Ker, 1921లో Prof. Louise Pound మిక్కిలిగా సమర్థించిరి.

Gaston Paris అను విమర్శకుడు కూడ వీరగాథలు అర్వాచీన మధ్యయుగ కవులచే సృజింపబడినవని తలంచుచున్నాడు. ప్రాచీన వివిధ సాహిత్యప్రక్రియల నుండియు, నమ్మకములు మూఢవిశ్వాసములు మున్నగువాని నుండియు ఇతివృత్తములు స్వీకరింపబడి వీరగాథలు నిర్మింపబడినవని ఈతని విశ్వాసము.[24] వీరగాథ యనునది 'Chanson' వంటి ఇతిహాసము, 'Carole' వంటి భావగీతము కలియుటచే నేర్పడిన ప్రక్రియయని ఇతడు భావించెను. ఈ వీరగాథా ప్రక్రియ మొట్టమొదట ఫ్రాన్సులో పుట్టినదని కొందఱు తలంపగా, మఱికొందఱు స్కాండినేవియాలో జనించినదని తీర్మానించిరి.

## ఖండన ముండనములు

. పై వాదములను బట్టి వీరగాథలను అతి ప్రాచీనకాలము నాటికి నెట్టుకొనిపోవుట యటులుండ, వాని యుత్పత్తి కర్తృత్వములను గూర్చి విమర్శకులలో నేకాభిప్రాయము లేదని స్పష్టమగుచున్నది. కొందఱు సామూహిక కర్తృత్వమును బలపఱిచి, అవి ప్రాక్తన జానపద సంఘముల నృత్తగీతముల నుండి పరిణమించినవనిరి. మఱికొందఱు వైయక్తిక కర్తృత్వమును బలపఱిచి, మధ్యయుగములనాటి జంగములచే గాని కవులచే గాని, పూర్వసాహిత్యమును మాతృకగాగొని వ్రాయబడిన రచనలని తీర్మానించిరి. గ్రిమ్‌సోదరులు వీరగాథలు ప్రాక్తన జానపద సమూహములందు తమంతతాము ఉద్భవించినవని (ballad or song 'sings itself') తలపోయగా, ఎ.డబ్ల్యు. ష్లెగల్ అను పండితుడు ప్రత్యేక కవి తన శిల్పచాతుర్యమును గనపఱుచుచు వీరగాథను సృజించెనని ఉన్నత గోపుర ఉపమానముతో గూడ నిరూపించెను.

---

24. *Gaston Paris adduces evidence for assigning their origin to the poets of the later Middle Ages, who have given an original colour to themes found in popular tradition, in earlier poetry, in old romances, in actual events, and in surviving pegan beliefs and superstitions"*

*- The New Universal Encyclopaedia, Vol. I, p. 886.*

ఎఫ్.బి. గుమ్రే అనునాతడు జానపద నర్తక సమూహము ఆశువుగా పాడగా వీరగాథ లేర్పడినవని తలపోయగా, డబ్లియు. పి. కెర్ అనునాతడు మధ్యయుగములనాటి నాగరకులు పాడు 'కెరోల్' అను శృంగార నృత్త గీతమునుండి వీరగాథ పుట్టినదని భావించెను.

'హార్వర్డ్' సంప్రదాయము జానపదుల ఆశుధారలనుండి ఐతిహాసిక క్రమమున వీరగాథ లేర్పడెనని వాదింపగా, డబ్లియు. జె. కోర్‌థోప్ అను విమర్శకుడు ప్రాచీన సుదీర్ఘ సాహసిక కావ్యముల నుండియే వీరగాథ లేర్పడెనని పై వాదమును ఖండించెను.

'థామస్ పెర్సీ' తాను సేకరించిన వీరగాథలను ప్రకటించుచు ఆ గ్రంథ ప్రస్తావనలో అవి ప్రాచీన సాహిత్యము మాతృకగా గలిగి, జంగములచే సృజింపబడినవని చెప్పగా; పెర్సీ ప్రత్యర్థియగు 'జోసెఫ్ రిట్సన్' వీరగాథలు జంగమ కర్తృకములని అంగీకరించినను, వాని ప్రాచీనతను మాత్ర మంగీకరింపక, అవి ఎలిజబెత్ కాలముకన్న అర్వాచీనములేయని వాదించెను.

పెర్సీ, స్టాన్‌లే, హోవర్డ్ - మొదలగువారు ప్రకటించిన వీరగాథలన్నియు నాయా జమీందారుల యాస్థానములలోనున్న గాయకులు రచించినవనియు, ఆయా జమీందారుల పూర్వుల సాహస కృత్యములను వర్ణించుచు గాని, లేదా సమకాలిక సంఘటనలను వర్ణించుచు గాని వీరగాథలను ఆ ఆస్థాన గాయకులు గానము చేసియుందు రనియు సి.హెచ్.ఫిర్త్ అను ఆచార్యుడు భావించుచున్నాడు. ఆస్థాన గాయకులు గాక, మధ్యయుగముల కవులే వీరగాథలను సృజించిరని ఆధునిక విమర్శకులు తలంచుచున్నారు.

డేనిష్ వీరగాథల నసంఖ్యాకముగా సేకరించిన 'స్వెన్డ్ గ్రండ్ ట్విగ్' వీరగాథలు తక్కిన ప్రయత్న పూర్వక శిల్ప సాహిత్యముకన్న భిన్నములనియు, వీనిలో కవి అగోచరుడనియు తెలుపగా; 'నిరోప్' అనునతడును, కొందఱు స్కాండినేవియా పండితులును సామూహిక కర్తృత్వ సిద్ధాంతమును సంపూర్ణముగా తిరస్కరించిరి. కాని ఆధునిక విమర్శకుల ధోరణి 'చైల్డు' వాక్యములనే బలపఱుచునదిగా నున్నది. వీరగాథలు సామూహిక కర్తృకములు గాక, వైయక్తిక కర్తృకములే యైనను, ఆ కవికి కర్తగా నేమియు ప్రాధాన్యముండదనియు, అందువలననే అవి అనామక కర్తృకములుగా మనకు లభించుచున్నవనియు 'చైల్డు' భావించెను. ఇట్లు వీరగాథల ఉత్పత్తి కర్తృత్వములపై విమర్శకులలో ఖండన ముండనములే కాని ఏకాభిప్రాయము శూన్యమనుట స్పష్టము.

## సిద్ధాంత రాద్ధాంతములు

సామూహిక కర్తృత్వమును బలపఱుచు జానపద సిద్ధాంత వాదులు - ప్రాచీనత, వ్యాప్తి, అనామక కర్తృత్వము, ఆధారములు, పరాశ్రయతా లక్షణము, ఛందస్సు, భాష, అద్వితీయ

లక్షణము - అను ఎనిమిది ముఖ్యాంశములను దృష్టిలో నుంచుకొని, తమ వాదపటిమను నిరూపింప ప్రయత్నించుచున్నారు. వైయక్తిక కర్తృత్వమును బలపఱుచు సాహిత్య సిద్ధాంత వాదులును ఈ యెనిమిది అంశములను ఖండించి, తమ వాదములోని సత్యమును సుప్రతిష్ఠిత మొనర్చుకొన ప్రయత్నించుచున్నారు.

**జానపద వాదులు**

**1)** ప్రాచీనత (Age): ప్రాక్తన మానవుని నృత్తగీతములనుండి పుట్టుటచే వీరగాథలు అతి ప్రాచీనములు.

**2)** **వ్యాప్తి** (Transmission): మౌఖిక సంప్రదాయము(oral tradition)న విస్తృతముగా వ్యాపించుట, నిరక్షరకుక్షుల నోళ్ళలో పలుమార్పుల నొందుట ప్రాచీనతా లక్షణమే.

**3)** **అనామక కర్తృత్వము** (Anonymity): ఏకకర్తృకములు కాక, జానపద సమూహములందు బహుకర్తృకములుగా వెలయుటచేతనే, వీరగాథల రచయితలు తెలియుట లేదు.

**4)** **ఆధారములు** (Sources): జానపద సంఘముల నర్తనమేళము (choral throng)లే వీరగాథల కర్తలు. వీరగాథలు నిమ్నజాతులకు చెందిన సాహిత్యప్రక్రియ. నేటి అనాగరక సంఘములన్నియు ఈ సత్యమును చాటుచున్నవి.

**5)** **పరాశ్రయతా లక్షణము** (Impersonal Character): వీరగాథలలో ఆత్మాశ్రయపరములగు 'నేను' మున్నగు శబ్దములు కానరాక పోవుటచే నివి ఏకకర్తృకములు కావనియు, బృందములలో సృజింపబడిన బహుకర్తృకములనియు స్పష్టమగుచున్నది.

**6)** **ఛందస్సు** (Metre): వీరగాథలు అప్రయత్నముగా ఆశువుగా చెప్పదగిన సులభచ్ఛందములో నుండుటయే కాక, వీనియందు పాదాంతపదము లేక పునరావృత్తి (Refrain) ఉండును. ఈ పాదాంతపదము ఆశువుగా కథనల్లుటకు సహాయపడుచు నృత్యమును సూచించుచున్నది. దీనివలన వీరగాథలు జానపద సమూహములచే నృత్యసమయమున సృజింపబడి యుండునని నిర్ధారితమగుచున్నది.

**7)** **భాష** (Diction): వీరగాథలయందలి భాష నిసర్గమధురమై సరళముగా నుండును. ఈ శైలీసారళ్యము వీని ప్రాచీనతకు పోషకమగుచున్నది.

**8)** ప్రత్యేక గుణము (Unique Character): వీరగాథాకవిత్వము ఇతర ప్రక్రియల కన్న భిన్నమై, ప్రత్యేకలక్షణములతో నొప్పుచుండుటచే నిది ప్రాచీనమైనదని నిశ్చయింపదగును.

## సాహిత్య వాదులు

జానపద వాదులు చెప్పిన పై ఎనిమిది అంశములను సాహిత్య వాదులు నిర్భయముగా ఖండించి వైచిరి:

**1) ప్రాచీనత:** క్రీ.శ. 15వ శతాబ్దము తరువాతనే వీరగాథలు ఐరోపాఖండమున ప్రచురముగా గాన్పించుచున్నవి. ఎంత ప్రాచీనమైన వీరగాథయైనను, 12వ శతాబ్దమునకు ముందు లేదు. క్రీ.పూ. నుండియు శిష్టసాహిత్యముగల భాషలు కొల్లలుగా నున్నవి. కావున ప్రాచీన ప్రౌఢ సాహిత్యమునుండి వీరగాథ లేర్పడినవని తలంపవచ్చును.

**2) వ్యాప్తి:** ముద్రణసౌకర్యములు లేని పూర్వకాలమున మౌఖిక ప్రసరణమే సాధనముగా నుండెడిది. ఇది అతిప్రాచీనతకు లక్షణము కాజాలదు. ఐరోపాఖండమున మత యుద్ధములవలన గాని, 15వ శతాబ్దమున దేశసంచారము చేయుటకు మొదలిడిన 'జిప్సీ'ల వలన గాని వీరగాథలు వ్యాపించినట్లు సాక్ష్యము లభించుట లేదు. కావున వీరగాథలకు అతి ప్రాచీనత్వమును నిర్దేశించు జానపద సిద్ధాంతము సమంజసము కాదు.

**3) అసంవేద్య కర్తృత్వము:** రచయిత తెలియనంత మాత్రమున వానినొక వ్యక్తి రచింపలేదనుట హాస్యాస్పదము. అసంవేద్య కర్తృకమగు నొక వీరగాథను పరిశీలించినచో అందు వైయక్తిక శిల్పము స్పష్టముగా గానగును. వీరగాథ ఒక నాణెము వంటిది. రచయిత నామము ఆ నాణెముపై అక్షరములవంటిది. మౌఖికప్రసరణమను చెలామణీలో ఈ వీరగాథయను నాణెమరిగిపోయి, రచయిత నామాక్షరము లస్పష్టములై, క్రమక్రమముగా నదృశ్యమగును. చెలామణీలో నరిగిపోయిన నాణెముపై మొదట అక్షరములు లేవనుట యెట్టిదో వీరగాథకు రచయిత లేడనుటయు నట్టిదే! ప్రసిద్ధ వీరగాథలన్నింటికిని కవులు తెలియుచునే యున్నారు.

"Ballads that deserve the name had authors and birth dates, though these were lost in oral transmission. Those coming down to us are from professional or semi-professional hands. Medieval singers and reciters, histrioni, jongleurs, jugulares, and minstrels knew verse of many patterns, and some, by the 13th century, must have sung or recited ballads. The authors of the extant English and Scottish ballads appear to have been minstrels, clerics, popular song composers, writers of court and stage entertainment, composers of journalistic broadsides, and individual folk or local poets."[25]

**4) ఆధారములు:** జానపద బృందముల నృత్తగీతములనుండి వీరగాథలు పరిణమించినవనుటకు రెండు అడ్డంకులున్నవి. (అ) ఇప్పుడు లభ్యమగుచున్న ప్రాచీన మత

25. *Prof. Louise Pound, The Encyclopedia Americana, Vol. III, p. 95.*

సంబంధమగు గేయకథలు కాని, వీరగాథలు కాని, జానపద నృత్తగీతములనుండి యేర్పడినట్లుగా ఏమాత్రమును సాక్ష్యమిచ్చుట లేదు. వీరగాథలలోని కథాకథనము (narration) నృత్యమున కడ్డువచ్చును. జానపదసంఘము నృత్యముచేయుచు పాడుటవలన ఆఖ్యానరహితములగు చిన్న చిన్న గేయములు పుట్టును గాని కథాకథనముతోగూడిన వీరగాథలు పుట్టవు.[26] ఒక వ్యక్తి ప్రత్యేక ప్రయత్నము వలననే వీరగాథ జనించును. మౌఖికప్రసరణమున కనువుగా కొంచెము నృత్యము, సంగీతము తరువాత ప్రవేశించియుండును. (అ) వీరగాథలు జానపదులకు సంబంధించినవి గాక, నాగరకములైన ఉన్నత కుటుంబములకు సంబంధించినవని స్కాట్లండు, డెన్మార్కు దేశములందు సాక్ష్యము లభించుచున్నది.[27] కావున జానపద సిద్ధాంతముకన్న సాహిత్య సిద్ధాంతమే బలమైనదనుట.

**5) పరాశ్రయతా లక్షణము:** వీరగాథలు కథాఖ్యాన కవిత్వమునకు జెందినవి. పరాశ్రయ పథమున సాగుట ఈ కవిత్వ ముఖ్యలక్షణము. అంతమాత్రమున నివి బహుకర్తృకములనుట హాస్యాస్పదము. ఏకకర్తృకము లయ్యును, ఆత్మీయతాముద్ర లేని కావ్యము లెన్నియో గలవు.

**6) ఛందస్సు:** వీరగాథలలో నుపయోగింపబడు ఛందస్సు లన్నియును ఆశువుగా జెప్పుటకు వలనుపడవు. పాదాంతపదము పల్లవివంటిది. ఇది వీరగాథల గేయత్వమును సూచించు లక్షణము మాత్రమే. ఇది, గాథలు ఆశుకవితా రూపమున వెలువడిన వనుటను గాని, జానపదుల నృత్తగీతమునుండి పుట్టిన వనుటను గాని సమర్థింపదు.

**7) భాష:** నిరక్షరాస్యులైన జానపద గాయకుల నోళ్ళలో పడుటచే వచ్చిన సరళత్వ పేలవత్వములే కాని, వీరగాథల పుట్టుక నుండియు వచ్చినట్టివి కావు. ఈ గాథలు ప్రథమమున బింకముగా, చక్కని కల్పనలతో, ఉపమానములతో వ్రాయబడియుండును. మౌఖిక ప్రసరణమున సమాసములు, ద్విత్వాక్షరములు, మహాప్రాణాక్షరములు శిథిలములై, శైలి పేలవత్వము నొందును.

"The variation in a piece re-delivered in different circumstances, with unequal care, by many unequally sensitive to expression, may give an appearance of folk-simplicity. It is difficult to reserve the cliches of words (e.g.,

---

26. *"... though corporate singing and dancing may produce chanties, jingles, and the like, it cannot tell a story as the ballad does."*
*- G.G. Smith, Encyclopaedia Britannica, Vol.2, p. 995.*

27. *"There is good testimony, especially in Scotland and Denmark, that the ballads were the concern of the 'upper classes'. - Ibid., p. 994.*

"three"), inversion, and other familiar devices in the ballads to the un-tutored crowd."[28]

**8) ప్రత్యేక లక్షణము:** సాహిత్యమున ప్రతిశాఖయు దేనికదే ప్రత్యేకలక్షణముతో నొప్పుచుండును. అర్వాచీనకాలమున 'నవల', 'కథానిక'ల వంటి ప్రత్యేక సాహిత్యప్రక్రియ లుద్భవించినట్లే, 12వ శతాబ్దమున వీరగాథలు ప్రత్యేక కవితాప్రక్రియగా తలయెత్తినవి. ఇవి జానపద సాహిత్యమున నొక భాగము. వీరగాథయే కవిత్వమునకు శ్రీకారమనుట గాని, దీనికి రచయిత ఉండడని తలచుట గాని సమంజసము కాదు.

మొత్తముపై జానపద సిద్ధాంతముకన్న సాహిత్య సిద్ధాంతమును బలపఱుచు నంశములే యెక్కువగా నున్నవి. ఈ వాదప్రతివాదములలో కొందఱ అభిప్రాయములు సమన్వయ ధోరణిని ప్రదర్శించుచున్నవి. అట్టి విమర్శకులను మధ్యస్థులుగా నెన్నవచ్చును. జానపదవాదులలో, వీరగాథలు ఆదిలో నేకకర్తృకములే యైనను మౌఖిక ప్రసరణమున బహుకర్తృకములగు ననెడి ప్రొఫెసర్ కిట్రిడ్జి పండితుని అభిప్రాయము ఇట్టి మధ్యస్థ నిర్ణయము లలో నొకటి.

ఎఫ్. బి. గుమ్మే పండితుడుగూడ నొకచో ఈ వాదద్వయమునకు సమన్వయమును గూర్చు ధోరణిని ప్రదర్శించెను.[29] పాదాంతపదము, ప్రత్యేకస్వరూపము ఇత్యాది ప్రసిద్ధ లక్షణములతో నొప్పు వీరగాథ వలయనృత్యమున ఆశువుగా జనించియుండి, మౌఖిక ప్రసరణమున చియ్యబట్టి కవితాస్వరూపము నందియుండును. లేదేని ఇదికూడ ఇతర కవిత్వ ప్రక్రియల వలెనే ఒక కవిచే ప్రౌఢముగా రచింపబడి, మౌఖిక సంప్రదాయమున నలిగి నలిగి, ప్రౌఢత్వము సన్నగిల్లి జానపద గుణమును పుంజుకొని యుండును.

H. Somerville అను విమర్శకుడు కూడ జానపద - సాహిత్య సిద్ధాంతముల రెండింటిని సమన్వయ పఱచి, వీరగాథల యుత్పత్తి చరిత్రము నిట్లు వివరించినాడు:

"These appear to have arisen out of the primitive ring-dance -- the Latin ballare means to dance -- in which the dancers accompanied themselves

28. *Ibid., p. 995.*

29. *Either, then the ballad, which carries such popular elements as the refrain or chorus and those peculiarities of structure...., is originally a product of the people under conditions of improvisation and choral dance, but ennobled and enriched on its traditional course in such a way as to endow it with something of the dignity of art; or else it is originally a poem, made like any other poem, but submitted by tradition to influences which give it a popular character.*
*-The Popular Ballad, pp. 28-29.*

by song. Gradually a story crept in, and from this there developed a simple narrative poetical form. The ballad is thus of popular origin -- it was composed by the people for the people. It was later that the minstrels and others, making use of folk traditions and of historical incident, became the individual authors. Even then each minstrel varied the story to suit himself and his audience, and thus we have a great veriety of versions of the same ballad."[30]

## వాదముల సమన్వయము

నృత్య సంగీతములకు అవినాభావ సంబంధ మున్నది. కవిత్వమునకు ఈ రెండింటితోను దగ్గఱ పొత్తున్నది. ప్రాచీనకాలమున వీరుల సాహస కృత్యములు నృత్తగీతము లందు పాడబడుటయు కలదు.[31] కాని అట్టి ప్రాచీన గాథలేవియు నేడు లభించుట లేదు. లభింపనంతమాత్రమున ప్రాచీనకాలమున వీరగాథలు లేవని చెప్పుట యుక్తము కాదు. సామూహిక - వైయక్తిక సిద్ధాంతములలో ఏ యొక్కటియు సంపూర్ణ సత్యముగా స్వీకరించుట కర్హము గాదు. రెండింటను లోపములున్నవి; రెండింటను సత్యములున్నవి.

నృత్యమునకై గుమిగూడిన జానపద సమూహ మంతయు ఆశుకవనము నల్లగల సామర్థ్యము గలిగియుండదు. ఆ సమూహములో గూడ కవితాస్ఫూర్తిగల రసహృదయు డెవడో ఒక్కడే యుండును. అతడే ఆశుకవనమును లయబద్ధముగా పాడును. తక్కినవారు పాదాంత పదమును (పునరావృత్తిని) పాడుచు తాళమును మాత్రము చేకూర్చుచుందురు. నేటికిని వీరగాథలను నృత్తగీతములుగా నుపయోగించుచున్న 'ఫేరో' ద్వీపవాసు లిందుల కుదాహరణములు. కావున నిట్టి పాట జానపద సమూహమందు జనించినప్పటికిని వైయక్తిక కర్తృకమే యగుచున్నది కదా![32] (ఇది సామూహిక వాదములోని లోపము).

వీరగాథను మొదట ఒకే వ్యక్తి ఆశువుగా రచించినను, తరువాత అది మౌఖిక ప్రసరణమున వ్యాపించుచు, అనేకుల దిద్దుబాట్లకు లోనై, స్వస్వరూపమును కోల్పోవును.

---

30. *English Verse from Spencer to Tennyson, p.1.*

31. *"Dance and music have an almost inseparable connection; and poetry has a close association with both.... Even in the early centuries of the Christian era, the deeds of heroes and the victories of great warriors were amongst European peoples celebrated in dance songs." -T.F.Hnderson, The Ballad in Literature, p.1.*

32. *"It is more probable that they sprung like Elizabethan play, lyric, or any other bit of fine literature, whole and alive, from the brain of a man of genius. And in the practice of the Fearoe islanders we have positive evidence that the couplets of the ballads were sung by one person, the dancing crowd singing only the burden or refrain."*

మొదట రచించిన వ్యక్తికి ప్రాధాన్యము తగ్గిపోవును. మౌఖికప్రచార మున్నంతకాలమును ఇది మాఱుచునే యుండును. దీనిని ఈ పేరుగల వ్యక్తి రచించినాడని చెప్పుట కవకాశముండదు. అందుచే వీరగాథ సామూహిక కర్తృకమే యగుచున్నది. (ఇది వైయక్తిక వాదములోని లోపము).

వీరగాథానిర్మాణమున ఎందఱు చేతులుకలిపినను, ప్రత్యేకవ్యక్తి శిల్పచాతుర్యము దానిలో గోచరించుచునే యుండుననుచు నున్నత గోపురోపమానముతో వాదించిన 'ష్లెగల్' పండితున కిట్లు జవాబు చెప్పవచ్చును. సామూహిక కర్తృకమువలె నుండుట వీరగాథ ముఖ్య లక్షణములలో నొకటి. దానియందు ప్రత్యేక వైయక్తిక శిల్పము గోచరింపవలెనని యెవ్వరును కోరరు. అట్లు కోరినచో అది మార్గకవిత్వమగునుగాని జానపదకవిత్వమగుట కాస్కారము లేదు. వీరగాథలు దేశిసాహిత్యమునకు జెందిన జానపదకవితాశాఖయని అందఱును అంగీకరింతురు. కావున నవి వైయక్తిక కృతములైనను వానియందు సామూహిక కర్తృత్వ లక్షణమే భాసింపవలెను. 'ష్లెగల్' పండితుడు చెప్పిన ఉన్నత గోపురోపమానమును పరీక్షింతము. ఒక మహోన్నత గోపురమును నిర్మించుటలో అనేకులు పాల్గొన్నను, వారెవ్వరికిని పేరుండదనియు, దానిని తన నమూనా ప్రకారము దగ్గఱనుండి నిర్మింపజేయు శిల్పికే పేరుండుననియు, అట్లే వీరగాథా నిర్మాణమున నెందఱు పాల్గొన్నను దానిని తీర్చి దిద్దిన మొదటి కవికే పేరుండుననియు 'ష్లెగల్' వాదించినాడు. ఇది సరికాదు.[33] కృత్రిమ శిల్పము నపేక్షించు కావ్యములయెడ మాత్రమే ఇతని అభిప్రాయ మన్వయించును. వీరగాథ నిసర్గకవిత్వమే కాని కృత్రిమకవిత్వము కాదు. 'ష్లెగల్' చెప్పిన ఉన్నత గోపురోపమానము కూడ సరికాదు. ఏ ప్రత్యేకవ్యక్తి పర్యవేక్షణమును లేకయే వందలకొలది ప్రజలచే 'బాబెల్' (Babel) గోపురము నిర్మింపబడలేదా?

సామూహిక వలయ నృత్యము (Communal ring dance)లో దీర్ఘ కథాకథనమున్న వీరగాథలు పుట్టవుకాని, లఘు వీరగాథలు పుట్టుట కవకాశమున్నది. రాయలసీమలో ఓబులరెడ్డి, దొరవారి నరసింహారెడ్డి, మానందిరెడ్డి, రాచోటిరామయ్య - మున్నగువారిపై వ్యాపించిన కోలాటపుపాట లిట్లు పుట్టినవే! కొండరెడ్లు, చెంచులు, కోయలు మున్నగు నాటవిక సంఘములలో నిట్టి వీరగాథానికలు నృత్యమున పుట్టుట నేటికిని గలదు (ఇది సామూహిక వాదములోని సత్యము).

నేడు లభించుచున్న ప్రసిద్ధవీరగాథలు సామూహిక వలయనృత్యమున పుట్టినవి కావు. సుదీర్ఘ కథాఖ్యానములు, సామూహికముగా నృత్యమున పుట్టుక కవకాశము లేదు. ఇవి చేతనా

---

33. *"This is specious argument; but we might reply to Schlegel that an architect is only wanted when the result is required to be an artistic whole. The tower of Babel was built by hundreds of men under no superintendence."*
*-Frank Sidgwick, Popular Ballads of the Olden Time, Introduction.*

శిల్పము లనుటలో సందేహము లేదు. తెలుగులో పల్నాటి వీరకథలను, కాటమరాజు కథలను శ్రీనాథుడు రచించినట్లుగా ప్రబల దృష్టాంతము లున్నవి. మల్లయ్య, కొండయ్య అనుకవులు కూడ పల్నాటి వీరకథలను రచించిరి. శ్రీనాథుని రచనలతోపాటు వీరి రచనలును నేడు లభించుచున్నవి. అట్లే కాటమరాజు కథలలో శ్రీనాథుని రచనలు నేడు లభింపకున్నను, గంగుల పినయెల్లయ్య రచించిన కథలు కొన్ని లభించుచున్నవి. (ఈ గంగుల పినయెల్లయ్యయే కాక, మద్దులేటికవి, కట్టెబోయిన మారయ్య, కనకబండి ఘట్టయ్య, పల్యా చెన్నయ్య, మంగళపురి వెంకటాద్రి, మల్లయ్య - అను కవులు రచించిన కాటమరాజుకథల తాళపత్రప్రతులు నాకు లభించినవి). బొబ్బిలియుద్ధకథను పెద్దాడ మల్లేశం, కొంతం నృసింహాచార్యులు, ధేనువకొండ వారు రచించినట్లు తెలియుచున్నది. పదములను జంగంకథలను రచించిన కవులు పెక్కురు తెలియుచునే యున్నారు. ఈ యుదాహరణము లన్నియును ప్రసిద్ధవీరగాథలు చేతనా శిల్పము లనుటకును, వైయక్తిక కర్తృకము లనుటకును నిదర్శనము లగుచున్నవి. (ఇది వైయక్తిక వాదములోని సత్యము).

వీరగాథలు సామూహిక కర్తృకములు గాక వైయక్తికములే యైనను, ఆ కవికి ప్రాధాన్యముండదనియు, అవి అసంవేద్య కర్తృకములుగా మనకందుట ఈ కవికి గల అప్రాధాన్యము వలననే యనియు జెప్పు F. J. Child వాక్యమును సమంజసమే. ఏలయన, తెలుగులో పల్నాటి వీరకథలను, కాటమరాజు కథలను తప్పించినచో, తక్కిన గాథలన్నిటికిని కవులు తెలియుట లేదనయే చెప్పవలెను. గుజిలీప్రతులలో తెలుపబడిన పేర్లలో చాలభాగము ఆయాగాథలను గానముచేసిన జంగముల పేర్లే యనవచ్చును. ఒక్కొక్కప్పుడు ప్రకాశకుడు గూడ గ్రంథకర్తగా నామమును ముద్రించుకొనుటయు సంభవించినది. సర్వాయిపాపడు కథ, లక్ష్మమ్మకథ, దేశింగురాజుకథలను రచించితిమని చెప్పుకొనిన 'నిడిగంటి వీరయ్యదేవర, చెంగల్వరాజు' అను పేర్లలో వీరయ్యదేవర వీరగాథను పాడిన జంగము; చెంగల్వరాజు ప్రకాశకుడు. బొబ్బిలికథను 1842లో బ్రౌనుదొర ఒక జంగము పాడుచుండగా వ్రాయించినాడు. అదియే నేడు మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారములోనున్న ప్రతి. ''పెద్దాడ నాగేశం కొడుకు మల్లేశం తాను, మల్లేశం చెప్పిన కథ వినుడి'' అని ఈ గాథాంతమున గలదు. ఈ 'మల్లేశం' బొబ్బిలికథను పాడిన జంగమేకాని, దాని రచయిత కాడని నా అభిప్రాయము. బొబ్బిలి యుద్ధము క్రీ.శ. 1757లో జరిగినది. సంఘటన జరిగిన వెంటనే కథ పుట్టును. కావున 18వ శతాబ్దముననే బొబ్బిలికథ పుట్టియుండును. అది మౌఖిక ప్రసరణమున వ్యాపించుచుండగా రచయిత నామమెప్పుడో అరిగిపోయి యుండును. 1842 వఱకును రచయిత నామము పాటలో నుండుట అసంభవము. కాబట్టి గుజిలీ ప్రతులలోని కవుల పేర్లు నమ్మదగినవి కావు. శ్రీపాద గోపలకృష్ణమూర్తిగారును ఈ పేర్లను అనుమానించుచున్నారు: ''ఈ కథలు చాలాకాలము ఆ నోటినుంచి ఆ నోటికి వ్యాపిస్తూనే నిలిచాయి కాని, ముద్రాశాలలు ముమ్మరంగా బయల్దేరిన

1890-1910 సంవత్సరాల మధ్య అచ్చుయినాయి. మరి యీ గ్రంథకర్తలుగా చెప్పుకున్నవారు అసలు రచయితలో, లేక పాఠము చేసి అచ్చులోకి రావడానికి సాయపడ్డావారో తెలియదు.''[34]

వీరగాథలు ఐతిహాసిక క్రమమున నేర్పడినవనుట కూడ సమంజసముగనే యున్నది. వీరగాథలనుండి ఇతిహాసము లేర్పడినట్లుగానే, జానపదుల ఆశురచనలనుండి వీరగాథ లేర్పడినవనుట 'హార్వర్డ్' సంప్రదాయజ్ఞుల నమ్మకము. వీరగాథలనుండి ఇతిహాసము లేర్పడిన వనుటకు ఆంగ్లోశాక్సన్ల కాలమునాటి *Beowulf*, జర్మన్ భాషలోని *Nibelungenlied*, ఫిన్నిష్ భాషలోని *Kalevala* అను ఇతిహాసములు సాక్ష్యమిచ్చుచున్నవి.[35] ఫిన్‌లాండ్ దేశమునకు జెందిన *Dr. Lonnrot* అను పండితుడు తన దేశమందలి ప్రాచీన వీరగాథల నన్నింటిని సేకరించి, వానినొక క్రమములో గుదిగ్రుచ్చి *Kalevala* అను ఇతిహాసము నేర్పఱిచినాడు. ఇందు తన సొంతవాక్య మొక్కటియు జొప్పించులేదని ఆతడు తెల్పియున్నాడు. ప్రాచీనేతిహాసము లెట్లేర్పడినవో సూచించుటకే ఆత డీ ప్రయోగమును చేసినాడు. ఐతిహాసిక క్రమము సత్యమని నిరూపించుట కీతని గ్రంథము ప్రత్యక్ష నిదర్శనము కాగలదు.[36]

మొదట పెద్ద సంఘటనము జరుగును. ఆ సంఘటనపై అనేక వీరగాథలు పుట్టును. అవి యన్నియు నొక క్రమమున నుండును. సమర్థుడగు కవి వీని నన్నిటిని కలిపి ఇతిహాసమును వ్రాయును. దీని నైతిహాసిక క్రమమందురు.

Ballads > Ballad - Cycle > Epic = Epic Process.

ఆంగ్లమున రాబిన్‌హుడ్ అను వీరునిపై అనేక వీరగాథలున్నవి. ఇవన్నియును గాథాచక్రముగా నేర్పడినవి. దీనిని 'Robin Hood Cycle' అందురు. (ఆంగ్ల పరిభాషలో రాబిన్‌హుడ్‌పైగల వీరగాథాచక్రమునకు "Geste of Robyn Hode" అని పేరు). ఐరోపాఖండమున సెర్బియన్ (Serbian) భాషలో కొన్ని వీరగాథలు 'కొస్సోవో' (Kossovo) అను జాతీయవీరుని

---

34. *కిన్నెర, డిసెంబరు, 1953, పుట 555.*

35. *"......scattered ballads gradually clustering together about a common character into ballad-cycles (like the English Robin Hood cycle), and these at length being reduced to approximate unity by the intervention of conscious art. Well known examples are to be found in the Anglo-Saxon "Beowulf", the old Germanic "Nibelungenlied", and the Finnish "Kalevala."*

*- W.H. Hudson, An Introduction to the Study of Literature, p. 106.*

36. *"His work, therefore, provides an interesting object-lesson, for it shows the way in which, in early times, an apic may have been made out of masses of scattered legendary material." -Ibid.*

విషాదగాథను వివరించుచు ఆతని చుట్టును ఒక చక్రముగా నేర్పడియున్నవి. ఈ గాథాచక్రమును "The tragedy of Kossovo" అందురు. ఈ వీరుడు క్రీ.శ. 1383 ప్రాంతమువాడు. అమెరికాలో 'జస్సీజేమ్సు' (Jesse James) పైనను, 'యాంకీ డూడిల్' (Yankee Doodle) పైనను ఇట్టి వీరగాథావృత్తములు వ్యాప్తియందున్నవి. ఆంధ్రదేశమున క్రీ.శ. 1180లో పల్నాటి యుద్ధము జరిగినది. దానిపై సుమారు ఇరువదినాలుగు గాథలు పుట్టినవి. ఒక్కొక్క వీరునిపై ఒక్కొక్క గాథ యున్నది. ఈ అన్నిగాథలును ఒక విధముగా బ్రహ్మనాయని చుట్టును ఏర్పడియున్నవి. కావున నిది బ్రహ్మనాయనిపైగల వీరగాథావృత్తముగా భావింపనగును. ఈ గాథలనన్నిటిని పరిశీలించి 19వ శతాబ్దపువాడగు ముదిగొండ వీరభద్రకవి 'వీరభాగవతము' అను కావ్యమును రచించెను. ఇది సంక్షిప్తముగా నున్నది. దీనినే విపులీకరించినదో గొప్ప ఇతిహాస మయ్యెడిది. అట్లే 13వ శతాబ్దమున కాటమరాజునకును నల్లసిద్ధికిని 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట' జరిగినది. ఆ కాటమరాజుపైనను, అతని బంధువర్గముపైనను సుమారు 32 వీరగాథలు పుట్టినవి. ఇవన్నియును ప్రధానవ్యక్తియగు కాటమరాజును పరివేష్టించి, ఒక ప్రసిద్ధ గాథాచక్రముగా నేర్పడినవి. దీనిని 'కాటమరాజు కథాచక్ర'మని పిలువవచ్చును. గుఱ్ఱముకొండ భక్తవత్సలకవి ఈ వీరగాథలలో నొకదానిని గ్రహించి (పెద్దిరాజు కథ) 'కరియావుల కాటమరాజు చరిత్ర' అను పద్యకావ్యమును రచించెను. ఇట్లు అన్నికథలను స్వీకరించి పద్యరూపమున వ్రాసియున్నచో అది ఇతిహాసమగుననుటలో సందేహము లేదు.

సంస్కృత మహాభారతము కూడ ఇతిహాసక్రమమున ఏర్పడినదే యని కొందఱు విమర్శకులు భావించుచున్నారు. ''కృష్ణద్వైపాయన వ్యాసుడు భారత యుద్ధమును వస్తువుగాగొని 'జయము' అను నొక వీరకావ్యమును గానమొనర్చెనట. దాని నాతని శిష్యుడగు వైశంపాయను డందుకొని స్వకపోల కల్పితములగు వర్ణనలతో పెంచి యుపన్యసించి భారతము చేసెనట. ఈ భారతమునే 'నిఖిల పురాణ వ్యాఖ్యాన వైఖరీ సమేతుం' డగు సూతుడు శౌనకాది మహామునులకు చెప్పునపుడు తనకు దెలిసిన మనోహర వ్యాఖ్యానములతో, ధర్మోపన్యాసములతో, రాజనీతి ప్రశంసలతో పెంపొనర్చి గానముచేయగా మహాభారతమను గ్రంథము రూపొందెను.''[37]

ఆంగ్లోశాక్సను భాషలోని ప్రాచీన గ్రంథమైన Beowulf అను కావ్యమునందు దానికి పూర్వమున్న వీరగాథలెన్నియో అంతర్భూతములైనవని ఎఫ్.బి.గుమ్మే పండితుని అభిప్రాయము. ఆంధ్రదేశమున ప్రజల వ్యవహారమునందున్న కథలెన్నియో రంగనాథ రామాయణమున చోటుచేసికొన్నవి. కావున వీరగాథలనుండియే ఇతిహాసము లేర్పడినవనుట సమంజసముగా నున్నది. ఈ పద్ధతిలోనే జానపదుల ఆశుకవనమునుండి వీరగాథ

---

*37. డ్వాక్టర్ బి. రామరాజుగారు, తెలుగు జానపద గేయ సాహిత్యము, పుట 33.*

లేర్పడియుండును. మొదట వైయక్తిక కర్తృకములుగనే వెలువడును. మౌఖిక ప్రచారమున చేర్పులకు మార్పులకు లోనై, కథాఖ్యానము పరిపుష్టమై వీరగాథయగును.

ఈ ఐతిహాసిక క్రమమును వ్యతిరేకించువారు, ప్రపంచమున ప్రతి సాహిత్య చరిత్రయందును ఇతిహాసయుగమునకు తరువాతనే వీరగాథా యుగము వచ్చుచున్నదనియు, అందుచే ఇతిహాసముల నుండియే వీరగాథ లేర్పడినవి కాని, వీరగాథలను వరుసక్రమమున అతుకుటవలన ఇతిహాసము లేర్పడెననుట అసమంజసమనియు వాదించుచున్నారు.[38] ఇది సబబుగా లేదు. భారతదేశమున హిందీసాహిత్యమందు మొట్టమొదట వీరగాథాయుగమే యున్నది. స్పెయిన్, డెన్మార్కు, పోర్చుగీసు దేశముల సాహిత్యములలో కవిత్వమంతయు వీరగాథలతోనే నిండిపోయినది. అట వేఱొక ప్రక్రియ లేదు. వీరగాథలనుండి ఇతిహాసము లేర్పడినవనుటకు తెలుగులో చక్కని ఉదాహరణమున్నది. బసవపురాణము తెలుగులోని మొదటి ఇతిహాసము. (నన్నయాదుల భారతము మౌలికరచన కాదు; ఆంధ్రీకరణము మాత్రమే). దీనికి మూలము 'పురాతన భక్త గీతార్థ సమితి' యని కవి చెప్పినాడు. ప్రజలు పాడుకొను గేయకథలనుబట్టి ఈ ఇతిహాసము వ్రాయబడినది. పండితారాధ్య చరిత్రయు నిట్టిదే. ఇట్లు వీరగాథలు ఇతిహాసములకన్న ప్రాచీనములని ఊహించుటకు వీలుకలుగుచున్నది. కాని, అట్టి ప్రాచీన వీరగాథ లేవియు నేడు ఉపలబ్ధములు గాకపోవుట దురదృష్టము.

జానపదుల నృత్తగీతమునకును, నేడు మనముపయోగించు నర్థమున వీరగాథకును సంబంధము లేదు. జానపదుల నృత్తమున భావాత్మక గేయము పుట్టును గాని కథాత్మక గేయము పుట్టుట కవకాశము లేదని ముందు తెల్పియుంటిని. నేడు డెన్మార్కు దేశములోను, 'ఫేరో' (Fearoe) ద్వీపములలోను నృత్యమున గేయములను గాక గేయకథలనే ఉపయోగించు చున్నారనుట సత్యమే. అంతమాత్రమున జానపదుల నృత్యమునుండి వీరగాథలు పుట్టినవని చెప్పజాలము. ఆ దేశములందు గేయములు లేవు. ఉన్నవన్నియును గేయకథలే. అందుచే ఆ గేయకథలనే నృత్యములందు ఉపయోగించుచున్నారు. ఇంగ్లండు దేశమునను ఇతర దేశములందును గేయము లధికముగా నుండుటచే ఈ పద్ధతి లేదు. జానపద సమూహముల నృత్తగీతములనుండి వీరగాథ లుద్భవించెననుట కేవిధమగు సాక్ష్యములును లేవు:

"Unmistakable examples of narrative verse so originating, pieces deserving the name of ballads, having plots, structure, wide currency, and achieving persistence, are utterly lacking . . . Such creation is, indeed, not only improbable, but hardly possible psychologically and mnemonically....

38. *"It is universally true that the ballad age succeeds the epic age if both occur in the same literature, so that epics cannot be ballads stitched together"*
*-Chambers's Encyclopaedia, Vol.II, p.74.*

Certainly no masses of them, nor even sure individual instances, have ever been brought forward."[39]

హిందీలోని 'రాసక' శబ్దము, గుజరాతీలోని 'గర్బో' శబ్దము, తెలుగులోని 'గొబ్బి' 'చుట్టు కాముడు', 'వెన్నెల గుడి' శబ్దములు నేటి సుదీర్ఘ వీరగాథల యుత్పత్తిని నిరూపింపజాలునవి కావు. హిందీలోని 'పృథ్వీరాజ రాసో' వంటి వీరగాథలు గాని, తెలుగున బొబ్బిలికథ, లక్ష్మమ్మకథల వంటివి కాని, నేడు వలయాకారమున తిరుగుచు పాడబడుట లేదు. నేడు లభించుచున్న గొబ్బి పాటలన్నియును గేయములే కాని గేయకథలు కావు. ఒకవేళ గేయ కథలు కొన్నియున్నను అవి బొబ్బిలికథాదులవలె సుదీర్ఘములుగాక, ఒక గంటలోపుననే పూర్తి యగు లఘురచనలు. ఈ లఘురచనలుకూడ కొన్ని ప్రసిద్ధవీరగాథలకు అనుకరణములే కాని, వలయనృత్యమున స్వతస్సిద్ధముగా జన్మించినవి కావు. కావున వలయనృత్యమున గేయము లుద్భవించును గాని గేయకథ లుద్భవింపవనుట సత్యము. ఒకవేళ కొన్ని పుట్టినను అవి లఘు వీరగాథలే యగునుగాని, సాధారణ వీరగాథలు కానేరవు. తెలుగునగల కోలాటపు కోపులన్నియు నిందుల కుదాహరణములే!

ఇట్లు వీరగాథల ఉత్పత్తి కర్తృత్వములను గూర్చి యెన్ని సిద్ధాంతములున్నను వీరగాథల స్వరూప తత్త్వములందు మాత్ర మెట్టి భేదమును గానరాదు.

"Opinion may differ about the origin of ballad. May it be individualistic or communal or rhythmic in theory, it has always remained us an accepted truth that ballad is basically a narrative -- impersonal and dramatic in treatment which tend to be related with specific incidents or a series of incidents and legendary exaggerations."[40]

## తెలుగు విమర్శకుల ఉత్పత్తి సిద్ధాంతములు

తెలుగు విమర్శక లోకమున విభిన్న లక్షణములు గల వివిధ సాహిత్యప్రక్రియలను ప్రత్యేక సాంకేతిక నామములతో పిలిచెడి యలవాటు కానరాదు. పల్లెపాటలు లేక జానపద గేయములు (Folksongs), వీరగాథలు లేక జానపద గేయకథలు (Popular Ballads), స్త్రీలపాటలు (Songs of the Women) - ఈ మూడు విధముల ప్రక్రియలకును తెలుగు విమర్శకు లభేదమును పాటించిరి. పనిపాటులయందు పల్లెప్రజలు పాడుకొను ఆత్మాశ్రయ ముక్తక సరళగీతములు జానపదగేయములనియు; వివిధ వర్ణములవారి నాశ్రయించుకొని జీవించు సంచార గాయక భిక్షువులు పాడెడి వీరరసప్రధాన, పరాశ్రయ, కథాసహిత, సుదీర్ఘ

39. *Prof. Louise Pound, The Encyclopedia Americana, Vol.III, p.95.*
40. *Shyam Parmar, 'Ballad singing in India, Folklore, Vol.V, No.8, August, 1964.*

గేయములు వీరగాథలనియు; అగ్రవర్ణముల స్త్రీలు మాత్రమే పాడుకొను ప్రౌఢగేయములు, గేయకథలు స్త్రీల పాటలనియు మెదటి ప్రకరణమున వివరించి యుంటిని. మన విమర్శకు లీ మూడింటిని కలిపి జానపదగేయ మాత్రముగనే సంభావించి, ఉత్పత్తిని గూర్చి ఊహింపసాగిరి. పై మూడు ప్రక్రియలకును మూడు రకముల యుత్పత్తు లున్నవి. జానపద గేయముల కర్తృత్వము తెలియరాదు. ఇవి పల్లెప్రజల హృదయములలో విచిత్రముగా జనించును. వీరగాథలకు జంగములును కవులును కర్తలని తెలియుచున్నది. స్త్రీలపాటలు గూడ శిష్టకవి కృతములే యనవచ్చును. ఈ త్రివిధగేయములకును అభిన్నతను పాటించుటచే మన విమర్శకుల సిద్ధాంతములు పాక్షికము లగుచున్నవి. వీరి సిద్ధాంతములు ఆత్మాశ్రయ కవితలగు జానపద గేయములకు మాత్రమే వర్తించుచున్నవి కాని, వీరగాథలకు వర్తించుట లేదు. ఇందుకొన్ని సిద్ధాంతములు వైయక్తిక కర్తృత్వ వాదమునకు దగ్గఱగను, మఱికొన్ని సామూహిక కర్తృత్వ వాదమునకు దగ్గఱగను, ఇంకను కొన్ని మధ్యస్థముగను ఉన్నవి. ఏమైనను, తెలుగు విమర్శకు లందఱును జానపద కవితా ప్రాచీనత నంగీకరించుటలో నొకే త్రాటిపై నిలిచిరి. ఇది ఇతిహాసాది మార్గసాహిత్యముకన్న ముందు పుట్టినదని ఉద్ఘాటించుటలో మాత్రము వెనుకంజ వేయలేదు.

ఆచార్య పింగళి లక్ష్మీ కాంతంగారు పదకవితావిర్భావము నిట్లూహించుచున్నారు:

''ఏ వాఙ్మయమునందైనను, ఈ పదకవిత్వమే, పద్యకవిత్వముకంటె ముందు పుట్టి పెరుగుననుట బహుజనాంగీకృతమైన సిద్ధాంతము. చిత్ర విచిత్ర కార్య కమనీయ పర్వతారణ్య మయమైన ప్రకృతిలో పుట్టిపెరిగిన ప్రాకృతజీవియగు ప్రాక్తనమానవుని హృదయమున సంతోషమయమో, దుఃఖమయమో యగు ఒకానొక భావము జనించి, పరవశునిచేయగా, అతని నోటివెంట, అప్రతర్కితముగా ఒక పాట వ్యక్తమై యుండుననియు, ఆవేశపూరితుడై ఆతడాపాటను చిందులుత్రొక్కుచు పాడియుండుననియు, ఆడుచు పాడిన ఆ పాటకు 'ఆటపాట' లేక 'నృత్తగీతము' (ballad dance) అని పేరుపెట్టవచ్చుననియు, అదియే కవిత్వమునకు శ్రీకారమనియు, ఈ సిద్ధాంతముయొక్క సారాంశము.''[41]

శ్రీ వావిలాల సోమయాజులుగారు పదకవిత్వోత్పత్తిని గూర్చి ఇట్లనిరి: ''సంతోషం కలిగినప్పుడు ప్రథమమానవుడు చిందులువేస్తూ కూనరాగాలాపనముతో సామాన్య పదకవిత్వము ప్రారంభిస్తాడుగాని, సంస్కృతీభూతమైన పద్యకవిత్వం మొదలుపెట్టడు. అందువల్లనే సాహిత్యవేత్తలు పద్యంకన్నా పదమే మొదట ఏ సారస్వతంలోనైనా ఉద్భవిస్తుందనటంలో ఏకీభవించారు. అదేవిధంగా మన భాషలోనూ ప్రథమంలో పద సాహిత్యము జన్మించి ఉంటుంది.''[42]

---

*41. పల్నాటి వీరచరిత్ర, పీఠిక, పుట 23.*

*42. 'గేయ రచనలు, ప్రాచీనులు' అను వ్యాసము, ప్రతిభ, జూలై 1940.*

పై రెండు సిద్ధాంతములును జానపద కవిత్వముయొక్క ప్రాచీనతను నిరూపించుచు, పాశ్చాత్యుల జానపద సిద్ధాంతమునకు దగ్గఱగా నున్నవి. కాని ఇవి గేయోత్పత్తిని చెప్పుచున్నవో లేక గేయకథోత్పత్తిని చెప్పుచున్నవో తెలియుట లేదు. ఏమైనను ఇవి గేయమునకు వర్తించు వాదములే కాని, గేయకథకు సంబంధించినవి కావని ఊహింపవచ్చును.

శ్రీ తల్లావజ్ఝుల శివశంకరశాస్త్రిగారు పాటల పుట్టుక నిట్లు నిరూపించు చున్నారు:- ''నాగరకత ప్రారంభంలో నాట్యము పుట్టింది. మనుషులు పగలంతా కష్టపడి రాత్రి నలుగురూ ఒకచోట ఉల్లాసముగా కాలము గడిపేటప్పుడు నాట్యము ప్రారంభమవుతుంది. క్రమేణ కూనరాగము బయలుదేరుతుంది. ఆ తర్వాత మనసులో మాట బయటికి అనేటప్పుడు లయ యేర్పడుతుంది. ఈ శబ్దజాలము పాట ఔతుంది. కొద్దిమంది సాహిత్య తత్వవేత్తల మతము మరొక విధముగా కనబడుతుంది. మనుషులు పనిపాటలు చేసేటప్పుడు కష్టము కనబడకుండా ఉండడము కోసము అప్రయత్నముగా కూనిరాగాలు తీయడము, ఏమో మాటలు లయతో అనడమూ సంభవిస్తుంది. పడవలు లాగేవాళ్ళూ, కళ్ళాలదగ్గర పనిచేసే వాళ్ళూ, బండ్లు లాగేవాళ్ళూ, వడ్లు దంచేవాళ్ళూ, పిండి విసిరేవాళ్ళూ పాటలు పాడడము వింటూనే ఉన్నాము. ఈ విధముగా పాటలు ఏర్పడుతవి. ఏది సిద్ధాంతమయినప్పటికీ, కవిత్వము కష్ట నివారణకో, ఉల్లాసముకో ఉదయమవుతుంది.''[43]

ఇది కూడ జానపదగేయోత్పత్తినే చెప్పుచున్నది కాని, వీరగాథల ప్రసక్తిని తెచ్చుట లేదు. పల్లెపాటలు పైరీతిగా పుట్టినవనుట సమంజసమే కాని, బొబ్బిలికథాదులిట్లు పుట్టినవనుట హాస్యాస్పదము కాగలదు.

డా॥ బి. రామరాజుగారు పల్లెపాటలను, వీరగాథలను గలిపి 'జానపద గేయములు'గా సంభావించినను, ఉత్పత్తిని చెప్పునప్పుడు ఒక్క పల్లెపాటలను మాత్రమే దృష్టియందుంచు కొనిరి. ''మానవుడు నాగరకతా సౌధ నిర్మాణమునకు పునాదులు త్రవ్వునప్పుడు అప్రయత్నముగా ననాలోచితముగా నాతని నోటినండి వెడలిన పృథ్వీగంధ సంవాసితములైన మాటలు గంధవహుడు నడచిన బాటలందు పాటలై నడచి, దేశ పరిభ్రమణమున నొకచో విఱిగి, మఱియొకచో తఱిగి, ఇంకొకచో పెరిగి, జానపదగేయ మయ్యెను.''[44] వీరగాథలు ఆదిలో వైయక్తిక కర్తృకములైనను వ్యాప్తియందు బహుకర్తృకము లగునని చెప్పిన 'జి.ఎల్.కిట్రెడ్జి' అభిప్రాయమునకు దగ్గఱగా నున్నది రామారాజుగారి పై ఉత్పత్తి సిద్ధాంతము. వేఱొకచోట రామరాజుగారు పూర్తిగా సామూహిక కర్తృత్వ సిద్ధాంతమువైపే మొగ్గు చూపినట్లున్నది. ''ఆదిలో

43. *'పద కర్తలు' వ్యాసము, వ్యాస సంగ్రహము.*
44. *తెలుగు జానపద గేయ సాహిత్యము, పుట 8.*

వైయక్తికమేయైనను, క్రమపరిణామమున నితర వ్యక్తుల దిద్దుబాట్లకు లోనై సాగిపోయెడి ఏల పదములవంటి గేయములును, ఆదియందే పలువురి యలంకారమునకు గుఱియైన జట్టు పాటలును, రెండును గూడ పరిణతదశలో ప్రత్యేక వైయక్తికములు కావు''[45]

మొత్తముమీద తెలుగువిమర్శకులలో పెక్కురు జానపదగేయోత్పత్తినే చెప్పిరికాని, వీరగాథోత్పత్తినిగూర్చి పట్టించుకొనినట్లు కానరాదు. 'గేయములు-గేయకథలు' అనునవి పరస్పర భిన్నములని వీరు గుర్తించినట్లు లేదు.

తెలుగు జానపద సాహిత్యమున జానపద గేయములు (Folksongs)- జానపద గేయకథలు (Ballads) అను రెండు భాగములు కలవని మొట్టమొదట గుర్తించిన మహనీయుడు డా॥ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు. వీరు 'జానపదగేయ - గేయకథా వాఙ్మయము'ను గూర్చి ముచ్చటించుచు జానపద గేయోత్పత్తి నిట్లు చెప్పినారు: 'జానపదులలో సహజముగ పుట్టి వ్యాపించిన గేయము జానపద గేయము. ఉత్సాహవంతులైన జానపదులు తమ ఆనందానికి అందపురూపు కల్పించడము కోసము గేయమును ప్రారంభించి సాగిస్తారు. ఉత్సాహవేశంతో కుర్రవాడో, కుర్రదో గొంతు విప్పడంతో ప్రారంభమౌతుంది ఈ గేయము. దాని జన్మముకూడ శూరుల జన్మము, సురల జన్మము, ఏరుల జన్మము వలె దుర్జ్ఞేయమే! జానపద గేయమును ఒకడు రెండు పంక్తులు పాడితే, ఇంకొకడు రెండు పంక్తులు చేర్చి మరొకడికందిస్తే, మూడోవాడు దానికి కొన్ని మెరుగులు పెట్టితే, నాలుగోవాడు ఏ గడ్డిబండిమీద పడుక్కునో, ఏ నావమీద సాగిపోతూనో గొంతెత్తి దాన్ని పాడుతాడు. జానపదాలలో గంధవహునివలె విహరించి ఆ నోటినుండి ఈ నోటికి ఎగిరిపోయేది జానపద గేయము''[46]

శ్రీపాదవారు తమ వ్యాస శీర్షికలో జానపద గేయకథా వాఙ్మయము (Ballad Poetry)ను సూచించినను, ఉత్పత్తిలో కేవలము జానపదగేయోత్పత్తినే చెప్పి ఊరకొనిరి. జానపద గేయమునకు సంబంధించినంత వఱకును ఈ ఉత్పత్తిసిద్ధాంతము చాల చక్కగా నున్నది. కాని జానపద గేయకథలు లేక వీరగాథలు మాత్రము ఈ పద్ధతిలో నుద్భవింపజాలవు. ఆ ప్రక్రియయే వేఱు, దాని యుత్పత్తియే వేఱు. సమర్థులయ్యును శ్రీపాదవా రేలకో వీరగాథల యుత్పత్తిని తడవలేదు.

డా॥ రామరాజుగారు చారిత్రక గేయములను గూర్చిన ప్రపక్తిలో వీరగాథల యుత్పత్తిని గూర్చి కొంత తడవి, అవి వైయక్తిక కర్తృకములని సూచించిరి. ''చారిత్రక - లేదా వీరగీతములు తత్తదుచిత వీరసంఘటన మేదియో జరిగిన వెంటనే యుద్భవించును. ఆ సన్నివేశమును

45. అదే.

46. తెలుగు విజ్ఞాన సర్వస్వము, నాల్గవ సంపుటము, పుట 802.

కన్నులార గాంచియో లేక చెవులార వినియో జానపదు డొక డుద్వేగముతో గాన మొనర్చును. ఆ పాట యంతట ప్రాకిపోవును. ఇట్లు విస్తరించుటలో పాటయొక్క వస్తువు కాలక్రమమున మార్పులు పొందును. ఒక క్రొత్తపాటయం దభివర్ణింపబడిన సంఘటనములకు ప్రాతకాలపు గాన ప్రవాహమందలి సంఘటనము తోడై ఊహింపరాని మార్పులు కలుగును.''[47]

వీరగాథలు ప్రాచీన యక్షగానములనుండి పరిణమించినవని కొందఱాధునికులు తలపోయుచున్నారు. శ్రీయుతులు శ్రీనివాస చక్రవర్తి, 'ఎల్లోరా', 'నాజర్' మున్నగువారిట్టి నమ్మకముతో నున్నారు.[48] ఆదిలో యక్షగానములందు ఒకే నటి వివిధ పాత్రలను అభినయించి పాడి వినిపించెడిదనియు; కాలక్రమమున నటి వివిధ ప్రధానపాత్రల నభినయించుచుండగా సూత్రధారుడను వ్యక్తి ఇతరములగు చిల్లరపాత్రల నభినయించి సంధివచనములు పలికెడివాడనియు; మఱికొంత కాలమునకు ఒక్కొక్క పాత్రను ఒక్కొక్కరు అభినయించు సంప్రదాయ మేర్పడిన దనియు ఈ విమర్శకు లూహించుచున్నారు. రెండవదశలో దీనికి 'భామా కలాప' మనియు, మూడవదశలో 'వీథినాటక' మనియు పేరు వచ్చినదట. ఇట్లు యక్షగానములు వీథినాటకములుగా మార్పు చెందినను, వాని ప్రథమ స్వరూపము (ఒకే నటి అన్ని పాత్రలను అభినయించుచు గానముచే కథను చెప్పుట) నశింపక బుఱ్ఱకథగా, హరికథగా పరిణమించి జీవించుచున్నదట.

ఈ ఊహ పైకి సమంజసముగానే కనబడుచున్నది. కాని పై విమర్శకులు సాంప్రదాయక వీరగాథలకును, ఆధునిక కాలమున సాంప్రదాయక గాథల ననుకరణములుగా విజృంభించిన బుఱ్ఱకథలకును భేదమును పాటింపలేదు. యక్షగాన మెంత ప్రాచీనమైనదో వీరగాథయు నంతే ప్రాచీనమైనది. బుఱ్ఱకథలు రెండవ ప్రపంచ యుద్ధ కాలమున పుట్టినట్టి అత్యాధునిక రచనలు. యక్షగానము పేర్కొనబడిన క్రీడాభిరామములోనే పల్నాటి వీరకథలు, పరశురాముని కథలు పేర్కొనబడినవి. ఇవి యక్షగానములు కావు; వీరగాథలు. ఈ ప్రాచీన వీరగాథలనే బుఱ్ఱకథలకు మాతృకలుగా తలపవలెను గాని, యక్షగానమును మాతృకగా తలచుటలో సామంజస్యము కానరాదు. యక్షగానమున నృత్యమునకు ప్రాధాన్య మెక్కువ. వీరగాథలో సంగీత నృత్యములు కథాకథనమునకు కొంచెము తోడ్పడునవి మాత్రమే. గానరూప కథాఖ్యానమే యిందు ప్రధానము. జంగంకథలవలె బుఱ్ఱకథలును యక్షగాన ప్రభావితము లనవచ్చును గాని, యక్షగాన జన్యములనుట పొరపాటు. 'నాజర్' బుఱ్ఱకథను యక్షగానమువలె అన్ని హంగులతోను పాడుచుండును. దీనినిబట్టి ఈ విమర్శకు లిట్లు పొరబడి యుందురు. ప్రాచీనములగు బొబ్బిలివరుసలో నుండు కథలలో ఈ శతాబ్ది ప్రారంభమున యక్షగానప్రభావముచే కీర్తనలు,

---

47. *తెలుగు జానపద గేయ సాహిత్యము, పుట 155.*

48. *చూ. నాజర్ సన్మాన సంచిక, భీమవరం, 1962.*

వచనములు, పద్యములు, దరువులు ప్రవేశించి 'జంగంకథ' లేర్పడినవి. ఈ జంగంకథలలో రాజకీయప్రచారము చొరబడి 1942 ప్రాంతమున బుఱ్ఱకథలు పుట్టినవి. అంతేకాని బుఱ్ఱకథలు యక్షగానముల ఆదిరూపమునుండి పరిణమించినవనుట సరికాదు.

ఇది యిట్లుండ, ప్రాచీన యక్షగానములు వీరగాథలే యని పలువురు పండితులు నిరూపించుచున్నారు. జక్కులు మొదట వీరవనితల గాథలను గానముచేసెడివారనియు, తరువాత వారు కామేశ్వరీ దేవతారాధకులుగా మాఱిరనియు పండితుల తలంపు. మొట్టమొదట జక్కులు వీరనారీమణుల చరిత్రలను గానముచేసెడివారని పంచాగ్నుల ఆదినారాయణ శాస్త్రిగారు చెప్పుచున్నారు. "యుద్ధములు మున్నగు కారణముల వలన గాని, మఱి యితర విధములగు కారణముల వలన గాని తమ తమ సతీత్వ వీరప్రసూత్వాదులను ప్రదర్శించి యతి సాహసమున వీరస్వర్గమును జూఱగొని పేరంటాండ్రై వెలసిన ఆంధ్ర నారీమణుల చరిత్రములను తొలుదొల్తటి జక్కులు తమకు గల గానప్రౌఢిమచే శ్రోతల మనశ్శరీరములు రసాతిరేకమునఁ బులకలెత్తునట్లుగ కీర్తించెడివారు. ఇట్లు కీర్తింపబడిన సతీచరిత్రములు కొన్ని ఈనాటి వఱకును పలనాడు మున్నగు ప్రదేశములలో గల జక్కుల యొద్ద మనము కనుగొనవచ్చును."[49] దీనిని బట్టి ప్రాచీన వీరగాథలనుండి యక్షగానములు పరిణమించినవని నిర్ణయింపవలసియున్నది. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు కూడ యక్షగానముల ప్రాథమిక రూపము వీరగాథలనియే భావించు చున్నారు.[50]

కావున యక్షగానములనుండి వీరగాథలు (లేదా బుఱ్ఱకథలు) పరిణమించినవని తలచు శ్రీనివాస చక్రవర్తి, నాజర్ - మున్నగువారి యభిప్రాయములు ప్రమాదజనితములు. సాంప్రదాయక వీరగాథల కనుకరణములగు నేటి బుఱ్ఱకథలపై యక్షగాన ప్రభావము కొంతవఱకు నుండవచ్చును. అంతమాత్రమున నివి యక్షగాన జన్యములన వీలులేదు. జంగం కథల వలెనే బుఱ్ఱకథ కూడ యక్షగాన ప్రభావము గల ప్రక్రియ. బుఱ్ఱకథలు, హరికథలు మున్నగు ప్రక్రియలు యక్షగానములనుండి పుట్టినవను నమ్మకములను ఆంధ్ర యక్షగాన వాఙ్మయముపై అమోఘపరిశ్రమ సల్పిన డాక్టర్ యస్వీ జోగారావు గారు ఇట్లు ఖండించిరి: "జక్కులకథలు, జంగంకథలు, హరికథలు, బుఱ్ఱకథలు - ఇవన్నియు గానరూపమునఁ గథాఖ్యానమే ప్రధానాశయముగాఁ బ్రారంభింపఁబడినవి. కావునఁ దత్తద్రచనా ప్రక్రియలలోఁ గొంత సాదృశ్యము గోచరించినను వాని వాని ప్రయోగ ఫక్కికలు వేఱు. ప్రయోజనములు వేఱు. వాని పుట్టువు పొలకువలే వేఱు వేఱు."[51]

---

*49. ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచిక, 1921, పుట 123.*

*50. చూ. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర, పుటలు 25,27.*

*51. అదే., పుట 78.*

## ఉపసంహారము

ప్రాక్తనమానవుని నృత్తగీతమునకును, నేడు ఉపలబ్ధములగు వీరగాథలకును ఏ విధమగు సంబంధమును లేదు. ఆ నృత్తగీతమునుండి జానపద గేయము పుట్టుట కవకాశమున్నది కాని గేయకథయగు వీరగాథ జనించుటకు వీలు లేదు.

పల్లె ప్రజల సామూహిక వలయ నృత్యమునుండి జానపద గేయ ముద్భవించును. లేదా లఘువీరగాథ పుట్టును. అంతేకాని సుదీర్ఘ వీరగాథలు జనింపవు.

జానపద గేయమే ఒక సంఘములోని కవిత్వమునకు శ్రీకారమగును కాని, వీరగాథ కానేరదు. వీరగాథలు ఇతిహాసములకు మాతృక లనుట వఱకు సమ్మతింపవచ్చును. ఇవి జానపద గేయములకన్న ప్రాచీనములు మాత్రము కావు. జానపద గేయములు సామూహిక కర్తృకములు కాగా, వీరగాథలు వైయక్తిక కర్తృకములు. ప్రచారమున కొంతవఱకును బహుకర్తృకములు కావచ్చును.

వీరగాథోత్పత్తి నిట్లు నిరూపించవచ్చును: ప్రశాంతముగానున్న సంఘమున నొక సంఘటన జరుగును. ఈ సంఘటన అతి సామాన్యమైనదిగా, చప్పగా నుండునది కాదు. అద్భుతావహమై వీరరసస్ఫోరకముగా నుండును; లేదా కరుణరస సమన్వితమై హృదయ విదారకముగా నుండును. ఈ సంఘటనా కాలమున ఆ ప్రాంతములలో జీవించు జంగము దానిని కనులార గాంచియో లేక చెవులార వినియో ఆ వృత్తాంతము నంతటిని ఆశువుగా పాడును. ఆ జంగము ఆ సంఘటనను స్వయముగా జూచినవాడే కాక, ఆ సంఘటనలోని వ్యక్తుల దగ్గఱ మసలినవాడై యుండును. కథనంతను ఆతడు వివరముగా పాట పాడును. ఒక్కొక్క జంగమునకు సుమారు ముప్పది నలుబది కథలు వచ్చియుండును. ఆ కథలలో తఱచుగా తాను వాడెడి పదజాలముతో, ఉపమానములతో వర్ణనలతో ఈ క్రొత్తకథ నలంకరించును. ఇట్లు ఆశువుగా పాడబడిన ఈ కథ ఈ జంగము నుండి మఱియొక జంగమునకు, ఆతని నుండి వేఱొక జంగమునకు మౌఖికప్రసరణమున వ్యాపించుచు, మార్పులకు చేర్పులకు లోనై పటిష్ఠమై, చక్కని రూపమును దాల్చును. రేనాటిసీమలోని 'కుంటిపుల్లారెడ్డి కథ' (1946 లో జరగిన హత్య), 'దొర్నిపాటి వెంకటరెడ్డి కథ' (1964లో జరగిన హత్య), చిత్తూరు జిల్లాలో 'యల్లమంద నాయుడు కథ' (1954 ప్రాంతముల హత్య), 'కలిచెర్ల నరసింహారెడ్డి కథ' (ఇటీవలి కాలమునాటి గ్రామకక్షలు) మున్నగునవి వీరగాథోత్పత్తి పైరీతిని జరుగుననుటకు ప్రబల నిదర్శనములు. మొదటి ఘట్టములో జంగము సమర్థుడు కానిచో అందు పాట తక్కువగాను, వచనము హెచ్చుగాను ఉండును. క్రమక్రమముగా పాట యెక్కువై వచనము తగ్గిపోవును. ఇట్లేర్పడిన గాథలు కొన్ని ఈ జంగములనుండి పొలములలో పనిపాటులు చేసికొను శ్రామిక

స్త్రీల కడకు చేరును. వారి నోళ్ళలో పడినప్పుడు మిగిలిన స్వల్ప వచనము గూడ అదృశ్యమై, లయ తగ్గి, రాగము హెచ్చి, ఒకే పాటగా మధురముగా సాగిపోవును. జంగములు పాడు సుదీర్ఘ వీరగాథలు ఇట్టి కర్షక శ్రామిక స్త్రీల ముఖములలో హ్రస్వరూపమునంది వీరగాథానికలు (Balladlings) గా మాఱుటయు గలదు.[52]

భారత రామాయణములు వీరగాథలని తలచినచో వ్యాస వాల్మీకులు జంగములవంటి పాత్రలనే నిర్వహించిరని చెప్పవలెను. ఈ కవులకు ఆ కథలలోని పాత్రలతో ప్రత్యక్ష సంబంధమున్నది. వీరు ఆయా సంఘటనలను కనులార గాంచినవారు. రామాయణము ఆశువుగా జనించినట్లు ప్రమాణమున్నది. ఇది తంత్రీలయ సమన్వితముగా వెలువడి కుశలవులచే గానము చేయబడినది.

ఆదిమానవుడు సంగీతలోలుడు. అతడెక్కువగా పాటలు పాడుకొనెడివాడు. ఇప్పటికిని మాలమాదిగల వంటి నిమ్నకులములవారిలోను, కోయ, చెంచు, ఏనాది, ఎఱుకల

---

52. *చిత్తూరు జిల్లా, చంద్రగిరి తాలూకా కొత్తాలపల్లె పరిసరములలో నిట్టి వీరగాథానిక లెన్నియో గొబ్బిపాటల రూపమున జానపద స్త్రీలలో వ్యాపించియున్నవి. బొబ్బిలికథ, లక్ష్మమ్మకథ, కామమ్మకథ, మరాటీకథ, కాంభోజరాజుకథ, నలచక్రవర్తికథ, నల్లతంగాళ్‌కథ, లక్ష్మీదేవికథ, రాముఠాలుకథ, చిన్నమ్మకథ, చెంచీతకథ, కాముడుకథ, అక్కమ్మపాట, ఎఱ్ఱపాపపాట, పసలబాలుడుకథ, గోపుపాట, రంభసీతపాట, వెంకటేశ్వరునిపాట, గవరమ్మపాట, యశోదమ్మపాట, రాజనరేంద్రునికథ, దేవేంద్రుడుకథ, సతీసావిత్రికథ - మున్నగున వన్నియును కొత్తాల, దర్శిపల్లె ప్రాంతములలో జానపద స్త్రీలచే గొబ్బిపాటలుగాను, వరినాటు పాటలుగాను, నారువేతల పాటలుగాను, పాడబడుచున్నవి. సంక్రాంతి పండుగ దినములలో ఇవి అన్నియును గొబ్బి పాటలుగా పాడబడుచుండును. దర్శిపల్లెలో శ్రీమతి దర్శి అక్కమ్మ, నాగమ్మ, రాజమ్మ అను ప్లవంగ కాంతలు ఈ పాటల నత్యద్భుతముగా పాడగల సమర్థురాండ్రు. ''ఈ పాటలన్నియును మీరెక్కడ నేర్చితిరి?'' అని నేను ప్రశ్నింపగా వారు, ''బుసనాగయ్య, వెంకట్రాములు అను జంగములు మా వూళ్ళో గుమ్మేట కథలు చెపుతుంటే వినికిడి వల్ల పాడుతున్నాం'' అని జవాబిచ్చిరి. కావున జంగములు పాడు సుదీర్ఘ వీరగాథలు జానపద స్త్రీలలో లఘు వీరగాథలుగా నవతరించుచున్నవని చెప్పవచ్చును.*

*ఆంధ్రప్రాంతమున పశ్చిమ గోదావరి జిల్లాలోను, తెలంగాణమున నల్లగొండ జిల్లాలోను పై రీతిగా లఘువీరగాథ లేర్పడిన సంఘటనలు నేను పరిశీలించితిని. నల్లగొండ మండలమున కొమ్ములవారు పాడు కాటమరాజుకథలను విని, జానపద స్త్రీలు ''బీరన్న పదము, బత్తిరన్న పదము, ఎర్రన్న పదము'' అనునవి చుట్టుకాముడు పాటలుగా పాడుచున్నారు. పశ్చిమ గోదావరి మండలమున కొవ్వూరు తాలూకా పెదవాడపల్లి గ్రామములో శ్రీమతి గెరవా అరవాలమ్మ అను మాదిగ పడుచు ''అంజమ్మ కథ, హరిదేవి కథ'' అను జంగంకథలను గొబ్బి పాటలుగా పాడుచున్నది.*

వంటి నిమ్నజాతులలోను ఈ గానలోలుపత్వము హెచ్చుగా గానవచ్చును. ఇట్టి నిమ్న వర్గములవారే పూర్వకాలమునను, వర్తమాన కాలమునను వీరగాథల పుట్టువునకు ముఖ్యకారకు లగుచున్నారు. పల్నాటి యుద్ధము జరుగగనే కథానాయకుడగు బ్రహ్మన్న కుడిభుజముగా నున్న మాలయగు కన్నమదాసు సంతతివారే ఆ వీరకథను ఆశువుగా గానము చేసియుందురని నే నూహించుచున్నాను. అట్లే కాటమరాజుకథలను కాటమరాజుకడ సేనాధిపతిగా నుండిన గోసంగి (మాదిగ) వీరుడు బీరినీని సంతతివారు ఆశువుగా గానము చేసియుందురు. బొబ్బిలికథను శ్రీకాకుళ మండలములోని మాలదాసరులు, జంగములు మొట్టమొదట ఆశువుగా గానముచేసియుందురు. లక్ష్మమ్మ, చిన్నమ్మ కథాదులు కూడ ఆదిలో జంగముల ఆశుకవనముగనే వెలువడియుండును. (ముద్రణ కర్తలు కూడ కొంత కవితాగుణమును జేర్చియుందురు. ఇప్పుడు మౌఖిక ప్రసరణమున నున్న గాథలకును ముద్రితములైన గుజిలీప్రతులకును చాల భేదమున్నది). లేదా అస్తవ్యస్తముగా నున్న ఆ యాశుకవిత్వమును ప్రసిద్ధకవులు పరిగ్రహించి ద్విపదరూపమున నిబద్ధించియుందురు. శ్రీనాథుడు చేసినపని ఇట్టిదేయని నా యభిప్రాయము. శ్రీనాథునకు ముందు తెలుగుదేశమున పల్నాటి వీరకథలు లేవనుట పరిణామ సిద్ధాంతమునకు వ్యతిరేకము. జానపదులలో ఆశు రూపముననున్న కథలనే శ్రీనాథుడు నిబద్ధించియుండును. శ్రీనాథుడు సంఘటనా కాలము నాటివాడు కాకపోవుట కూడ ఈ యూహకు పోషకమగుచున్నది. అతడు జానపదుల నుండియు, పెద్దలనుండియు పల్నాటి కథల ఇతివృత్తములను తెలిసికొనియుండును.

రాజుల చరిత్రలను వారి యాస్థానములలోని ఆశ్రితులగు భట్టు, కవులు కీర్తించినట్లుగనే, గ్రామములలోని పెద్ద రైతులకు కక్షలేర్పడినప్పుడు వారివారి జీతగాండ్రు తమ కామందుల గొప్పతనమునుగూర్చి, ధైర్యసాహసములనుగూర్చి కీర్తించుట పరిపాటి. కృష్ణామండలమున, గుడివాడతాలూకా, 'ముదినేపల్లి' దగ్గఱనున్న 'గురజ' గ్రామములో సుమారు 15 సంవత్సరముల క్రిందట పంటపొలముల విషయమై కమ్మవారికిని, మాలలకును గొప్పదొమ్మీ జరగినది. అందొక మాల హతుడయ్యెను. ఆ దొమ్మీని కన్నులార గాంచిన 'భీము'డను పేరుగల మాలవాడు ఆ సంఘటన నంతటిని జముకు వాయించుచు నాశువుగా గానము చేసెను. (కమ్మవారు ఈ పాటను కొంత అణచివేసిరి. లేనిచో చక్కని వీరగాథయొకటి లభించెడిది. ఈ భీముడు 1962 ప్రాంతమున గతించినాడు. ఆ పాట అతనితోనే పోయినది). కాబట్టి పల్నాటి వీరకథలను కన్నమదాసు సంతతివారును, కాటమరాజుకథలను బీరినీని సంతతివారును మొట్టమొదట ఆశువుగా గానము చేసియుందు రనుటలో నాశ్చర్యము లేదు. తరువాత కొంతకాలమునకు శ్రీనాథుడు వీనిని నిబద్ధించినాడు. శ్రీనాథునికన్న ముందే పల్నాటి వీరకథలు వ్యాప్తిలో నున్నట్లు క్రీడాభిరామమున సాక్ష్యమున్నది. పల్నాటి వీరకథలు, పరశురాముని కథలు రెండవ ప్రతాపరుద్రుని కాలమునాటికే ఓరుగల్లులో మిక్కిలి

వ్యాప్తియందున్నవి. దీనినిబట్టి వీరగాథలు మొదట ఏకకర్తృకములుగా ఆశురూపమున సృజింపబడి, పరిణతదశలో పలువుర సంస్కారమునకు లోనై, జానపద గేయములవలె అంతటను ప్రాకిపోవుననియు, ఈ ఆశురచన లొక్కొక్కప్పుడు ప్రసిద్ధకవుల దృష్టినిబడి ద్విపద కావ్యములుగా స్థిరపడుటయు సంభవించుననియు తెలియనగును.

అన్ని వీరగాథలకును ఒకే విధమగు పుట్టుక నూహించుట కూడ సమంజసము కాదు.[53] దీనిని నిరూపించుటయు కష్టమే. నేడు లభ్యమగుచున్న అసంఖ్యాకములగు వీరగాథలు రకరకములుగా నుద్భవించియుండును. కొన్ని పై విధముగా ఆ సంఘటనా కాలమునాటి ఆశు రచనలుగా పుట్టియుండును. మఱికొన్ని జానపద కవిత్వమునెడ అభిమానముగల సుప్రసిద్ధ మార్గకవులచే వ్రాయబడి యుండవచ్చును. తెలుగు వీరగాథాకవిత్వమునకు తలమానికములగు పల్నాటి వీరకథలను, కాటమరాజు కథలను కవిసార్వభౌముడగు శ్రీనాథుడు రచించెనని రూఢిగా తెలియుచున్నది. శ్రీనాథుడు, తనకు పూర్వమునుండియు, జానపదులలో అస్తవ్యస్తముగా, ఆశుధారలుగా పాటల రూపమున నున్న వానిని గాని, వచనకథల (Folktales) రూపమున నున్న వానిని గాని, విని, తన్మయుడై, వానిని సంస్కరించి, ద్విపద కావ్యములుగా సంతరించి యుండును. శ్రీనాథుని రచనల నాధారముగాగొని తరువాతి కాలమున మల్లయ్య, కొండయ్య, గంగుల పినయెల్లయ్య అను జానపదకవులు ఈ కథాచక్రములలో పెక్కు కథలను సృజించిరి. ఉత్తర భారతమున విశేషఖ్యాతి గాంచిన 'పృథ్వీరాజ రాసో' అను వీరగాథను పృథ్వీరాజుయొక్క ఆస్థానకవి 'చంద్ బర్దాయీ' రచించెనని తెలియుచున్నది. ఇతడా సంఘటనను కన్నులారగాంచి రచించిన గాథాకవి. ప్రాచీనేతిహాసములనుండియు, సాహసకావ్యములనుండియు గూడ ఇతివృత్తములను గ్రహించి కవులు వీరగాథలను సృజించిరి. తెలుగులో జంగంకథలు, పదములు అను వీరగాథాప్రక్రియ లిట్లు వ్రాయబడినవే. విశాఖమండలమునుండి పసూడ సన్యాసి, పూడిపెద్ది బుచ్చన్నపంతులు మున్నగు కవు లెన్నియో పదములను రచించిరి. వర్తమాన కాలమున కాశీమజిలీ కథలనుండియు, భట్టివిక్రమార్కుని కథలనుండియు ఎన్నియో వీరగాథలు బయలు దేరుచున్నవి. వీనిని జంగము లాశువుగా పాడుచున్నారు.

వీరగాథల ప్రాచీనతను గూర్చి చర్చించినచో ప్రపంచమున ఏ సాహిత్యమందును అతి ప్రాచీనములైన వీరగాథలు లభ్యమగుట లేదు. అన్నియును 12వ శతాబ్దికి ఈవలివే! తెలుగులో పల్నాటి వీరకథలు, కాటమరాజు కథలు, జంగం కథలు, పదములు మున్నగు వీరగాథా ప్రక్రియల

---

53. *"The ballads had all one type of origin cannot be demonstrated. The large bodies of such songs now collected and available had multiple origins, like other folk-songs."* *-Prof. Louise Pound, Encyclopedia Americana, Vol.III, p.95.*

ఉత్పత్తి కర్తృత్వములు తెలియుచున్నను, పరశురాముని కథలు, అంకమ్మ కథలు మున్నగు శక్తికథల యుత్పత్తి తెలియవచ్చుట లేదు. వస్తువునుబట్టి పరశురామునికథలు అతి ప్రాచీనములై యుండవలెను. మొత్తముపై వీరగాథల యుత్పత్తి కర్తృత్వములను గూర్చి చర్చించుట నిష్ప్రయోజనము.[54] ఏమైనను, జానపద సమూహముల యెదుట పాటరూపమున కథను చెప్పుటకు ప్రయత్నించిన మొదటి వ్యక్తియే మొట్టమొదటి గాథాకారు డగుచున్నాడు. పాల్కురికి సోమనాథుని గేయప్రసక్తినిబట్టి తెలుగున 12వ శతాబ్దమునకు పూర్వమునుండియు వీరగాథలున్నవని తలపనగును. 13వ శతాబ్దమున పల్నాటి వీరకథలు, పరశురాముని కథలు ఓరుగల్లు వీథులలో గానము చేయబడుచుండె ననుటకు క్రీడాభిరామకర్త ప్రమాణము. 18, 19 శతాబ్దములలో సాంఘిక చారిత్రక వీరగాథలెన్నియో పుట్టినవి.

మతప్రచారమున గూడ వీరగాథలు పుట్టుచుండును. భారతదేశమున శాక్తేయము వలనను, వీరశైవమువలనను పెక్కు గాథ లుత్పన్నములైనవి. తెలుగున వీరశైవమతము వ్యాప్తించుట తోడనే, ప్రాచీన శైవభక్తుల కథలును గేయరూపమున ప్రబలియుండును. ఇవియే తెలుగున గల అతిప్రాచీన వీరగాథలు. ఈ శైవకథలను పాల్కురికి సోమనాథుడు ద్విపద రూపమున నిబద్ధము చేసినాడు. తెలుగున వీరగాథలు శైవమత విజృంభణముతోనే పుట్టినవని శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారు తలంచుచున్నారు: ''శైవమత విజృంభణతో సరస్వతి అయిన ఆంధ్రవాఙ్మయంలో వీరగాథలు ఒక శాఖ. పాల్కురికి సోమనారాధ్యుడు. ద్విపదలలో శైవ గాథలనెన్నో రచించినాడు తన రెండు పుస్తకాల్లోనూ. స్త్రీల వ్రతాల గాథలూ, స్త్రీల కథా గేయాలూ ద్విపదలలో వెలిశాయి. జానపదులలో శైవమత ప్రచారము చెయ్యడానికి ద్విపద గ్రంథాలు బాగా పనికివచ్చాయి. కనక వీరగాథలను చెప్పడానికి ద్విపదలే శరణమైనాయి. నాకు చూడగా పల్నాటి వీరచరిత్రయే నేటికీ నిల్చియున్న ప్రాచీనగాథ అనిపిస్తోంది. కృష్ణాగోదావరీ మధ్యదేశానికి శైవవైష్ణవాల సంఘర్షణ పన్నెండవ శతాబ్దమునకే దాపురించింది. పల్నాటి యుద్ధము ఆ సంఘర్షణకు తొలి ఫలము.... కాకతీయులు తొలుత జైనులు, ఆ పిమ్మట వీర శైవులైరి. వీరశైవముతో విజృంభించిన ఆస్తికతతో అన్నిరకముల ఆస్తికతలూ తలలెత్తి, మాహురమ్మకథ, మాతపురాణమూ, గౌతమపురాణమూ, మగ్రిచెట్లకథ, రేణకయుద్ధమూ, కాకతమ్మకథ, అంకమ్మకథ, గంగానమ్మకథ, మాతంగికథ వెలసియుండునేమో ... కామేశ్వరి పాట కూడా ఇట్టిదే. పరశురామ పురాణము వైష్ణవప్రశంస చేయును. అది తరువాతిదై యుంటుంది.''[55]

---

54. *"To linger over mysteries of origin that might differentiate the ballad from other poetic species is futile. The first individual who thought of telling a story in verse, directly to gathered groups, created the first ballad."* -Ibid.

55. *కిన్నెర, డిసెంబరు 1953, పుట 555.*

వీరమతముల వలనను, వీరారాధనము వలనను గూడ వీరగాథలు విశేషముగా పుట్టి వ్యాపించుచుండును. ఆంధ్రసాహిత్యమున సుప్రసిద్ధ గాథాచక్రమగు పల్నాటి వీరకథలలోని బాలచంద్ర యుద్ధమును ప్రప్రథమమున ముద్రించిన అక్కిరాజు ఉమాకాంతముగారు, ఆంధ్ర దేశములో ప్రాచీనకాలము నుండియు వచ్చుచున్న వీరారాధన వలననే పల్నాటికథలు వ్యాపించినట్లుగా సూచించియున్నారు: ''వీరారాధనం భారత వర్షానికి నూతనం కాదు. అయితే 'భవిష్యద్రాజేతిహాసం' అని పురాణాల్లో ప్రదర్శితులైన రాజుల కాలానికి పిమ్మట పల్నాటి వీరులవలె దైవత్వమారోపించి పూజితులవుతున్న యుద్ధవీరులు ఇంతవరకు భారతవర్షంలో మృగ్యులు.... ఇటీవల పరాక్రమప్రధానమైన సిక్కుజాతిలో కూడా ఈ రీతులు కనబడవు. మహమ్మదీయులు ''మొహరం'' సమయంలో ఆచరించే ఆరాధన కొంతవరకు దీన్ని పోలి వున్నది. కార్లైల్ వీరపూజను గురించి యూరపు ఖండంలో ఎక్కువ ప్రచారం చేశాడు. పల్నాటి వీరారాధనవంటి మతప్రస్థాన మెక్కడా యేర్పడి వుండలేదు. స్కాండినేవియాయందలి నార్సుమతం, జపాన్ అందలి షింటోమతం యుద్ధవీరారాధనతో సంబంధం కలవని తెలుస్తున్నది. ఈ వీరమతం ఆంధ్రదేశపు గొప్ప విశేషంగా కనబడుతున్నది.''[56] పల్నాటి సీమలో నేటికిని ఈ వీరమతము నాచరించువారున్నారు. అన్ని కులములలోను వీరు కలరు. వీరికి ''ఆచారవంతులు'' అనిపేరు. వీరిలో కొందఱు పల్నాటివీరుల ఆయుధములను పూజింతురు. వీరిని ''దేవుళ్ళవాళ్ళు'' అందురు. ఈ కథలు పాడెడి మాలలను ''వీర విద్యావంతులు'' అందురు. ఈ వీరమతమునకు కారెంపూడిలో ఆచార్యపీఠమున్నది. దానికి 'పిడుగువారు' వంశపారంపర్యముగా వచ్చుచున్న గురువులు. వీరు ఆరువేల నియోగి బ్రాహ్మణులు. (వీరు బాలచంద్రుని సంగడీడగు అనపోతు వంశమువారని నా ఊహ). ఈ వీరమతమువారు ప్రతిసంవత్సరము కారెంపూడిలో కార్తీక బహుళ అమావాస్య రోజు మొదలుకొని అయిదురోజుల పాటు పల్నాటివీరుల ఉత్సవమును జరపి, వీరగాథలను పాడింతురు. ఇట్లే అంకమ్మను కొలెచెడి కులములవారు అంకమ్మకథలను, ఎల్లమ్మను కొలెచెడి కులముల వారు ఎల్లమ్మకథలను, గంగను కొలిచెడి యాదవులు కాటమరాజుకథలను, రాయలసీమలో చౌడమ్మ నిలువేల్పుగా పూజించు తొగటవీరులు చౌడమ్మ పాటలను, కామేశ్వరిని పూజించు వర్ణముల వారుజక్కులచే కామేశ్వరికథను పాడించుకొనుచున్నారు. ఇవన్నియును మాతాచారమునుండి - ముఖ్యముగా వీరమతములనుండి వీరగాథలు పుట్టుననుటకు నిదర్శనములగుచున్నవి. తెలుగున గల వీరగాథ లెక్కువగా శాక్తేయ మతము వలనను, వీరశైవ మతమువలనను జనించినవని చెప్పవచ్చును. మతాచారమునుండి పాటలు, పాటలనుండి కవిత్వము పుట్టినవని సాహిత్యవేత్తలు కొందఱు నిర్ణయించినారు.[57]

---

56. పల్నాటి వీరచరిత్ర, వావిళ్ళప్రతి, ద్వితీయ భూమిక, పుట 55.

57. *A Russian scholar who had studied the ritualistic songs of his race, comes to a theory of poetic origins embraced in the formula of "ceremony to song, song to poetry". -F.B. Gummere, The Popular Ballad.*

ఆంధ్రదేశమున బ్రాహ్మణేతరులలో పితృదేవతల ప్రీతికొఱకు వీరగాథలను పాడించు నాచారము నేటికిని గలదు. ఇది చాల ప్రాచీనమైన యాచారముగా గన్పట్టుచున్నది: ''పూర్వకాలమున వివిధ దేశములందు వెలసిన నాట్య సంగీత ప్రక్రియ లనేకములు మత ప్రచారముకొఱ కేర్పడియుండుట లేదా మతబీజకములై యుండుట ప్రసిద్ధ విషయము. కాత్యాయనుని శ్రౌతసూత్రములలో (23-3-11) పితృమేధ కర్మకాండమున నొకవిధమగు గీతాభినయప్రక్రియ ఆచరణీయమని సూచింపఁబడినది.''[58] ఆంధ్రదేశమున బ్రాహ్మణేతరులలో పెద్దకర్మరోజున పల్నాటి వీరగాథాగానము చేయించు నాచారమును గూర్చి అక్కిరాజు ఉమాకాంతముగారిట్లు వ్రాసిరి: ''తెలుక్కు మతభాషాగౌరవ మేర్పడ్డదీ వీరచరిత్రయందే..... ఇప్పటికీ ఔర్ధ్వ దైహిక క్రియల్లో బ్రాహ్మణేతరు లనేకులు, వైష్ణవులు నాలాయిరాన్ని వలె పితృప్రీతి నుద్దేశించి వీరచరిత్ర గానంచేయిస్తారు....''[59]. ఇట్టి మతాచారముల వలన వీరగాథలు పుట్టియుండునని తలపవచ్చును. దీనిని నిరూపించు చక్కని యుదాహరణములు కొన్ని నాకు రాయలసీమలో లభించినవి.

పూర్వకాలమున రాజులు, జమీందారులు కవులను పోషించుచు, వారిని సన్మానించి, తమ కిష్టమైన కావ్యములను వ్రాయించుకొనినట్లు శిష్ట సాహిత్య చరిత్ర నిరూపించుచున్నది. ఇట్లే గ్రామీణులు సంచార గాయక భిక్షువులైన జంగముల నాదరించి, వారిచేత తమకిష్టములైన వీరగాథలను పాడించుకొనుట జనపదములలో గానవచ్చు సంప్రదాయము. అంతేకాదు, గ్రామీణు లీ జంగములకు గోదాన సువర్ణ దానములు చేసి, చనిపోయిన తమవారిపై కథల నల్లుడని కోరుదురు. ఇట్లు కోరబడిన జంగము పరమానంద భరితుడై, వెంటనే ఆశువుగా దివంగతుడైన ఆ గ్రామవీరుని గూర్చియు ఆతని సాహసములను గూర్చియు నత్యద్భుతముగా గానమొనర్చును. అది క్రమక్రమముగా ఆ ప్రాంతమంతయు ప్రాకిపోవును. ఇటీవలి కాలమున అనేక వీరగాథలు ఇట్లు జనించినవి.

రాయలసీమలో రేనాటికి చెందిన జమ్మలమడుగు తాలూకాలో 'చిన్న పసుపుల' అను గ్రామమున్నది. అక్కడ ధనిరెడ్డి పుల్లారెడ్డి అను స్థానిక వీరుడుండెడివాడు. ఇతడు 1946 ఆగస్టు 4వ తారీఖున కోవెలకుంట్లలో హత్య చేయబడెను. ఈ పుల్లారెడ్డి చండశాసనుడైనను సత్యధర్మములకై పోరాడిన ధీరుడు. న్యాయాన్యాయ విషయమున ఎంతటివానినైనను లెక్క చేసెడివాడు కాడు. సచ్ఛీలుడు. జమ్మలమడుగు, కోవెలకుంట్ల తాలూకాలలో ఈతని మాటకు తిరుగు లేకుండెను. ఒక కాలు కొంచెము ఈడ్చుచు నడచుచుండుటచే ఇతనిని 'కుంటి

---

*58.* డ్సాక్టర్ యస్వీ. జోగారావుగారు, ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర, పుట *14.*

*59.* పల్నాటి వీరచరిత్ర (వావిళ్ళప్రతి), ద్వితీయ భూమిక, పుట *30.*

పుల్లారెడ్డి' అని పిలిచెడివారు. ఈ ధీరు డొకప్పుడు ప్రమత్తుడై కోవెలకుంట్లలో నొక 'హోటలు' లో నుండగా జంగం బుస్సయ్య అను శత్రువుచే చంపబడెను. ఈ పుల్లారెడ్డి పెద్దకర్మ రోజున ఇతని సతీమణి నారాయణమ్మగారు. యడవల్లి రామలింగం అను జంగమువానిని పిలిచి, తన భర్త ధరించెడి జరీకండువా, సిల్కుపంచె అతనికి బహూకరించి, ఆ జంగమునకు వంత పాడెడిడి స్త్రీకి తన పట్టుచీరనిచ్చి, తన భర్త చేసిన సాహస కార్యములపై నొక కథను పాడుమని కోరెను. ఆ జంగము, పుల్లారెడ్డిని స్వయముగా నెఱిగినవాడు. అతని సాహసములను కనులార వీక్షించినవాడు. ఆ కుంటి పుల్లారెడ్డి అనుచరులగు కుమ్మరి నాగన్నవంటివారు ఆ జంగమునకు మఱికొన్ని విశేషాంశములను దెల్పిరి. ఆ విషయముల నన్నింటిని మనసులో నుంచుకొని యడవల్లి రామలింగమను ఆ జంగమువాడు, తన చెల్లెలు వంత పాడుచుండగా ''రజాభోగతి గలిగి - మేలుభళి'' అను 'కర్నూలు నవాబుకథ' వరుసలో పుల్లారెడ్డిగారి కథను ఆశువుగా గానము చేసెను. తరువాత ఇది 'కుంటి పుల్లారెడ్డి కథ' అను పేరుతో రేనాడంతయు వ్యాపించిపోయినది. ఈ గాథ మొట్టమొదటిసారిగా 1946-47 సంవత్సరములలో పాడబడినది. ఆ తరువాత మౌఖిక ప్రసరణమున ఈ కథ ఆ ప్రాంతపు జంగములలో విశేష వ్యాప్తినందినది. సరిగా సంఘటన జరగిన 20 సంవత్సరములకు (1966 లో) నేను ఈ వీరగాథను సేకరించితిని. ఈ వీరగాథకు నేను మూడు ప్రతులను సేకరించితిని. అందులో దీని మొదటి సృష్టికర్తయగు యడవల్లి రామలింగము పాడిన ప్రతియుగలదు. 1966 ఏప్రిల్ నెలలో కర్నూలు మండలమున పెద్దయమ్మ నూరు గంగతిరునాళ్ళలో ఈ జంగమును జూచితిని. అప్పటికితడు 80 సంవత్సరముల వృద్ధుడు; అంధుడు. అయినను ఈ కథను మహావేశముతో పాడినాడు. కోవెలకుంట్ల తాలూకాలో మఱి యిర్వురు జంగములు పాడగా ఈ కథను వ్రాసికొంటిని. వీరగాథ లెట్లు పుట్టునో ఊహించుటకు ఈ కుంటి పుల్లారెడ్డి కథ చక్కని అవకాశము నిచ్చుచున్నది.

చిత్తూరు మండలమున 'యల్లమందనాయుడు కథ' (1954 ప్రాంతమునాటి హత్య) కూడ కుంటి పుల్లారెడ్డి కథవలెనే 'పూసల బలిజ' లను గాథాకారుల ఆశురచనగా పుట్టినది. ఇట్లే రాయలసీమలో 'అల్లాబక్సు కథ' (కడపజిల్లా, 1960), 'దొర్నిపాటి వెంకటరెడ్డి కథ' (కర్నూలు మండలము 1964) అనునవి ఇప్పుడిప్పుడే తలయెత్తుచున్నవి. కృష్ణామండలమున వ్యాపించిన 'కండెపు సుబ్బయ్యగారి కథ'ను మొట్టమొదట ఒంగోలుకు చెందిన ఒక భట్రాజు ఆశువుగా గానము చేసెనని తెలియుచున్నది. ఆ సుబ్బయ్యగారి పుత్రులు పెద్దకర్మరోజున తమ యాచకుడగు భట్రాజునకు గోదానము చేసి, తమ తండ్రిపై కథను చేయుమని కోరిరట! కాబట్టి ఈ వీరగాథలన్నింటికిని ఆయా ప్రాంతములందలి గాథాకారులే (జంగములు) కర్తలని చెప్పవచ్చును.

వీరగాథలు జంగముల ఆశురచనలే యనుటకు మఱియొక దృష్టాంతము కూడ కలదు. ఈ జంగములలో 'కయికట్టు' (=కవికట్టు =కవిత్వమును అల్లు) 'కయిసేయు' (=కవిచేయు

=కవిత్వమును తయారుచేయు) అను రెండు శబ్దములు వాడుకలో నున్నవి. ''ఈ కథను నీ వెక్కడ నేర్చుకొంటివి?'' అని జంగమును మనము ప్రశ్నించినచో, ఆతడే దానికర్తయగు నప్పుడు ''నేనే కయిసేశాను ఈకతను'' అని సమాధానమిచ్చును. లేదా తనతండ్రి దగ్గఱ నేర్చుకొంటినని చెప్పును. 'కవిత్వమునల్లు' అనుటకు 'కయికట్టు' (కవికట్టు), 'కయిసేయు' (కవిచేయు) అను పదములు రాయలసీమలో, ముఖ్యముగా రేనాటి జంగములలో వాడుకయందున్నవి.

ఆంధ్రదేశమున సాంఘికాచారముల వలన గూడ కొన్ని ప్రత్యేక వీరగాథ లుత్పన్నము లైనవి. భర్త చనిపోయినచో భార్యకూడ ఆ శవముతో గలిసి అగ్నిగుండమున బడి చనిపోవుట హైందవ సంప్రదాయము. ఇది అతి ప్రాచీనకాలము నుండియు భారతదేశమునగల ఆచారము. దీనిని 18వ శతాబ్దమున రాజా రామమోహన్‌రాయ్ ప్రతిఘటించెను. ఆతడు నాటి బ్రిటిషు ప్రభుత్వముతో సంప్రదించి, ఒక శాసనమును జేయించి, ఈ సహగమన దురాచారము నరికట్టెను. అయినను కొందఱు మహాపతివ్రతలు విగతభర్తృకలుగా జీవింపనొల్లక సహగమనము నాచరించుటకై ప్రభుత్వమునుండి ప్రత్యేకముగా అనుమతిబడసి తమతమ భర్తల శవములతో చిచ్చుఱికిరి. ఇట్టి పతివ్రతలు ఆయా గ్రామములలో దేవతలుగా నర్చింపబడుచున్నారు. వీరిని 'పేరంటాండ్రు' అందురు. ఈ పేరంటాండ్ర జీవితములపై వీరగాథలు పుట్టినవి. వీనిని 'పేరంటాండ్ర కథలు' అందురు. కామమ్మకథ, సన్యాసమ్మకథ, మండపేట పాపమ్మకథ, శృంగవరపుకోట యెఱుకమ్మకథ, తిరుపతమ్మకథ, నారాయణమ్మకథ (గూడూరు) - మున్నగు పేరంటాండ్ర కథలన్నియును సహగమనమను సాంఘికాచార సముత్పన్నములే! ఈ పేరంటాండ్ర కథలను పూర్వము వేశ్యాకులమునకు జెందిన 'జక్కు' లను గాథాకారులు గానము చేసెడివారని పండితులు చెప్పుచున్నారు. నేడు జంగములే ఈ కథలను పాడుచున్నారు. సాంఘికాచారము నుండి వీరగాథలు పుట్టుననుట కివి యుదాహరణములు.

యుద్ధ సమయములందు వీరగాథ లెక్కువగా పుట్టుచుండును. ప్రాచీనకాలమున వీరుల నుత్తేజపఱుచుటకు వారి పూర్వులయొక్కయు, వారియొక్కయు సాహసకృత్యములను భట్లు మున్నగువారు కీర్తించుచుండెడివారు. బాలచంద్రుడు యుద్ధమునకుబోవ ననుజ్ఞ గొనుటకై తన భార్యయగు మాంచాలమేడ కేగుచుండగా ఆతనిని భట్లు పొగడుచున్నట్లుగా పల్నాటి కథలలో గలదు.

బ్రాహ్మణుల్ దీవింప భట్లు పొగడంగ
ఆట పాటలవారు నాడుచు రాగ[60]

60. పల్నాటి వీరచరిత్ర (విశాలాంధ్ర ప్రతి), పుట 397.

ఇందు పేర్కొనబడిన 'ఆట పాటలవారు' గాథాకారులై యుందురు. వీరివలననే వీరగాథలు సృజింపబడి యుండును. రామరాజుగా రీ వీరగానమును గూర్చి యిట్లు తలచుచున్నారు: ''పూర్వము మన సైనికవ్యవస్థయందు వీరపాణముండినటులే వీరగానములు కూడ నుండి యుండును. ఆయా రాజులయొక్కయు దండనాథుల, పాలెగార్ల, వీరుల యశోగాన మొనర్చుటకు వారి ఆస్థానములందు వారి పోషణమున వందిమాగధులో, భట్లో, పిచ్చుకుంటువారో, శారదకాండ్రో, గొల్లసుద్దులవారో యుండెడివారు. అట్టివారే తమ వంశము వారికిని తదితరులకును ఈ వీరగీతములను నేర్పుచుండెడివారు. కాలక్రమమున వీరయశో గానమే వారికి వృత్తిగా పరిణమించెను.''[61] దీనినిబట్టి సైనికవ్యవస్థయందును, రాజాస్థానము లందును గూడ వీరగాథలు పుట్టియుండునని తలంపవచ్చును.

ప్రాచీనకాలమున అరేబియాదేశమున నొక వింతపద్ధతి యుండెడిది. ''యుద్ధ సమయంలో ఇరువాగుల వెంట కవులుండేవారు. ఒక పక్షం కవి ఒక కవితగాని, ఒక చరణం గాని చెపితే ఎదిరిపక్షం కవి దానికి సమాధానంగానో, దానిని విరిచి విపరీతార్థంగానో పూరించేవాడు. ఇది యుద్ధంతోపాటు ముమ్మరంగా సాగేది. ఈ యుద్ధరంగకవితను 'రజ్మియా షాయరీ' అంటారు.''[62] ఈ విధమగు కవిత్వమునుండి కూడ వీరగాథలు పుట్టియుండును. ముఖ్యముగా అరేబియాదేశములోని వీరగాథ లిట్లు పుట్టినవని తలంపవచ్చును. యుద్ధములనుండి వీరగాథ లుద్భవించుననుట కీ 'రజ్మియా షాయరీ' కవిత్వమొక దృష్టాంతము.

సంఘటన జరగిన వెంటనే వీరగాథ పుట్టును. యుద్ధసమయములందు మఱింత తొందరగా పుట్టును. 1962లో చైనా భారతదేశముపై దండెత్తినది. ఆ సంఘటనపై 'లడక్ వీరులు', 'చైనా దురాక్రమణ', 'కనువిప్పు', 'భారత దేశం - చైనాద్రోహం' అను బుఱ్ఱకథలు వెంటనే వ్యాపించినవి. 1965లో పాకిస్థాన్ మనపై దండెత్తినది. ఆ యుద్ధమున శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ పూర్వవిద్యార్థియగు లెఫ్టినెంట్ కె. బలరామిరెడ్డి వీరస్వర్గమలంకరించెను. ఇతని స్వగ్రామము కడప మండలమున రాజంపేటకు సమీపస్థమగు 'క్రొండ్లోపల్లె'. ఇతడు మరణించిన కొద్దిరోజులకే కడప మండలమున ఈతని జీవితముపై బుఱ్ఱకథ పుట్టినది. ఇట్లు, సంఘటన జరగిన వెంటనే వీరగాథలు పుట్టుననుటకు ఈ బుఱ్ఱకథలు ప్రబల తార్కాణము లగుచున్నవి. ఈ బుఱ్ఱకథలు అచ్చమగు సాంప్రదాయక వీరగాథలు కాకపోయినను వీరగాథానుకరణములుగా వీని నంగీకరింపవచ్చును!

---

*61.* తెలుగు జానపదగేయ సాహిత్యము, పుటలు *156,157.*

*62.* 'సాహిత్య సేవక్' రచించిన 'కవి సమ్మేళనాలు - ముషాయరాలు' అను వ్యాసము, ఆంధ్ర పత్రిక, ఆదివారము సంచిక, *10-4-1966*

ఎప్పుడును సామాన్య మానవులపై వీరగాథలు పుట్టుట కవకాశము లేదు. విశిష్ట వ్యక్తులపైనను, వీరులపైనను మాత్రమే వీరగాథ లుద్భవించుచుండును. తెలుగులో వీని యుత్పత్తి క్రమము నిట్లు చెప్పవచ్చును. పల్లెలో నొక విశిష్టవ్యక్తి యుండును. ఈ వ్యక్తి ఉయ్యాలవాడ నారసింహారెడ్డివంటి యుద్ధవీరుడో, బుడ్డా వేంగళరెడ్డివంటి దానవీరుడో, కుంటి పుల్లారెడ్డి వంటి చండశాసనుడో, నారాయణమ్మవంటి పతివ్రతయో, నక్కపల్లి రామునివంటి గజదొంగయో యైయుండును. వీరు చేసిన సాహసాద్భుత కృత్యములను ప్రజలు కథలుగా చెప్పుకొనుచుందురు. ఈ స్థితిలో నివి జానపద వచనకథల (Folktales) వలె నుండును. జంగములు ఈ కథలను గ్రహించి గేయకథలుగా గానము చేయుదురు. లేదా జంగము కూడ ఆ సంఘటనను స్వయముగా చూచినవాడైనచో, మధ్య ఈ వచనస్థితి లేకుండగనే ఒకేసారి గేయకథగా నవతరింపజేయును. సంఘటనలోని ప్రసిద్ధవ్యక్తికి సంబంధించినవారు జంగమును పిలిచి కథను కట్టుమని కోరవచ్చును. (కుంటి పుల్లారెడ్డి కథలో అతని భార్య ఇట్లు కోరినది). లేదా సంఘటనలోని ప్రధాన వ్యక్తియే ఒక కవిని పిలిచి తన వృత్తాంతమును పాటగా వ్రాయుమని కోరిన దృష్టాంతములును గలవు. కామమ్మకథలో కామమ్మ సహగమనము చేయుటకు ముందు 'మాదాసు వెంకయ్య' అను కవివరుని పిలిచి, పాతిక వరహాలు, తనభర్త ధరించెడి నగలు ఆ కవికి బహూకరించి, తన కథను వ్రాసి వ్యాప్తిచేయుమని కోరినట్లుగా గలదు:

**మాదాసు వెంకయ్యను పిలుపించినాదీ కామమ్మ**
**తాను పుట్టింది పెరిగింది వ్రాయమన్నాదీ కామమ్మ**
**కవన మేరుపరచి ప్రకాస్తి చెయ్యీ వెంకయ్య**
**పాతికే వరహాలు వెంకయ్యకిచ్చే కామమ్మ**
**మారయ్య నగలన్ని వెంకయ్యకిచ్చే కామమ్మ**
**దేశాలు మీదనే ప్రకాస్తి చెయ్యీ వెంకయ్య**[63]

ప్రజావ్యవహారమున వచనరూపమున గల కథలన్నియు గేయకథలుగా మారునని చెప్పలేము. కొన్ని నాయకుల అద్భుత కృత్యములను వర్ణించుచు, ఆఖ్యాన రహితముగా చిన్న చిన్న గేయములు (Songs)గా మాత్రమే ఏర్పడి యుండవచ్చును. ''వాహువా! నరసింహారెడ్డీ! నీ పేరంటే, రాజా! నరసింహారెడ్డి!...'' అను పాట ఇట్టిదే. లేదా నృత్యమున కనుగుణముగా చిన్న కోలాటపు కోపుగా నేర్పడి యుండవచ్చును. ''దొరవారి నరసింహారెడ్డీ; నీ దొరతనము కూలిపోయె, రాజా నరసింహారెడ్డీ....'' అను కోలాటపు పాట ఇట్టిదే. గడేకల్ నాగిరెడ్డి పైనను, ఓబులరెడ్డి పైనను ఇట్టి కోలాటపు కోపులున్నవి. ఇట్టి కోపులందును, వీరగేయము లందును

63. *కామమ్మకథ, వేలూరి కుప్పుస్వామి మొదలారి ప్రచురణ, చెన్నపట్టణము, 1928, పుట 37.*

కథనము లేకపోయినను, ఒక పెద్ద సంఘటన నివి సూచించుచుండుటచే వీనిని వీరగాథలలో నొక భాగముగనే - 'వీరగాథానికలు' (Balladlings) అను పేరుతో స్వీకరింపవలెను. వచన రూపమున నున్న కథలు కొన్ని సంపూర్ణమగు గేయకథలుగా నవతరించును. అట్టివి 'వీరగాథలు' (Ballads). కుంటి పుల్లారెడ్డికథ, యల్లమందనాయుడుకథ మొదలైనవి. కొన్ని సంఘటన లెంతకాలమైనను గేయరూపమును దాల్పక వచనకథలుగనే ఉండిపోవుటయు గలదు. కోవెలకుంట్ల తాలూకాలో 'బిజినామల జయరాముడు' అనువానిపై నిట్టి వచనకథ యున్నది. వచనరూపము, లఘుగేయరూపము, దీర్ఘ గేయకథారూపము - ఇందే రూపముననున్నను ఇవి యన్నియును మౌఖికప్రసరణమునందే యుండునుగాని, గ్రంథస్థములై యుండవనుట మఱవరానిది. బుడ్డా వేంగళరెడ్డిగారు చేసిన దానములను గూర్చిన కథలలో కొన్ని మాత్రమే పాటలో వచ్చినవి. తక్కిన వెన్నియో వచనరూపమున అనుశ్రుతముగా పెద్దలచే చెప్పబడుచున్నవి. అట్లే నారసింహారెడ్డి చేసిన కొన్ని సాహసములు మాత్రమే వీరగాథలోను, వీరగాథానికలలోను కానవచ్చుచున్నవి. తక్కినవి వచనరూపముననే వ్యాపించియున్నవి. (ఇట్టి వచనకథలలో ''సీతడు - కలికి నారిగాడు'' అను నారసింహారెడ్డి అనుచరులను గూర్చిన కథ నొకదానిని నాకు ఉయ్యాలవాడలో 'దస్తగిరి' అను వృద్ధుడు 17-4-1966న చెప్పినాడు). కావున, మొదట అద్భుత సంఘటన, తరువాత వచనకథ (Folktale), ఆ తరువాత వీరగాథ (Ballad) ఏర్పడుచుండునని చెప్పవచ్చును.

మొత్తముమీద వీరగాథలు రెండు విధములుగా పుట్టుచుండును. (1) జంగముల ఆశురచనలుగను, (2) ప్రసిద్ధకవుల ప్రయత్నశిల్ప సమన్వితములగు రచనలుగను. ఇందు రెండవ విధముగా పుట్టిన వీరగాథలలో మఱల రెండు రకములున్నవి. (అ) గాయక భిక్షువుల ఆశురచనలను, అనుశ్రుతముగా వచ్చు వృద్ధుల వచనకథలను ఆధారముగా జేసికొని కవి నిర్మించిన వీరగాథలు ఒక రకము. మన పల్నాటివీరకథలు, కాటమరాజుకథలు మున్నగునవి యిట్లే శ్రీనాథాదులచే పునర్నిర్మింపబడియుండును. (ఆ) ఇట్లుగాక, కవియే స్వకపోల కల్పితముగా గాని, పురాణముల నాధారముగా జేసికొని కాని రచించిన వీరగాథలు రెండవ రకము. హరిహరీపదములు, శారదపదములు, జంగంకథలు మున్నగునవి యిట్టి వీరగాథల కుదాహరణములు. పసూడ సన్యాసి, పూడిపెద్ది బుచ్చన్నపంతులు, నడిమింటి రామయోగికవి మున్నగు జానపదకవు లిట్టి గాథల నెన్నింటినో రచించిరి. మఱియొక విధముగా పరిశీలించినచో తెలుగులో వీరగాథలు మూడు విధములుగా పుట్టినవని చెప్పవచ్చును. గాయక భిక్షువుల ఆశుకవనముగా పుట్టినవి. బొబ్బిలికథ, బాలనాగమ్మకథ, కాంభోజరాజుకథ, ముగ్గురు మరాఠీలకథ, నారసింహారెడ్డికథ, జగపతిరాజుకథ, సదాశివరెడ్డికథ మొదలగున వన్నియు నిట్టివే. అనగా, బొబ్బిలికథ వరుసలోను తద్భేదములలోను గల వీరగాథలు సాధారణముగా జంగముల ఆశురచనలుగనే వెలువడునని చెప్పవచ్చును. ఇది మొదటి విధమగు పుట్టుక. జంగముల లేదా

గాయకభిక్షువుల ఆశురచనల నాధారముగా జేసికొని కవులు నిర్మించుట రెండవ విధమగు పుట్టుక. జానపదకవులే స్వకపోల కల్పనలతో ప్రాచీన పురాణముల నాధారముగా జేసికొని వీరగాథలను రచించుట మూడవ విధమగు పుట్టుక. జననకాలమున నిందేదియు సిసలైన వీరగాథ కానేరదు. సిసలైన వీరగాథకొక అనిర్వచనీయమైన ప్రత్యేక స్వరూపముండును. దీనిని 'వీరగాథా ప్రమాణము' (Ballad Level) అని పిలువవచ్చును. పైన తెల్పిన మూడువిధములుగా పుట్టిన వీరగాథలలో దేనికిని ఈ ప్రత్యేక స్వరూపముండదు. జంగముల ఆశురచనయగు కథలో కవిత్వము పలుచనై, నీరసముగా, కథాఖ్యానము శిథిల బంధముగా నుండును. ప్రసిద్ధకవిచే రచింపబడిన గాథ (అది పునర్నిర్మాణమైనను, స్వకపోలకల్పితమైనను) ప్రౌఢత చేతను కృత్రిమ శిల్పము చేతను పెళుసుగా నుండును. మొదటిది సిసలైన వీరగాథా స్వరూపమునకు కొన్ని మెట్లు దిగువను, రెండవది కొన్ని మెట్లు ఎగువను ఉండును. ఇవి ఆ వీరగాథా స్వరూపమును జేరుకొన వలెనన్నచో మొదటిది రసమును కవితాగుణములను పుంజుకొని చియ్యబట్టవలెను; రెండవది ప్రౌఢత్వమును కృత్రిమశిల్పమును వర్జింపవలెను. ఇట్టి మార్పులు రావలెనన్నచో పై రెండు విధముల రచనలకును కొన్ని పుతములు పెట్టవలెను. మౌఖిక ప్రసరణమే (Oral Transmission) ఈ పుతము. పులిసిన కొలది మద్యమునకు రుచి హెచ్చునట్లు, వీరగాథ మౌఖిక ప్రసరణమున నలిగిన కొలదిని శ్రేష్ఠత్వము వచ్చి లక్షణసిద్ధమగు ప్రత్యేకస్వరూపము నందును.

"True, some, as we shall find, more than hint that the genuine ballad of tradition is, like good wine, mellowed rather than corrupted by age....."[64]

ప్రౌఢకవి రచనను శిల్పచాతుర్యముతో తీర్చిదిద్దిన స్వర్ణాభరణముతోడను, జంగముల ఆశురచనను అప్పుడే ఖనినుండి త్రవ్విన స్వర్ణఖనిజముతోడను పోల్చవచ్చును. సిసలైన వీరగాథ మెత్తని మేలిమిబంగారము వంటిది. స్వర్ణాభరణము కాని, స్వర్ణఖనిజము కాని ఈ మేలిమి రూపమును దాల్చినప్పుడే నిజమగు వీరగాథయగును. అనగా స్వర్ణాభరణము తనలోని కాఠిన్యమగు రాగిని, కృత్రిమ శిల్పమును వర్జింపవలెను. ఖనిజములో మట్టి, బొగ్గువంటి ఇతర పదార్థములు వర్జింపబడి మేలిమి ప్రకాశింపవలెను. ఈ రెండువిధముల పరివర్జనములును మౌఖిక ప్రసరణ మను మూసలో జరుగును. ఈ మూసలో ఖనిజసదృశమగు ఆశురచన, సలసల కరగింపబడి, స్వర్ణేతర వస్తువులు ఎగురగొట్టబడును. మేలిమి మిగులును. అట్లే కృత్రిమాభరణ సదృశమగు కవిరచన కూడ ఈ మౌఖిక ప్రసరణ మను మూసలో పడి, మెత్తగా కరగిపోయి, కాఠిన్యమునకై కలుపబడిన రాగి తొలగింపబడి వన్నెబంగారముగా మార్పబడును. ఈ వన్నె బంగారమే సాంప్రదాయక వీరగాథ (Traditional Ballad).

64. *T.F. Henderson, The Ballad in Literature, p.9.*

వీరగాథ జానపద గాయకుని నోట ఆశువుగా పుట్టినప్పుడు దానికి కళా గౌరవముండదు. మౌఖిక ప్రసరణమున ఈ గౌరవమబ్బును. అట్లే ప్రత్యేక రచయిత సృష్టిగా వెలసినప్పుడు బహుజనాదరపాత్రత (Popularity) అను గుణముండదు. ఇది కూడ మౌఖిక ప్రసరణముననే సిద్ధించును. 'గాయక భిక్షుని ఆశురచన - కవి ప్రత్యేక రచన': ఈ రెండింటికిని నడుమ వీరగాథా స్వరూప మున్నది. ఈ స్వరూపము లేక ప్రమాణము మౌఖిక ప్రసరణమున మాత్రమే సిద్ధించును. వీరగాథ పైన చెప్పిన రెండు విధములలో ఏ విధముగా పుట్టినను మౌఖిక ప్రసరణమున గాని పారిశుధ్యము నొందజాలదు; ప్రత్యేక స్వరూపమును బడయజాలదు. గాయక భిక్షువుల ఆశుకవనము నుండి కవి పునర్నిర్మించిన వీరగాథలుకూడ పుట్టుక సమయమున ప్రౌఢముగనే ఉండును గాని, వీరగాథా స్వరూపము నందజాలవు. ఇవికూడ మౌఖిక ప్రసరణమున నలిగిన తరువాతనే వీరగాథయొక్క సహజ స్వరూపము నొందును.

ఈ వీరగాథయొక్క ప్రత్యేక స్వరూపము లేక ప్రమాణము అనిర్వచనీయమైనది; అనుభవైక వేద్యమైనది. అయినను దీని నీ క్రింది విధముగా నిరూపింపవచ్చును:

**వీరగాథా ప్రమాణము (Ballad Level)**




రేఖా వివరణము: PC = Poet's Creation
TB = Traditional Ballad
MI = Minstrel's Improvisation

కవుల ప్రౌఢరచనలకన్న, గాయక భిక్షువుల ఆశురచనలే తొందరగా వీరగాథా ప్రమాణము నందుకొనును. 1945-49 మధ్యకాలములో కమ్యూనిస్టుపార్టీవారు తెలంగాణమున నైజాముకును, కాంగ్రెసు ప్రభుత్వమునకును వ్యతిరేకముగ గొప్ప పోరాటమును నడపిరి. ఈ

పోరాటమున మరణించిన వీరులపై ఈ పార్టీవారు కొన్ని పాటలను వ్రాసిరి. ఈ పాటలు ప్రౌఢములుగా గాక, జానపదుల పాటల వరుసలలోనే వ్రాయబడినవి. శ్రీ సుద్దాల హనుమంతు, శ్రీ తిరునగరి రామాంజనేయులు మున్నగు విద్యావంతులగు కవులే వీనికర్తలు. అయినను ఇవి సిసలైన జానపద గేయములుగను వీరగాథలుగను మాఱుటకు కొన్ని యేండ్లు పట్టినది. ఇవి సుమారు పది పదునేను సంవత్సరముల కాలము మౌఖిక సంప్రదాయమున నలగి నలగి, తెలంగాణా జానపద కవిత్వమున కలసిపోయినవి. నేడు నల్లగొండ జిల్లాలో ఈ పాటలు, వీరగాథలు, కర్షకులు, శ్రామికులు, స్త్రీలు, జంగములు - మున్నగు వారిచే పాడబడుచు బహుళవ్యాప్తి నందియున్నవి. ఈ పాటలను మొదట రచించిన కవులు తమ రచనలను పోగొట్టుకొని, ప్రజలనుండి వానిని సేకరించుకొనదలచి, కొన్నేండ్లు పోయిన తరువాత నల్లగొండ మండలమున కేగి, తమ పాటలను విని తామే ఆశ్చర్యపోయిరట! వారు మొదట వ్రాసిన స్వరూపమునకును నేడివి ప్రజలలో వ్యాపించియున్న రూపమునకును ఎంతయో భేదమున్నది. ఇట్లు విద్యావంతులగు కమ్యూనిస్టుకవులు వ్రాసిన పాటలు, పాటలకథలు జానపద రూపమునందుటకు పది పదునేను ఏండ్లు పట్టగా 'యాదగిరి' అను ఒక నిరక్షరకుక్షియగు కమ్యూనిస్టు జానపదుడు, ప్రాచీన జానపదగేయపు వరుసలో, ఆనాటి నైజాము క్రౌర్యముపై ఆశువుగా చెప్పిన ఈ క్రింది గేయము, కొలది దినములలోనే వీరగీతమై తెలంగాణమంతటను మాఱు మ్రోగిపోయినది:

> నైజాము సరకరోడ – నాజీల మించినోడ
> యమ బాధలు పెడితివి కొడుకో నైజాము సరకరోడ!
> పండీన పంటనంత తిండికైన ఉంచకుండ
> తీసికెళ్ళినావు కొడుకో నైజాము సరకరోడ!
> చుట్టూన సూర్యాపేట – నట్టనడుమ నల్లగొండ
> అవతాల గోలగొండ – గోల్కొండ ఖిల్లకింద
> నీ గోరి కడతం కొడుకో – నైజాము సరక రోడ!![65]

---

65. ఈ పాటకు మూలమగు ప్రాచీన జానపద గేయ మిట్లుండును:

> చుట్టున్న సూర్యాపేట – నట్టనడుమ నల్లగొండ
> దానెనుక హైదరబాద – అవతాలగోలుకొండ
> గోల్కొండ ఖిల్లామీద – మల్లెపూల నల్లగొడుగు
> ఆ గొడుగు కింద మడుగు – పడుచు వయ్యారిభామ
> భామాను దెచ్చుకోర – బంగారు జంగమోడ!
> ముద్దాల జంగమోడ! – వయ్యారి జంగమోడ!

కావున ప్రసిద్ధకవుల రచనలకన్న నిరక్షరాస్యులగు జానపదుల ఆశురచనలే త్వరగా వీరగాథా స్వరూపమును జేరుకొనును. జంగములు ఆశువుగా పాడిన కథలే అనతికాలమున సాంప్రదాయక వీరగాథలగుట కవకాశమున్నది. ప్రసిద్ధకవులు కూడ కల్పనలలోను, పదజాలములోను కృత్రిమత్వమును జూపక, జానపదుల సహజధోరణిని జక్కగా నాకళింపు జేసికొని రచింపవలెను. ఇట్లు చేసినచో అనతికాలముననే అవి వీరగాథాప్రమాణము (Ballad Level)ను జేరుకొనగలవు. నల్లగొండ జిల్లాలో తిరునగరి రామాంజనేయులు, సుద్దాల హనుమంతు మున్నగు కమ్యూనిస్టు కవులు రచించిన పాటలు జానపద గేయములుగా పరివర్తన చెందుటకు గల ముఖ్యకారణము, వారు జానపదుల గేయఫణితులను బాగుగా నాకళింపు జేసికొని అనుకరించుటయే;[66]

వీరగాథల పుట్టుక ఆయాప్రాంతముల శీతోష్ణపరిస్థితుల పైనను, ప్రజల మనస్తత్వముల పైనను గూడ ఆధారపడి యుండునేమో అని అనుమానింపవలసి యున్నది. దేశము పర్వతారణ్యములతో నిండి, ప్రజలు మోటువారుగను, యుద్ధప్రియులుగను ఉన్నప్పుడు,

---

*66.* *నేను 1966 ఆగస్టు 30వ తేదీని, గుంటూరు జిల్లా మాచెర్లలో నున్న తిరునగరి రామాంజనేయులుగారిని కలిసికొంటిని. ఈయన తెలంగాణా పోరాటమున స్వయముగా పాల్గొనిన వ్యక్తి. జానపద కవి. తాము అజ్ఞాతవాసములో నుండగా నల్లగొండ అరణ్యములలోగల కోయ, చెంచు, మున్నగు గిరిజనుల పాటలను, వాని వరుసలను బాగుగా పరిశీలించితి ననియు, ఆ వరుసలలోనే తమ పార్టీ ఉద్యమముపైనను, మరణించిన కార్యకర్తలపైనను పాటలు వ్రాసితి ననియు వీరు నాతో చెప్పిరి.*

*నేను 2-9-1966 న పల్నాడు తాలూకాలోని జానపాడు గ్రామమున బొగ్గవరపు కోటయ్య అనునొక వృద్ధుని కలిసికొంటిని. అతడు పాడుచుండగా 'పోట్ల బూదయ్య పదము'ను వ్రాసికొంటిని. ఇది ఆ ప్రాంతమున వ్యాప్తియందున్న ఒక లఘువీరగాథ. దీనికి కర్త ఈ కోటయ్యయే. ఇతడు భజనకీర్తనలను బాగుగా పాడగలడు. జానపదగేయ ఫణితులను ప్రశస్తముగా ననుకరింపగలడు. నే నా గ్రామమునకు జేరునాటికి సరిగా నెలరోజులకు ముందు (అనగా 2-8-1966న) ఆ జానపాడు గ్రామములో నొక దారుణమగు హత్య జరగినది. 'ఆదెమ్మ' అను స్వైరిణి ఉపభర్తతో కూడి అసలు భర్తను చంపివేసినది. ఈ సంఘటన జరగిన ఇరువది రోజులకే ఈ బొగ్గవరపు కోటయ్య ''నాయుడో రింటికాడ, నల్లతుమ్మ చెట్టుకాడ......'' అను ప్రసిద్ధ ప్రాచీన జానపద గేయపు వరుసలో 'ఆదెమ్మ పాట'ను రచించినాడు. ఇది ప్రజలలో ప్రచారమగుటకు సిద్ధముగ నున్నది. దానికి జనామోదము (public approval) అనతి కాలములోనే వచ్చును. ఇందలి సహజ కవితాశయ్య, జానపద పదజాలము, స్థానికేతివృత్తము మున్నగునవి దీనిని అతిశీఘ్రముగా జానపద గేయములలో కలిపి వేయును. ఈ కోటయ్య వంటి జానపద కవులచే గూడ వీరగాథలు లేదా వీరగాథానికలు త్వరితగతిని పుట్టుచుండును.*

దేశమున తఱచుగా అరాచకములు చెలరేగుచుండినప్పుడు వీరగాథలు పుట్టుట కవకాశము హెచ్చు. ఇంగ్లండు, స్కాట్లండు దేశములను పోల్చి చూచినచో ఈ విషయము స్పష్టమగును. ఆంగ్లేయులు కవిత్వప్రతిభలో ప్రపంచకీర్తి నార్జించిన మహామహులు. అయినను ఇంగ్లండు దేశమున ఉత్తమ వీరగాథలు పుట్టలేదు.[67] ఆంగ్ల సాహిత్యవేత్తలు తలచుకొని గర్వించు వీరగాథలన్నియును స్కాట్లండు దేశమున పుట్టినట్టివే! ఏలయన, ఇంగ్లండుప్రజల మనస్తత్వము, దేశపరిస్థితులే వీరికి 'నాశిరకము' వీరగాథలను ప్రసాదించినది. ప్రాచీనకాలముననే ఇట సుస్థిరప్రభుత్వము నెలకొన్నది. ప్రజలు ఉత్తమ సంస్కారముగల సాత్త్వికులు. స్కాట్లండు ప్రజలిట్టివారు కారు. వారు మిక్కిలి మోటువారు. ఆ దేశము పెక్కేండ్లు అరాచకమున మునిగి యున్నది. అట దోపిడులు, కొట్లాటలు, హత్యలు విచ్చలవిడిగా జరగెడివి. ఇవన్నియును వీరగాథలకు ప్రశస్తమగు నితివృత్తములు. అందుచే స్కాట్లండులో నుత్తమమైన వీరగాథలు కొల్లలుగా జనించినవి.

పైన తెల్పిన కారణముల వలననే భారతదేశమున రాజస్థాను మహారాష్ట్రములు వీరగాథల పుట్టలైనవి. వీరజాతియగు శిక్కులకు మాతృభూమి - పంజాబుకూడ పైవానితో తులతూగ వలసియు, కొంచెము వెనుకబడియున్నది. దీనికొక ముఖ్యకారణమున్నది. శిక్కుమతము చాలకాలముపాటు జైన, బౌద్ధముల వలెనే సాధుమతముగా నుండెడిది. హిందూ మహమ్మదీయులకు సఖ్యత చేకూర్చుటయే శిక్కుమత స్థాపకుడగు గురునానక్ ముఖ్యోద్దేశము. 'శిక్' అనగా 'శిష్య'డని యర్థము. నానక్ ఈ మతమునకు మొదటి గురువు. పదియవ గురువగు గురుగోవిందు వఱకును ఇది సాధుమతమే. ఈ గురుగోవిందు తండ్రియగు తేజ్ బహదూర్‌ను మొగల్ షాదుషాయగు ఔరంగజేబు వధించెను. దానితో గురుగోవిందులో పౌరుషజ్వాల రగిలి శిక్కులను 'సింగులు'గా మార్చెను! శిష్యులు సింహములై విజృంభించిరి! కావున గురుగోవిందు కాలము (17వ శతాబ్దము) నుండియే శిక్కులను వీరజాతిగా పరిగణింపవలసి యున్నది. అంతకు పూర్వము వీరందఱును సాధువులే. ఇట్లు శిక్కులు ఇటీవలి కాలమున మాత్రమే వీరజాతిగా మాఱినవారగుటచే వీరిలో ప్రాచీనమైన వీరగాథలు పుట్టుట కవకాశము లేకపోయినది. రాజపుత్రస్థానము క్రీస్తు పూర్వము నుండియు శూరకులముల కాలవాలమగుటచే అది వీరగాథల పురిటిగడ్డయైనది! 17వ శతాబ్దమున వీరజాతిగా మాఱిన శిక్కులు నేడు భారత

67. *"Perhaps, tthe circumstances and even the character of the English had something to do with this general inferiority of their ballads. England early became a comparitively orderly country. It did not provide many of the wild happenings which form such good ballad themes. Some of the finnest Scottish ballads tell stories of terrible revenges and feuds."*

*-Mrs. Margaret L. Woods, 'The Ballads', Essays by Divers Hands, Vol. Vi, p..39.*

సైన్యమున నత్యంత కీలకస్థానము నాక్రమించి యున్నారు. కావున భావిలో పంజాబు రాష్ట్రము వీరగాథల కాటపట్టు కాగల యవకాశములు హెచ్చుగానున్నవి. గురుగోవిందు శిక్కులను వీరజాతిగా మార్చుటయే కాక, వీరగాథలను వీరగాథాగానమును ప్రోత్సహించినాడు. తాను స్వయముగా వీరగాథను రచించినాడు. ఈ గురుగోవిందు కాలమునుండియే శిక్కుభాషలో వీరగాథలు కానవచ్చుచున్నవి. ప్రాచీనకాలమున రాజపుత్రస్థానమువలెను, మధ్యకాలమున మహారాష్ట్రమువలెను, వర్తమాన కాలమున పంజాబు వీరజాతికిని, వీరగాథలకును పట్టుగొమ్మ యగుచున్నది.

రాజపుత్రస్థానమువలె అతిప్రాచీనములగు ఉత్తమవీరగాథలుగల రాష్ట్రము ఆంధ్ర ప్రదేశము. దేశ నైసర్గిక పరిస్థితులను, ప్రజల మనస్తత్వములను దృష్టిలో నుంచుకొని పరిశీలించినచో దీనియందు గూడ కొన్ని ప్రాంతములు వీరగాథా సంపదలో అతిసాంద్రములు గను, మఱికొన్ని ప్రాంతములు అంతంతమాత్రములుగను నున్నవని గుర్తింపవచ్చును. నాగరకతలో వెనుకబడిన మండలములలో సిసలైన వీరగాథలు పుట్టును. ఇట్టి ప్రాంతముల ప్రజలలో పౌరుషము, ప్రతీకారవాంఛ, కోపము, పట్టుదల, క్రౌర్యము, శాసనధిక్కారము హెచ్చు. ఆంధ్రప్రాంతమున శ్రీకాకుళము, విశాఖమండలము, గుంటూరు నెల్లూరు మండలముల పశ్చిమ ప్రాంతములు (పల్నాటిసీమ, కనిగిరిసీమ), రాయలసీమలో కడప, కర్నూలు అనంతపుర మండలములు; తెలంగాణమంతయును - ముఖ్యముగా నల్లగొండ మండలము - వీరగాథ లధికముగా పుట్టిన ప్రాంతములు. ఈ ప్రాంతములలో ఉత్తమవీరగాథలు పుట్టినవి. ఇంకను పుట్టుచున్నవి. నేడు ఆంధ్రులు గర్వించు వీరగాథలన్నియును ఈ ప్రాంతముల లోనివే:

| కథలు | ప్రాంతము |
|---|---|
| బొబ్బిలి కథ<br>జగపతిరాజు కథ<br>హరిహరీ పదములు | శ్రీకాకుళము, విశాఖ మండలములు |
| పల్నాటి వీరకథలు<br>లక్ష్మమ్మ కథ<br>వీర రాజమ్మకథ | పల్నాటి సీమ (గుంటూరు మండల పశ్చిమ భాగము) |
| కాటమరాజు కథలు - | కనిగిరి సీమ (నెల్లూరు మండల పశ్చిమ భాగము) |
| బంగారు తిమ్మరాజు కథ<br>చిన్నమ్మ కథ<br>ముగ్గురు మరాఠీల కథ | అనంతపుర మండలము |

బాల నాగమ్మకథ
కర్నూలు నవాబు కథ
నారసింహారెడ్డి కథ
అప్పలాపురం చెన్నారెడ్డి కథ
కుంటి పుల్లారెడ్డి కథ
} కడప, కర్నూలు, మండలములు

సర్వాయి పాపడుకథ
సదాశివరెడ్డి కథ
మియాసాబ్ కథ
రాణీ శంకరమ్మ కథ
రాజారామేశ్వరరావు కథ
రావులమ్మ కథ
} తెలంగాణా

పైన తెల్పిన ప్రాంతములలో నేటికిని వీరగాథాసృష్టి విరివిగా కొనసాగుచున్న దనుటకు శ్రీకాకుళములోని 'దువ్వందొర కథ', రాయలసీమలోని 'కలిచెర్ల నరసింహారెడ్డి కథ', తెలంగాణమున (మహబూబ్‌నగర మండలము) 'ఆలంపూర్ చంద్రశేఖరరెడ్డి కథ', 'మలగర బాలేసాబు కథ' మున్నగునవి సాక్ష్యములు. ఈ వీరగాథా నాయకు లందఱును వర్తమాన కాలమువారే!

నీరు నాగరకతా చిహ్నము. నీటిపాఱుదల ఏర్పాట్లు హెచ్చుగానున్న ప్రాంతములలో ప్రజలు సాధువులుగా నుందురు. అట్టి ప్రదేశములలో సామాన్య నేరములున్నను హత్యానేరములు తక్కువగ నుండును. హత్యలు లేనిచో వీరగాథలకు పసందైన ఇతివృత్తములు లభింపవు. కృష్ణా గోదావరీ మండలములు, గుంటూరు, నెల్లూరు మండలముల తూర్పు భాగములు, చిత్తూరు మండలము నాగరకత హెచ్చిన ప్రదేశములు. నాగరకత జానపదసాహిత్యమునకు చుక్కెదురు. ఈ ప్రాంతములలో ఉత్తమ వీరగాథలు పుట్టుట కవకాశము లేదు. అసలు పుట్టుట లేదన్నను సత్య దూరముకాదు. నాగరక ప్రాంతములలో వీరగాథాజననము స్తంభించిపోయినది. ఏవో కొన్ని పేరంటాండ్ర కథలు తప్ప (ఇవి వీరరస ప్రధానములు కావు), కృష్ణా గోదావరీ మండలములలో గర్వింపదగిన వీరగాథలు లేవు!!

నీటిపాఱుదల హెచ్చుగానున్న ప్రాంతములలో వరిపంట యెక్కువగా పండును. ఈ వరియన్నము తిను ప్రజలకు పౌరుష బలపరాక్రమములు తక్కువయని చెప్పవచ్చును. వీరు మిక్కిలి భోగలాలసులుగా నుందురు. నీరులేని మెట్ట ప్రాంతములలో జొన్నలు పండును. ఈ జొన్నలు తిను ప్రజలు బలాఢ్యులై యుందురు. బలపరాక్రమాదులు వీరియందు మెండు. వీరు

కష్టజీవులు. గుంటూరు మండలమున పల్నాడు, రాయలసీమలో రేనాడు దీనికి చక్కని ఉదాహరణములు. నేడు నాగార్జునసాగర్ ప్రాజెక్టువలన పల్నాడంతయు నీటిపాఱుదల సౌకర్యములచే మాగాణిగా మాఱిపోగల 'ప్రమాద'మున్నది. దేశసౌభాగ్య దృష్టితో చూచినప్పుడిది ప్రమోదమేయైనను, వీరగాథాసంపద దృష్టితో చూచినప్పుడిది 'ప్రమాదమే'! ప్రశస్త వీరగాథా గానముతో మాఱుమ్రోగెడి నేటి పల్నాడు, వరిపంటతో నాగరకమై, అనతి కాలముననే కృష్ణా, గోదావరి డెల్టాల వలెనే వీరగాథాదారిద్ర్యముచే నిర్వీర్యము కాగలదు!!

రాయలసీమలో రేనాడు వీరగాథల కాటపట్టు. కడప-కర్నూలు మండలములోని ఈ క్రింది ప్రాంతములను 'రేనాడు' అందురు: కడప మండలములో ప్రొద్దుటూరు తాలూకా ఉత్తరభాగము, జమ్మలమడుగు తాలూకా పూర్తిగాను, కర్నూలు మండలములో కోవెలకుంట్ల తాలూకా పూర్తిగాను, నంద్యాల తాలూకా దక్షిణభాగము, ఆళ్లగడ్డ తాలూకా పడమటి భాగము. ఈ రేనాడును స్కాట్లండుతో బోల్పవచ్చును. ఇట హత్యానేరములు చాల హెచ్చు! ఇక్కడి నల్లరేగడ భూమి కూడ హత్యానేరము లెక్కువగా నుండుటకు గారణమట! నల్లని భూమిలో తెల్లని ప్రత్తి పండుననియు, ఈ నలుపు తెలుపు రంగులు కలిసి ఎఱ్ఱని రక్తమును బలికోరుననియు రేనాడులో కలెక్టరుగా పనిచేసిన ఒక ఆంగ్లేయుడు తన రికార్డులో వ్రాసినాడని ఆ సీమలోని గ్రామవృద్ధులు చెప్పగా నేను వింటిని. మొత్తమునకు ఏ కారణము వలననో ఆంధ్రదేశమున ఈ రేనాడు హత్యానేరములలో ప్రథమస్థానమును వహించుచున్నది. ఇక్కడనే ఉత్తమోత్తమ వీరగాథలు పుట్టినవి; ఇంకను పుట్టుచున్నవి.

నీరు సమృద్ధిగాగల మాగాణి ప్రాంతములలో మఱియొక చిక్కున్నది. ఇవి పర్వతారణ్యముల వలె పోరాటమున కనుకూలముగా నుండవు. అందుచే నిట విప్లవములు చెలరేగుట కవకాశముండదు. అందువలననే ప్రశస్తమగు ప్రాచీనగాథలు ఈ మండలములలో జనింపలేదని చెప్పవచ్చును. పశ్చిమగోదావరీ మండలములోని మాగాణి ప్రాంతమున జన్మించిన అల్లూరి సీతారామరాజు బ్రిటీషు ప్రభుత్వముతో పోరుటకై తూర్పుగోదావరి విశాఖ మండలములలోని మన్యప్రాంతము నావాసముగా జేసికొనుట గమనింపదగ్గది. ఈతని మహావిప్లవమంతయు ఆ మండలారణ్యము లందే జరగినది. మెట్టప్రాంతమైన రాయలసీమలో నారసింహారెడ్డికి ఇట్టి చిక్కులేదు. రేనాడులోని ఎఱ్ఱమల నల్లమల కొండలు అరణ్యములు అతనికి మంచి రక్షణను కల్పించినవి. కాబట్టి, శీతోష్ణ పరిస్థితులు, ప్రజల మనస్తత్వములు, నైసర్గిక స్వరూపము వీరగాథోత్పత్తి విషయమున ప్రముఖపాత్రను వహించుచున్నవని చెప్పవచ్చును.

పాశ్చాత్యదేశములలో డెన్మార్కు, పోర్చుగల్, స్పెయిన్, స్కాట్లండు దేశములలోను, భారతదేశమున రాజస్థాన్, మహారాష్ట్ర, పంజాబ్, ఆంధ్రప్రదేశ్‌లలోను వీరగాథలు కొల్లలుగా

లభించుచున్నవి. ఇది జాతి స్వభావమునుబట్టి వచ్చిన వీరగాథాసంపద. ఆంధ్రదేశమున నాగరత ప్రబలిన మాగాణిప్రాంతములలో కన్న, వెనుకబడిన మెట్టప్రాంతములలో వీరగాథలు హెచ్చుగా నున్నవి. ఇది నైసర్గిక పరిస్థితుల ప్రభావము. ఇట్లు జాతి మనస్తత్వము, నైసర్గిక పరిస్థితులే కాక, ఆంధ్రదేశమున కులస్వభావము గూడ వీరగాథోత్పత్తిలో కీలక స్థానమును వహించుచున్నదని చెప్పవచ్చును. ఆంధ్రులలో బ్రాహ్మణ వైశ్య కులములవారి వలన వీరగాథోత్పత్తి ఏమాత్రమును జరుగుటలేదు. కాటమరాజుకథలలోని ఖడ్గతిక్కనవలెను, బొబ్బిలియుద్ధకథలోని భేరీ రామక్క (వైశ్యస్త్రీ) వలెను, శౌర్యమును ప్రకటించినవారు ఈ కులములలో నూటికి కోటికి ఒకరుందురు. సాధుత్వము ఈ కులములలో మూర్తీభవించి యుండుటయే దీనికి కారణము. (గాంధీజీ, పొట్టి శ్రీరాములు వంటివారు అహింసా సిద్ధాంతముతో శాంతిసమరములను నడపుటకు వారి కుల సౌమ్యతాగుణమే ముఖ్యకారణమని నా అభిప్రాయము). కాగా, తెలుగు వీరగాథాసంపదలో రెడ్డికులము ప్రధానపాత్ర వహించుచున్నది. మన వీరగాథలలో సగమునకు పైగా వీరగాథలు ఈ కులమువారి సాహస కారణమున జనించినట్టివే!

భారతదేశమున రాజపుత్రస్థానము పిండిత శూరకుల నిలయము. పృథ్వీరాజాదు లిక్కడి వారే. ఇటనుండి కొన్ని వీరజాతులు మహారాష్ట్రమునకు తరలి వచ్చినవి. ఆ మహారాష్ట్రమునుండి మఱల ఆంధ్రదేశమును ప్రవేశించినవి. ఇట్లు వలస వచ్చిన శూరకులము లలో రాష్ట్రకూటులొకరు. ఈ రాష్ట్రకూటులే నేటి 'రెడ్లు' అని చారిత్రకులు కొందఱూహించు చున్నారు. (రాష్ట్రకూట > రట్టోడి > రట్టడి > రెడ్డి). ఈ రెడ్లు మహారాష్ట్రమునుండి వచ్చిన వారగుట చేతనే తెలంగాణా రాయలసీమ ప్రాంతములలో నెక్కువగ వ్యాపించియున్నారు. రాయలసీమలోని ఆరె కాపులును మహారాష్ట్రులే. ఈ రెడ్లు దేవగిరిపట్టణమునుండి కృష్ణదేవరాయల రాజ్యమునకు వలసవచ్చినట్లుగా 'కుంటి మల్లారెడ్డి కథ' అను వీరగాథలో కూడ చెప్పబడినది. నేటి మహారాష్ట్రమునందలి దౌలతాబాదే దేవగిరిపట్టణము. రాజస్థాన్, మహారాష్ట్ర, ఆంధ్రదేశములలో వీరగాథ లెక్కువగా నుండుటకు ఈ శూరకుల ప్రస్థానములే కారణములు కావచ్చును.

రెడ్డి, వెలమ, క్షత్రియ, కమ్మ, కాపు కులములు ఆంధ్రుల చరిత్రలో అనాదిగా వీరకులములుగా ప్రసిద్ధికెక్కియున్నవి. క్రౌర్యము, కక్ష, పగ సాధింపవలెనను పట్టుదల ఈ కులములలో హెచ్చు. కావున ఈ కులములవారు ఎక్కడ ఎక్కువగ నుందురో అట వీరగాథలును పుష్కలముగా లభించును. దీనిని బట్టి కులభేదముల వంటి సాంఘిక పరిస్థితులు కూడ వీరగాథోత్పత్తియందు కీలక స్థానమును వహించుచున్నవని చెప్పవలెను.

ఈ ప్రకరణమందలి వివిధ చర్చల సారాంశము నిట్లు చెప్పవచ్చును:

వీరగాథల ఉత్పత్తి కర్తృత్వములు వివాదగ్రస్తమైనవి. పాశ్చాత్య విమర్శకులలో కొందఱు, వీరగాథలు అతి ప్రాచీనకాలమున జానపదసంఘములచే నృత్యమునందు ఆశువుగా సృజింపబడినవని సిద్ధాంతము చేసినారు. మఱికొందఱు ఈ సిద్ధాంతమును ఖండించి, వీరగాథలు మధ్యయుగములలో జంగముల చేతను, ప్రత్యేక కవుల చేతను రచింపబడిన వనియు, వీనికి మూలము ప్రాచీన శిష్టసాహిత్య మనియు వాదించుచున్నారు. ప్రాక్తనమానవుని నృత్త గీతమున భావాత్మకమగు చిన్న పాట పుట్టును కాని, కథాకథనముతో గూడిన పెద్దపాట పుట్టుట స్వభావ విరుద్ధము. కావున వీరగాథ, జానపదగేయముకన్న ప్రాచీనమైనది కాజాలదు. ఇతిహాసములకు మూలము వీరగాథలు కావచ్చును. అయినను, 12వ శతాబ్దముకన్న ప్రాచీనమైన వీరగాథలు ప్రపంచమున ఏ దేశమందును నేడు లభించుట లేదు. అన్ని వీరగాథలును ఒకే విధముగా పుట్టవు. తెలుగులో కొన్ని వీరగాథలు శ్రీనాథాది ప్రత్యేక కవులచే రచింపబడినవి; మఱికొన్ని జంగముల ఆశురచనలుగా పుట్టినవి. వీరగాథ ఈ రెండు విధములలో ఏ విధముగా పుట్టినను, సిసలైన వీరగాథాస్వరూప మేర్పడుటకు, అది కొంతకాలము ప్రజలలో మౌఖిక సంప్రదాయము(Oral Tradition)న జీవించి తీరవలెను. నాగరకత వీరగాథోత్పత్తికి పరమశత్రువు. ఆంధ్రదేశమున నాగరకములైన మాగాణి ప్రాంతములకన్న, అనాగరకములైన మెట్ట ప్రాంతములలో వీరగాథ లధికముగా పుట్టుచున్నవి. దేశ నైసర్గిక స్వరూపము, జాతి మనస్తత్వము, కులస్వభావము వీరగాథోత్పత్తిలో కీలక స్థానమును వహించును.

## ఆంధ్రప్రదేశ్‌లో వివిధ ప్రాంతముల వీరగాథా ప్రాముఖ్యము

| | |
|---|---|
| **1. పల్నాటి సీమ** | పల్నాటి వీరకథాచక్రము, లక్ష్మమ్మ కథ, వీరరాజమ్మ కథ మొదలగు వీరగాథలు పుట్టిన ప్రాంతము. |
| **గురజాల** | నలగాముని రాజధాని |
| **మాచెర్ల** | మలిదేవుని రాజధాని |
| **కారెంపూడి** | పల్నాటివీర యుద్ధక్షేత్రము |
| **కల్యాణ పట్టణము** | మలిదేవుని పెండ్లి జరగిన ప్రదేశము, కొమ్మరాజు అలరాజుల స్వస్థలము |
| **2. కనిగిరి సీమ** | కాటమరాజు కథాచక్రము మిక్కిలి ప్రచారమున నున్న ప్రాంతము |
| **ఎలమంచి (లి)** | కాటమరాజు పితామహుడుగు వల్లురాజు పాలించిన ప్రదేశము. ఇది విశాఖ మండలమున గలదు. కాటమరాజు తండ్రియగు పెద్దిరాజును, ఆతని సోదరులును పాలించిన 'పంపాద్రి' కూడ ఈ మండలములోనే కలదు. అన్నవర క్షేత్రమునకు ప్రక్కగా పంపానది ప్రవహించుచున్నది. |

| | |
|---|---|
| కల్యాణగిరి పట్టణము | కాటమరాజు జన్మించిన ప్రదేశము, పెద్దిరాజు కథాస్థలము |
| దొనకొండ | కాటమరాజు పినతండ్రియగు పోలురాజు పుత్రులు అయితమ రాజాదులు పాలించిన ప్రదేశము. |
| కనిగిరి | కాటమరాజు నల్లసిద్ధితో పోరిన ఎఱ్ఱగడ్డపాడు రణక్షేత్రము, కాటమరాజు కోట, పంచలింగాల కొండ, పాలేఱు (నది) కలయట్టి ప్రదేశము. |
| నెల్లూరు | నల్లసిద్ధిరాజు ముఖ్యపట్టణము, ఖడ్గతిక్కన స్వస్థలము. |
| 3. రేనాటి సీమ | నారసింహారెడ్డి కథ, బుడ్డా వేంగళరెడ్డి పాట, అప్పలాపురం చెన్నారెడ్డి కథ, కుంటి పుల్లారెడ్డి కథ, కర్నూలు నవాబు కథ మొదలగు వీరగాథలు పుట్టిన ప్రాంతము. |
| నొస్సం | నారసింహారెడ్డి మాతామహుడగు జయరామరెడ్డి కోటయున్న గ్రామము. దీనికి దగ్గరలోనే బుడ్డా వెంగళరెడ్డిగారు నివసించిన 'ఉయ్యాలవాడ' గ్రామమున్నది. |
| కోవెల కుంట్ల | నారసింహారెడ్డి కొల్లగొట్టిన పట్టణము. బ్రిటీషువారు నారసింహారెడ్డిని ఉరి తీసినదియు నిచ్చటనే. కుంటి పుల్లారెడ్డి హత్య చేయబడినది ఈ యూరనే. |
| గిద్దలూరు | నారసింహారెడ్డి - లెఫ్టినెంట్ వాట్సన్‌తో 1846 జులై 23వ తేది నాడు మొదటి యుద్ధము కావించిన ప్రదేశము. గిద్దలూరుకు సమీపములోగల ముండ్లపాడులో నారసింహారెడ్డి - కెప్టెన్ నాట్, కెప్టెన్ రస్సెల్‌లతో 1846 జులై 24వ తేది రెండవ యుద్ధము చేసినాడు. ఈ ముండ్లపాడుకు దగ్గఱలోనున్న 'కొత్తకోట'లో నారసింహారెడ్డి కోట, దాని బురుజుపై ఒక ఫిరంగి ఉన్నవి. |
| జమ్మల మడుగు | దీనికి సమీపమునగల 'చిన్న పసుపుల' గ్రామములో కుంటి పుల్లారెడ్డి కథ జరగినది. |
| 4. విశాఖ – శ్రీకాకుళ మండలములు | వీరగాథలు విశేషముగా గల ప్రాంతము. అతి ప్రసిద్ధమైన బొబ్బిలి కథ, జగపతిరాజు కథ వంటి వీరగాథలు; లక్ష్మణమూర్ఛ, కుశలాయకము, అంగద రాయబారము వంటి పదములు; స్త్రీల పాటలు - ఈ మండలమున కోకొల్లలుగా జనించినవి. అల్లూరి సీతారామరాజు కథ ఎక్కువ భాగము విశాఖమండలములోనే జరగినది. |

| | |
|---|---|
| బొబ్బిలి | రంగారాయని వంశస్థుల కోట, 'లడాయి స్తంభము' గల యుద్ధ క్షేత్రము. |
| విజయ నగరము | పూసపాటి విజయరామరాజు కోట. |

5. **నల్లగొండ మండలము** వీరగాథలు విశేషముగా పుట్టిన ప్రదేశము. తెలంగాణా విప్లవ స్థలము.

6. **ఇతర ప్రదేశములు:**

| | |
|---|---|
| పెద్దాపురము | వత్సవాయి జగపతిరాజు కోట (జగపతిరాజు కథ లేక పెద్దాపురపు కోడిపుంజుల కథ). |
| సామర్లకోట | కామమ్మ కథ |
| గుంటూరు | చిన్నపరెడ్డిని ఉరితీసిన పట్టణము |
| చేబ్రోలు | చిన్నపరెడ్డి స్వగ్రామమగు 'రెడ్డిపాలెము' దీని ప్రక్కనే గలదు. |
| తిరుపతి | బంగారు తిమ్మరాజు మరణించిన ప్రదేశము. |
| పెనుకొండ | బంగారు తిమ్మరాజు బోగం రంగసానితో యుద్ధము చేసిన చోటు. ఇట రాయలవారి కోట కలదు. |
| కర్నూలు | కర్నూలు నవాబు కథాస్థలము. |
| గద్వాల | గద్వాల సోమనాద్రి కథ, లేక నల్ల సోమనాద్రి కథ. |
| వనపర్తి | రాజా రామేశ్వరరావు కథ |
| హైదరాబాదు | సదాశివరెడ్డి కథ; దీని ప్రక్కనే ఉన్న గోల్కొండలో సర్వాయి పాపడు యుద్ధము చేసినాడు. |

* * * * *

ఐదవ ప్రకరణము

# విదేశ భాషలు - వీరగాథలు

వెనుకటి ప్రకరణమున వీరగాథల యుత్పత్తి కర్తృత్వములను గూర్చి తెలిసికొంటిమి. ఇప్పుడు ప్రపంచమున వివిధ దేశముల వీరగాథాసంపదను దిక్ప్రదర్శనముగా సమీక్షింతము.

## 1. ఐరోపా ఖండము:

ఐరోపా ఖండమున వీరగాథలు మధ్యయుగమున బయలుదేరినవి. 'రైమ్స్' (Rhymes) అనబడు సుదీర్ఘాఖ్యానములు క్రీ.శ. 11వ శతాబ్దమున పుట్టినవి. ఆ తరువాత క్రీ.శ. 12వ శతాబ్దమున కాని వీరగాథ లావిర్భవింపలేదు. ఆంగ్లమున 'జూడాస్' (Judas) అనబడు వీరగాథవంటి ఒక ఖండిక, 13వ శతాబ్దమునాటిది. Langland అనునాతడు 14వ శతాబ్దమునాటి 'రాబిన్ హుడ్', (Robin Hood) 'రాన్‌డాల్ఫ్' (Randalph), ఎరల్ ఆఫ్ ఛెస్టర్' (Earl of Chester) అనబడు 'రైమ్సు'ను పేర్కొనినాడు. కాని యివి వీరగాథలు కావు; సుదీర్ఘాఖ్యానములు మాత్రమే. మధ్యయుగమున వీనికి 'రైమ్స్' అను పేరు వచ్చినది. కాగా, నిజమగు వీరగాథలు 15వ శతాబ్దమునుండి లభించుచున్నవి. వీనిలో 'Geste of Robin Hood' అనునది ఒక వీరగాథావృత్తము.

డెన్మార్కు దేశమున ఒక వీరగాథలో 12వ శతాబ్దమునాటి సంఘటన వర్ణింపబడినది. మఱియొక డేనిష్ వీరగాథ 13వ శతాబ్దమునాటి ఇతివృత్తమును గలిగియున్నది. కాని, యీ గాథల రచనమాత్రము తరువాతి కాలమునాటిదిగనే కన్పట్టుచున్నది. 16వ శతాబ్దము నాటికిగాని ఐరోపాఖండమందంతటను వీరగాథలవ్యాప్తి జరగలేదు. ప్రశస్తములైన ఇంగ్లీష్, స్కాటిష్ వీరగాథలలో ఎక్కువ భాగము క్రీ.శ. 16-18 శతాబ్దముల మధ్య బయలుదేరినట్టివే. వీని యితివృత్తములును ఈ శతాబ్దిత్రయమునకు సంబంధించినవే. జె. కిన్స్‌లే (J. Kinsley) అను విమర్శకుడు వివిధ పాశ్చాత్యదేశముల వీరగాథాకాలముల నిట్లు నిర్ధరించి చెప్పినాడు:

"The origins of popular narrative poetry are lost in antiquity, but the European ballad emerges in the latter middle ages -- in 12th century Denmark, for example, 13th century Russian and 14th century Spain, Scotland and England. Czechoslovakian balladry appears to be much later in origni; but it is largely a derivative from the older balladry of Germany."[1]

1. *Encyclopaedia of Literature, p.40.*

ఐరోపా ఖండమందలి వివిధ దేశముల వీరగాథా సంపదను సమీక్షించుచు ప్రొఫెసర్ లూయీస్ పౌండ్ (Prof. Louise Pound) ఇట్లు చెప్పెను:

"Nations vary in their preferred type of popular song. Denmark and the British Isles are peculiarly rich in ballads. A fine body of narrative song has been preserved from 16th century Denmark. The main body of extant English ballads dates from the late 15th century onward, the better pieces coming from the North rather than the South. France and Italy have relatively few traditional ballads. There, story songs are overshadowed by pure lyrics, and in Germany, too, popular song is more lyrical than narrative. Spain is rich in romantic ballads. They are narrative and dramatic, not lyrical, and are more unified in technique than are the English and Scottish. Ballads have also been gathered in abundance in Russia, the Balkans, Greece, and other countries. In general, those of eastern Europe are longer than those of the western Europe."[2]

డెన్మార్కు, స్కాట్లండు, స్పెయిన్, పోర్చుగల్ దేశములు నాలుగును వీరగాథా సంపదలో యావత్ప్రపంచమునను ప్రథమ స్థానమును వహించుచున్నవి. డేనిష్, పోర్చుగీస్ సాహిత్యములలో వీరగాథలు తప్ప, వేఱు కవితాప్రక్రియలు లేవని తెలిసికొనియుంటిమి.

**1.1 డెన్మార్కు:** జర్మనీ దేశమున కుత్తరముగను, నార్వే స్వీడన్ దేశములకు దక్షిణమునను ఉన్నది డెన్మార్కుదేశము. స్కాట్లండునకు ఉత్తర దిశలో అట్లాంటిక్ మహాసముద్రమున నున్న 'ఫేరోస్' (Faeroes) ద్వీపము కూడ ఈ డేనిష్ రాజ్యమునకు చెందినదే. ఈ ద్వీపమంతయు వీర గాథల పుట్ట! ఇట నేటికిని వీరగాథలు నృత్యరూపమున ప్రదర్శింపబడుట విశేషము. ఈ ద్వీపమున అగ్రవర్ణములవారు కూడ వీరగాథలను పాడుదురు. ఈ ఫేరోస్ ద్వీపముతో గూడిన డెన్మార్కుదేశము వీరగాథాసంపదలో ప్రపంచమున ప్రప్రథమస్థానము నాక్రమించుచున్నది. E.T. Kristensen అను నాతడు డేనిష్ వీరగాథలను కొల్లలుగా సేకరించిన మహనీయుడు. డెన్మార్కులో వీరగాథా సేకరణకు నాగరకులే మొదట నడుము కట్టిరి. 16,17 శతాబ్దములలో డేనిష్ వీరగాథలను నాగరక వ్యక్తులు, స్త్రీలు సేకరింప ప్రారంభించిరి. డెన్మార్కు రాణి సోఫియా ప్రోత్సాహముచే నివి మొట్టమొదట ముద్రింపబడినవి.

వీరగాథలు ప్రథమమున నాగరకుల వినోద కాలక్షేపముల కుద్దేశించినట్టివే యని డేనిష్ చరిత్రకారు లంగీకరించినారు. ప్రాచీనకాలమున డేనిష్ పల్లెపట్టులలో తఱచు పాడబడు వినోద గీతములే నేటికిని 'ఫేరోస్' ద్వీపవాసులు తమ నృత్తగీతములుగా నుపయోగించుచున్నారు. ఇట్లుపయోగించుట మొదట నాగరకులలోనే ప్రారంభమైనది. ఈ నృత్తగీతములలోని జానపద తత్త్వము (folk element) డేనిష్ జానపదులనుండి వచ్చినదికాదు. డెన్మార్కులో జానపదులు

2. *The Encyclopedia Americana, Vol.III, p.94b.*

ఒక ప్రత్యేక వర్గముగా లేరు. కవిత్వమునకు సంబంధించినంతవఱకు అట ప్రజలందఱును జానపదులే! దేశికవిత్వమును ప్రజలలో నాగరక అనాగరక వర్గములు రెండును ఆదరించును. ఈ దేశమున 'జానపద' శబ్దము ఇతర దేశములలోవలె ఒక నిమ్న వర్గమును మాత్రమే సూచింపక, దేశప్రజలందఱిని సూచించును.[3] దీనికి కారణమున్నది. వీరగాథల వంటి దేశికవిత్వము నణగద్రొక్కగల ఉన్నత సాహిత్యప్రక్రియలు డేనిష్ భాషలో లేవు. ఇట్టి ఉన్నత సాహిత్యప్రక్రియ లెచ్చట నుండునో అచ్చట జానపద కవిత్వము లాటిను కవిత్వములో వలె విస్మరింపబడును; లేదా 'ఒడిస్సే', 'బేయోవుల్ఫ్', 'ఆర్థూరియన్ రొమాన్సెస్' ల వలె మఱియొక రూపమును దాల్చును; లేదా Burns రచించిన "Hallowe'en" వలె హాస్యధోరణికి త్రిప్పబడును. ప్రయత్నపూర్వక కవిత్వశిల్పమును ప్రదర్శించు Dante, Chaucer వంటి మహాకవులున్నచోట వీరగాథలవంటి దేశిప్రక్రియ లభివృద్ధి చెందలేవు. పోర్చుగల్, ప్రావెన్షల్, జర్మనీ మున్నగు కొన్ని దేశములలో మాత్రము "Troubadours", "Minnesingers" అను చారణకవులు రాజసభలలో గూడ జానపద గేయములను పాడిరని తెలియుచున్నది. (తెలుగులో దక్షిణాంధ్రయుగమున రాజసభలలో ప్రదర్శింపబడిన యక్షగానముల యందెన్నియో జానపద గేయములున్నవి). కాని సాహిత్యచరిత్రలలో నిట్టి యుదాహరణములు మిక్కిలి తక్కువ. సర్వసాధారణముగా మార్గ సాహిత్యమువలన దేశిసాహిత్య మణగద్రొక్కబడుచుండును. కొన్ని పట్ల దేశిస్వరూపమే మార్చి వేయబడుచుండును.

కాని ఒక్క డెన్మార్కుదేశమున మాత్రము ఈ సర్వసాధారణ పరిస్థితి కాన్పింపదు. అట 'త్రోబాదోర్స్', 'మిన్నేసింగర్స్' వంటి చారణగాయకులు గాని, 'డాంటే', 'ఛాసర్'ల వంటి మహాకవులుగాని లేరు. డేనిష్ సాహిత్యమున వీరగాథలు తప్ప మఱొక విధమైన కవితా ప్రక్రియయే కానరాదు. వీరగాథలకే అట తావున్నది. వానితోనే ఆ సాహిత్యమంతయు నిండి పోయినది.[4]

---

3. *The imaginative life of Denmark in the Middle Ages is all of the kind which is called 'popular'; i.e., the term 'people' or 'populace', if it is to be used at all, does not here mean the cottagers, the peasants, the way faring men. Everyone, as far as poetry is concerned, belongs to the 'folk'.*
   -*W. P. Ker, ' On the History of the Ballads', P. B. A., 1909-1910, Vol.IV, p.198.*

4. *"But Denmark is not like the other countries and languages; it has no one to compare with the troubadours or minnesingers, with Dante or Chaucer. Denmark had scarcely any poetry, except the ballads. Not only was there no great author there (nor in Sweden either) to be compared with those of other lands, but there was not even any considerable amount of the rough work as is found in plenty. in France and Italy, Germany and England, in the Middle Ages. There was room for the ballads and the ballads took up all the room, with scarcely a challenge from any other competitor."-*
   *--Ibid.*

**1.2 ఇంగ్లండు - స్కాట్లండు:** ఆంగ్లము నేటి జీవద్భాషలలో అతి ప్రాచుర్యమును ప్రక్రియా వైవిధ్యమును గలిగిన గొప్ప భాష. దీని ప్రాచీనరూపము ఆంగ్లోశాక్షన్. ఇందెంతయో జానపద సాహిత్యముండి యుండును. కాని అలేఖ్య పారంపర్య సంప్రదాయమున సాహిత్యమంతయు నశించినది. పోయినది పోగా 'బేయోవుల్ఫ్' (Beowulf) అను వీరగాథాకావ్యము మాత్రము నిలిచియున్నది. "క్రీ.శ. 8వ శతాబ్దియందొక అజ్ఞాతకవి నాటికి ప్రచారములో నున్న కొన్ని వీరగీతములను సేకరించి ఈ ఇతిహాస కావ్యరూపమున జోడించెనని భావింపబడుచున్నది. నాటి ప్రజల వినోదవిహారములు, బలపరాక్రమములు, క్లేశమయమైన వారి సాహసిక జీవితము అందు చక్కగా చిత్రింపబడినది. ఇట్టివే వీరగాథాకావ్య శకలములును, 'ది వాండరర్' (The Wandarer), 'ది సీ ఫేరర్' (The Sea Farer) వంటి విషాద గీతములును మఱికొన్ని లభించినవి."[5]

14వ శతాబ్దమున జానపదగీతముల కమితముగా ప్రజాదరణ లభించినది. అందు 'ఛెవ్వీఛేస్' (Chevy Chase), 'సర్‌పాట్రిక్‌స్పెన్స్' (Sir Patrick Spens) చాల ప్రసిద్ధములైన వీరగాథలు. క్రీ.శ. 1765లో 'బిషప్ పెర్సీ' (Thomas Percy) అను నతడు "Reliques of Ancient English Poetry" అను వీరగాథా సంకలన గ్రంథమును ప్రకటించెను. దేశభక్తి నుద్దీపింపజేయు వీరగాథా కావ్యరచనను 'సర్ వాల్టర్ స్కాట్' (Sir Walter Scott) ప్రోత్సహించెను. ఇతడు 1802 - 1803 మధ్యకాలమున "Minstrelsy of the Scottish Border" అను గాథా సంకలనమును వెలువరించెను.

ఆంగ్లేయుల వీరగాథాసంపద కొనియాడదగినది. సాహిత్య పరముగా నున్నతమైనది. ఇందు రెండు ప్రధాన భాగములున్నవి: (1) రాబిన్‌హుడ్ వీరగాథాచక్రము, (2) ఉత్తరదేశ సరిహద్దు గాథలు (స్కాట్లండు గాథలు). ఇందు రెండవ విభాగము సంగీతగుణమున మొదటి దానిని మించిపోయినది. రాబిన్‌హుడ్ కథాచక్రమున సుమారు నలుబది వీరగాథలున్నవి. కాని వీనిలో పదప్రయోగమునను, సంఘటనలలోను పునరుక్తి యెక్కువగ నున్నది. కాగా, స్కాటిష్ - ఇంగ్లీష్ సరిహద్దు జీవితమునకు చెందిన వీరగాథల (Border Ballads)లో ఉత్తమ కవిత్వమున్నది. 'సర్ వాల్టర్ స్కాట్' సంకలనము చేసిన గ్రంథమున అత్యధిక భాగము ఈ సరిహద్దు వీరగాథలే! స్కాట్ సేకరణలో అపూర్వములును, అప్రకటితములును అగు గాథలు నలుబది వఱకును గలవు. వానిలో కొన్ని అత్యుత్తమములగు వీరగాథల పేర్లు: 'Thomas the Rhymer, The Dowie Dens O' Yarrow, The Wife of Usher's Well, Annan Water, The Douglas Tragedy, The Lament of the Border Widow, Clerk Saunders, The Sang of the Outlaw Murray, Kinmont Willie.' కొన్ని ప్రసిద్ధ వీరగాథలకు ('థామస్ పెర్సీ'

---

*5. విజ్ఞాన సర్వస్వము, ఆరవ సంపుటము, పుట 430.*

మొదలగువారు తన కన్న పూర్వమే సేకరించిన గాథలకు) ఈ స్కాట్ దోషరహితములును, ఉత్తమములును అగు ప్రతులను పొందుపఱిచి యున్నాడు. అట్టి వానిలో ముఖ్యమైనవి. 'Lord Randal, Helen of Kirk-connell, Tam Lane, The Lass O' Lochryan'.

పైన తెల్పిన వీరగాథలలో 'కిన్‌మాంట్ విల్లీ' అనునది ఆంగ్ల వీరగాథా కవిత్వమునకు శిరోభూషణ మనదగినది.[6] కవిత్వపరముగను, చారిత్రకపరముగను మిక్కిలి విలువగల యుద్ధ గాథలలో ఇది ప్రథమ స్థానమును వహించును. ఇది ప్రజాజీవితమును ప్రతిబింబించు మణి దర్పణము.

క్రీ.శ. 1857-59 సంవత్సరములలో 'ప్రొఫెసర్ ఛైల్డు' అయిదు సంపుటములలో **"English and Scottish Ballads"** అను వీరగాథా సంకలన గ్రంథమును ప్రకటించెను. ఇందు 305 వీరగాథలున్నవి. ఇది వీరగాథా సంకలన గ్రంథములలో ప్రాతఃస్మరణీయము. 1910 వ సంవత్సరమున Arthur Quiller-couch ఒక గాథా సంకలనమును ప్రకటించెను. "Oxford Book of Ballads" అను పేరుగల ఈ గ్రంథమున 176 వీరగాథలున్నవి.

ఆంగ్ల వీరగాథలలో ముప్పదియాఱు పాదములలో నున్న 'Judas' అను గాథ ప్రాచీనమైనదిగా తలంపబడుచున్నది. ఇది క్రీ.శ. 13వ శతాబ్దమునకు చెందినది. 14వ శతాబ్దమున కొన్ని గాథలు ఫ్రాన్సుదేశము నుండి దిగుమతియైనవి. 15వ శతాబ్దము ఆంగ్ల వీరగాథలకు స్వర్ణయుగము. ఉత్తమ వీరగాథలన్నియును ఈ శతాబ్దివే. ఆ తరువాత 300 ఏండ్ల పాటు ఆంగ్లేయులు వీరగాథల ననాదరించి విస్మరించిరి. క్రీ.శ. 1765లో థామస్ పెర్సీ సంకలన గ్రంథము వెలువడు వఱకును ఆంగ్లేయులు తమకు వీరగాథలున్నవను సంగతినే మఱచిపోయిరి. పెర్సీ వీరగాథాసంకలనము ఆంగ్లసాహిత్యముపై విశేష ప్రభావమును జూపినది. ఆంగ్ల కాల్పనికోద్యమ సాహిత్యమునకు వీరగాథలు పుష్టి నిచ్చినవి.

**1.3 స్పెయిన్:** అరబ్బులకు స్పెయిన్‌దేశ ప్రజలకు జరగిన మతయుద్ధములలో వీరగాథలు పుట్టెను. ఇవియే స్పానిష్ సాహిత్యమునకు శ్రీకారము చుట్టినవి. ఈ వీరగాథల నాధారముగా జేసికొని 12వ శతాబ్దమున ఇతిహాసములు పుట్టినవి. క్రీ.శ. 1100లో వాస్తవముగా జరగిన ఒక సైనికుని గాథను ఆధారముగా జేసికొని 1140లో ''ఎల్ కాల తార్ దమి యోసిద్'' అను ఇతిహాసము బయలుదేరినది.

---

6. *"Kinmont Willie can hardly be overpraised as a master- piece of the herioc ballad. Fighting ballads like this have high historical as well as poetical value, for they reflect closely and accurately the manners and life of the particular people who produced them; and doubtless they had their influence on the rude people who preserved them"*
*- Nelson's Encyclopaedia, p. 543.*

స్పానిష్ సాహిత్యముపై ఫ్రెంచిసాహిత్య ప్రభావ మెక్కువ. కాని ఆఱవ 'అల్ఫోన్సో' కాలమున (1226-1257) స్పానిష్‌భాష ఈ ప్రభావమునుండి తప్పించుకొని, వీరగాథా కవిత్వముతో విజృంభించినది. ''త్రోబాదోర్స్'' (Troubadours) అనబడు చలన గాయకులు వీరగాథలను సృజించి వ్యాపింపజేసిరి. ఇట్టి చారణగాయకులలో ''పెడ్రో అమిగో దవె విల్లా, మొదది సాంకో, ఐరాస్ నూనెజ్ ద సాంతి యాగో'' - అను వారు ముఖ్యులు. క్రీ.శ. 1376-1460 ప్రాంతమువాడగు ''ఫర్నాన్ ఫెరెజ్ దగు జ్మాన్'' అను కవి సమకాలిక చరిత్రలతో పెక్కు వీరగాథలను రచించెను. స్పానిషు వీరగాథల ఔన్నత్యమును ప్రశంసించుచు నొక ఆంగ్ల విమర్శకు డిట్లు చెప్పెను.

"Spanish literature is rich in Ballads. Perhaps the earliest type is that of the 'Poema del cid', probably, like most early epics, composed of numerous Ballads joined into a compact whole. ... In Spain the Ballad has mostly to do with romance pure and simple. .....The Ballads of Spain are in general composed in a more varied metre than those of other European countries, and have furnished many British poets with models for the composition of narrative verse."[7]

**1.4 పోర్చుగల్:** పోర్చుగీసు సాహిత్యమున ఐతిహాసిక సంప్రదాయము గాని, కావ్య సంప్రదాయము గాని లేదు. అందుచే రచయితలు వీరగాథలను విరివిగా సృష్టించి విస్తరింపజేసిరి. 'గార్షియా ద రేసిందె' (క్రీ.శ. 1440-1536) అను కవి ''కన్సియోనెరో గెరాల్'' అను గేయ సంకలనమును కూర్చినాడు. 'కాటలాన్' ప్రాంతపు భాషలో 'ఔజియస్ మార్చ్' (1397-1458) అను నాతడు వీరగాథలను రచించెను. 'ఆల్మై దాగా రేత్' (1799-1854) అను కవి ప్రాచీన జానపదగేయములను పునరుద్ధరించెను.

**1.5 ఫ్రెంచి:** ఫ్రెంచి సాహిత్యమున క్రీ.శ. 12వ శతాబ్దమునకు పూర్వమునుండియు ఎన్నియో వీరగాథలు వ్యాప్తియందున్నవి. ఈ వీరగాథల నాధారముగా జేసికొని ఇతిహాసములు సమకూర్ప బడినవి. ఫ్రెంచి జాతీయ వీరుడగు 'షేర్లమేన్' కాలమున క్రైస్తవమత రక్షణార్థమై ముస్లిములతో పోరాడి మరణించిన ఒక వీరుని చరిత్రము నాధారముగా జేసికొని ''రోలాండు గీతము'' అను ఇతిహాసము బయలుదేరినది. ఇట్లు ఫ్రెంచి ఐతిహాసిక కవులు 12వ శతాబ్ది పూర్వార్ధము గతించు వఱకును జాతీయ వీరగాథల నాధారము జేసికొనిరి. ఆ తరువాత ఇంగ్లండు మొదలగు అన్య దేశముల ప్రాచీన చరిత్రలందలి వీరుల సాహస కృత్యములను కథావస్తువులుగా గ్రహించి వ్రాయ మొదలిడిరి. ఇట్లు ఫ్రెంచి సాహిత్యమునకు పునాది వీరగాథలేయని చెప్పనగును.

---

7. *'The Ballad in Spain', Everyman's Encyclopaedia, Vol.1, p. 711.*

**1.6 జర్మన్:** జర్మన్ సాహిత్యము కూడ వీరగాథలతోనే ప్రారంభమైనది. పితాపుత్రుల యుద్ధము ఇతివృత్తముగా గల ''డాస్ హిల్డె బ్రాన్డ్స్ లీడ్'' అతి ప్రాచీనకాలపు రచనలలో నొకటి. 13వ శతాబ్దమున పుట్టిన ''నిబు లుంగెన్ లీడ్'' అను వీరకావ్యమున ప్రేమ, స్వామిభక్తి, వీరధర్మము ఉదాత్తరూపము నందినవి. 15వ శతాబ్దమున జానపద సాహిత్యము చాల వచ్చినది. ఇందు హర్ష విషాదములు, జీవన-మరణములు, మిత్రత్వ-శత్రుత్వములు, సాహస కార్యములు, సంయోగ వియోగానుభూతులు, ఋతు ధర్మములు కన్నులకు కట్టినట్లు వర్ణింపబడినవి. 16వ శతాబ్దమున ఈ ధోరణి ననుసరించి 'మిన్నేసింగర్స్' (Minnesingers) అను గాయకులు వచ్చిరి. (వీరు మన తెలుగులో జంగములను పోలినవారు). ఈ 'మిన్నేసింగర్సు' వీరగాథలను రచించుచు, గానము చేయుచు దేశమంతయు పరిభ్రమించెడివారు. ఇట్టి గాథాకారులలో 'హన్స్ సాక్స్' (1494-1576) అనునాతడు నాల్గువేల గీతములను రచించెను. ఈ చారణగీతముల నాధారముగా జేసికొని 'గొట్ట్ ఫ్రీడ్ ఔగుస్ట్ బ్రైగ్గెర్' అనుకవి ''లియొనారె'' అను గొప్ప వీరగాథను రచించెను.

**1.7 పోలిష్:** పోలిష్ సాహిత్యమున మొదటి ప్రపంచ యుద్ధానంతరము గేయకవిత మిక్కిలి ప్రాముఖ్యమును వహించినది.

**1.8 హంగేరియన్:** 16వ శతాబ్దమున హంగేరియన్ సాహిత్యమున జానపద కవిత్వము మిక్కిలి వికసించినది. 'విరాజీ నే కక్' అను కవితాశాఖ యిందలిదే. తన ప్రణయమూర్తిని ఒక పుష్పముగా భావించి సంబోధించుట ఈ గీతములందుండును. వీనిని మన పుష్పాపచయ గీతములతోను, తుమ్మెద వెన్నెల పదములతోను పోల్చుకొనవచ్చును. హంగేరియన్ సాహిత్యమున మొట్టమొదటి గేయకవి ''వెలెంబియన్ బలస్సా''. 19వ శతాబ్ది చివరి వఱకును ఇతని గేయములకు ప్రజానీకమున విరివిగా ప్రచారముండెడిది. 'అలెగ్జాండర్ పెటోఫి' గేయకవులలో అత్యుత్తముడు. జానపద కవితకు పేరుప్రతిష్ఠలు కల్పించినవాడు 'జాన్ అరానీ'.

**1.9 ఇటాలియన్:** ఇటలీ దేశమునకు చెందిన 'సిసిలీ' (Sicily) ద్వీపమున 'పిట్రే' (Pitre) అను పరిశోధకుడు ఏడువేల వీరగాథలను సేకరించెను.

**1.10 రష్యన్:** మతాచార్యుల అధీనములో లిఖిత సాహిత్యము, జనసామాన్యమున అలిఖిత జానపద సాహిత్యము రష్యన్ భాషలో అతి ప్రాచీనకాలము నుండియు గలవు. రష్యన్ జానపద సాహిత్యము ఐరోపాలో కెల్ల శ్రేష్ఠతమమైనది. ఇందు 'బైలిని' (Byliny) అను వీరగాథలు, తత్త్వ గేయములు, దేవతాకథలు, సామెతలు, జాతీయములు పెక్కు గలవు.

## 2. ఆసియా ఖండము

**2.1 తుర్కీ:** తుర్కీ సాహిత్యమున 16వ శతాబ్దమున మార్గ కవిత్వముతోపాటు జానపద కవిత్వము కూడ విశేషముగా పెంపొందెను. 17వ శతాబ్దపు 'కరక వో గ్లాన్' గొప్ప జానపద రచయిత.

**2.2 అరబ్బీ:**[8] యాత్రికుల వియోగ గాథలను వర్ణించు 'ఖసీదా' అను గేయములతో ఈ సారస్వతము ప్రారంభమైనది. ఈ గేయములలో ఒంటెలు, తుపాకులు, వేట మున్నగు ఎడారి జీవితమునకు సంబంధించిన విషయములు ప్రధానముగా వర్ణితము లగుచుండును. వీనినిబట్టి ప్రాచీన అరబ్బుల సామూహిక జీవనము, సాంఘిక పరిస్థితులు, యుద్ధములు, మనఃప్రవృత్తులు సులభముగా గ్రహింపగలము. ఈ ఖసీదాలను పాడువారిని 'రావీ' అందురు. 'ఉమ్రా-ఉల్-కైస్' అనునతడు ఖసీదారచనలో సిద్ధహస్తుడు.

కాని ఖసీదాలు 'Ballads' అను ఆంగ్లప్రక్రియకు సమానమగునవికావు. ఖసీదాలలో అక్కడక్కడ వీరుల ప్రశంస యున్నను, ఖసీదాలు వీరగాథలు కావు. ఇవి కేవలము పొగడ్త పాటలు. ఇవి మన వందిమాగధుల కైవారములను బోలును. యుద్ధములను గుఱించియు, వీరులను గుఱించియు వర్ణించు పాటలను అరబిక్ భాషలో 'హమాసా' అందురు. ఇదియే Ballad కు సమానార్థకమగు పదము. ఈ హమాసాలో వర్ణింపబడిన వీరులు సజీవులు కావచ్చును, లేదా విగతజీవులు కావచ్చును. కాని కేవలము మృతవీరులను తలచుకొని విలపించు విషాదగీతములు కొన్ని కలవు. వీనిని 'మర్సియా' అందురు. ఈ మర్సియాలలో ఇరాక్‌లోని 'కర్బ్లా' యుద్ధరంగమున 'హసన్, హుసేన్' అను వీరులు (మహమ్మదుప్రవక్త దౌహిత్రులు) ఖలీఫా అధికారమునకై 'యజీద్' అనువానితో పోరాడి మరణించిన కథలును, ఇంకను ఇతర మృత వీరులను గుఱించిన కథలును వర్ణింపబడినవి. కావున 'హమాసా' శబ్దము వీరగాథను, 'మర్సియా' శబ్దము విషాద వీరగీతమును సూచించు అరబిక్ పదములని గ్రహింపవలెను. విషాద వీరగీతములను ఆంగ్లమున 'Coronach' or 'lamenting ballads' అందురు. 'హస్సాన్ బిన్ సాబిత్' అను కవి అరబిక్ భాషలో హమాసాలు మర్సియాలు విరివిగా రచించెను. హమాసా దీర్ఘవీరగాథ అనియు, మర్సియా లఘువీరగాథ(Balladlings) అనియు చెప్పవచ్చును.

అరబ్బులు ప్రశస్తమగు వీరజాతికి చెందినవారు. వీరు కావించిన యుద్ధములలో అనేక వీరగాథలు పుట్టినవి. యుద్ధముతోపాటు ఈ వీరగీతములును ఆశువుగా నుద్భవించు వింత

---

*8. అరబ్బీభాషలోని వీరగాథలను గూర్చి తెలిపిన మిత్రులు, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమున అరబిక్ ఉపన్యాసకులు శ్రీ ఎహితిషమ్ అహమ్మద్ నద్వీ గారికి కృతజ్ఞుడను.*

పద్ధతి అరేబియాలో గలదని వెనుకటి ప్రకరణమున నిరూపించితిని. ఇరుపక్షముల కవులును తమతమ వర్గములవారి నుద్రేకపఱుచుచు ఆశువుగా గీతములను చెప్పెడివారు. ఇట్టి ఆశుగీతము లను 'రజజ్' (Rajaz) అందురు. ఇట్లు తమ పక్షములవారి నుద్రేకపఱుచుటలో ఆయా వీరుల తండ్రి తాతల పొగడ్తలు కూడ వచ్చెడివి. ఈ పొగడ్తలు గల భాగములను మాత్రము 'ఖసీదా' అందురు.

**2.3. పారసీకము[9]:** అరబిక్ భాష నుండి ఖసీదాలు పారశీకమున ప్రవేశించినవి. పారశీక కవులకు కైవారముచేయు నలవాటు హెచ్చు. అందుచే పారశీకపు ఖసీదాలలో పొగడ్త పాలు మఱింత హెచ్చి పోయినది. (అరబిక్ కవులు సాధారణముగా పొగడుట కిష్టపడరు. చెప్పుకొనదగిన పని చేయనిదే, ఊరక గోరంతలు కొండంతలుగా చేసి వర్ణింపరు). ఖసీదాలతోపాటు మర్సియాలు కూడ పర్షియన్ భాషలో ప్రవేశించినవి. కాని హమాసాలు మాత్రము ఆ పేరుతోగాక 'రజ్మియా నజమ్' (poetry about war) అను పేరుతో నున్నవి. కావున అరబిక్ హమాసాలు, పర్షియన్ రజ్మియాలు నొక్కటే యని గ్రహింపవలెను.

అరబిక్ మర్సియాలు పారశీకమున ప్రవేశించు సరికి అర్థమున కొంచెము సంకోచము చెందినవి. అరబిక్‌భాషలో 'మర్సియా' అనగా 'చనిపోయిన వీరుని గూర్చిన కన్నీటి పాట' అను విశాలార్థముండగా పర్షియన్‌భాషలో 'మర్సియా' అనునది పవిత్రయుద్ధమున హసన్ హుసేనుల మరణమును వివరించు గీతములకు మాత్రమే వర్తించు పదము. ఉర్దూభాషలో గూడ 'మర్సియా'కు ఇట్టి పరిమితార్థమే కలదు (అరబిక్ పదములు పారశీకము ద్వారా ఉర్దూభాషలో ప్రవేశించినవి). పారశీక సాహిత్యమున ''దకీకీ, పిరదౌసి, నిజామీ గంజ్వీ'' - అను కవులు రజ్మియారచనలో అందెవేసిన చేతులు.

గజనీమహమ్మదు కాలమునాటి పిరదౌసి రచించిన ''షోరబ్ అండ్ రుస్తుమ్'' పారశీక సాహిత్యమున విశేషప్రచారము గలిగిన వీరగాథ. ఈ కథకు చారిత్రకాధారమున్నదో లేదో తెలియుట లేదు. తన దేశీయులను యుద్ధోన్ముఖులను జేసి, వారిలో వీరత్వమును నిలబెట్టుటకై తాను ఈ కథను కల్పించితినని పిరదౌసి ఒకచో వ్రాసెనట. దీనినిబట్టి యీ గాథ కల్పితమని భావింపవలసి యున్నది. లేదా పిరదౌసి తన కాలమునాటి ముదుసలుల నుండి ఈ కథను విని యుండవచ్చును. వీరగాథాకవిత్వమును పారశీకభాషలో 'రజ్మియా నజమ్' అందురు. (రజ్మ్ = war, రజ్మియా = about war , నజమ్ = poetry).

**2.4 ఉర్దూ[9]:** ఇది నేటి పాకిస్థాన్ దేశభాష. భారతీయ ముస్లిములు నేటికిని ఈ భాషనే వ్యవహరించుచున్నారు. అరబిక్, పర్షియన్, హిందీ భాషల సమ్మేళనమున అవిభక్త భారత

9. పారశీకము, ఉర్దూ భాషలలోని వీరగాథలను గూర్చి తెలిపిన మిత్రులు, శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమున పారశీకోపన్యాసకులగు శ్రీ షేక్ మహమ్మద్ హుస్సేన్ గారికి కృతజ్ఞుడను.

దేశమున పుట్టిన భాష 'ఉర్దూ'. తరువాత మతప్రాతిపదికపై పాకిస్థాన్ దేశ మేర్పడినది. ఆ దేశమున కిది మాతృభాషయైనది.

రజ్మియా, మర్సియా కవితాప్రక్రియలు పారశీకమునుండి ఉర్దూభాషలోనికి సంక్రమించినవి. భారతదేశమున మొట్టమొదటి మర్సియా రచించిన కీర్తి హైదరాబాద్ రాజ్య స్థాపకుడగు 'కులూ కుతుబ్ షా' కు దక్కినది. ఈతని మర్సియాలు దక్షిణ భారతదేశమున మిక్కిలి ప్రసిద్ధికెక్కినవి. ఉత్తర భారతమున ''అనీస్, దబీర్'' అను కవులు రచించిన మర్సియాలకు వ్యాప్తి హెచ్చు. ఈ ఉర్దూ మర్సియా లన్నియు హసన్-హుసేనులు యజీద్‌తో పోరిన పవిత్ర యుద్ధములను వర్ణించునట్టివే. పర్షియన్ భాషలో వలెనే ఉర్దూ భాషలో సహితము మర్సియాకు పరిమితార్థమే కలదు. క్రీ.శ. 1857లో జరగిన ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామములో మరణించిన వీరులపై ఉర్దూలో ఎన్నియో రజ్మియాలు పుట్టినవి. వీనిలో గాలిబ్ కవి రచించిన రజ్మియాలు ప్రసిద్ధములు.

**2.5 చైనీస్ :** నేటి ప్రపంచ భాషలలోకెల్ల పెద్దది చైనీయభాష. సజీవ భాషలలో నింతటి ప్రాచీన సాహిత్యము గల భాషయు మఱొకటి లేదు. ఇందు క్రీ.శ. 590-960 మధ్యకాలమున గేయ కవిత్వము బహుముఖముల వ్యాప్తినొందెను.

**2.6 బర్మీస్ :** 15-19 శతాబ్దముల మధ్య బౌద్ధసన్యాసుల గేయము లనేకములు బయలు దేరినవి. వీనిలో కొన్ని చారిత్రక వీరగాథ లున్నవి. వీరగాథను ఈ భాషలో ''ఎగియిన్'' అందురని తెలియుచున్నది. 'యదు' అను ప్రకృతిప్రేమ గేయములు, ''టే-దత్, దాన్-చో, లే-చో, ద్వే-చో, బా-లే'' అనబడు లఘు గేయము లీ సాహిత్యమున కొల్లలుగా గలవు.

**2.7 మలయన్ :** ఈ సాహిత్యమున వీరగాథలు, పల్లెపాటలు మాత్రమే దేశీయమగు సహజ కవిత్వము. తక్కిన వన్నియును ఇతర సాహిత్యములనుండి అనువదింపబడినవే. ఈ భాషలో పల్లెపాటలను ''పాన్టమ్'' అందురని తెలియుచున్నది.

**2.8 తాయ్ లేక సయామీస్ :** జావాదేశపు ప్రసిద్ధ వీరుడు ''పంజి'' అను వానిని గుఱించి అనేక వీరగాథాలు ఈ సాహిత్యమున వ్యాపించియున్నవి. ''ఇనావ్'' అనునది ఇట్టి వీరగాథాలలో నొకటి.

**2.9 కొరియన్ :** ఈ సాహిత్యముపై చైనీయసాహిత్య ప్రభావ మెక్కువ. అయినను ఈ కొరియన్ సాహిత్యమున మేలి తరగతికి చెందిన దేశికవిత్వ మున్నది. కొరియన్ కవిత్వమున ఛందోలక్షణములు స్వల్పముగా నున్నవి. అందుచే కొరియన్ జానపద గేయములు మిక్కిలి సుందరములుగా నుండును.

**2.10 జాపనీస్ :** కొరియన్ భాష వలెనే జాపనీస్ భాషపై గూడ చైనీయప్రభావ మెక్కువ. క్రీ.శ. 5వ శతాబ్దములో చైనాలిపి ప్రవేశపెట్టబడు వఱకును జపానులో నంతయు మౌఖిక సాహిత్యమే. కథలు, గేయములు, మతసంబంధమైన ప్రార్థనలు మౌఖికప్రసరణమున నుండెడివి.

జాపనీస్ సాహిత్య యుగములలో క్రీ.శ. 1192-1332 వఱకును గల యుగమునకు 'కామకూరా యుగము' అని పేరు. ఈ యుగమును గూర్చి యిట్లు చెప్పబడినది: ''యుద్ధ కథానకమైన 'హెకెమొ నొగటారి' ఎవరు రచించినదో నిశ్చితముగా తెలియదు. కాని జపాను వాఙ్మయమందలి ఆ రకపు రచనలలో అది చాల ప్రముఖమైనది. 'బివా' అనబడు జంత్ర వాద్యము సాధనముగా పాడబడుచుండుటచే, తరువాతి నాటకములపై దాని ప్రభావ మధికముగా కనబడును. 'హమురోటోకి నాగా' రచించిన 'హె ఇచి మొ నొగటారి', 'హొజెన్ మొ నొగటారి', 'మిజుక గామి' (జల ముకురము) అనునవి ఈ యుగమందలి ఇతర చారిత్రక రచనలు'[10]

దీనినిబట్టి జాపనీస్‌భాషలో వీరగాథను ''నొగటారి'' అందురని ఊహింపవచ్చును. తెలుగులో 'బొబ్బిలికథ, దేసింగురాజు కథ, చిన్నపరెడ్డి కథ, బాలనాగమ్మ కథ' - ఇత్యాదిగా వీరుని పేరు పూర్వపదముగను, Ballad అనుదానికి సమానార్థకముగా 'కథ' అనునది ఉత్తర పదముగను ఉన్నట్లే, పైన చెప్పిన జాపనీస్ పేర్లలో 'నొగటారి' అను ఉత్తరపదము అన్నింటను సమానముగా నుండుట గమనింపదగినది. పైగా, ఇవన్నియును యుద్ధ కథానకములై వీరరస ప్రధానములుగా నుండుట, జంత్రవాద్యముతో పాడుటకు అనువై యుండుట, చారిత్రక ప్రాధాన్యము కలవియై యుండుట, అజ్ఞాతకవి కర్తృకములై యుండుట పై ఊహకు పోషకములుగా నున్నవి. 'హెకె మొ', 'హె ఇచి మొ', 'హొజెన్ మొ' మున్నగు పూర్వపదములు ఆయా వీరుల నామధేయములు కాబోలును.

## 3. అమెరికా ఖండము

ఇటీవలి వఱకును అమెరికా ఖండమున వీరగాథలు ఎక్కువగా వలస వచ్చిన విదేశ సంఘములవారి వలన - ముఖ్యముగా బ్రిటిషు ద్వీపముల నుండి వచ్చినవారి వలన ప్రవేశ పెట్టబడినవే. ఫ్రెంచి వీరగాథలు కెనడా, లూసియానా, మెక్సికాన్ ప్రాంతములలోని ఫ్రెంచి వలసలలో వ్యాప్తియందున్నవి. దక్షిణ అమెరికాలో పశ్చిమ ప్రాంతమున స్పెయిన్ వీరగాథలు ప్రచారమున నున్నవి.

అమెరికన్ వీరగాథాలు 'Jesse James', 'Sam Bass' వంటి నేరస్థులు, విప్లవకారులు మున్నగువారిని గూర్చియు; 'Poor Lorella' వంటి హత్యా ప్రేమికులను గూర్చియు;

---

*10. విజ్ఞాన సర్వస్వము, ఆరవ సంపుటము, పుట 409.*

విడిపోయిన ప్రేమికుల పునస్సమాగమము, పరిత్యక్త బాలికలు, కఠినులగు తల్లిదండ్రులు, స్థానిక హత్యలు, అల్లకల్లోలములు మొదలగు వానిని గూర్చియు చెప్పుచుండును. ఐరోపా వీరగాథాలలో సర్వసాధారణమగు అతిమానుష గుణము (supernatural element) అమెరికా వీరగాథాలలో సన్నగిల్లినది. ఐరిష్ జానపదగేయముల ననుకరించుచు, మరణశయ్యా గీతములు, రైలు పాటలు, పొలము పాటలు, మతసంబంధమగు గేయములు కూడ అమెరికాలో గలవు. అమెరికా వీరగాథలన్నియు సాధారణముగా ప్రాచీన గ్రంథముల నుండి ఇతివృత్తములను గ్రహించి వ్రాయబడి, జనరంజకత్వము (popularity)ను పొందినట్టివే.

ఇట్లు అమెరికా ఖండమున విదేశముల నుండి వచ్చిన వీరగాథలే కాక, దేశీయములైన వీరగాథలును కొన్ని కలవు.[11] ఇవి విదేశీయులు వలస వచ్చుటకు పూర్వమునుండియు ఇట వ్యాప్తియందున్నవి. ఇవి యిప్పటికిని దేశద్రిమ్మరులగు గాయక భిక్షువుల ముఖములలోను, గుజిలీ ప్రతులలోను నిలిచియున్నవి.[12] దేశీయములగు అమెరికా వీరగాథలు మొదట ఎక్కువగా హత్యలకు తిరుగుబాట్లకు సంబంధించియున్నను, ఇటీవలి కాలమున నిట్టివి తగ్గిపోయి, హాస్యరస ప్రధానములైన గాథలు ప్రచారమందున్నవి. ఈ క్రిందివి దేశీయ వీరగాథలలో అతి ప్రసిద్ధములైనవి: 'Spring field Mountain', ---- 'Frankie and Johnny' ---- 'Casey Jones', ---- 'John Henry', ---- 'Young Charlotte'

అమెరికాలో అతి ప్రసిద్ధమైన రెండు వీరగాథాచక్రము లున్నవి. అవి: "Jesse James", "Yankee Doodle" అమెరికాలోని వీరగాథా సంకలన గ్రంథములలో Carl Sandburg నంతరించిన 'American Songbag' అనునది అత్యుత్తమ గ్రంథము. దక్షిణ అమెరికా ఖండమున గూడ వీరగాథా కవిత్వము పుష్కలముగా నున్నది.

## 4. ఆస్ట్రేలియా ఖండము[13]

ఆస్ట్రేలియా ఖండమందలి వీరగాథ లెక్కువగా హాస్యరస ప్రధానములు. వీనిలో ప్రస్ఫుటత్వము, హాస్యము, దేశీయత, వీరము ఉట్టిపడుచుండును. ఈ చిన్న ఖండమున

---

11. *"In the U.S. many folk ballads are survivals or variants of the old English ballads, but there are a number of indigenous types, dealing with occupational pusuits, such as Casey Jones, with the Negroes and other national or racial groups, such as John Henry, with various sections of the country, with battles, and with actual or legendary heroes." -The Reader's Encyclopaedia, p.70.*
12. *Few indigenous ballads remain from colonial and provincial times but a variety of pieces from older and later periods, some of them ballads, are preserved in existent 'songsters' and broadsides. - Encyclopedia Americana, Vol. III, p. 97.*
13. *Australian Bush Ballads, edited by Douglas Stewart and Nancy Keesing, Sydney, 1957.*

వీరగాథ లెట్లు పుట్టినవను విషయమున పరస్పర భిన్నములగు రెండు వాదములున్నవి. ఇంగ్లండు, ఐర్లండు, స్కాట్లండు దేశములనుండి ఇక్కడకు వచ్చిన ప్రప్రథమ కాందిశీకులు తమతో తెచ్చుకొన్న జానపద కవిత్వమునుండి ఆస్ట్రేలియా వీరగాథలు పరిణమించినవని ఒక వాదము. 'Adam Lindsay Gordon' అను కవి ప్రచారమునకు తెచ్చిన ఒకానొక సాహిత్యోద్యమమే ఆస్ట్రేలియా వీరగాథలని మఱియొక వాదము.

పై రెండు వాదములును సత్యములే. ప్రాచీనములగు 'పొదరింటి పాటలు' (bush songs) తరువాతి కాలపు గాథారచయితల నెక్కువగా ప్రభావితము చేసినవనుట నిజము. అట్లే 'గార్డన్' కవి రచించిన 'The Sick Stock Rider' అను వీరగాథకు పుంఖానుపుంఖముగా పుత్రిక లేర్పడినవనుటయు సత్యమే. గుఱ్ఱపుస్వారీలకు, పందెములకు సంబంధించిన వీరగాథ లన్నియును దీనినుండి యేర్పడినవే.

ఆస్ట్రేలియా వీరగాథోత్పత్తిని గుఱించి మఱియొక వాదము కూడ ప్రచారమున నున్నది. రాత్రివేళలో పాఱిపోజూచు ఆలమందలను ప్రశాంతపఱుచుటకు పసులకాపరులు పాటలు పాడుట ప్రారంభించిరనియు, వీరగాథలు కొంతవఱకును ఈ పాటలనుండియే పరిణమించిన వనియు కొందఱు విమర్శకు లూహించుచున్నారు.

ఈ వాదములన్నిటిని సమన్వయ పఱుచుకొనగా ఆస్ట్రేలియా ఖండమున వీరగాథలు సహజముగా పుట్టినవనియు, ఆ ఖండము వీరగాథోత్పత్తికి అనువుగా నున్నదనియు, గాథాసృష్టి చేయగల ప్రజలు అచ్చట కలరనియు, కాల మనుకూలముగా నున్నదనియు, అందుచే ఆ ఖండములో వీరగాథ లుద్భవించి వికసించినవనియు తెలియుచున్నది.

ఆస్ట్రేలియాలో దేవతలు లేరు; ఫలితముగా దేవతలపై గాథలు లేవు. అట్లే అట దయ్యములపై ప్రజలకు నమ్మకమును లేదు; అందుచే దయ్యములను గూర్చిన కథలును లేవు. ఇంగ్లండు - స్కాట్లండు సరిహద్దు గాథల (Border Ballads) వంటి నాటకీయ కథలును ఆస్ట్రేలియాలో స్వల్పముగ నున్నవి. ఆస్ట్రేలియాలో యుద్ధజాతులు లేవు; అందుచే యుద్ధ సంబంధమగు వీరగాథలును మృగ్యము. అట తరతరములుగా వసించు సంపన్న కుటుంబములు లేవు; అందుచే సామాన్యులకు ప్రతీకగా నొక గొప్పవానిని (Aristocrate) నాయకుని జేసి, ఆతని సాహసములను వర్ణించునట్టి గాథలును లేవు.

ఇన్ని లేకపోయినను ఆస్ట్రేలియా ఖండము వీరగాథా సంపదలో వెనుకబడలేదు. వీరగాథోత్పత్తికి అవసరములగు నాటకీయ సంఘటనలు అట ననేకములు జరగినవి. వాని నుండి ప్రశస్తమగు వీరగాథలు కొన్ని పుట్టినవి : "There were, it is true, several dramatic possibilities in Australia, all of which the balladists seized upon, sometimes with excellent results. There were the occasional spearings of outback settlers or

their cattle by the aborigines, and the sometimes dreadful relations by the whites. There were the riots on the gold-fields....which moved towards armed rebellion and the setting up of a republic. And, especially, there were the bushrangers...."[14]

ఇట్లు వీరగాథోత్పత్తికి వలసిన పరస్పర సంఘర్షణ లిన్నియున్నను, ఇవి యన్నియు అతిత్వరలో అణగ(దొక్కబడినవి. నల్లజాతులపై తెల్లజాతి చేసిన యుద్ధము ఏకపక్షా(శితమై వీరమును (ప్రకోపించునదిగా లేదు. పైగా, ఇది మిక్కిలి సంక్షిప్తమై, అతి (ప్రాచీనకాలమున జరగినదై యున్నది. బంగారు గని కార్మికుల విప్లవము సైన్యము చేతను, రాజకీయ స్వేచ్ఛా (ప్రదానము చేతను అతిత్వరలో అణచివేయబడినది. తుప్పల పితూరిదారులు (bush rangers) చుట్టుముట్టబడి అతిశీఘ్రకాలమున నిర్దాక్షిణ్యముగా నురితీయబడిరి. ఇట్లు అతి కుతూహలమును పుట్టించు ఈ వీరగాథోత్పత్తి హేతువులలో ఏ ఒక్కటియు అభివృద్ధి కానీయబడలేదు. ఇవి అభివృద్ధి చెందియున్నచో ఆ(స్ట్రేలియాలో హత్యాభియోగ (ప్రాచుర్యముతో నొక (క్రొత్తసంఘ మేర్పడి, విషాదాంత వీరగాథలను కొల్లలుగా సృజించి యుండెడిది. కాని ఆ(స్ట్రేలియాలో అట్టిది జరగలేదు.

సకృత్తుగా వీరగాథోత్పత్తికి హేతుభూతమైన సంఘటన లభించినప్పుడు సైతము, ఆ(స్ట్రేలియా గాథారచయితలు ఆంగ్లభాషలోని (ప్రాచీనకాలపు సరిహద్దుగాథల ననుకరించుట గమనింప తగ్గది. ఈ సరిహద్దు గాథలు (ప్రధానముగా విషాదాంతములు, బీభత్సరస (ప్రధానములు. ఏమైనను, ఈ తరగతి వీరగాథాలు ఆ(స్ట్రేలియాలో తక్కువ. ఆ(స్ట్రేలియా వీరగాథ లన్నియును హాస్యరస (ప్రధానములే యనవచ్చును. రాబిన్‌హుడ్ వీరగాథాలలోను హాస్యమున్నది! ఛాసర్ ఆఖ్యాన కవనమునను హాస్యమున్నది! కాని వీనిలో హాస్యము (ప్రధానము కాదు, ఆనుషంగికము మా(త్రమే. ఆ(స్ట్రేలియా వీరగాథలలో నిట్లు గాక, హాస్యమే (ప్రధానముగా, అదియే జీవగఱ్ఱగా నున్నది[15].

'Kelly Gang' అనునది ఆ(స్ట్రేలియాలో (ప్రసిద్ధి కెక్కిన వీరగాథాచ(క్రము. Paterson రచించిన 'The Man from Snowy River' అను వీరగాథ ఆంగ్ల సరిహద్దు గాథానుకరణములలో (ప్రసిద్ధమైనది. Douglas Stewart, Nancy Keesing అను పండితులు సంకలనము చేసిన "Australian Bush Ballads" అను (గ్రంథమున మొత్తము 220 వీరగాథలున్నవి.

---

14. *Douglas Stewart, Preface, Australian Bush Ballads, p. xvii*

15. *"There is laughter in the Robbin Hood ballads, as there was afterwards in the narrative poetry of Chaucer, but the Border ballads proper are tragic and severe. But humour is the very basis, the living flesh of the Australian ballad".*

*-Ibid, p. xviii*

ఆస్ట్రేలియాలో ప్రసిద్ధికెక్కిన కొన్ని వీరగాథలు, వాని రచయితలు:

| వీరగాథ పేరు | కవి పేరు |
|---|---|
| Brave Ben Hall | (Anon) |
| 'Tis true Not Many Years Ago | J.E.Liddle |
| The Watchers | Earnest Favenc |
| The Devil on the Rock | G.M.Smith("Steele Grey") |
| Ballad of the Drover | Henry Lawson |
| The man from Snowy River | A.B.("Banjo")Paterson |
| The Team Bullock | Will H. Ogilvie |
| Waiting for the Rain | John Neilson |
| His Last Stage | John Philip Burke(J.P.B.) |
| A Tale of Tooth | Henry E.Horne |
| The Man from Ironbark | A.B.("Banjo") Paterson |
| Why Doherty Died | Thomas E. Spencer |
| Salt | A.S. Allison |
| Since the Country Carried Sheep | Harry Morant("The Breaker") |
| The Horse that Died for Me | Edwin Gerard ('Gerardy') |

ఇట్లు ఆస్ట్రేలియాలో ఎక్కువ వీరగాథలు సకర్తృకములుగనే కన్పట్టుచున్నవి. కావున వీరగాథలకు కవి యుండడను జానపద సిద్ధాంతుల వాదము పరాస్తమగుచున్నది.

## 5. ఆఫ్రికా ఖండము

చారిత్రకులకే కాక సాహిత్యపరులకును ఇది 'చీకటి ఖండము'గనే యున్నది. ఇచటి నీగ్రో జాతుల భాషలలో వాగ్రూప సాహిత్యమే కాని లిఖిత సాహిత్య మున్నట్లు లేదు. అందుచే ఇట సాహిత్యమంతయు జానపదరూపముననే ఉండియుండును. ఈ ఆఫ్రికన్‌జాతులు పరస్పరము కలహించునట్టివి. కాబట్టి ఈ భాషలలో వీరగాథలు పుష్కలముగా పుట్టియుండునని తలంపవచ్చును.

పై పరిశీలనను బట్టి, యావత్ ప్రపంచమునను డెన్మార్కు, 'ఫేరోస్' (Faeroes), ద్వీపములు, స్కాట్లండ్, స్పెయిన్, పోర్చుగల్, 'సిసిలీ' (Sicily) ద్వీపము - మున్నగుచోట్ల వీరగాథ లత్యధికముగా నున్నవని తెలియనగును.

* * * * *

ఆఱవ ప్రకరణము

# భారత భాషలు - వీరగాథలు

వెనుకటి ప్రకరణమున ప్రపంచమున గల వివిధ దేశములందలి జానపద సాహిత్యమును గూర్చియు వీరగాథలను గూర్చియు కొంత పరిశీలించితిమి. ఇప్పుడు భారత దేశములోని వివిధ భాషలలో వీరగాథాప్రక్రియ యెట్లున్నదో స్థూలముగా తెలిసికొందము.

## ఆర్య భాషలు- వీరగాథలు

**1. హిందీ :** హిందీ సాహిత్యమున వీరగాథలకు ప్రత్యేక స్థానమున్నది. ఈ సాహిత్యచరిత్రను విమర్శకులు నాలుగు ప్రధాన భాగములుగా విభజించి, అందు ప్రప్రథమ కాలమునకు 'వీరగాథా కాలము' అను పేరిడిరి (1. వీరగాథా కాలము, 2. భక్తి కాలము, 3. రీతి కాలము, 4. ఆధునిక కాలము). మొదట ఈ పేరును సూచించినవాడు రామచంద్ర శుక్ల పండితుడు. వీరగాథలకు ప్రపంచమున ఏ సాహిత్యమందును ఇంతటి ఉన్నతస్థాన మీయబడలేదు.

హిందీ వీరగాథలలో నూటికి తొంబది వంతులు రాజస్థాన్‌లో పుట్టినవే. రాజస్థానీ మాండలికమున వీరగాథను 'రాసో' అందురు. 'చారణు'లను గాయకులు ఈ వీరగాథలను ఉత్తర దేశమంతటను వ్యాపింపజేసిరి. చారణులు పాడుచుండుటచే వీరగాథలను హిందీలో 'చారణ గీతము' లనియు పిలుతురు. ఈ చారణులనుబట్టియే హిందీ సాహిత్యచరిత్రలోని వీరగాథా కాలమునకు 'చారణయుగ' మనియు పేరు వచ్చినది.

ఈ వీరగాథాయుగ రచనలో తొలుత పేర్కొనదగినది 'ఖుమాన్ రాసో'. దీని రచయిత దలపత్ విజయుడు. ఈ ఇతివృత్తము చిత్తూరు దుర్గము నేలిన ద్వితీయ ఖుమానునకు సంబంధించినదని ఆచార్య రామచంద్ర శుక్ల తలంపు. కాని ఇటీవలి పరిశోధనల వలన ఇది ఈ కాలమునకు చెందిన రచనకాదని తేలినది. ఇందు రాణాప్రతాపుని చరిత్రయే కాక, అతనికి రెండు తరముల వెనుకటి వాడైన రాణా జయసింహుని చరిత్రము కూడ వర్ణింపబడి యున్నదనియు, అందుచే నిది 18వ శతాబ్ది పూర్వార్ధమునకు చెందిన రచన యనియు కొందఱు విమర్శకులు భావించుచున్నారు. హిందీ సాహిత్యమందలి మఱికొన్ని సుప్రసిద్ధ 'రాసో'లు:

**'బీసల్ దేవ రాసో'** - రచయిత నరపతి నాల్హ. రచనాకాలమును గూర్చి అభిప్రాయ భేదము లున్నవి. విక్రమ శకము 1212 అని కొందఱు, వి.శ. 14వ శతాబ్దమని మఱికొందఱు,

వి.శ. 1545-60మధ్యకాలమని ఇంకకొందఱు భావించుచున్నారు. ఇది గానయోగ్యమై, శృంగార రసప్రధానమై, రచనాసౌష్ఠవము కలిగిన చక్కని ప్రేమ గీతము.

**'జయచంద్ర ప్రకాశ్'** - కేదారభట్టు రచన.

**'జయ మయంక జస చంద్రికా'** - మధురకవి మాధోభట్టు రచన.

ఈ రెండు గాథలును అనుపలబ్ధములు. వీనియందు బహుశః కనోజు రాజైన జయచంద్రుని ఇతివృత్తము వర్ణింపబడియుండును.

**'హమ్మీర్ రాసో'** - దీని కర్త వి.శ. 1350 ప్రాంతమువాడగు 'శార్ఙ్గధరు'డని కొందఱు, 'జజ్జల కవి' యని మఱికొందఱు తలంచుచున్నారు. పూర్తిగా లభ్యము కాలేదు. ఇతివృత్తము హమ్మీర్ రాణాను ఆశ్రయించి యుండును.

**'విజయపాల్ రాసో'** - కవి నల్లసింహ్. వి.శ. 1355 ప్రాంతమువాడు. ఇందు వి.శ. 1095లో విజయపాలునికి 'వరంగ జా' కు జరగిన యుద్ధము వర్ణింపబడినది.

**'పృథ్వీరాజ రాసో'**- ఇది హిందీ వీరగాథాయుగమందలి రచనలలో కెల్ల నెక్కువ ప్రశస్తి నార్జించిన రాసో. దీని కవి 'చందు వరదాయి'. ఈతడు ''ప్రసిద్ధ హిందూ నరేశుడైన పృథ్వీరాజు యొక్క చెలిమికాడు, ఆస్థానకవియు నై యుండెను. రాసోసాహిత్యమందెల్ల ప్రసిద్ధి కాంచిన పృథ్వీరాజ రాసో కూడ ప్రామాణికమగు రచనముగా అంగీకరింపబడలేదు. చరిత్రకు సరిపడని అనేక విషయము లిందు చోటు చేసికొన్నవి. కాగా ఈ గ్రంథముపై తర్జన భర్జనలు అనేకములు చెలరేగినవి.... చందు వరదాయి ప్రతిభావంతుడైన కవి. షడ్భాషా వైదగ్ధ్యము కలవాడు. తన కావ్యమున వీర శృంగారములను చక్కగా పోషించెను. ముఖ్యముగా ఇచ్ఛినీ దేవి, శశివ్రతా, సంయోజితా వివాహ ఘట్టములు రసికులను ఆకర్షించును. ఇవి అన్నియు ప్రాచీన కథారీతులను అనుసరించి కవి వర్ణించెను.''[1] పృథ్వీరాజు క్రీ.శ. 1180-1193 మధ్యకాలములో ఢిల్లీని పాలించిన చక్రవర్తి.

**'పరమాల్ రాసో' లేక 'అల్హా'** - ఇది 'అల్హా' ఛందస్సులో గేయరూపమున నున్నది. రచయిత జగనికుడు. ఇతివృత్తము 'మహోబా'లోని 'అల్హా', 'ఊద్దల్' అను ఇరువురు వీరయువకుల చరిత్ర. కాలాంతరమున ఇందు పెక్కు మార్పులు వచ్చినవి. వర్షాకాలమున దీనినిప్పటికిని పాడుచుందురు. ఈ వీరగాథా వైశిష్ట్యమును గూర్చి 'శ్యామ్ పర్మార్' అను విమర్శకు డిట్లు తెల్పుచున్నాడు:

---

*1. విజ్ఞాన సర్వస్వము, ఆరవ సంపుటము, పుట 346.*

In Uttar Pradesh ' Alha', still continued its unceasing impact over the people from the points of content and art of singing. Originally it was first composed into Bundelkhandi and attributed to Jagnik, but unfortunately that text has gone into oblivion. . . . Woven into many variants of certain out-growth and folk-like ornamentations, the structural story of this narrative did not change. It has kept up the stereotype episodal sequences, which move round the two heroes, namely 'Alha' and 'Udal', unchanged. Throughout the North India this ballad is sung with gusto, zeal and extolling voice."[2]

హిందీ సాహిత్యమున వీరగాథాపరముగా వాడబడుచున్న 'రాసో' శబ్దము 'రాసక్' అను శబ్దమునుండి పుట్టినది. రాసక > రాస అ > రాస ఉ > రాసో అనునది దీని వికాస ప్రకారము. 'రాసక' మనగా 'గుండ్రముగా జేరి నృత్యము చేయుట' అని యర్థము. 'రాసక్రీడ' శబ్దము కూడ దీని పరిణామమే. ప్రాక్తన సంఘములు చేసిన వలయ నృత్యము (communal ring dance) నుండి వీరగాథలు పుట్టినవను పాశ్చాత్య సిద్ధాంతమును హిందీయందలి 'రాసో' శబ్ద వికాసము బలపఱచుచున్నది. హిందీలో 'భూషణ్' అను వీరకావ్య రచయిత శివాజీస్తుతితో 'శివరాజ భూషణ్' అను వీరరస ప్రధానమైన లక్షణగ్రంథమును గూడ రచించెను.

మాళవ దేశమున 'ఛెయిన్‌సింగ్ యువరాజు' (నరసింహ ఘడ్), క్వాజా నాయక్ తిరుగుబాటు' అనునవి ప్రసిద్ధమైన వీరగాథలు[3]. బ్రజ్, బుందేల్ ఖండ్, కంగరా లోయ ప్రాంతములలో 'జగదేవ్' వీరగాథ లేక 'జైమాల్ ఫట్టా' (Jaimal Phatta) విశేషముగా పాడబడుచున్నది. ఇది, మన పల్నాటి వీరకథలవలె, కత్తి డాలు చేతబట్టి కదము త్రొక్కుచు పాడబడును. యుద్ధవీరగాథలు రాజస్థాన్ సౌరాష్ట్రములలో హెచ్చు. 'దూంగ్ జీ-జవార్ జీ' (Doongjee-Jawarjee), 'రతన్ రాణో' (Ratan Rano) అను వీరగాథలు రాజస్థాన్‌లో రావణహస్త మను వాద్యముతో పాడబడుచున్నవి. ఇవి క్రీ.శ. 1857కు పూర్వమే ఆఙ్గ్లేయులపై తిరుగుబాటు చేసిన వీరుల గాథలు.

ఘర్‌వాల్ ప్రాంతమున వీరగాథను 'పవారా' (Pawara) అందురు. 'మధోసింగ్' (Madhosingh) అను అస్పష్ట చారిత్రక వీరగాథ ఈ ప్రాంతమున మిక్కిలి ప్రసిద్ధి కెక్కినది. ఇది 'మథేలే' కాలువకు సంబంధించిన కథ. మధోసింగ్ భారత టిబెట్ దేశముల సరిహద్దులను నిర్ణయించిన వీరుడు. "Bhanu Damama, Rikhola, Asha Hindwan, Kafu Chauhan, Gadu Sumerial" ఇత్యాదులు సుప్రసిద్ధ ఘర్‌వాలీ వీరగాథలు.

మధ్యప్రదేశ్‌లో ఛట్టిస్ ఘడ్ ప్రాంతమున 'బాన్స్ గీతములు' (Bans Geets) అనబడు ప్రాచీన వీరగాథలున్నవి. ఇవి ఒక ప్రత్యేక పద్ధతిలో పాడబడుచున్నది. పొడవైన వెదురు

2. *Shyam Parmar, 'Ballad singing in India', Folklore, Vol. V, No.8, August 1964.*
3. *See, Indian Antiquary Vols. XLIV, XLV.*

గొట్టముల నూదుచు 'రావత్' వర్ణమునకు జెందిన కర్షకులు ఈ వీరగాథలను గానము చేయుదురు. ఇట్లు పాడబడు వీరగాథలలో "Bhujabal Ahir", "Kahawa Aupania" అనునవి ప్రసిద్ధములు.

**2. పంజాబీ :** పంజాబీ భాషలో వీరగాథను 'వార్'(Vaar) అందురు. 'జంగ్‌నామా' శబ్దము కూడ వీరగాథలను సూచించునట్టిదిగనే కన్పట్టుచున్నది. వర్గ వర్ణ సంబంధములేని జానపద సాహిత్యము పంజాబు కంతకును సామాన్యమైన సొత్తు. ఇది ముఖ్యముగా పదములతోడను, కథలతోడను నిండియుండి ఎడనెడ కవితాస్పర్శ కలిగి కథానక శైలిలో వ్రాయబడి యుండెను. ప్రాచీనమైన వీరగాథలు శాల్బాహనుని కుమారులైన 'పూరణ', 'రిసాలూ' లకు సంబంధించి యున్నవి. ఈ శాల్బాహనుడు ప్రతిష్ఠానపురము నేలిన శాలివాహనుడనియు, అతడు పంజాబును జయించిన పిమ్మట సయాల్‌కోట నగరమును స్థాపించెననియు చెప్పుదురు. ఈ సోదరుల గాథలు ఉత్తర హిందూస్థాన మందంతటను వ్యాప్తిలో నున్నవి.

ఒక్క పంజాబులోనే కాక, ఉత్తర హిందూస్థాన మంతటను జానపద కవిత్వమందలి ప్రధాన వస్తువు 'హీర్ - రాంఝా' ల వృత్తాంతము. 'హీర్' చీనాబు నదీతీరమున గల 'ఝాంగు' నందలి 'శ్యాల నాయకు'ని కూతురు. 'ధీడో' అనునతడు మఱొక గ్రామాధికారి కనిష్ఠ పుత్రుడు. అతనికి వంశమును బట్టి 'రాంఝా' అనియు నామాంతరము కలిగెను. హీర్, రాంఝాలకు ప్రణయ మేర్పడెను. రాంఝా, హీర్ తండ్రిచే నోడింపబడి ఫకీరగుటచే, ఆమె మఱొకనిని పెండ్లియాడవలసి వచ్చెను. రాంఝా నూతన గృహమున కూడ ఆమెను కలసికొనెను. కొన్ని గాథలలో విశ్వాస హీనతచే హీర్ వధింపబడెననియు, ఆ వార్త విని రాంఝా విచారగ్రస్తుడై మరణించెననియు చెప్పబడినది. మఱికొన్ని గాథలలో హీర్, రాంఝాతో లేచిపోయి సుఖముగా నుండెనని చెప్పబడినది. జనవ్యాప్తిని బట్టి చూడ ఈ కథ మిక్కిలి ప్రాచీనమైనదిగా తోచుచున్నది. దీనిని మొట్టమొదట కథారూపమున చెప్పినవాడు ఝుంగి వాసియు, అక్బరు కాలమందలి వాడును నగు 'దామోదరుడు'.[4]

ఈ క్రిందివి కొన్ని ప్రసిద్ధ ప్రాచీన పంజాబీ వీరగాథలు :

Tunde Asraja Di Vaar
Sikandar Ibrahim Di Vaar
Jodhe Singh Di Vaar

అక్బరు కాలములోను, గురు అర్జున్‌దేవ్ కాలములోను ఇట్టి వీరగాథలు విశేషముగా వ్యాపించినవి. గురుగోవింద్ సింగ్ (1660-1708) స్వయముగా "Chandi Di Vaar" అను

4. విజ్ఞాన సర్వస్వము, ఆరవ సంపుటము, పుట 324.

వీరగాథాను రచించెను. 'నజ్‌బత్' (Najbat) అను కవి రచించిన "Nadir Shah Di Vaar" పంజాబీలో మిక్కిలి ప్రసిద్ధికెక్కిన వీరగాథ. కాని ''ఇందు ప్రధాన చారిత్రకాంశములు వర్ణింపబడలేదు. నాదర్‌షా ఢిల్లీలో గావించిన సార్వజనిక హత్యాకాండ నామమాత్రమునకైన ప్రస్తావింపబడలేదు. ఇది ప్రాచీన భారతీయోపాఖ్యాన పద్ధతిలో కలి నారద మహర్షుల వివాదముతో ప్రారంభమగుచున్నది. ఇందు చారిత్రకాంశములకంటె కావ్యాంశము లెక్కువగా కనపడును. ఇందలి పదగుంభనము, సరళశైలి, నిర్దుష్ట ప్రయోగము గణనీయములైనవి. నాటకీయ గుణము కూడ ఈ కథలో కన్పించును.''[5] ఇది 18వ శతాబ్ది ప్రథమ పాదమున రచింపబడి యుండును. (1925లో మొదటిసారిగా ముద్రింపబడినది). 1734 లో 'అగరే' కవి 'దలైమా' ఛందములో ''హక్ కత్ రాయ్ వార్'' అను వీరగాథను రచించెను. ''ఛట్టియా దీ వార్'' అను వీరగాథయు; యశోదానందుడు, దేవీదాస్ అను కవులు రచించిన 'లవకుశ్‌కీ వార్'' అను వీరగాథయు 18వ శతాబ్దమున పుట్టిన ఇతర పంజాబీ వీరగాథలు.

పంజాబీ సాహిత్యమున మహమ్మదీయులు సృజించిన 'జంగ్‌నామా' లు 'వీరగాథలుగా దలపవచ్చును. ఇవి అరబిక్, పర్షియన్, ఉర్దూ భాషలలోని 'మర్సియా'ల వంటివే. ఈ జంగ్‌నామాలు, 'హసన్, హుసేన్' అను వీరులొక ప్రక్కనను, 'యజీద్' మఱొక ప్రక్కను ఉండి పోరిన పవిత్ర యుద్ధములను వర్ణించును. ఇవి ఆ యుద్ధములకు స్మారక చిహ్నములుగా నిర్వహింపబడు మొహరమ్ దినములలో ప్రతి సంవత్సరము పాడబడును. వీనిలో క్రీ.శ. 1696లో 'ముక్బిల్' కవి వ్రాసిన జంగ్‌నామా మొట్టమొదటిది. 'హమీద్' అనుకవి 1765లో రచించిన జంగ్‌నామా ఇంతకంటెను జనసమ్మతమైనది. ఇందు 5620 పంక్తులున్నవి. ఇందలి కొన్ని భాగములు స్త్రీల రోదనములతో కూడి మిక్కిలి హృదయ ద్రావకములుగా నుండును.

క్రీ.శ. 1721-37 సంవత్సరముల నడుమ 'మణిసింగు' సమకూర్చిన 'దశమ గ్రంథము' శిక్కుల రెండవ మతగ్రంథము. హిందూ పురాణముల నుండియు, సమకాలిక జానపద సాహిత్యము నుండియు సేకరింపబడిన కథల సమూహమే దశమగ్రంథము.

'శిక్కు యుద్ధములు' అను మఱియొక వీరగాథ కూడ నేడు పంజాబులో విశేషవ్యాప్తి యందున్నది. ఇది రెండు భాగములుగా నున్నది. మొదటి భాగమున క్రీ.శ. 1845-46లో జరగిన మొదటి శిక్కుయుద్ధము, 1846 ఫిబ్రవరి 10వ తేదీన జరగిన సోబ్రాంగ్ యుద్ధము వర్ణింపబడినవి. రెండవ భాగమున 'ముల్తాను'ను పట్టుకొనుట, రెండవ శిక్కుయుద్ధము వర్ణితములు. (ఈ రెండు సంఘటనలును 1848-49లో జరగినవి). ఈ వీరగాథను 1875లో,

---

*5. ఉత్తర భారత సాహిత్యములు, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమి ప్రచురణ, 1965, పుట 278.*

అనగా సంఘటన జరగిన సుమారు 25-30 సంవత్సరములకు M. Longworth Dames అను దొర సేకరించినాడు.[6]

పంజాబీ జానపద సాహిత్యమును గూర్చి జరగిన కృషిని ప్రశంసించుచు ఆచార్య మోహన్ సింగ్ గారిట్లు వ్రాయుచున్నారు:

''పంజాబీ జానపదసాహిత్యములో ప్రథమ మహాన్వేషకుడు దేవేంద్ర సత్యార్థి. వీరు పంజాబీ లోకగీతములను సేకరించుటలో చాల కృషిచేసిరి. వీరు గాక పండిత రామ్‌చరణ్ (పంజాబీ దే గీత్), కర్తార్ సింహ 'షంషీర్' (జీ ఊందీ దునియా, గాఁవ్రూఁదా పంజాబ్), హరజీత్ సింహ (నైఁఝునోఁ), షేర్ సింహ 'షేర్' (బార్ దే ఢోలే) మొదలైనవారి కృషి కూడ ప్రశంసనీయమైనది. డా॥ యస్.యస్. రంధావా శాస్త్రీయ పద్ధతిలో జానపద సాహిత్యమును సంగ్రహించి దానినొక విశిష్ట క్రమమున ప్రకటించి మన కందించుచున్నారు. వారు ప్రకటించిన 'ప్రీత్ కహానియాఁ', 'పంజాబీ లోక్‌గీత్', 'కుల్లూ దే లోక్‌గీత్', 'కాంగ్డా', 'హరియాణ్ దే లోక్ గీత్' మొదలైనవి మిగుల ఉత్తమ సంపుటములు.''[7]

**3. కాశ్మీరీ :** జమ్ములో వీరగాథలను 'బారన్స్' (Baarans) అందురు. ఇవి పంజాబీ 'వార్స్' వంటివే. కాశ్మీరీ భాషలో 14వ శతాబ్దమునాటికి అజ్ఞాత కర్తృకములై జనుల ముఖముల నుండి పరంపరగా సజీవములై వచ్చుచున్న గేయములు పెక్కులున్నవి. గృహ జానపద గేయములు, పెండ్లి పాటలు, మరణ గేయములు, కోతల పాటలు, గొల్లల పాటలు మున్నగు అనేక విధములైన గేయములున్నవి.

**4. బెంగాలీ :** క్రీ.శ. 16,17 శతాబ్దములలో వంగ సాహిత్యమున వీరగాథలు పెక్కు వెలువడినవి. ఇవన్నియు చారిత్రక వస్తు సంబంధము గలిగి, హృద్యమైన కవితాశోభతో నొప్పారుచుండును. వీనిలో అతి సుందరమైన 'చౌదరీర్ లడాయి' తూర్పు వంగదేశమునందలి మైమన్ సింగ్ జిల్లాలో రచింపబడినది. ఇది మన బొబ్బిలికథను పోలియుండు మనోహరమైన యుద్ధవీరగాథ. 17వ శతాబ్దములో నుత్తర వంగ దేశమున 'రాజా గోపీచంద్రు' (గోవింద చంద్రు) నకు సంబంధించిన జానపద రచనలు పెక్కు గలవు. వీనిలో బౌద్ధమత ప్రభావము గోచరించును.

**5. అస్సామీ :** ''క్రీ.శ. 7వ శతాబ్దియందు అస్సామున పర్యటించిన చైనాయాత్రికుడు హ్యూన్‌త్సాంగు వ్రాసిన విశేషములను బట్టి చూడ ఆనాటికే అస్సామీయందు కొంత సారస్వతము ఉండెడిదని ద్యోతకమగుచున్నది. ఆనాడు ఈ ప్రాంతమును 'కామరూపము' అని వ్యవహరించెడివారు. చైనీయ వీరుడగు చిన్వాంగ్ షి హ్మైన్ వీరకృత్యములను గుఱించిన ఒక

6. *A Ballad of the Sikh Wars', Indian Antiquary, Vol. XXXVIII, 1909, p.171.*
7. *శ్రీ గడియారం రామకృష్ణశర్మగారి అనువాదము, ఉత్తర భారత సాహిత్యములు, పుట 278.*

గేయము ఆనాటి కామరూపమున ప్రజలలో వ్యాప్తి యందుండెననియు, ఆ వీరునికి చైనా చరిత్రయందు గల ప్రాముఖ్యమును తెలిసికొనగోరి కామరూపాధిపతియగు భాస్కరవర్మ తన్ను ప్రశ్నించెననియు హ్యూనిత్సాంగు పేర్కొనెను. విరివిగ ఈనాడును వ్యాప్తియందున్న జానపద సాహిత్యమున అత్యధిక భాగము ఆ పూర్వ యుగమునకు చెందినదియే అని తద్జ్ఞుల అభిప్రాయము.''[8]

అస్సాములో ఆకురాలు కాలములో వచ్చు 'మాఘ బిహు' అను పండుగలోను, వసంత కాలములోవచ్చు ''బోహగ్ బిహు'' అను పండుగలోను ఎన్నియో జానపద గీతములు పాడబడుచున్నవి.[9] ఈ పండుగలు మన సంక్రాంతి పండుగ వంటివి. ఈ పండుగ దినములలో ప్రజలు పాడిపంటల సమృద్ధిలో తులతూగుచు నుల్లాసముగా పాటలు పాడుకొనుచుందురు.

**6. గుజరాతీ :** గుజరాతునందలి అన్ని ప్రాంతములందును జానపద సాహిత్యము ప్రజా జీవితమున చాల ప్రముఖపాత్ర వహించినది. గుజరాతు గేయములును, కథలును పారంపర్యముగ వచ్చుచున్నవి. ఇప్పటికిని పసుల కాపరులు వీనిని పాడుచుందురు. 'గుజరీనో గర్బో' అను గొల్లభామ కథ గుజరాతులో మిక్కిలి ప్రసిద్ధి కెక్కినది.[10] 'గర్బో' అనగా గొబ్బి పాట.

**7. మరాఠీ :** మరాఠీ భాషలో వీరగాథను 'పోవాడా'(Powada) అందురు. ఈ పోవాడా అనునది 17వ శతాబ్దమున ఈ భాషలో వికసించిన వీరతాస్ఫోరక సాహిత్యము. అఫ్జల్ ఖానును వధించిన శివాజీ వీరకృత్యమును వస్తువుగ గ్రహించి అగ్నిదాస్ అను కవి 1659లో రచించిన వీరగాథ ఈ పోవాడాలలో మొదటిది. 'తులసీదాస్, అనంత ఫూందీ, ప్రభాకర్' మొదలగు కవులు పీష్వాలను గురించి ఇట్టి పోవాడా లనేకములు రచించిరి. జానపదకవులే కాక శిష్టకవులును వీరగాథారచనకు కడంగుట మహారాష్ట్రుల సుకృతము!

"Apart from obscure local poets, who were the authors of innumerable folktales, renowned poets and ballad singers have also composed ballads which are popular even today. Sagan Bhau, Shahir Prabhakar, Patthe Baburao, Ram Joshi are names which never fail to produce a magical effect on the masses. Many of their songs have been carried from one generation to another orally. Efforts are now being made by research scholars to collect them and print them."[11]

---

*8. విజ్ఞాన సర్వస్వము, ఆరవ సంపుటము, పుట 298.*

*9. See, 'Harvest Festival and the Bihu Songs of Assam', by Sukumar Biswas, Gauhati University, Gauhati, 1964.*

*10. See, Indian Antiquary, Vol. XVIII, 1889, p.242.*

*11. Binod Rao, 'Folk Tales of Heroism and Valour', Akashvani, Vol.XXVIII, No.48, December (1-7) 1963, p.9.*

ఈ క్రిందివి మరాఠీ సాహిత్యమందలి కొన్ని ప్రశస్త వీరగాథలు:

(1) ఛత్రపతి శివాజీని ఔరంగజేబు ఢిల్లీకి ఆహ్వానించి మోసగించి బంధించగా, శివాజీ మిఠాయిగంపలో కూర్చుని తప్పించుకొని పోయిన గాథ.

(2) సింహఘడ్ కోటను పట్టుకొనుటకై తానాజీ చేసిన ప్రాణత్యాగము.

(3) ప్రతాప్‌ఘడ్ యుద్ధము - శివాజీ అఫ్జల్‌ఖానును చంపుట

(4) బాజీప్రభు దేశ్‌పాండే శివాజీ విజయమున్నకై చేసిన ప్రాణత్యాగము

(5) షయిస్తఖాన్ శివాజీ చేత వ్రేళ్ళు నఱకబడి పాఱిపోయిన కథ

(6) శంభాజీ కథ (శివాజీ పెద్ద కొడుకు)

(7) రాజారాం కథ (శివాజీ చిన్న కొడుకు)

(8) 'ధనాజీ జాధవ్' - 'సంతాజీ ఘోర్‌పాడే' కథలు. వీరిద్దఱును గొప్ప మరాఠీ సర్దారులు. వీరి పేరు చెప్పిన చాలు, మొగల్ గుఱ్ఱములు నీళ్ళు త్రాగెడివి కావట!

(9) బాజీరావు పేష్వే కథ - ఈతడు 'మస్తాని' అను ముస్లిమ్‌యువతిని ప్రేమించెను. ఆమెను పూనాకు తెచ్చెను. వీరిద్దఱి పైనను అసంఖ్యాకముగా పాటలు గాథలు వ్యాపించినవి.

(10) బాజీరావు సోదరుడగు 'ఛిమాజీ అప్ప' బసీన్ దుర్గమును పట్టుకొనిన కథ

(11) పానిపట్టు యుద్ధముపై పోవాడా

(12) మాధవరావ్ పేష్వే క్రీ. శ. 1715లో నిజాముతో చేసిన 'ఖర్డా' యుద్ధము పై పోవాడా.

పై పోవాడాలలో (1) నుండి (8) వఱకును గల వానిని శివాజీపైగల వీరగాథావృత్తము (Ballad-Cycle of Shivaji)గా భావింపనగును. క్రీ.శ. 1857లో ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామమునకు నడపిన ఝాన్సీ లక్ష్మీబాయి, నానా సాహెబ్, తాంత్యా తోపేలపై పెక్కు పోవాడాలు పుట్టినవి.

వీరగాథా సంపదలో భారతదేశమున రాజస్థాన్ ప్రథమ స్థానమును, ఆంధ్ర మహారాష్ట్రములు ద్వితీయ స్థానమును ఆక్రమించునని చెప్పవచ్చును. వీని తరువాత చెప్పదగినది పంజాబు. గోవాలో వ్యాప్తియందున్న మరాఠీ మాండలికమగు కొంకణీభాషలో గూడ వీరగాథలున్నవి.

**8. కొంకణి భాష (గోవా) :** గోవాలో ఉత్తమశ్రేణికి చెందిన జానపద సాహిత్యమున్నది[12]. ఇక్కడ కలవారికి లేనివారికి మధ్య భేద మెక్కువుగా నుండకపోవుటచే, ప్రజలందరిలోను ఆత్మగౌరవము చిత్తస్థైర్యము హెచ్చు. దేశములోని ఇతర ప్రాంతములలోవలె ఇట జానపద సాహిత్యము కేవలము నిరక్షరాస్యులకు సంబంధించిన సాహిత్యముగా మాత్రమే లేదు. చదువ నేర్చినవారు కూడ ఈ జానపద సాహిత్యముపై విశేషాదరమును చూపుచున్నారు.

గోవాలో వ్యావహారిక భాష 'కొంకణి', ఇది మరాఠీ మాండలికమని ఖాత్రే పండితుడు నిరూపించియున్నాడు. కాని ఈ భాషలో గ్రంథస్థమైన సాహిత్యమేమియు లేదు. గోవాలో సామాన్యప్రజ లందఱును కొంకణియే వాడుదురు. ఇందులోనే అపారమైన జానపద సాహిత్యమున్నది. పట్టణప్రాంతములందు క్రైస్తవులలో ఉన్నత వర్గములవారు మాత్రము పోర్చుగీసు భాష నుపయోగింతురు. అట్లే హిందువులలో ఉన్నత వర్గములవారు మరాఠీ భాష నుపయోగింతురు. పల్లెలలో సామాన్యజను లందఱును కొంకణి భాషనే వ్యవహరించుచున్నారు.

గోవా జానపద కవిత్వములో పల్లెపాటలు, వీరగాథలు - రెండును గలవు. గోవా ప్రజలకెన్నియో తరములుగా రాజకీయ చైతన్య ముదయించలేదు. కాని వారిని నిద్రనుండి మేల్కొల్పినది రాణేల తిరుగుబాటు. ఈ తిరుగుబాటు అనేక పర్యాయములు జరగినది. సావంతవాడి రాజు, 'సత్తర్' అనెడి అఱువది గ్రామముల ఒక పరగణాను పోర్చుగీసువారికి అప్పగించినాడు. దానిని వారాక్రమించుకొనిన మొదటి అర్ధశతాబ్దిలోనే ఈ పరగణాలోని రైతులు, వారి పాళెగాండ్రైన రాణేల నాయకత్వముతో పోర్చుగీసువారిని పదునాల్గుసార్లు ఎదిరించి, మఱల స్వాతంత్ర్యమును సంపాదించుకొనినారు. వారి ప్రతిఘటనలో ఆఖరుది 1912లో జరగినది. పోర్చుగీసు ప్రభుత్వము చేయు ఆర్థికమైన దోపిడీ విధానమునకును, పౌరసత్వముల నణచివేయు పద్ధతికిని ప్రతికూలముగా రాణేల తిరుగుబాట్లు జరగినవి. ఈ తిరుగుబాట్లపై ఎన్నియో వీరగాథ లుత్పన్నములైనవి. ఇందు క్రీ.శ. 1854లో పోర్చుగీసు ప్రభుత్వము నెదిరించి తన కోరికలు సాధించుకొనిన 'దీపురాణే' ధైర్య సాహసములను కీర్తించు నీ క్రింది వీరగీతము (Balladling) మిక్కిలి ప్రసిద్ధమైనది:

**అరవై డెబ్బై గ్రామాలలో ఎవరు వీరుడు భళీ?**
**అరవై డెబ్బై గ్రామాలలో దిపురాణే భళీ!**
**రాణేల కులంలో దిపురాణే వీరుడు!**
**అతడు మూడు వందల అరవై మంది తుపాకి సిపాయీలను కూర్చుకున్నాడు**

12. *చూ. (శ్రీ) వినాయక్ సదాశివ్ సుఖ్‌ఠణ్‌కర్ వ్యాసము, ''జన జీవన దర్పణాలు : గోవా జానపద గేయాలు'', భారతి, జూలై 1965.*

ఆ మూడు వందల అర్వై మందితోనే సాందీ కోటను లగ్గ పట్టాడు
అర్వై డెబ్బై గ్రామాలలో ఎవరు వీరుడు భళీ?
తెల్ల సోల్జర్లు భయ భీతులై కాలికి బుద్ధి చెప్పారు
తెల్ల సోల్జర్లు వగరుస్తూ పరిగెత్తారు
పరిగెత్తి తమ పడవలలో పోయి పడ్డారు
అర్వై డెబ్బై గ్రామాలలో ఎవరు వీరుడు భళీ?[13]

గోవాప్రజలను ఉత్తేజితులను చేయు మఱియొక సంఘటన మునిసిపల్ పార్లమెంటు ఎన్నికలు. ఈ ఎన్నికలలో గోవాప్రభుత్వము, ప్రభుత్వమున కనుకూలమగు అభ్యర్థినో, మఱియొకరినో సమర్థించుట పరిపాటి. ఏబది సంవత్సరముల క్రిందట గవర్నర్ 'గాల్‌హోర్డో' పరిపాలనలో జరగిన అట్టి సంఘటనను వర్ణించెడి వీరగీతమొకటి గోవాలో ప్రచారమున నున్నది.

గోవా జానపద సాహిత్యమున అపూర్వముగా ప్రతిధ్వనించిన గొప్ప రాజకీయ సంఘటన 1910లో పోర్చుగల్ రిపబ్లిక్ అగుట. గోవాప్రజలు రిపబ్లిక్‌కు మహోన్నతోత్సాహముతో స్వాగతమును పలికిరి. దీనిపై వీరగీతములు పుట్టినవి. గోవాలో నిట్లు బయలుదేరిన గేయములన్నియును లఘువీరగాథలే (Balladlings) కాని దీర్ఘవీరగాథలు కావు.

## ద్రావిడ భాషలు- వీరగాథలు

భాషావిషయమున మాత్రమే కాక, సాహిత్య విషయముననుు ద్రావిడభాషలలో సామ్య సాన్నిహిత్యములు హెచ్చుగా నున్నవి. జానపద సాహిత్య విషయమున ఈ సాన్నిహిత్యము మఱింత స్పష్టముగా గోచరించును. తమిళము, తెలుగు, కన్నడ భాషలలో వీరగాథల వినిమయము కాననగును. తెలుగున పుట్టిన చిన్నమ్మకథ కన్నడమున ప్రవేశించినది. కన్నడమున మొదట పుట్టిన కుమార రాముని కథ తెలుగున ప్రవేశించినది. దేశింగురాజు కథ, నల్లతంగాళ్ కథలు తమిళము నుండి తెలుగు వీరగాథలలోనికి చేరినవి. రంగమ్మ కథ వంటి

---

13. *సాఠ్ సత్తర్ గాంవా మదిం కోణ వీర బళీ?*
*సాఠ్ సత్తర్ గాంవా మదిం దిపు రాణో బళీ!*
*రాణ్యాంచ్యా కులామదిం దిపు రాణో బళీ!*
*తేణేం మోళావళీ తినశేం సాఠ్ నళీ*
*తినశేం సాఠ్ నళీ మేళ పూన ఘేతలేం సాంటేర్ కోట్*
*సాఠ్ సత్తర్ గాంవా మదిం కోణ వీర బళీ?*
*పణజేచే సాఖలే ఝూలే భయ భీత*
*పళాలే సాంఖలే జీవ ఘాలతీ తార వాంతా.*
- *భారతి, జూలై 1965, పుట 63.*

తెలుగు వీరగాథలు యథాతథముగా తమిళదేశమున పాడబడుచున్నవి. అట్లే తెలుగున స్త్రీల పాటలలో దేవతాస్తుతి పరములైన కొన్ని తమిళ పాటలు యథాతథముగా పాడబడుచున్నవి. నందిరాజు చలపతిరావుగారు సేకరించి ప్రకటించిన స్త్రీలపాటలలో కన్నడ పాటలు ('ఉడిపి కృష్ణుని పాట', 'గోపికాస్త్రీల జలక్రీడలు' వంటివి) కూడ నున్నవి. ఇవి తెలుగు ముత్తైదువులు పాడునట్టివే. ఇట్టి జానపద గేయముల వినిమయము ఈ మూడు భాషలలోను చాల హెచ్చుగ నున్నది. ఈ వినిమయము సరిహద్దు మండలములలో మఱింత ఎక్కువగా నున్నది. అనంతపుర మండలమున తెలుగు-కన్నడముల వినిమయము, చిత్తూరు మండలమున తెలుగు - తమిళముల వినిమయము కాననగును. ఇట్లు ఒక భాషనుండి మఱియొక భాషలోనికి ప్రవేశించిన వీరగాథలు ఎరవు తెచ్చుకొన్నట్లుగా నుండక సహజత్వము నొందుట ద్రావిడభాషల సాన్నిహిత్యమునకు మఱియొక నిదర్శనము. దేశింగురాజు కథ, నల్లతంగాళ్ కథ తమిళులకు సంబంధించినవని ఏ ఆంధ్రుడు భావించుచున్నాడు? బొబ్బిలి కథ, లక్ష్మమ్మ కథల వలెనే వీనిని కూడ ఆంధ్ర జానపదులు తమ గాథలుగానే విని రసానుభూతిని పొందుచున్నారు. అట్లే కుమార రాముని కథను కూడ ఆంధ్రులు స్వీయ వీరగాథగానే పరిగ్రహించి పులకించుచున్నారు. శైవమత వ్యాప్తివలన ఈ మూడు ద్రావిడభాషల సాన్నిహిత్యము మఱింత హెచ్చినది. సిరియాళుని కథ పాల్కురికి సోమనాథుని కాలమునకు ముందే ఈ ద్రావిడభాష లన్నింటను మాఱు మ్రోగుచున్న వీరగాథ!

**1. తమిళము[14] :** భారతదేశమున గల జీవద్భాషలలో అతి ప్రాచీనమైన సాహిత్య సంపద గల భాష తమిళభాష ఒక్కటే! క్రీ.పూ. నుండియు ఈ భాషలో సాహిత్యమున్నది. ఇందలి 'సంగం యుగము' క్రీ.పూ. 6వ శతాబ్దమునకు చెందినదని పండితుల భావన. రామాయణ మహాభారత కథ లెన్నియో ఈ సంగం సాహిత్యమున గలవు. ఇవి నేటికిని ప్రజలలో మౌఖిక సంప్రదాయమున నిలిచి యున్నవి. క్రీ.శ. ఒకటవ శతాబ్దమునకు చెందిన 'సిలప్పదికారమ్' అను కావ్యమున 'కణ్ణకి' అను వీరవనిత గాథ యున్నది. ఇది యిప్పటికిని ప్రజలలో పాటల రూపమున నిలిచి యున్నది.

క్రీ.శ. 4-5 శతాబ్దముల నాటికి తమిళ దేశమున శైవ మతము విశేషవ్యాప్తి యందున్నది. ఈ మతములోని కొందఱు భక్తులు అద్భుత త్యాగములను జేసి భక్తివీరమును ప్రదర్శించిరి. ఇట్టి భక్తులలో అఱువది ముగ్గురి కథలు ఆనాటి ప్రజలలో ఆబాలగోపాలము కీర్తింపబడినవి. వీరిని 'అరువత్తు మూవరు నాయన్మార్లు' అందురు. ఈ అఱువది ముగ్గురు భక్తుల పేర్లను మొట్ట మొదట తెల్పినవాడు క్రీ.శ. 7వ శతాబ్దమునకు జెందిన 'సుందర ముత్తు స్వామిగళ్'. ఇతడు పది పద్యములలో ఈ అఱువది ముగ్గురు భక్తుల నామములను తెల్పినాడు.

---

*14. తమిళ వీరగాథలను గూర్చి తెల్పిన మిత్రులు శ్రీ ఎన్. సుబ్బురెడ్డియార్ (శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ తమిళ భాషోపన్యాసకులు) గారికి కృతజ్ఞుడను.*

ఈ పద్య దశకమును 'తిరుత్తొండ త్తొహై' అని పిలుతురు. ఇందు సుందర ముత్తుస్వామి తన పేరును, తన తల్లిదండ్రుల పేర్లను గూడ కలిపినాడు. ఈతని సమకాలికులు, పూర్వులు కూడ ఈ 'అరువత్తు మూవరు'లో నున్నారు. అందుచే క్రీ.శ. 7వ శతాబ్దికి పూర్వమునుండియు శైవభక్తుల కథలు తమిళదేశమున అశేష ఖ్యాతి నందియున్నవని విశదమగుచున్నది.

క్రీ.శ. 10వ శతాబ్దమునకు చెందిన 'నంబియాండార్ నంబి' అను కవి, ఈ అరువత్తు మూవరు శైవభక్తులపై నూఱు పద్యములతో నొక ప్రబంధమును రచించెను. దీని పేరు ''తిరుత్తొండత్ తిరు అందాది''. ఇందు భక్తుల నామములు మాత్రమే కాక, వారిని గూర్చిన కథా వివరములును కొంతవఱకు గలవు.

సుందర ముత్తుస్వామి, నంబియాండార్‌ల రచనల నాధారముగా జేసికొని క్రీ.శ. 12వ శతాబ్దమున ''సేక్‌జార్ స్వామిగళ్'' అను కవి 'పెరియ పురాణము'ను రచించెను. ఇందు శైవ భక్తుల కథలు విపులముగా వర్ణింపబడినవి. ఈ కథలన్నియును ప్రజావ్యవహారమున నున్నట్టివే!

తమిళమున వీరగాథలకు ప్రత్యేకముగా నామము లేదు. వీనిని జానపద గేయములతో కలిపి 'నాట్టు పాడగల్‌గళ్ (= పల్లెపాటలు) అని వ్యవహరించుటయే పరిపాటి. ఆధునిక విమర్శకులు కొందఱు వీరగాథలను ప్రత్యేకముగా సూచించుటకు 'కదై పాది పాడల్‌గళ్ (=కథ పాదిగిన పాటలు) అని వ్యవహరించుచున్నారు.

తమిళమున నాయకరాజుల కాలమున (17వ శతాబ్దము) వీరగాథలు విశేషముగా విజృంభించినవి. తెలుగు వీరగాథల నామముల చివర 'కథ' అను శబ్దమున్నట్లే, తమిళమున 'కదై'అను శబ్దము ప్రతి వీరగాథ పేరునకు చివర విధిగా నుండి తీరును. 'దేశింగురాజన్ కదై, ఊమత్తురై[15] - కట్టబొమ్మన్ కదై, నల్లతంగాళ్ కదై' మొదలగునవి. ఇట్టి చారిత్రక, సాంఘిక గాథలే కాక, తమిళమున పౌరాణిక గాథలును హెచ్చుగా గలవు. 'వీరాబిమన్యు కదై, పాండవ వనవాసం కదై, నలమహారాజు కదై, అల్లీ-అర్జున కదై' మొదలగునవి ఇట్టివి. (ఇవన్నియును తెలుగులో గూడ కలవు).

తమిళదేశమున 'తొట్టి నాయిక్కర్' అను కులమువారు ప్రతి పల్లెలోను ఉందురు. వీరు ఆంధ్రులు. వీరు తెలుగు, తమిళ భాషలలో పాటలను వీరగాథలను పాడి వినిపించు చుందురు.

**2. మలయాళము :** అన్ని భాషలవలెనే మలయాళము కూడ తొలుత పాటలతోడనే ప్రారంభమైనది. 'మామాంకం' మొదలైన గానములే ఈ భాషలో ప్రాచీన కృతులు. క్రీ.శ. 12,13

---

*15. 'ఊమత్తురై' అను వీరుడు కట్టబ్రహ్మన సోదరుడు. అన్నను మించిన శూరుడు. ఇతనిని మన బొబ్బిలి యుద్ధములోని వెంగళరాయనితో పోల్చవచ్చును.*

శతాబ్దములనాటి వీరగాథలెన్నియో నేడు లభించుచున్నవి. ఉత్తర మలబార్‌లో 'అరోమల్ చేవకర్' (Aromal Chevakar) గాథలు, దక్షిణ మలబార్‌లో 'ఛావెర్ (Chaver) గాథలు' ఎన్నదగినవి. ఉత్తర ప్రాంతమున ప్రసిద్ధకెక్కిన తచ్చోలి కుటుంబ గాథలు 16వ శతాబ్దము నాటివి.[16] మద్రాసు విశ్వవిద్యాలయమున మలయాళ శాఖాధ్యక్షులుగానున్న 'చెల్‌నత్ అచ్యుత మీనన్' (Chelnat Achyuta Menon)గారు 1935లో, 'Ballads of North Malabar' అను పేర కొన్ని వీరగాథా సంపుటములను వెలువరించిరి.

**3. కన్నడము :** భారతీయ సాహిత్యములలో సంస్కృత తమిళముల తరువాత ప్రాచీన తరమైనది కన్నడ సాహిత్యమే! దీని ప్రథమదశ వీరపురుషులను కీర్తించు శాసనములతో ప్రారంభ మగుచున్నది. వానిలోకెల్ల ప్రాచీనతమమైనది క్రీ.శ. 450వ సంవత్సరమునకు చెందిన హల్మిడి శాసనము.

క్రీ.శ. 7వ శతాబ్దము నాటికి తమిళమున ప్రసిద్ధికెక్కిన 'అరువత్తు మూవరు' శైవభక్తుల కథలు కన్నడ దేశమున ప్రవేశించినవి. కన్నడ కవులు వీరిపై పురాణములు, కావ్యములు రచించిరి. క్రీ.శ. 1200 ప్రాంతమువాడైన హరిహరుడు 'రఘటా కావ్యము'ను రచించినాడు. ఇందు 108 రగడలలో 108 భక్తుల కథలున్నవి. ఇందు 'పురాతనర్' అను పేరుతో అరువత్తు మూవర కథలును గలిసియున్నవి. ఈ హరిహరుని మేనల్లుడు 'రాఘవాంకుడు'. ఇతడు షట్పదులలో పెక్కు కావ్యములను వ్రాసినాడు. భక్తులపైనను లౌకిక వ్యక్తులపైనను పురాణములు వ్రాయుటలో నితడే ప్రథముడు. పాల్కురికి సోమనకు ఇతడే మార్గదర్శియై యుండును. పాల్కురికి సోమనాథుని కాలమునాటికి ఈ శైవభక్తుల కథలు తెలుగు దేశమున గూడ విశేషవ్యాప్తి నందియున్నవి.

కన్నడమున లభించుచున్న గ్రంథములలో 9వ శతాబ్దమునాటి 'కవిరాజ మార్గము' మొదటిది. ఇది ఛందోగ్రంథము. దీని రచయితయగు 'నృపతుంగుడు' కన్నడనాడులో చదువు సంధ్యలులేని ప్రజలు సహితము కవిత్వము నల్లగలరని తెల్పియున్నాడు. అనగా 9వ శతాబ్దమునాటికే కన్నడమున జానపద సాహిత్యము విరివిగా కలదని తెలియుచున్నది. ఈతడు జానపద కవిత్వమును రెండు తెఱగులుగా విభజించినాడు: పురుషులు పాడు యక్షగానముల

16. *"....the important songs of Aroomal Cheevakar of North Malabar which relate to events of 12th century A.D., not long after the death of the last of the Perumal Emperors. They mention the naaduvaazis or village assemblies but we find in them no reference to individual rulers. The Chaaver songs of South Malabar may be dated between 1300 and 1700 A.D. The large and important group which describes the fortunes of the Tacchooli family of the North belongs mainly to the 16th century...." ----Percy Macqueen, Foreward, Ballads of North Malabar*

వంటి వానిని 'బెదండె' అనియు, స్త్రీలు పాడు శోభనగీతములవంటి పాటలను 'చత్తాణ' అనియు పేర్కొనినాడు. మహాకవి 'నేమిచంద' (క్రీ.శ. 1175) తన లీలావతీ ప్రబంధమున 'ఒణకె హాడు' (husking song) అను పేర త్రిపద గీతములను రచించెను. ఈ కవి తన కాలమున వ్యాప్తియందున్న జానపద ఛందస్సు ననుసరించి యుండును.

తెలుగు, తమిళము లందు వలెనే కన్నడమున గూడ 'ఫోక్ సాంగ్స్' అను ఆంగ్ల శబ్దమునకు సమానార్థక శబ్దమున్నది కాని, 'బ్యాలెడ్స్' అను మాటకు సమానార్థకము లేదు. 'హళ్ళియహాడుగళు' (=పల్లె పాటలు) 'జనపద గీతెగళు' (=జానపద గీతములు) అనునవి 'ఫోక్ సాంగ్స్'కు పర్యాయపదములు. 'గోవిన కథెహాడు' (=గోవు కథాగేయము) వంటి పేర్లనుబట్టి 'కథె హాడు' అనునది కన్నడమున 'బ్యాలెడ్' పరముగా వాడవచ్చునని తెలియుచున్నది. కాని ఆధునికులు 'లావణి' అను పదమును 'బ్యాలెడ్'కు సమార్థకముగా వాడుచున్నారు.

ఆధునిక కాలమున కన్నడ జానపద సాహిత్యముపై విశేష కృషి జరుగుచున్నది. ''క.ర.కృ.'' అను పరిశోధకుడు జానపద గేయములను వీరగాథలను బండ్లకెత్తిన మహానుభావుడు. (వీరు తెలుగులో నేదునూరి గంగాధరంగారిని పోలుదురు). కన్నడ కథాగేయములలో 'గోవిన కథెహాడు' మిక్కిలి ప్రసిద్ధికెక్కినది. దీనిని గూర్చి బెంగుళూరు విశ్వవిద్యాలయములో కన్నడ జానపద గేయములపై పరిశోధన చేసిన శ్రీ టి. కేశవభట్‌గారు ఈ క్రింది విధముగా వ్రాయుచున్నారు: "The famous ballad-song in Kannada is Govina Kathe Hadu, probably of 18th century, story of a cow which was true to its words given to a cruel tiger. The cow is called "Punyakoti" and the tiger is "Arbuda". This ballad so far published contains about 138 verses, but the one I received from a manuscript in South Kanara contains 227 verses. There are other ballads, which are the stories from Puranas, with some natural social aspects. Mr. Ka. Ra. Kri. has published many ballads in his editions such as "Ambigara Ganga".[17]

కన్నడమున నున్న ఈ 'గోవిన కథెహాడు' వలెనే తెలుగున 'గోవు పాట' అను స్త్రీల పాట కలదు. రెండింటి కథావస్తువును ఒక్కటే. ఈ గోవుపాట వంటిదే ఉత్తర హిందూస్థానమున వ్యాపించిన ''వన దేవతలు'' అను పాట. ఆ పాటలో పులికి బదులు సింహమున్నది. ఇంతియ భేదము. కథాభాగ మంతయు దాక్షిణాత్య కథలలో వలెనే ఉన్నది.

19వ శతాబ్దమున బయలుదేరిన కొన్ని ప్రసిద్ధ కన్నడ వీరగాథలపై J.F.Fleet దొరగారు Indian Antiquary లో ఐదు వ్యాసములను ప్రకటించిరి.[18] ''రాబడి పన్ను, హాళగలి

---

*17. శ్రీ టి. కేశవభట్‌గారు 1965 జనవరి 31వ తేదిని నాకు వ్రాసిన లేఖలోని భాగము.*

*18. See, Indian Antiquary, Vols. Nos. XIV (1885), XV(1886), XVI (1887), XVIII (1889), XIX(1890).*

బోయలు, సంగ్యా నేరము-మరణము, కిత్తూరు కోడలు చెన్నవ్వ '' - ఇత్యాది వీరగాథలు క్రిందటి శతాబ్దమున పుట్టి ప్రశస్తి కెక్కినవి. క్రీ.శ. 1857లో జరగిన ప్రథమ స్వాతంత్ర్య సంగ్రామమునకు తరువాత, ఆంగ్లేయులు భారతీయుల దగ్గఱనున్న ఆయుధములను వశపఱుచుకొనుట కొక ప్రత్యేక చట్టమును ప్రవేశపెట్టిరి. దక్షిణ మహారాష్ట్రమున హళగలి గ్రామమున నలుగురు బోయవీరులు ఈ చట్టమును వ్యతిరేకించిరి. ''పూజారి హనుమ, బాల, జడగ, రామ'' అనుపేర్లుగల ఈ నలుగురు బోయవీరులును తమ ఆయుధములను ప్రభుత్వమున కిచ్చుట కంగీకరింపక, ధైర్యముగా పోరి, వీరస్వర్గ మలంకరించిరి. వీరిపై 'హళగలి బోయలు' (The Bedas of Halagali) అను పేర ఒక వీరగాథ ప్రజలలో వ్యాపించి ప్రసిద్ధి కెక్కినది.

1860 జూలై 31వ తేదిని బ్రిటిషు ప్రభుత్వము వారు చేసిన రాబడి పన్ను చట్టము (Act No. XXXII) పై "Income Tax" అను కథాగేయము వ్యాపించినది. 1889 లో ప్రకటింపబడిన ''సంగ్యా నేరము - మరణము'' (The crime and death of Sangyya) బెల్గాం జిల్లాలో ప్రసిద్ధికెక్కిన వీరగాథ. 1890 లో ప్రకటింపబడిన 'కిత్తూరు కోడలు చెన్నవ్వ' బెల్గాం జిల్లా, సంపగం తాలూకా, కిత్తూరు జమీందారీకి సంబంధించినది. చెన్నవ్వ, బ్రిటిషు ప్రభుత్వమువారు ప్రవేశపెట్టిన దత్తస్వీకార చట్టము వలన నష్టపడి, వారితో వీరోచితముగా పోరాడినది.

తెలుగు వీరగాథ లెక్కువగా ద్విపదలలో వ్రాయబడినట్లే, కన్నడ వీరగాథలు త్రిపదలలో వ్రాయబడుచుండును. ఇట్టి ఛందమున నున్నవానిలో మైసూరు ప్రాంతమున 'మదలింగన హోడు' అను కథాగేయము మిక్కిలి వ్యాప్తియందున్నది. మదలింగన నూతన వివాహితుడు. వధూవరు లిరువురును ఉల్లాసముతో నొక పర్వతము నెక్కుచుండిరి. వధువు ఒక పాత్రతో నీరు తెచ్చుచున్నది. యౌవన మదాతిరేకమున నడకలోని హొయలు హెచ్చినది. విలాసపు నడక ముదిరినది. పాత్రలోని నీరంతయు తొణికిసలాడి ఒలికిపోయినది. కొండపైకి చేరుసరికి మదలింగనకు దాహమయ్యెను. వధువు కడనున్న పాత్రలో నీరు లేదయ్యెను. దప్పికతో బాధపడి మదలింగన ప్రాణములు విడిచెను. ఈ విషాదగాథ మైసూరు ప్రాంతమున ఇప్పటికిని పాడబడుచున్నది. ఆతడు మరణించిన ఆ కొండచఱియను నేడు 'మదలింగన కణివె' అని పిలుచుచున్నారు.

మొత్తముపై భారతదేశమున రాజస్థాన్, ఆంధ్రప్రదేశ్, మహారాష్ట్ర, గోవా, పంజాబ్‌లలో ప్రశస్తమయిన వీరగాథలు అసంఖ్యాకముగా లభించుచున్నవి.

* * * * *

ఏడవ ప్రకరణము

# తెలుగులో వీరగాథలు

ప్రపంచమున వివిధ దేశముల వీరగాథలను గూర్చియు, భారతదేశమున ఆర్య, ద్రావిడ భాషలలోని వీరగాథలను గూర్చియు తెలిసికొంటిమి. ఇప్పుడు తెలుగు సాహిత్యములోని వీరగాథలను గూర్చి ముచ్చటింతము. తెలుగు శిష్ట సాహిత్యమున వీరగాథల ప్రసక్తిని, నేడు ఉపలబ్ధము లగుచున్న వీరగాథలను పరిశీలింతము.

భరత ఖండమున వీరగాథా సంపదలో రాజస్థానము తరువాత పేర్కొనదగినది ఆంధ్ర దేశమే! పౌరాణికములు, చారిత్రకములు, సాంఘికములు - ఇత్యాది విభాగముల క్రిందకు వచ్చు వీరగాథలు తెలుగులో కోకొల్లలుగా నున్నవి. సంఖ్యాబలముననే కాక, ప్రాశస్త్య ప్రాచీనతలలో గూడ నివి వన్నెకెక్కినవి. క్రీ.శ. 12వ శతాబ్దమున పల్నాటి వీరకథా చక్రమును, 13వ శతాబ్దమున కాటమరాజు కథాచక్రమును విజృంభించినవి. 13వ శతాబ్దములో పరశురాముని కథలు, పల్నాటి వీరకథలు, జక్కుల కథలు తెనుగు గడ్డపై మాఱుమ్రోగుచుండినవి! మన బొబ్బిలి యుద్ధ కథ ప్రపంచ వీరగాథాసాహిత్యమున వ్రేళ్లపై లెక్కింపదగిన అత్యుత్తమ వీరగాథలలో 'కనిష్ఠికాధిష్ఠిత' మైనది!! పాశ్చాత్య విమర్శకులు నిర్ధరించిన వీరగాథా లక్షణముల నన్నింటిని పుణికి పుచ్చుకొన్న పరమ ప్రశస్తమైన వీరగాథ బొబ్బిలి యుద్ధము! తెలుగు వీరగాథా సరస్వతీ మస్తకన్యస్త మణిమకుటమున నిది 'కోహినూరు'!!

తెలుగు సాహిత్యమున వీరగాథ లెక్కువగా నుండుటయే కాక, వీరగాథా చక్రములును, అత్యధికముగ నుండుట మఱియొక విశేషము. తక్కిన భారత భాషలలో నిట్టి గాథాచక్రములు (Ballad-cycles) విరివిగా కానరావు. వీరగాథలు పుష్కలముగా నున్న సాహిత్యములందే ఈ చక్రము లేర్పడుచుండును. పౌరాణికములలో పరశురాముని కథాచక్రము, వెలకంటి వీరుని కథాచక్రము; అస్పష్ట చారిత్రకములలో అంకమ్మ కథాచక్రము; చారిత్రకములలో పల్నాటి వీర కథాచక్రము, కాటమరాజు కథాచక్రము తెలుగు వీరగాథలలో మిక్కిలి ప్రసిద్ధికెక్కినవి.[1] ఈ వీరగాథావృత్తములే కాక, విడిగా నున్న వీరగాథలలో బొబ్బిలి కథ, దేశింగురాజు కథ,

---

1. నేను పరిశీలించినంతవఱకు, పరశురాముని కథాచక్రమున ఎనిమిది వీరగాథలు, అంకమ్మ కథాచక్రమున మూడు వీరగాథలు, పల్నాటి వీరకథా చక్రమున ఇరువది నాలుగు వీరగాథలు, కాటమరాజు కథా చక్రమున ముప్పది రెండు వీరగాథలు, వెలకంటి వీరుని కథాచక్రమున ఐదు వీరగాథలు కలవని తెలియుచున్నది.

బాలనాగమ్మకథ, కాంభోజరాజు కథ, ముగ్గురు మరాఠీల కథ, పసలబాలుడు కథ, కొమార రాముడు కథ, గాంధారి కథ, బంగారు తిమ్మరాజు కథ,కామమ్మ కథ, లక్ష్మమ్మ కథ, చిన్నమ్మ కథ, సన్యాసమ్మ కథ, తిరుపతమ్మ కథ, ఎఱుకుల నాంచారి కథ, రావులమ్మ కథ, సర్వాయి పాపడు కథ, చిన్నపరెడ్డి కథ; (రాయలసీమలో) కుంటి మల్లారెడ్డి కథ, ఎలనాగిరెడ్డి కథ, నారసింహారెడ్డి కథ, పర్వతాల మల్లారెడ్డి కథ; (తెలంగాణములో -) కొమిరెల్లి మల్లన్న కథ, సదాశివరెడ్డి కథ, రాణీ శంకరమ్మ కథ, నల్ల సోమనాద్రి కథ, కర్నూలు నవాబు కథ, రాజా రామేశ్వరరావు కథ, బల్గూరి కొండ్రాయుని కథ, మియాసాబ్ కథ; విశాఖ మండలము నుండి బయలుదేరిన పదములు (అంగద రాయబాదము, లక్ష్మణ మూర్ఛ, గంగా వివాహము, కుశలాయకము మొదలగునవి); గుంటూరు మండలము నుండి వెలువడిన జంగం కథలు (సిరియాళ మహారాజు చరిత్ర, భల్లాణ రాయని చరిత్ర, వామన విజయము, విరాటపర్వము మొదలగునవి) - ఇవన్నియును తెనుగు గడ్డపై తరతరముల నుండి పాతుకొనిపోయిన వీరగాథలు! తెలుగు గాలిలో శతధా మాఱుమ్రోగిన వీరగాథలు! తెలుగువాని రక్తములో జీర్ణించుకొనిపోయిన వీరగాథలు!!

తెలుగు శిష్ట సాహిత్యమున ఈ వీరగాథల (లేదా కనీసము జానపదగేయముల) ప్రసక్తిని గూర్చి తెలిసికొందము. ప్రతి నాగరక సంఘమందును సాహిత్యము 'మార్గ-దేశి' అను రెండు పాయలుగా ప్రవహించుచుండును. ఒక సాహిత్యమున మార్గ భాగ మెంత యుండునో అంతకు సమముగను, కొన్నిపట్ల అధికముగను దేశి భాగ ముండును. కాని సాహిత్య చరిత్రకారు లందఱును మార్గ సాహిత్య చరిత్రనే త్రవ్వి తలకెత్తుచున్నారు కాని, దేశి సాహిత్య చరిత్రను స్పృశించిన మనస్వి మందునకైనను గానరాడు! సాహిత్యములో సగభాగము నాక్రమించు దేశి సంపదను విస్మరించుట విచారకరము. పుష్కలమైన ఈ సహజ సాహిత్యము ఆయా కాలముల లోని పండిత కవులపై తన ప్రభావమును జూపక పోలేదు. బుద్ధిమంతులగు మార్గకవులు కొందఱు తమ కావ్యములలో నచ్చటచ్చట పాటల ప్రసక్తిని దెచ్చియున్నారు. దేశి కవితా రీతులందును, జానుతెనుగు పైనను అభిమానము గల శివకవులును; ప్రజాజీవితమును చిత్రించిన క్రీడాభిరామకర్తయు; శుకసప్తతి, హంసవింశతి - ఇత్యాది శృంగార దేశికథా కావ్యకర్తలును; దక్షిణాంధ్ర యుగపు కవులును ఈ జానపద కవితా ప్రసక్తి నెక్కువగా దెచ్చిరి. దశకుమార చరిత్ర, కేయూరబాహు చరిత్ర, విక్రమార్క చరిత్ర, సింహాసన ద్వాత్రింశిక, బహుళాశ్వ చరిత్ర - మున్నగు కథాకావ్య రచయితలు కూడ ఎడనెడ ఈ ప్రసక్తిని కొంత తెచ్చియున్నారు.

శివకవులలో ప్రథముడును, నన్నయకు కొంచెము ఇంచుమించు సమకాలికుడును అగు నన్నెచోడుడు తన కుమారసంభవ కావ్యమున ఆంధ్రదేశములో చాళుక్యరాజులు దేశికవితను

పుట్టించి, తెనుగును నిలిపిరని ప్రశంసించి యున్నాడు.[2] అంతేకాక, ఇతడు దేశి - మార్గములు దేశీయ మగునట్లు రచన చేసిన తన కావ్యములో, పార్వతి తన బాల్యమున ఈశ్వరునిపై అంక మాలికలు పాడుచు గీతభేదముల రీతు లెఱిగెననియు; ఉవిద లింపు మిగుల ఊయల పాటలు పాడిరనియు; వనపాల బాలికలు అభినవలీలతో ఆలతులు చేసి పాడిరనియు; వన్య కాంతలు జీజీక కల్లుత్రాగి గౌడుగీతములు పాడుచు ఆడిరనియు; శబర కామినులు రోకటి పాటలను పెక్కు రాగములతో రసోత్కటముగా పాడిరనియు; ఎఱుకు వెలదులు వాణీధరుని గూర్చి వీనుల కింపెసగునట్లు పాడిరనియు వ్రాసియున్నాడు.[3] దీనినిబట్టి నన్నెచోడుని కాలము నాటికిని (క్రీ.శ. 1130 ప్రాంతము), అంతకు పూర్వమును తెలుగులో 'అంక మాలికలు, ఊయల పాటలు, ఆలతులు, గౌడు గీతములు, రోకటి పాటలు, ఎఱుకుల పాటలు' - ఇత్యాది గేయములు విశేష వ్యాప్తియందున్నవని నిశ్చయముగా జెప్పవచ్చును. కాని ఇవన్నియును లఘురచనలును, భావాత్మకములును అగు శుద్ధ గీతములే కాని; దీర్ఘములును ఆఖ్యానాత్మకములును అగు గేయకథలుగా దోపవు. 'అంక మాలికలు' అనుపదమున 'మాలికా' శబ్దముండుటచే నివి కథనము చేయు దీర్ఘ గేయములు కావచ్చునని డాక్టర్ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు అభిప్రాయ పడుచున్నారు. (అంక = ఈశ్వరాంకితముగా జెప్పబడిన, మాలిక=సుదీర్ఘ రచన). ఇవి రాగయుక్తము లనియు, ఆలతులు అభినయముతో గూడిన వనియు సందర్భమును బట్టి తెలియవచ్చుచున్నది.

వీరశైవులకు గురుస్థానమగు పాల్కురికి సోమనాథ మహాకవి పలురకముల దేశికవితా ప్రక్రియలను పేర్కొని యున్నాడు. ఈతని కాలవిషయమున విమర్శకులలో ఏకాభిప్రాయము లేదు. క్రీ.శ. 1170-1220 అని కందుకూరి వీరేశలింగంగారును, 1160-1230 అని బండారు తమ్మయ్యగారును, 1190-1250 అని వేటూరి ప్రభాకరశాస్త్రిగారును, 1290-1320 అని మల్లంపల్లి సోమశేఖరశర్మగారును అభిప్రాయపడుచున్నారు. ఇందు మల్లంపల్లివారు తప్ప, తక్కిన ముప్పురును ఇంచుమించుగ నొకే యభిప్రాయమును వెలిబుచ్చినారు. కాబట్టి క్రీ.శ. 1160-1240 పాల్కురికి సోమనాథుని కాలముగా గ్రహింపనగును. ఈ సోమనాథునకు పూర్వము శతాబ్దముల నుండియు శైవభక్తులను గుఱించిన కథాగేయము లనేకములు ప్రజలలో విశేషవ్యాప్తిలో నున్నవని నిస్సంశయముగా తెలియుచున్నది. ఈతడు తన బసవ పురాణమును పురాతన భక్తుల గీతార్థసమితియే మాతృకగా గైకొని రచించితినని చెప్పుకొనినాడు. ఈ కావ్యమున బసవని చరిత్రమును, అనేకములగు నితర ప్రాక్తన భక్తుల చరిత్రల తోడను, బసవని సహచరులగు

---

2. చూ. కుమార సంభవము, వావిళ్ళప్రతి, 1-23.

3. అదే., 3-38, 4-89, 4-112, 6-45, 6-47, 6-48.

మఱి కొందఱు సమకాలికుల చరిత్రల తోడను కలిపి, పూసలలో దారమువలె వర్ణించినాడు.[4] ఈ శైవ భక్తులందఱును త్యాగవీరమును భక్తివీరమును ప్రదర్శించిన మహానుభావులు కావున ఇవి యన్నియును వీరగాథలనజెల్లును.

బసవేశ్వరుడు (క్రీ.శ. 1125-1168) వీరశైవమును స్థాపించిన తరువాతనే తెలుగులో వీరగాథలు వెలసెనని కొందఱి తలంపు. ఇది సరికాదు. క్రీ.శ. 4,5 శతాబ్దములనాటికే శైవము తమిళ దేశమున విశేషవ్యాప్తి యందున్నది. 7వ శతాబ్దమునాటికి ఈ మతమున భక్త్యావేశము ప్రదర్శించిన మహాత్ముల కథలు అఱువది మూడు (అరువత్తు మూవరు నాయన్మార్ల కథలు) ప్రజలలో బహుళ ప్రచారము నందియున్నవి. ఈ భక్తులందఱును బసవేశ్వరునికన్న ప్రాచీనులనుట విదితము. పాల్కురికి సోమనాథుని బసవ పురాణ, పండితారాధ్య చరిత్రలలోని కథలలో నెక్కువ భాగము ఈ అఱువది ముగ్గురు భక్తుల కథలలోనివే. అనగా ఈ కథలు నాడు తమిళ దేశమునకే కాక, యావద్దక్షిణ దేశమునకు సుపరిచితములని తెలియుచున్నది. ఈ ప్రాచీన కథలు తమిళమున నుద్భవించి, అచ్చటినుండి కర్ణాట దేశమునకును, ఆ కర్ణాటమునుండి శివకవుల మూలమున తెలుగులోనికిని ప్రవేశించినట్లున్నవి. పాల్కురికి సోమనాథుని కాలమున సిరియాళుని కథ తెలుగు దేశమున పాటగా, పద్యకావ్యముగా, గద్యకావ్యముగా, యక్షగానముగా, నాటకముగా, వీరగాథగా, స్త్రీల రోకటిపాటగా ఊరూరను పాడబడుచున్నదని తెలియుచున్నది.

> కరమర్థి నూరూర సిరియాలు చరిత
> మేటియై చను భక్త కూటువలందుఁ
> బాటలుగాఁ గట్టి పాడెడువారుఁ,
> బ్రస్తుతోక్తుల గద్య పద్య కావ్యముల
> విస్తారముగఁ జేసి వినుతించువారుఁ,
> నటుగాక సాంగ భాషాంగ క్రియాంగ
> పటు నాటకంబుల నటియించువారు,
> మును మాడి వీరు వారన నేల కూడి

---

4. *అకలంక లింగ రహస్య సిద్ధాంత, సకల వేద పురాణ సమ్మతంబైన*
*యాతత సకల పురాతన భక్త, గీతార్థ సమితియే మాతృక గాఁగఁ*
*బూరితంబై యొప్పు పూసలలోను, దారంబు క్రియఁ బురాతన భక్త వితతి*
*చరితల లోపల సంధిల్ల బసవ, చరితమే వర్ణింతు సత్కృతి యనఁగ*
-బసవ పురాణము, వావిళ్ళప్రతి, పుట-*9*.

కనుఁగొన తోళ్ళ రోఁకళ్లఁ బాడెదరు
అనుమాన మెక్కింతయును లేదు దీనికి. [5]

దీనినిబట్టి క్రీ.శ. 12వ శతాబ్దినాటికి సిరియాలుని వీరగాథ ఆంధ్రదేశమున మిక్కిలి ప్రచారమున నున్నదని విశదమగుచున్నది. ఇది చారిత్రక వీరగాథ. క్రీ.శ. 7వ శతాబ్దమున కాంచీపురమున జరగిన కథ. సిరియాళుని తండ్రియగు ''చిఱుతొండడు సుప్రసిద్ధ శివభక్తుడు. దభ్ర భక్తుడని కూడ ఇతనికి పేరు. ఇతడు ఒక చోళరాజు సేనానాయకుడు. ఇతడు పశ్చిమ చాళుక్యుల రాజధాని అయిన వాతాపి (బాదామి) దుర్గమును పట్టుకొని దాని రాజును (రెండవ పులకేశిని) తన రాజున కొప్పజెప్పినాడు. ఇతని కొడుకు సిరియాలుడు (శ్రీలాలు డనియు పేరున్నది). చిఱుతొండడు శివుని కోరిక చొప్పున కొడుకును చంపి అతని మాంసము నారగింపు చేసినాడు. దానికి మెచ్చి శివుడు సిరియాలుని (శ్రీలాలుని) బ్రతికించినాడు.'' [6]

పై చారిత్రక సంఘటనను బట్టి రెండవ పులకేశి కాలమున చిఱుతొండడు కలడని (క్రీ.శ. 7వ శతాబ్దము) నిస్సందేహముగా తెలియుచున్నది. ఇతడు జ్ఞాన సంబందర్‌కు సమకాలికుడనియు చెప్పుచున్నారు. చిఱుతొండని స్వగ్రామము తంజావూరు జిల్లా నన్నిలం తాలూకా 'తిరుచ్చెంగాట్టంగుడి'. ఈ గ్రామములో సిరాలదేవుని మండపమున్నది. చిఱుతొండ నంబి సిరాలదేవుని భక్తుడని ఒక శాసనములో చెప్పబడినది. [7] చిఱుతొండడు తన పుత్రునకీ దేవుని పేరుపెట్టి యుండును. చిఱుతొండని విగ్రహము తంజావూరులో ప్రతిష్ఠింపబడినది.

ప్రాచీన కాలమున తమిళ కర్ణాటాంధ్ర భాషలకు నేడున్నంత భేదము లేదు. ఇచ్చి పుచ్చుకొను వ్యవహారము నాడెక్కువగా నుండెడిది. అందుచే నొక దేశమున పుట్టిన కథ అతి త్వరలో తక్కిన దేశములకు వ్యాపించెడిది. 7వ శతాబ్దమున తమిళదేశమున పుట్టిన సిరియాలుని కథ అనతి కాలముననే కర్ణాటాంధ్రములకు ప్రాకియుండును. అట్లే తెలుగు దేశమున (కల్యాణ కటకమున) జరగిన 'జొమ్మయ్య కథ' కర్ణాటకమున వ్యాపించినది. ఇతడాంధ్రుడగుట చేతనే ''తెలుగు జొమ్మయ్య'' అని విశేషణ పూర్వపద సహితముగా ప్రయోగింపబడినది. ఇట్లు తమిళ దేశమున 4,5 శతాబ్దములనుండి 7,8 శతాబ్దముల వఱకు బయలుదేరిన భక్తవీరుల గాథలన్నియు మౌఖిక ప్రసరణమున అచిరకాలముననే కర్ణాటాంధ్రములకు విస్తరించినవి. వీనిని నాటి ప్రజలు పాటలుగా పాడుకొనెడివారు. ఈ ప్రజల పాటలకథల నాధారముగా జేసికొనియే తమిళమున 'పెరియ పురాణము', కన్నడమున 'శివగణద రగళె', 'అరువత్తు మూవరు పురాతన చరిత్రె', 'బసవ పురాణము', సంస్కృతమున 'హాలాస్య మాహాత్మ్యము', 'శివభక్త మాహాత్మ్యము',

5. *బసవ పురాణము, వేటూరి పరిష్కృతము, పుట 124.*
6. *డాక్టరు చిలుకూరి నారాయణరావుగారు, పండితారాధ్య చరిత్ర, పీఠిక, పుటలు 393,394.*
7. *దక్షిణ హిందూదేశ శాసనములు, 2-172.*

తెలుగున 'బసవపురాణ' 'పండితరాధ్య చరిత్రలు' వెలసినవి. ఈ గ్రంథములలో పేర్కొనబడిన కథలు కాక, ప్రాచీన తమిళ శిలాశాసనములలోను, తామ్ర శాసనములలోను 87మంది శివభక్తుల పేర్లు కానవచ్చుచున్నవి.

తమిళమున నున్న అరువత్తు మూవరు నాయన్మార్ల కథలన్నియు యథాతథముగా కర్ణాటాంధ్రము లందు ప్రవేశింపలేదు. కొన్ని కథలు మార్పు చెందినవి. మఱికొన్ని కథలు క్రొత్తగా ప్రవేశించినవి. తెలుగు బసవపు రాణమును బట్టి కన్నడమున భీమకవి క్రీ.శ. 1369లో బసవ పురాణమును రచించెను. కాని సోమనాథుడు చెప్పని క్రొత్త కథలు మఱికొన్ని అందు ప్రవేశించినవి. కావున తమిళమున నున్న అరువదిముగ్గురు శివభక్తుల కథలే తక్కిన దేశములందును వ్యాప్తియందున్నవని తలపరాదు. ప్రతి దేశమునకును ప్రత్యేకములైన కొన్ని శైవకథలున్నవి. కాని మొత్తముమీద మూడు దేశములకును సమానమైన కథలు ఎక్కువ కలవనుట మాత్రము సత్యము.

పాల్కురికి సోమనాథుడు తన బసవ పురాణములో శివభక్తుల కథలు మొత్తము 92 పేర్కొన్నాడు. ఇందు బసవేశ్వరుని సమకాలికుల కథలు 15మాత్రమే. తక్కినవన్నియు బసవేశ్వరునికన్న ప్రాచీనతరములైనవే. ఇందు కొన్ని కథలను బసవేశ్వరుడే భక్తితో వినినట్లు చెప్పబడినది. (ఉదా: శంకరదాసి కథను మడివాలు మాచయ్యగారు చెప్పగా బసవడు శ్రద్ధగా ఆలకించెను). దీనినిబట్టి నన్నయకు బూర్వమందే ఈ కథలన్నియు తమిళ కర్ణాటాంధ్రములలో వ్యాప్తియందున్నవని తెలియుచున్నది. తెలుగు వీరగాథల నామములకు సహజముగా నంత్యమున నుండు 'కథ' అను శబ్దమును పాల్కురికి సోమనాథుడు తన శైవభక్తుల కథలన్నింటికిని ప్రయోగించుట గమనింపదగ్గది. ఇవన్నియు సోమనాథునికి పూర్వము నుండియు, మౌఖిక సంప్రదాయమున నున్న వీరగాథలనుట కిది కూడ నిదర్శనము కాదలదు. అట్లే పండితారాధ్య చరిత్రలో ఇట్టి కథలు 26 ఉన్నవి. (ఇందు కొన్ని బసవ పురాణములో చెప్పినవే మఱల చెప్పబడినవి). బసవపు రాణమున తృతీయాశ్వాసమున తెలుపబడిన వాద్య విశేషములలో 'కిన్నర వీణ', 'జనక' అనునవి గమనింపదగినవి. ఇవి జానపద వాద్యవిశేషములు. కిన్నరవీణ తెలంగాణమున మిక్కిలి ప్రసిద్ధికెక్కిన జానపద వాద్యము. దీనిని 'మెట్ల కిన్నెర' అందురు. (మియాసాబ్ కథ ఈ మెట్లకిన్నెరతోనే పాడబడుచుండును). పాల్కురికి సోమనాథుడు తెలంగాణమువాడు కావున దీనిని తన రెండు కావ్యములందును పేర్కొనినాడు. 'జనక' అనునది లేఖక దోషమని నా అభిప్రాయము. 'జముక' అనుటకు 'జనక' అని వ్రాసి యుండును. 'జమిలిక' అనియు 'జమిడిక' అనియు నివి ప్రాచీన కవులచే పేర్కొనబడినవి.

పండితారాధ్య చరిత్రలో వాదప్రకరణమున పండితుడు చందవోలురాజు కడకేగు నప్పుడు అతని వెంటనున్న సద్భక్త సంకులము మది సుబ్బి ''సంసార మాయా స్తవంబు

పదములు, తుమ్మెద పదములు, ప్రభాత పదములు, పర్వత పదములు, ఆనంద పదములు, శంకర పదములు, నివాళి పదములు, వాలేశు పదములు, గొబ్బి పదములు, వెన్నెల పదములు, సంజవర్ణన పదములు, గణవర్ణన పదములు'' అర్ణవఘోషవలె ఘూర్ణిల్లునట్లు పరమ హర్షముతో బాడుచు ఆడుచు వెడలిరని చెప్పబడినది.[8] ఈ పదములు చెప్పబడిన తావున (పండితారాధ్య చరిత్రలో) మొదటి పాదమున ''సంసార మాయా స్తవంబుఁ బదములు'' అని యున్నది. ఇందలి ఖండబిందువు పరిష్కర్తలు చేర్చినదని నా తలంపు. ఇవి 'సంసారమాయా స్తవము చేయు పదములు'. అనగా నివి పోతులూరి వీరబ్రహ్మం, దూదేకుల సిద్ధయ్య మున్నగు పామర కవుల తత్త్వ గేయముల వంటివి కావచ్చును. డా॥ శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారును ఇదే అభిప్రాయమును గలిగియున్నారు. ''పాల్కురికి చెప్పిన తుమ్మెద, నివాళి, ప్రభాత, శంకర, సంసారమాయా, ఏలపదములున్నూ విడిగేయాలు....'[9] ఇందు 'పదము' అనునది ప్రతిమాటకును చేర్చుకొనవలెను. కావున 'సంసార మాయా పదము' లనియే శ్రీపాదవారి అభిప్రాయము.పాల్కురికి సోమనాథుడు చేసిన ఈ పద ప్రసక్తి నుదాహరించుచు, పలువురు విమర్శకులు ''సంసార మాయా స్తవంబు'' అను భాగమును విడచి, ''పదములుఁ దుమ్మెద పదముల్ ప్రభాత, పదములుఁ బర్వతపదము లానందపదములు....'' అను రీతి నుదాహరించు చున్నారు. ఇది ప్రామాదికము. ''సంసార మాయాస్తవంబు పదములుఁ, దుమ్మెద పదముల్, ప్రభాత పదములు....'' అనుట సమంజసము. ''సంసార మాయా స్తవంబు పదములు'' అనునది దుష్ట ప్రయోగమని తలంపరాదు. ఏలయన, పాల్కురికి సోమనాథుడు తన కావ్యములలో నెక్కడను షష్ఠీ తత్పురుషములో పుంప్వాదేశము చేయడు. 'శీలంపు భక్తులు' అనుటకు 'శీలంబు భక్తులు' అనియే ప్రయోగించును. ఇట్టి ప్రయోగములు బసవ పురాణములో పలుబది నాలుగు కలవని శ్రీ తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారి పరిశోధన వలన తెలియుచున్నది. కాబట్టి 'సంసార మాయా స్తవంపు పదములు' అనుటకు మాఱుగా సోమనాథుడు తన సహజ ధోరణిలో 'సంసార మాయా స్తవంబు పదములు' అని ప్రయోగించినాడు. కావున పాల్కురికి సోమనాథుడు పేర్కొనిన పదముల నిట్లుదాహరింప వలెను:

మది నుబ్బి, సంసార మాయా స్తవంబు
పదములుఁ, దుమ్మెద పదముల్, ప్రభాత
పదములుఁ, బర్వత పదము, లానంద
పదములు, శంకర పదముల్, నివాళి
పదములు, వాలేశు పదములు, గొబ్బి

8. మా. పండితారాధ్య చరిత్ర, చిలుకూరి పరిష్కృతము, ప్రథమ భాగము, పుట 513.
9. విజ్ఞాన సర్వస్వము, నాల్గవ సంపుటము, పుట 803.

> పదములు, వెన్నెల పదములు, సంజ
> వర్ణన మఱి గణవర్ణన పదము,
> లర్ణవ ఘోషణ ఘూర్ణిలుచుండc
> బాడుచు నాడుచుc బఱమ హర్షమునc
> గూడి సద్భక్త సంకుల మేcగుదేర [10]

ఇందలి 'సంసార మాయా స్తవంపు పదములు' వైరాగ్య తత్త్వ గేయములు కావచ్చును. ఇవి నేటి బ్రహ్మముగారి తత్త్వములను బోలినవి. తుమ్మెద పదములు నేటికిని గలవు. 'తుమ్మెదా' అను పాదాంత పదముతో నుండును. ప్రభాత పదములు - మేలుకొలుపులు కానోపును. 'పర్వత' మనగా శ్రీశైలమని యర్థము. శ్రీశైల పర్వత మహిమను గూర్చిన పాటలు పర్వత పదములన బడెడివని తలంపవచ్చును. శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు ఈ పర్వత పదములను కథాగేయములుగా నూహించుచున్నారు.[11] ఆనంద పదములు నేటి స్త్రీలపాటలలో ''ఆనంద మానంద మాయెనే, మన సీతమ్మ పెండ్లికూతు రాయెనే....'' వంటి పాటలు కావచ్చును. శంకర పదములు 'శంకరా' అను సంబోధనతో నున్న పాటలే! వాలేశు పదములును ఇట్టివే! నివాళి పదములు మంగళ హారతులు. 'నీకు నివాళి' అనునది పునరావృత్తి.[12] ఇవియును శివస్తుతి పరములే. గొబ్బి పదములు, వెన్నెల పదములు నేటికిని గలవు. 'గొబ్బియళ్ళో', 'వెన్నెలా' అనునవి పాదాంత పదములు. సంజవర్ణన పదములు - ఉదయ సాయంసంధ్యలను, గణవర్ణన పదములు- శివగణ నాయకులను వర్ణించు పదములని నామములను బట్టి సులభముగా నూహింప వచ్చును. పండితారాధ్యుడు బసవేశ్వరునకు సమకాలికుడు. కాగా క్రీ.శ. 12వ శతాబ్దమునాటికే తెలుగులో ఎన్నిరకముల పదములు వ్యాప్తియందున్నవో సోమనాథుడు కావించిన ఈ ప్రసక్తిని బట్టి తెలియనగును.

పండితారాధ్యుని కాలమునాటి గాయక నికరములు ఈ క్రింది పురాతన శివభక్తులపై గీతము లాలపించెడి వారట:

> బసవయ్య, షొడ్డల బాచయ్య, చెన్న -
> బసవయ్య, మడివాలు ప్రభువు, సత్తేశు -
> చామయ్య, యజగన్న, సవరద సిద్ధ -

10. పండితారాధ్య చరిత్ర, ప్రథమ భాగము, పుట 513.
11. ''పర్వత పదములు, సిరియాళు చరిత, కామవల్లి వలపు, పరశురాముని కథ, విద్దికూచి రామాయణము, పల్నాటి వీరకథ - కథాగేయాలు''
విజ్ఞాన సర్వస్వము, నాల్గవ సంపుటము, పుట 803.
12. శ్రీ హస్నాబాద నాగలింగ శివయోగి గారు 1963 డిసెంబరు భారతిలో కొన్ని నివాళి పదములు ప్రకటించియున్నారు.

రామయ్య, యక్కగార్కల్లి దేవయ్య,
దాసయ్య, శంకర దాసయ్య, దాస
కేసయ్య, గక్కయ్య, గేశిరాజయ్య,
మసనయ్య, సిక్కయ్య, మాదిరాజయ్య,
యసలార మఱియు శైవాఢ్యు లైనట్టి
సకల పురాతన సద్భక్తగీత –
నికరముల్ గాయక నికరముల్ వాడ [13]

పండితారాధ్య చరిత్రలోని పర్వత ప్రకరణము జానపద సాహిత్య ప్రసక్తికి ఆటపట్టు. ఈ ప్రకరణమున జంగములు, పిచ్చుకుంట్లు, చెంచులు, ఇత్యాది గాథాకారులు వర్ణింపబడిరి. శైవ భక్తులు లింగార్చన చేసి, బసవన్న గీతములు, ఏలలు, చిందుపాటలు, ఆలతులు పాడుచు ఆడుచు జయపెట్టుచుండిరట.[14] నక్షత్ర పర్వతారోహణ ఘట్టమున వివిధ దేశముల పరుసలు బంతులు గట్టి పాటలు పాడుచు పర్వతము నారోహించిరని తెలుపబడినది. (ఇట్లు పర్వతము నెక్కునప్పుడు పాడు పాటలు గూడ 'పర్వత పదముల' పేర పిలువబడి యుండును). ఈ పాటలలో నాడు ప్రచారమున నున్న శైవభక్తుల పేళ్ళన్నియు గలవు. ఇక్కడ సోమనాథుడు ఆంధ్ర దేశపు పరుస, కన్నడ పరుస, ఆరె వరుస, అరువ దేశపు పరుసల పాటలను వర్ణించినాడు. తరువాత మృగవ్యాధుని కథ చెప్పుచు భక్తులు శివరాత్రి జాగరణలో అరువత్తు మూవరు నాయన్మార్ల చరిత్రలను, బసవపు రాణమును ఏలలు పెట్టి, ఇంపు సొంపారు శైలిచే చదివిరనియు, బసవన గీతములు, సకల పురాతన చారుగీతములు ప్రకటించి ప్రకటించి పాడిరనియు తెల్పినాడు.[15] ఇట్లు ఏలలు కట్టి పాడిన బసవ పురాణము పాల్కురికి సోమనాథుడు రచించినదో,

---

13. పండితారాధ్య చరిత్ర, ప్రథమభాగము, పుట 516.

14. బసవన్న గీతముల్ వసరించువారు, బసవపురాణ మొప్పగ జదువువారు
భరతోక్తి నేలలు వాడెడువారు, నరుదందc జిందుల కాడెడువారు
నాలతుల్ సేయుచు నలరెడువారు, శైలముల్ ఘూర్నిల్ల జయవెట్టువారు'.
– పండితారాధ్య చరిత్ర, పర్వత ప్రకరణము, పుట 365.

15. అరుదగు దాసయ్య నఱువత్తు మూఱు
సరితంబులును శ్రీ బసవ పురాణంబు
నేలల్గు వెట్టంగ నింపు సొంపారు
శైలిచేc గ్రాలుచుc జదివెడువారుc
జాతుర్య మెసగc బసవ దండనాథు
గీతంబు లాదిగా గీతాఢ్యులైన
సకల పురాతన చారు గీతములుc
బ్రకటించి ప్రకటించి పాడెడువారు. – పండితారాధ్య చరిత్ర, పర్వత ప్రకరణము, పుట 433.

లేక ఆతనికి పూర్వమునుండియు ప్రజలలో మౌఖిక సంప్రదాయమున నున్న బసవ పురాణమో నిశ్చయముగా చెప్పలేము. పాల్కురికి బసవ పురాణము క్రీ.శ. 1192లో రచింపబడిన దనియు, పండితారాధ్య చరిత్ర క్రీ.శ. 1230లో రచింపబడిన దనియు విమర్శకు లూహించుచున్నారు. ఈ 30,40 ఏండ్లలోనే అతని బసవపురాణము మిక్కిలి ప్రచారమునకు వచ్చియుండు ననియు, దానినే నాటి భక్తులు ఏలలు పెట్టి చదువుచుండిరనియు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారు భావించి, ఉదాహరణ పూర్వకముగా దీనిని నిరూపించియున్నారు.[16] కాని నాటి భక్తులు

---

*16.* ''దీనిని బట్టి ఆ కాలంలో ద్విపదలలో నుండే బసవపురాణ పంక్తులకు 'ఏలాలో' అనే పదాన్ని చేర్చి పాడేవారని తెలుస్తుంది. ఉదాహరణకు -

**బసవాయనిన జాలు బాన లొండేల - ఏలాలో**
**అసలార విషమైన అమృంతంబు గాదె - ఏలాలో**
**బసవా యనిన జాలు బానలొండేల - ఏలాలో**
**వసుధ శత్రులు మిత్రవర్గంబు గారె - ఏలాలో...**
**గతకాలవర్తన కంటె సద్భక్తి - ఏలాలో**
**మితిమీరి దప్పకుమీ బసవన్న - ఏలాలో**
**శత్రులైనను లింగ సహితులై యున్న - ఏలాలో**
**మిత్రులకా చూడుమీ బసవన్న - ఏలాలో**

దీనిని బట్టి 'ఏలాలో' అను ఏల పదసంబంధమైన పల్లవితో పంద్రెండో శతాబ్దంలో పాడేవారని తెలుస్తుంది.'' -కిన్నెర, జనవరి *1955*, పుట *45*.

కాని పైన ఇచ్చిన వేంకటరావుగారి ఉదాహరణము సమంజసముగా దోపదు. జానపద గేయములలోను, వీరగాథలలోగాని ''తుమ్మెదా, వెన్నెలా, ఉయ్యాలో, ఏలాలో'' ఇత్యాది పునరావృత్తులు (*Refrains*) ప్రతిపాదము నందును విరామస్థానమున (యతి దగ్గఱ) ఒక మాఱు, పాదాంతమున మఱియొక మాఱు వచ్చును. గొబ్బి పాటలును ఇట్టివే. ఒక్క పాదాంతమున మాత్రమే వచ్చుట జానపద సంప్రదాయముకాదు. అది పాడుట కనువైనది కూడ కాదు. ఉదాహరణమున కీ క్రింది పదములు చూడుడు:

తుమ్మెద పదము : దేవసిరి నందీ తుమ్మెదా - తేరగా వచ్చింది తుమ్మెదా
గొంతెమ్మ పెంచినా తుమ్మెదా - గొలుసుళ్ళ నందీ తుమ్మెదా

వెన్నెల పదము : పగడాల రాయెక్కి యెన్నెలా - పలువరస తోమింది యెన్నెలా
ముత్యాల రాయెక్కి యెన్నెలా - మునిపల్లు తోమింది యెన్నెలా

ఊయల పదము : గంగదారిమీద ఉయ్యాలో - బంగారి వానా ఉయ్యాలో
ఏడేడు గరిసెల్ల ఉయ్యాలో - ఏ దేవుడు గుప్పిచ్చె ఉయ్యాలో

చందమామ పదము : ధర చోళ దేశమున చందమామ - ధర్మాంగుడను రాజు చందమామ
ఆ రాజు భార్యయు చందమామ - అతి సత్యవతి యండ్రు చందమామ

ఏలలతో చదివినది సోమనాథుని కన్న పూర్వము నుండియు ప్రజలలో ప్రచారమున నున్న బసవ పురాణమే కాని, సోమనాథ విరచితమైనది కాదనియు, సోమనాథుని కావ్యము ప్రౌఢమనియు, ఏలలతో చదువుటకు వీలుకాని దనియు శ్రీ తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారు భావించు చున్నారు. ఇదియే సమంజసముగా తోచుచున్నది. ఏలయన, ''తుమ్మెదా, వెన్నెలా, ఉయ్యాలో, చందమామ, ఏలలో'' మున్నగు పునరావృత్తులు ప్రతి పాదముననుయతిస్థానమున నొకమాఱు, పాదాంతమున మఱొకమాఱు వచ్చును. ఇది జానపద కవిత్వమున ప్రసిద్ధ సంప్రదాయము. ఈ

---

ఇట్టి జానపదగేయముల నాధారముగా గొని కీర్తనలు రచించిన పదకవితా పితామహుడు తాళ్ళపాక అన్నమాచార్యులు సహితము గొబ్బి పాటను పాదమునకు రెండుచోట్ల గొబ్బి పెట్టుచునే రచించినాడు, **''కొలని దోవరికి గొబ్బిళ్ళో - యదుకుల స్వామికిని గొబ్బిళ్ళో.''** ద్విపదలలో వ్రాయబడిన పల్నాటి వీరకథలు, కాటమరాజు కథలు పాడునప్పుడు సరిగా యతిస్థానమున నిలుపబడి, వంతల పునరావృత్తిని అందుకొనిన తర్వాతగాని ముందునకు సాగవు. యతిస్థానమున ఒక మాఱు పాదాంతమున మఱియొకమాఱు *'ఆఁ...!' 'ఓ చెన్నయ్యా...!'* అను వంత పదములు పల్నాటి వీరకథలలోను, *''ఆఁ...!, ఔనే...!''* వంటి వంతపదములు కాటమరాజు కథలలోను వచ్చుచుండును.

జానపద సంప్రదాయము, గాన సౌలభ్యము ఇట్లుండ, పాల్కురికి ద్విపదలు యతి స్థానమున గాని పాదాంతమున గాని విఱుగునవి కావు. అసలు యతిస్థానమున నిలుపు అలవాటు తెలుగు కవులలో (శ్రీనాథాదుల నొక రిద్దఱిని తప్పించినచో) ఎవరికిని లేదనవచ్చును. యతిస్థానము మాట దేవుడెఱుగు, పాదాంతమున నిలుపు అలవాటే మనవారికి లేదు. నన్నయ సీస పద్యములవలె పాల్కురికి ద్విపదలు కూడ ఒక పాదమునుండి మఱియొక పాదమునకు 'దురాక్రమణ' చేయుచు - సాగుచు - పోవుచుండును. ఇట్టి ద్విపదలను ఏలలతో పాడుటకు గాని, చదువుటకు గాని శక్యముగాదు. ఒకవేళ పాడిరని తలచినను, ఈ క్రింది విధముగా పాడియుందురు కాని, వేంకటరావుగారు చెప్పినట్లు కాదు.

**బసవా యనిన చాలు ఏలాలో - బానలొందేల ఏలాలో**
**అసలార విషమైన ఏలాలో - అమృతంబు గాదే ఏలాలో.**

కాని యిట్లు యతిస్థానమున విఱుగు పాదములు నూటికిని కోటికిని ఒక్కటి కానవచ్చుచున్నది. వేంకటరావుగారు ఉదహరించిన భాగములోనే మొదటి మూడు పంక్తులు తప్ప తక్కిన భాగము పై విధముగా పాడుటకు లొంగదు. ఒక పాదము మఱియొక పాదములోనికి చొచ్చుకొని పోయిన సందర్భము అడుగడుగునకు తటస్థించుచుండును. కావున పాల్కురికి సోమనాథుని ద్విపదలు ఏలలు పెట్టి పాడుట కనువైనవి కావనుట నిశ్చయము. ఆతడు పేర్కొనిన 'బసవ పురాణము' ప్రజలలో వ్యాపించియున్న వేఱొక 'ఏలల బసవ పురాణము' కావచ్చును. నాటి ప్రజలలో నట్టి బసవ పురాణమే కాక, అఱువత్తుమూవరు చరిత్రలు కూడ ఏలల రూపమున చదువబడుచున్నవని సోమనాథుని ఉదాహరణమును బట్టి స్పష్టమగుచున్నది.

పద్ధతి పాడుట కనువైనది కూడ. కాని పాల్కురికి సోమనాథుని ద్విపదలు యతిస్థానమున విఱుగునవి కావు. అవి పాదాంతమున గూడ ఆగక, మఱియొక పాదము లోనికి చొచ్చుకొని పోవును. ఇట్టి ద్విపదలను ఏలలు పెట్టి పాడుట అసాధ్యము. కాలానుక్రమమున చూచినను ఇది అసమంజసమే యగును. పండితారాధ్యుడు పాల్కురికి సోమనాథునకు పూర్వుడు. అతని కాలమునాటి కథ ఇందు (పండితారాధ్య చరిత్రలో) వర్ణితము. కాన పండితారాధ్యుని కాలమున సోమనాథ విరచిత బసవపురాణము పఠింపబడిన దనుట పొసగదు.

ఈ పండితారాధ్యచరిత్రలో శివరాత్రివర్ణన సందర్భముననే సోమనాథుడు 'చాంగుభళా' చిందుపాటలను, బహునాటకములను, బహురూపములను, తోలుబొమ్మలాటలను, కొయ్య బొమ్మలాటలను, గంధర్వ యక్ష విద్యాధరాది వేషములతో పాడు గానములను, నృత్యములను, ఆటపాటలను పేర్కొన్నాడు.[17] గాథాకారుల వేషములను నృత్యములను కన్నులకు గట్టినట్టు వర్ణించినాడు. నాడు ప్రచారమున నున్న దేశిసంగీతమును, రాగములను, తాళములను, వాద్యములను తెలిపియున్నాడు. ఒకచో జ్యోతులను ధరించి నృత్యము చేయు వీర వేషధారులను

---

17. *అలరుచుఁ బడి హోరులట్ల యందఱును*
*లలినుబ్బి చాంగు భళా యనువారు* - (పుట 434)

*ప్రమథ పురాతన పటుచరిత్రములుఁ*
*గ్రమమొంద బహునాటకము లాడువారు*
*లలితాంగ రస కళాలంకార రేఖ*
*లలవడ బహురూప మాడెడువారు...*
*భారతాది కథలఁ జీరమఱుఁగుల*
*నారంగ బొమ్మల నాడించువారుఁ*
*గడు నద్భుతముగఁ గంబ సూత్రంబు*
*లడరంగ బొమ్మల నాడించువారు*
*నాదట గంధర్వ యక్ష విద్యాధ*
*రాదులై పాడెడు నాడెడువారు* -(పుటలు 435, 436)

*మఱికొందఱు గంతులు వైచుచు శంకరునిపై పాటలు పాడుచున్నారట:*

*చంకఁ జూపుచు బయల్ సప్పరించుచును*
*జంక లడిచికొనుచు శంకరుఁ బాడు*
*చు నుఱుకుచుఁ గేళ్ళు సూపుచుఁ బన్ని*
*కొనుచు గంతులు వైచుచును...* -(పుటలు 436, 437)

పేర్కొన్నాడు[18]. వీరు నేటి రాయలసీమలో చౌడమ్మ పాటలు పాడు తొగటవీరుల వంటి వారేమో! ఈ తొగటవీరులు కూడ పాల్కురికి వర్ణించినట్లే వేషములు ధరించి, నెత్తిపై జ్యోతిని పెట్టుకొని, వీరావేశమున నృత్యము చేయుచు, తమ కులదేవతయగు చౌడేశ్వరిపై పాటలు పాడుదురు. ఈ పాటలలో కథాగేయములును గలవు.

తన కాలమునాటి ప్రజాజీవితమును ఇంత సూక్ష్మముగాను, ఇంత ప్రస్ఫుటముగాను వర్ణించిన పాల్కురికి సోమనాథుడు తెలుగుజాతి గర్వింపదగిన ప్రజాకవి. ఈతడే నిజమైన తెలుగు జాతీయకవి! ఈ సోమనాథుని కాలమునాటికే (క్రీ.శ. 12వ శతాబ్దము నాటికే) ఇన్ని రకముల పాటలు, ఆటలు, ఆటపాటలు, నాటకములు, బొమ్మలాటలు మున్నగునవి ఉండగా-వీరగాథలు, వీరగాథాగానము ఉన్నవా లేవా అని సందేహించుటకు ఏ మాత్రమును అవకాశము లేదు. ఆడుచు పాడుచు కథ చెప్పుటయే వీరగాథా తత్త్వము. ఈ ఆటపాటలవారిని సోమనాథుడు పలుతావులందు వర్ణించినాడు. కావున వీరగాథలు 12వ శతాబ్దినాటికి తెలుగులో విశేష వ్యాప్తియందున్నవని నిస్సంశయముగా చెప్పవచ్చును. అందు సిరియాలుని వీరగాథకు మిక్కిలి ప్రచారమున్నదని తెలియుచున్నది!

ఏగంటి లక్ష్మయ్యగారు పాల్కురికి సోమనాథుని తరువాతి కాలమున గల ప్రసిద్ధ శైవ కవియని కొందఱు తలచుచున్నారు. ఈతని పాటలెన్నియో నేటికిని వ్యాప్తియందున్నవి. కాని ఇవి శుద్ధ గేయములే కాని కథా గేయములు కావు.

నాచనసోముని కాలమున (క్రీ.శ. 1360 ప్రాంతము) జాజర పాటలు వ్యాప్తియందున్నవని తెలియుచున్నది. ఈతని వసంతవిలాస కావ్యమునుండి లాక్షణికు లొక జాజరపాటను పేర్కొని యున్నారు.[19] 'జాజర పాట'కు సంస్కృతీ కరణము 'చర్చరీగీతము'. శ్రీనాథుని

---

*18. ... పర్వతుని గుఱించి*
*ధృతి శిరంబులు ధూప దీప పాత్రముల*
*గతి నావహించిన కరణియుఁ బోలె*
*శిరముల దాల్చిన చిరధూప దీప -*
*పరిమళ ప్రభలు శ్రీ పర్వతు ముంపఁ*
*జూడఁ జోద్యంబంచుఁ జూపఱు వొగడ*
*నాడుచుఁ బాడుచు నలరెడు వారు* -(పుట 407)

*19. వీణా గానము వెన్నెల తేటా*
*రాణ మీఱఁ గా రమణుల పాటా*
*ప్రాణమైన పిన బ్రాహ్మణు వీటా*
*జాణలు మెత్తురు జాజర పాటా*

చూ. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి 'దేశి సాహితి సొంపు' అను వ్యాసము, *పరిశోధన, ఆగస్టు - సెప్టెంబరు 1954.*

(15వ శతాబ్దము) భీమఖండమున అచ్చరలు కనకవీణలు మీటుచు ''జాదుర జాదు రంచు మృదు చర్చరి గీతులు'' పాడిరని తెలుపబడినది.[20] జాజర పాటలు నేటికిని తెలంగాణమున కాముని పున్నమ దినములలో విశేషముగా పాడబడుచున్నవి. వెన్నెలలో స్త్రీలు వలయాకారముగా నేర్పడి చప్పట్లు చఱచుచు వీనిని పాడుదురు. ఈ జాజర పాటలను తెలంగాణమున 'చుట్టు కాముడు పాటలు' అని పిలుతురు. వలయాకారమున తిరుగుచు కాముని పున్నమ దినములలో పాడుటచే కాబోలును ఈ పేరు వచ్చినది. రాయలసీమలో, ముఖ్యముగా రాయచోటి తాలూకాలో స్త్రీలు వెన్నెలరాత్రులలో పాడెడి ఇట్టి పాటలను 'జక్కికలు' అందురు. పూర్వము వీనిని 'జక్కులవాండ్రు' పాడెడివారు కావున ఈ పేరు వచ్చినది.

కేతన (క్రీ.శ. 1200-1280) తన దశకుమార చరిత్రలో అమూలకములైనవియు, ఆంధ్రదేశీయములైనవియు నగు కొన్ని విశేషములను చొప్పించినాడు. ఒకడు **''మరులు దవం బెక్కించుకొని, కలమాటలాడుచు, మొలవుండ్ల మల్లనిఁ బాడుచు, నొడలెల్ల బరికి కొనుచు''**[21] తలవరులను గికురించి తప్పించుకొనెనట. 'మొలవుండ్ల మల్లనిఁ బాడుట' యననేమో తెలియక పోయినను, మల్లనిపై కొన్ని జానపద గేయము లానాడు ప్రచారమందున్న వని గ్రహింపనగును. తెలుగు వీరగాథలకు హేతుభూతములైన కోడిపందెముల వర్ణన చేసిన ప్రథమకవియు నీతడే.[22] ఈ కోడిపోరు వర్ణన క్రీడాభిరామముననను, హంసవింశతి యందును గూడ కలదు. ఇది ఆంధ్ర దేశమునకు ప్రత్యేకమైన సజీవద్యూతము. భారతదేశమున ఇతర ప్రాంతములలో ఇదియున్నట్లు కానరాదు. ప్రపంచమున ఇతర దేశములందును ప్రచురముగా లేదు. ఆగ్నేయాసియాలో ఒక్క 'ఫిలిప్పైన్స్' (Philippines) దీవులలో మాత్రము మన ఆంధ్రదేశమున నున్నంత యధికముగా ఈ కోడిపందెము లున్నవని ఆచార్య జి.యన్. రెడ్డిగారు తెలుపుచున్నారు. మన భాషలో నున్నట్లే అక్కడ కుక్కుట శాస్త్రములును వెలసినవట! కోడిపుంజుల అతిలోక శౌర్యప్రకటనకు గల కారణములను శాస్త్రవేత్తలు పరిశీలింపవలసి యున్నది.

క్రీడాభిరామమను వీథీరూపకమున వీరగాథలయు, గాథాకారులయు ప్రసక్తి అత్యధికముగా నున్నది. ప్రతాపరుద్రుని కాలమున (క్రీ.శ. 1298-1323) గల ఓరుగల్లు పట్టణ ప్రజాజీవితమే ఇందలి యితివృత్తము. ఇది యేదియో ఒక యుత్సవ సందర్భమందలి వర్ణనవలె నున్నది. లేనిచో ఇన్ని రకముల గాథాగానముల ప్రసక్తి యుండుట కవకాశము లేదు. గోవింద మంచనశర్మ, టిట్టిభసెట్టి యను మిత్రద్వయము ఈ యితివృత్త వ్యాఖ్యాతలు. వీరిరువురును

---

*20. భీమ ఖండము, 5 -103*

*21. షష్ఠాశ్వాసము, 157వ పద్యము*

*22. చూ. నవమాశ్వాసము, 29-33 పద్యములు.*

ఓరుగల్లు కోటలో కలకలముతో నిండిన రాజమార్గమున గాక, క్రంతత్రోవల గుండా పోవుచుండిరి. అట్లు కొంతదూరము పోగా గోవిందశర్మ '**పలనాటి వీరపురుష పరమదైవ శివలింగ భవనావాటి**' ని వీక్షించెను.[23] ఆ వీరాలయమునకెదురుగా నొక స్త్రీ '**తకధుం ధుంధుం కిటాత్కార సంగతి**' తో ద్రుతతాళమున వీరగుంభిని వాయించుచు ద్విపద ప్రబంధమున వీరానీకమును గూర్చి పాడెను. ఆమె పాడు ప్రత్యక్షరమునకును కుమారకులు (వంతలు) ఫీట్కారము (వీరరసోద్దీపకములగు పెడబొబ్బలు) తో తూలుచున్నారు.[24] కొడుము తాటింపుచు ఆ పడతి పెద్దకొలువులో పల్నాటి వీరులను గూర్చి పాడుచుండగా ఆమెకు వంతపాట పాడుచున్న పురుషులలో నొకడు గర్జించుచు, గాథాకారిణి పాదవిన్యాసమున కనుగుణముగా వీరసంబెటను కోలతో కొట్టుచున్నాడు. మఱియొకడు పెద్దపెద్ద అంగలు వేయుచు, వంగి, కుంతమును విసరుచున్నట్లుగా అభినయించుచున్నాడు. ఇంకొకడు బిగువు కన్నుల నుబ్బెడి బెదరు చూపులతో ఫీట్కార మొనరించుచున్నాడు. వేఱొకడు భుజములు చఱచుకొనుచు భూమిపై కుప్పించి దుముకుచున్నాడు. మఱియొకడు 'ఓల' (వంతపాట) పాడుచున్నాడు. ఇంకను నొకడు గుఱ్ఱపు నడకలను అనుకరించి చూపుచున్నాడు.[25]

పిఱికి కండ లేని అఱువది యేగురు పల్నాటి వీరబాంధవులకు గులదైవము గురిజాల గంగాంబ; చెలిమికాడు పోతురాజు. ఆరువల్లి నాయకురాలి దుర్మంత్రము, కోడిపోరు, చాప కూటి కుడుపు - ఈ మూడును పల్నాటి యుద్ధమునకు ప్రథమ కారణములని క్రీడాభిరామకర్త తెలుపుచున్నాడు: (చూ. 118,119 పద్యములు).

తరువాత వీరకుమారకోటి వేషభూషణములను తెల్పుచున్నాడు. ఒడలి నిండ పచ్చని పిండిగందము, ఫాలభాగమున అక్షతలబొట్టు, కంఠమున ఎఱ్ఱని పూలదండ, కొప్పుగా నల్లిన జడలు, కుచ్చులు గల వీరసంబెట (=సుత్తివంటి ఒక ఆయుధ విశేషము), క్రొత్తగా మడచిన కాసెపుట్టము - ఇవి ప్రసిద్ధమగు వీరకుమారాభరణములు. (చూ. 120వ పద్యము).

---

23. చూ. *క్రీడాభిరామము, వేటూరి ప్రభాకర శాస్త్రిగారిచే పరిష్కరింపబడినది, మణిమంజరి ప్రకాశితము, హైదరాబాదు - 20, 1960, 115వ పద్యము. ఈ పద్యము నుండి 125వ* పద్యమువఱకును పల్నాటి వీరగాథాగానము యొక్కయు, వీరులయొక్కయు ప్రసక్తి కలదు.

24. మ. *ద్రుత తాళంబున వీరగుంభి తకధుం ధుం ధుం కిటాత్కార సం*
*గతి వాయింపుచు నాంతరాలిక యతి గ్రామాభిరామంబుగా*
*యతిగూడం ద్విపద ప్రబంధమున వీరానీకముం బాడె నొ*
*క్క్రత ప్రత్యక్షరముం గుమారకులు ఫీట్కారంబునం దూలఁగన్.* - *116* వ పద్యము.

25. చూ. *117*వ పద్యము.

నల్లగొండ, నాగరికల్లు, పల్లేరు, నాగులేరు - ఇవి పల్నాటి రాజ్యమునకెల్లలు. ఇచ్చటి పల్లె దేశములయందలి చనుప పెద్దలు (బిడారి గుంపులు) పల్నాటి వీరులను గూర్చిన ఐతిహ్యాము లనేకములు చెప్పుచుందురు. సామంత నృపతులు చాపకూడు కుడిచిన చోటును, ఆరువెల్లి నాయకురాలు మంత్రాంగము చేసిన చోటును, బీలసాని సహగమనము చేసిన చోటును, సవతి తల్లుల బిడ్డలైన పల్నాటి రాజులు రాజ్యమునకై పోరిన ప్రదేశమును, వారు వీరపురుషులై యుద్ధమున బడిన ప్రదేశమును ఈ బిడారి గుంపులు చూపుచుందురు. (చూ. 121,122 పద్యములు). ఇందు బేర్కొనబడిన 'బీలసాని' ఎవరో తెలియుటలేదు. అనుగురాజు మరణించి నప్పుడు గురిజాలలో మైలమదేవి సహగమనము చేసినది. అలరాజు మరణించినప్పుడు రత్నాల పేరమ్మయు చిచ్చుఱికినది; కాని ఇది పల్నాడులో గాదు, మేడపిలో (కర్నూలు మండలమున) జరగినది. కన్నమదాసు తండ్రి తెప్పలినీడు ఆరణగండ్ల యుద్ధమున మరణించినప్పుడు గురిజాలలో అతని భార్యయు సహగమనము చేసినది. 'బీలసాని' ఇందెవ్వరో తెలియుటలేదు. దీని విషయమింకను పరిశోధింప వలసియున్నది.

మాచెర్ల చెన్నుడును, శ్రీగిరి మల్లికార్జునుడును పల్నాటి సీమను బ్రోచుచుండుటచే అచట పంటలు సమృద్ధిగా పండుచున్నవి. ఆ పల్నాటి భూమిలో మగవారే కాదు, ఆడువారును సింహములవంటివారే! త్రిభుజాకారముగా బిగించిన చట్రములో గచ్చు చేసిన చిత్రపు గద్దె పలకపై శీలము బ్రహ్మనాయడు మొదలగు వీరసేనాధిపతుల చరిత్రలను వ్రాసినారనియు, దానిని జాడు మనియు గోవింద మంచనశర్మ టిట్టిభసెట్టితో జెప్పినాడు. (చూ. 123, 124, 125 పద్యములు). ఇట్లు వీరగాథలలోని ముఖ్యఘట్టములను చిత్రరూపమున ప్రదర్శించి పాటపాడుట కాటమరాజు కథాగానము నేటికిని గలదు.

ఇట్లు క్రీడాభిరామమున విపులమైన పల్నాటి వీరగాథా ప్రసక్తియే కాక, ఏకవీరాంబ ప్రసక్తియు, బరశురాముని కథా ప్రసక్తియు గూడ కలవు. 127వ పద్యమునుండి 133వ పద్యము వఱకును నిట్టి ప్రసక్తి యున్నది. మొదట ఫణిరాజ మండనయు, జగదంబికయు, జమదగ్ని గారాపు సతియు, గిరిరాజ నందనయు, నిత్యకల్యాణియు, ఆదిశక్తియు, వేదవేదాంత సారయు నగు ఏకవీరను వర్ణించినాడు. ఏకవీరయే రేణుక. ఈమెను జానపదులు 'ఎల్లమ్మ' అని పిలుతురు. ఏకవీర భృగుబ్రహ్మసంయమి వంశమునకు అభినవాభరణము. త్రేతాద్వాపర యుగముల సంధ్యావేళలో మగనితో పెక్కేండ్లు జీవించినది. కానక కన్న నెయ్యంపు కొడుకుచే ముయ్యేడు మాఱులు నరులను చంపించెను. హైహయ రాజుల అస్థిపటలమును గవడపేరుగా జేసి మెడను ధరించినది. మండపాక, పెనుపాక, మాహురము, నాగవరము, పోలాస అను ప్రదేశములలో వెలసిన ప్రసిద్ధదేవత ఏకవీర. ఓరుగంటిలో కాకతమ్మకు సైదోడుగా వసించుచున్నది. ఈమెను గూర్చి 'ఏకవీరాంబ కథ' అను వీరగాథ కలదు. (దీని తాళపత్ర ప్రతి

నాకు కృష్ణామండలమున లభించినది). ఈ ఏకవీరాదేవికి 'మాహురమ్మ' యనియు పేరు. 'మాహుర' మను ప్రదేశమున వెలసినదగుటచే ఈ పేరు వచ్చియుండును. ఈమె ఎంతటి రాజుల భార్యల నైనను విధవలుగా మార్చు రట్టుకత్తె; జమదగ్ని మునికి కూరిమి వెలయించు వేడ్కకత్తె; సుక్షత్రియ కులమును నిక్షత్రముగా జేయు కొడుకును గాంచిన కోపకత్తె; బవనీల జవనిక పాటలతో నిల్లాంద్రను త్రుళ్ళాడించు రంతుకత్తె! ఇట్టి ఏకవీరామహాదేవి యెదుట నిల్చి, చారుతరకీర్తియగు నొక బవనీల చక్రవర్తి జవనికను నేర్పుతో వాయించుచు, శుద్ధ సాళవ సంకీర్ణ వివిధ రాగముల చవులు సూపుచు, పరశురాముని కథల నన్నిటిని ప్రౌఢితో పాడినాడు.[26] ఒక మాలెత కలకంఠ కోమల కుహూకారముతో నెల్లమ్మ పాటలు పాడినది.[27] ఈమెకు వంతలుగా కొందఱు స్త్రీలున్నారు. వారు తకదుమ్ములతో ఏకతాళముతో జవనికలు వాయించుచు ఏకవీరమ్మకు తందానలు పాడుచున్నారు.[28] మఱియొకచోట, తప్పెట్లును తళ్ళెతాళములును వాయించు ఆసాదివారి ప్రసక్తి యున్నది.[29] బవనీలనే రాయలసీమలో 'ఆసాదివారు' అని పిలుతురు. వీరు నేటికిని ఎల్లమ్మకథలను పాడుచున్నారు.

---

26. సీ. *కక్ష నిక్షిప్త వికస్వర స్వర విలాస శ్రీనివాసంబు జవనికందుఁ*
*గట్టిన తంత్రికిఁ గంఠ శ్రుతికిఁ గూడఁ జొక్కంబుగా నారి సొబగు మీఱ*
*నాలాపముల శుద్ధ సాళవ సంకీర్ణ వివిధ రాగంబుల చవులు చూపి*
*ఢమ ఢమ ధ్వనులఁ బొటారించి యెడనెడ గత్తెర మార్గంబు బిత్తరిల్ల*
*వాద్య వైఖరిఁ గడు నెఱవాది యనఁగ*
*నేకవీరా మహాదేవి యెదుట నిల్చి*
*పరశురాముని కథ లెల్లఁ బ్రౌఢిఁ బాడెఁ*
*జారుతరకీర్తి బవనీల చక్రవర్తి* - (*130వ పద్యము*)

27. మ. *అలరుం బోఁడి జనంగము ప్రమద మధ్యానద్ధ ఘంటాధ్వనుల్*
*చెలగం బాడె సమస్త లోక జననిన్ శ్రీ యేకవీరాంబికన్*
*వలరాఁజొక్కొక మూర్ఛనా స్వరమునన్ బ్రాణంబు గల్పింపగాఁ*
*గల కంఠీ కలకంఠ కోమల కుహూకారంబు తోరంబుగన్.* -(*131 వ పద్యము*)

28. మ. *అకలంక స్థితిఁ గోరి కొల్చెదరు బ్రహ్మానంద భావంబునన్*
*సకలానందమయైక మాత లగుచున్ సంతోష చిత్తంబునన్*
*తకదుమ్ముల్ యకతాళముల్ జవనికల్ తందాన లమ్మయ్యకున్*
*ఎకవీరమ్మకు మాహురమ్మకు నధో హ్రీంకార మధ్యాత్మకున్.* -(*132 వ పద్యము*)

29. మ. *అకలంక స్థితి శీధుపాన రుచులై యాసాదు లుప్పొంగి యో*
*యకరో యమ్మకరో యమక్కరొ యదీ యట్టట్ట కోయంచుఁ బా*
*యక తప్పెట్లును దళ్ళె తాళములు నింపై సొంపు రంజిల్లఁ గాఁ*
*జక జుంజుం జక జుం జు జుమ్ము మనుచున్ సాగుం గడున్ వాద్యముల్.* -(*147వ పద్యము*)

క్రీడాభిరామమున కామవల్లీ మహాలక్ష్మియొక్క కైటభారిని గూర్చిన వలపును పాడుచు వచ్చిన జక్కుల పురంధ్రి వర్ణింపబడినది. జక్కుల పడతి పాడుటచే ఈ 'కామవల్లి వలపు పాటను' యక్షగానముగా దలంపరాదు. ఇది కథాగేయమే. ఆవేశ స్ఫోరక మగుటచే వీరగాథయే యగును. ఇట్టి జక్కుల కథాగేయముల నుండి తరువాతి కాలమున యక్షగానములు పరిణమించి యుండును. క్రీడాభిరామమున జక్కుల పురంధ్రి కామవల్లి వలపు నిట్లు పాడినది:

సీ. కోణాగ్ర సంఘర్ష ఘుమ ఘుమ ధ్వని తార
కంఠస్వరంబు తో గారవింప
మసిబొట్టు బోనాన నసలు కొల్పిన కన్ను
కొడుపుచేఁ దాటించు నెడప దడప
శ్రుతికి నుత్కర్షంబుఁ జూపంగ వలయుచోఁ
జెవిత్రాడు బిగియించు జీవగట్ట
గిల్కు గిల్కున మ్రోయు కింకిణీ గుచ్ఛంబు
తాళమానంబుతో మేళవింప
రాగమున నుండి లంఘించు రాగమునకు
నురుమ యూరుద్వయంబుపై నొత్తిగిల్లి
కామవల్లీ మహాలక్ష్మి కైటభారి
వలపు పాడుచు వచ్చె జక్కుల పురంధ్రి. [30]

ఈ జక్కుల పురంధ్రి పాటననుసరించి ఏడుగురక్కలు ఆవేశమున నొడలు మఱచి వీర నృత్యము చేసిరట. రాయలసీమలో నిప్పటికిని 'జక్కికలు' అను పాటలున్నవి. పిచ్చుకుంట్లు, జంగములు, కొమ్మువారు - మున్నగు గాథాకారులవలె 'జక్కులవారు' మాత్రము నేడు ప్రచురముగా గానవచ్చుట లేదు. వీరు కామేశ్వరీ ఆరాధకులగు వేశ్యాకులమువారని కొందఱు విమర్శకులు భావించుచున్నారు.[31] క్రీడాభిరామమున అగ్నిగుండమున నడచు మైలార వీరభటులు వర్ణింపబడిరి. వీరు నేటి రాయలసీమలో చౌడమ్మను గొల్చు తొగటవీరులవలె నున్నారు. ఇందు స్త్రీలపాటల ప్రసక్తియు గలదు. పూటకూటి యింటనున్న రాయ వితంతువు కోయిల పంచమస్వరముతో తెల్లవారుఝామున విద్దికూచి (కంచి) రామాయణము ఆఱు కాండలును పాడినదట: (చూ. పద్యము-170). తూర్పునాటి గడిడు తటపెట దిమికిట

30. *136వ పద్యము.*

31. ***"Jakkula – Described as an inferior caste of prostitutes, mostly of the Balija caste; and as wizards and a dancing and theatrical caste" -***

***-E. Thurston, Castes and Tribes of South India, Part II, p.438.***

ధ్వనులతో గుమ్మెట వాయించుచు, రాగంబు గుమ్మడించి పాడుచు ఆడుచున్నాడట: (చూ. పద్యము 226). మేదరవాడలో మేదర కరణ వేశ్య ఏకసక్కెముగా నేదైన ఒక మాటాడుచు మాటి మాటికివి పాట పాడుచున్నదట: (చూ. 68వ పద్యము). తెలుగు వీరగాథలలో తఱచుగా వచ్చెడి కోడిపోరు ఈ వీథీరూపకమున మహాద్భుతముగా వర్ణింపబడినది: (చూ. పద్యములు 234-236).

ఈ క్రీడాభిరామమను వీథీరూపకకర్త వినుకొండ వల్లభరాయడని గ్రంథమునుబట్టి తెలియుచున్నది. కాని ఇది శ్రీనాథ కృతమని వేటూరి ప్రభాకర శాస్త్రిగారు సప్రమాణముగా నిరూపించి యున్నారు. ఇది శ్రీనాథ, వల్లభరాయలలో నెవరి కృతమైనను కాలమున మాత్రము మార్పురాదు. ఇరువురును సమకాలికులే (15వ శతాబ్దము).

పోతనగారి కాలమున (క్రీ.శ. 1405-1470) గోవిందుని మీద పాటలు పాడుట, హరి భక్తుల కథలు ఆడుట, స్త్రీలు పెరుగు తరుచుచు పాటలు పాడుట కలదని తెలియుచున్నది.[32]

కొఱవి గోపరాజు (క్రీ.శ. 1450ప్రాంతము) 'వెన్నెల గుడి పాట' పేదల కాత్మ సంప్రీతి నొసగునని చెప్పెను.[33] వెన్నెల రాత్రులలో స్త్రీలు మండలాకారమున తిరుగుచు, చప్పట్లు చఱచుచు పాడెడి పాటనే ఇతడు 'వెన్నెల గుడి పాట'గా పేర్కొని యుండును. ఇవి నేటికిని గలవు. తెలంగాణమున వీనిని'చుట్టు కాముడు పాటలు' అనియు, రాయలసీమలో 'జక్కికి' లనియు పిలుచుచున్నారు.

తాళ్ళపాక అన్నమాచార్యులవారు (15వ శతాబ్దము) తన కాలమున ప్రచారమున నున్న గొబ్బి పాటలు, తందాన పదములు, లాలిపాటలు - ఇత్యాదులను మాతృకలుగా గొని ఎన్నియో కీర్తనలను రచించెను. ఈయన సతీమణి తిమ్మక్క సుభద్రాకల్యాణమను స్త్రీలపాటను రచించెను. ఇంతవఱకును రచనాకాలము తెలిసిన పాటలలో నిదియే మొదటిది.

శ్రీకృష్ణదేవరాయలు (1509-1530) తన ఆముక్తమాల్యదా ప్రబంధమున ఉదయకాలమున పాడబడు 'ఏతాము పాటల'ను పేర్కొనినాడు.[34] పరశురాముని కథలను పాడు బవనీల వాద్యమైన 'జముకును' 'జమిడి' అని పేర్కొనినాడు: (చూ. 4ఆ. - 177ప.). అల్లసాని

---

*32. చూ. ఆంధ్ర మహా భాగవతము, ప్రథమ స్కంధము, 505ప., దశమ స్కంధము 355 ప.*

*33. "పని చేసి గంజియైనను నంబలైనను, నెదచల్లఁగా త్రాగి యెచటనైనఁ*
*బడియుండి వెన్నెల గుడి పాట పాడఁగాఁ, బేదల కాత్మ సంప్రీతి గలుగు"*
*- సింహాసన ద్వాత్రింశిక, నవమాశ్వాసము, 16వ పద్యము.*

*34. "ప్రాతర్వేళల నంధు యంత్ర నతి క్రుత్ప్రోద్గీత గేయౌఘముల్" - ఆముక్త మాల్యద, 2 ఆ. 55ప.*

పెద్దన కవీంద్రుడు మనుచరిత్రలో లక్ష్మీనారాయణుల కల్యాణపు పాటలను ప్రస్తావించినాడు.[35] భట్టరు చిక్కాచార్యులు అను పండితుడు పదములను పద్యములను సమముగా నాదరించిన ఉత్తముడు.[36] ఇతడు తెనాలి రామకృష్ణుని గురువు. మహాకవి ధూర్జటి తన శ్రీ కాళహస్తీశ్వర శతకములో బవనీల ప్రసక్తి తెచ్చినాడు. ఈతని కాలమున బవనీలు తమ వీరగాథా కవిత్వముతో ఊరూరను విజృంభించి, సత్కవీశ్వరులకు చోటు లేకుండ చేసినారట.

శా. ఊరూరన్ బవినీని కాండ్లు కవులై యొక్కొక్కచోఁ గొందఱన్
కేరే మీరును బాణకాదు రనుచున్ గీతాలు బోధింపఁ గా
సారాసార మెఱుంగ లేక మిగులం జౌకయ్యెగా పద్యముల్
జేరం జోటిఁక నేది సత్కవులకున్ శ్రీ కాళహస్తీశ్వరా![37]

దీనినిబట్టి శ్రీ కృష్ణదేవరాయల కాలమున పద్యప్రబంధములే కాక జానపద కవిత్వము కూడ విశేష వ్యాప్తియందున్నదని తలపనగును.

కందుకూరి రుద్రకవి (1550-1580) రచించిన సుగ్రీవ విజయ యక్షగానమున ఎన్నియో రకముల జానపద కవితలున్నవి. దామరల వేంగళ భూపాలుడు (1550-1600) తన బహుళాశ్వ చరిత్రలో జాజర పాటలు (2-13), ధవళములు (4-70), గౌరీ కల్యాణపు పాటలు (4-87) పేర్కొన్నాడు. అనంతామాత్యుని భోజరాజీయమున 'గోవు కథ' యున్నది. ఇది స్త్రీల పాటగా వ్యాప్తియందున్న 'గోవు పాట'ను బట్టి రచింపబడి యుండును. ఇది కన్నడమునను, ఉత్తర హిందూదేశమునను గూడ దేశిసాహిత్యమున వ్యాప్తిగల పాట.

నాయకరాజుల కాలము (17వ శతాబ్దము) గేయరచనలకు స్వర్ణయుగము. నాయకరాజులలోని విజయరాఘవ నాయకుడు ఆంగ్లదేశమందలి ఎనిమిదవ హెన్రీ చక్రవర్తిని పోలినాడు. వీరిరువురు గేయసాహిత్య పోషకులే కాక గేయస్రష్టలును అగుట ముదావహము.

పాలవేకరి కదిరీపతి (1650 ప్రాంతము), దేశి కథలతో 'శుక సప్తతి'యను శృంగార కావ్యమును రచించెను. ఇందు జానపద కవితలయు, గాథాకారులయు ప్రసక్తి మిక్కిలి

---

*35.* *''వేల్పుగాణలు బాడు లక్ష్మీనారాయణుల కళ్యాణంపు బాటలం దీటుకొను తిన్నని రవంబులుం గలసి బలసికొను కోలాహలము'' (5-71)*

*36.* *పద పద్యంబులు చదివిన, విదిలించుక లేచిపోక వేడుక తోడన్*
*దుద రమ్మని యిప్పించిన, బది వేలొక పోకవక్క భట్టరు చిక్కా.*
*-వేటూరివారి చాటుపద్య మణిమంజరి (ప్ర.భా), పుట 18.*

*37.* *శ్రీ కాళహస్తీశ్వర శతకము, 117వ పద్యము.*

యెక్కువగా నున్నది. క్రీడాభిరామము తరువాత జానపద సాహిత్యము నెడ ఎక్కువగా దృష్టిని కేంద్రీకరించిన కావ్య మిది యొక్కటియే. ఇందు కొరవంజియను ఎఱుకలసాని (1-97), చెంచులు (1-244), జంగమురాలు (2-32), గొల్లలు (2-342), బవనీడు(2-414-416). మాతంగి (2-425), మాష్టీడు, జోగి జంగములు, బట్టువారు (4-120), బవనీలు, ఆట పాటలవారు (3-116) వర్ణింపబడిరి. గంగమ్మ (2-76) ఎక్కలి దేవి (2-445), కూనలమ్మ (2-411), చెంగలమ్మ (3-403) అను గ్రామదేవతలు ప్రస్తావింపబడినారు. 'జమిలిక' అను జానపద వాద్యవిశేషము పేర్కొనబడినది (2-415). సువ్వాలలు, శోభనములు, ధవళాలు మొదలగు పాటలు, వీథి నేగెడి ప్రౌఢ విటుడు పాడెడి వింత ఏల పదములు, రాట్నము పాటలు[38] పరశురామునిపై పాట, గొబ్బిళ్ళ పాటలు (2-434), బొమ్మలాటలు, ప్రయాణమున కథలు చెప్పుకొనుట (2-502) - మున్నగునవి యెడనెడ ప్రసక్తములైనవి. ఇందు పరశురామునిపై మాతంగ స్త్రీ పాడిన పాట వీరగాథయని నిశ్చయముగా జెప్పవచ్చును. ఎల్లమ్మ కథలు లేక పరశురాముని కథలు బైనీడివారిచే (ఆసాదులచే) నేటికిని జముకులతో పాడబడుట సువిదితము. ఇందు పరశురాముని పాట పాడు మాతంగ స్త్రీ ఇట్లు వర్ణింపబడినది:

సీ. నునుపుగా దువ్వి తీర్చిన కెంపు బాలేందు
  పసమీఱు నొసటి కెంబసుపు బొట్టు
మెడతోలు పావాలు నిడుద గవ్వల దండ
  సన్నంపుఁ జికిలి దర్శనపుఁ బేరు
నెడమ చేఁ బళ్ళిక నిడిన బండా రవ్య
  పాణిఁబట్టిన నాగపడిగ కోల
కటిఁ గాసె కట్టగాఁ గట్టిన చెంగావి
  నిద్దంపు గుబ్బల నీలి అవికె

---

*38. క. ఆ లలనామణి కాఁగ*
*య్యాళి యొకానొక్క వేళ నక్కఱతో సు*
*వ్వాలు న్శోభనములు ధవ*
*ళాలు న్మొదలైన పాటలం దగ నేర్పున్'' -(1-523).*

*ఒక ఎలజవ్వని ''వీథి నేగెడు ప్రౌఢ విటుఁడు పాడెడు వింత, యేలపదా లట్టె యాలకించు'' చుండెడిదట -(2-172).*

*''శుభవతి'' యను జవ్వనిని జూచి, వరభద్రుడను విటుడు ''వింత పదమువాడి కేకరించి కొన్ని పోకలఁబోయి'' నాడట -(1-516).*

*కాపు కన్నెలు ''ప్రాయంపు పడుచులఁ బనిగొంటివే దూది యనెడి పాటలఁదేనె చినుకులీన'' రాట్నములను వడికిరట -(2-422).*

పదయుగంబున గజ్జెలు బాగు నెఱపఁ
బరశురామునిపైఁ బాటఁ బాడికొనుచు
సొంపు మీఱంగ నెక్కలో జోగటంచు
ముంగిటికి వచ్చి నిలచె మాతంగి యొకతె. -(2-425)

మాదిగస్త్రీలు 'ఎక్కలోజోగు' (ఎక్కలే జోగు) అని అఱచుచు బిచ్చమెత్తుట రాయలసీమలో నేటికిని సర్వసాధారణము. ఎల్లమ్మయే ఈ ఎక్కల దేవియో, లేక కామేశ్వరియే ఈ ఎక్కల దేవియో తెలియుట లేదు. కామేశ్వరి పాటకు 'అక్కల పాట' అను నామాంతరమున్నది. ఏడ్గురు అక్కసెల్లెండ్రలో కడసారపుది కామేశ్వరి. ఈమె కార్గురు అక్కలుండుటచే 'అక్కల దేవి' అని పేరు కలిగినది. 'అక్కల దేవి' శబ్దమే జానపదులలో వికృతి నొంది 'ఎక్కలి దేవి' అయియుండును. ఈ కథాకావ్యమున 'కూనలమ్మ చీర' పేర్కొనబడినది. ఈ కూనలమ్మ కూడ కామేశ్వరి పాటలో వచ్చు పాత్రయే. ఈమె పోతురాజు భార్య. ఏడ్గురక్కలను పెంచి పెద్ద చేసిన స్త్రీ కూనలమ్మ. కూనలమ్మ పదాలు జానపదగేయములలో సుప్రసిద్ధమైనవి. 'కూనలమ్మ చీర' అనగా ఎఱ్ఱని అంచుగల తెల్లచీర. దీనిని ధరించిన స్త్రీలు సంతానవతు లగుదురట.

ఈ శుకసప్తతి కావ్యములో తృతీయాశ్వాసమున 'చెంగలమ్మ' ప్రసక్తమైనది (3-403). చెంగలమ్మ ఒక పేరంటాలు కథ. నెల్లూరు జిల్లాలో వ్యాప్తియందున్నది. భర్తతో సహగమనము చేసి పేరంటాలైనది. (ఈ కథను గూర్చి యింకను పరిశోధింపవలసి యున్నది). యాదవుల కులదైవమగు గంగ గుడివర్ణన కూడ ఈ కావ్యమున గలదు (2-76).

క్రీ॥శ. 1680 ప్రాంతమువాడగు కంచెర్ల గోపన్న (రామదాసు) సరళభాషలో ఎన్నియో భజన కీర్తనలను రచించెను. ఇవన్నియును జానపద గేయములవలె బహుజన ఆదర పాత్రములైనవి. (ఇవన్నియును 'జాతి దేశి' కవితాశాఖకు చెందునని ప్రథమ ప్రకరణమున నిరూపించి యుంటిని).

జానపదుల ఆచారవ్యవహారములను, ఆటపాటలను పట్టియిచ్చు మఱొక కావ్యము 'హంస వింశతి'. ఇది శుక సప్తతికి ప్రతిబింబముగ రచింపబడినది. కర్త అయ్యలరాజు నారాయణామాత్యుడు. ఇతడు క్రీ.శ. 1750 ప్రాంతమువాడు. ఇందు 'కథలు, సుద్దులు, జాతి గాథలు' పేర్కొనబడినవి.

చ. స్తుతులు, ప్రసంగముల్, కథలు, సుద్దులు, వార్తలు, రాచకార్యముల్,
చతురతరేతిహాసములు, శాస్త్రములుం, దగు జాతిగాథలున్,
సతకడము, ల్పురాణములు, సామెతలుం, బరిహాసకంబు, లిం
గితములు, జార జారిణుల కేళి చరిత్రముల న్వచియించుచున్. -(2-43)

ఇందలి 'సుద్దులు' కాటమరాజు కథలు కావచ్చును, 'జాతిగాథలు' వీరగాథలు కావచ్చును, కథలనగా వచనకథలై యుండును.

ఈ హంస వింశతి కావ్యమున కాటమరాజు కథలు పాడెడి సుద్దుల గొల్లలు అతి విపులముగా వర్ణింపబడిరి. ద్వితీయాశ్వాసమున 87వ పద్యమునుండి 91 వ పద్యము వఱకును ఇది కొనసాగినది. అందు సుద్దుల గొల్లల ప్రసక్తి యిట్లుండును:

ఉ. కొమ్ములు వీరణాలు జిగి గుల్కెడు వ్రాఁతల కృష్ణ లీలలం
గ్రమ్ము గుడార్లు వీరుఁడగు కాటమరాజు కథానులాపముల్
బమ్మిన పుస్తకాలు ముఖపట్టిక కట్టు రుమాలలు న్నెఱా
సొమ్ములు నామము ల్వేలయు సుద్దుల గొల్లలు వచ్చి రెంతయున్. - (2-87)

సీ. ఘెళ ఘెళ వీరణాల్ ఖలి పెళి వాయించి
పోటు చో కొమ్ములు నాట నూఁది
దొనకొండ గంగను దొలుత సన్నుతి చేసి
కృష్ణున కతి భక్తిఁ గేలు మోడ్చి
యాదికాలపు గొంగ్ర నందఱిఁ గొనియాడి
తాత తండ్రుల పేళ్ళు దలఁచి పొగడి
బిరుదుల నరుదుగాఁ బేర్కొని మొఱయించి
దీవించి వీరుల త్రోవ లెన్ని

తే. కులము పెద్దల కథ లామికొనఁగఁ జెప్పి
సివము పుట్టించి పుత్రులఁ జెందఁగలరు
వీరులను గొల్వుఁడని తెల్పి వీడు కొల్పఁ
జనిరి సుద్దుల గొల్లలు సంతసిల్లి -(2-89)

కాటమరాజును గంగను కొలుచుటచే సంతానప్రాప్తి యగునని చెప్పబడినది (2-91).

ఈ కావ్యమున తొమ్మిదవ రాత్రి కథలో బహువిధముల వాద్యములు, పలురకముల కులములు చెప్పబడినవి (చూ. 3-29). ఈ వాద్యములలో కొన్ని నేటికిని జానపద గాయకులచే వాడబడుచున్న వీరవాద్యములు. ''గుమ్మెత, తమ్మెట, వీరణ యురుమ, ఒంటికంటి యురుమ, పంబ, జమిడిక, తొప్పెట, జేగంట, చిటితాళములు, చిటికెలు, తంబుఱ, కిన్నెర'' - మున్నగునవి జానపద వాద్యములు. అట్లే ఈ కావ్యకర్త యిచ్చిన కులముల పట్టికలో కొన్ని గాథాకారుల కులములుగా గన్పట్టుచున్నవి. ''భట్టు, తొగట, యెఱుకు, చెంచు, ఏనాది,

వీరముష్టి, మాష్టి, మైలారి, బొమ్మలాటవారు, సూత్ర నాటకులు, కుంద నాటకులు, తెర నాటకపు జంగాలు, తెల్లకోక భక్తులు, శివసత్తులు, బత్తులు, పలునాటి వీరులు, సుద్దుల కుమాళ్ళు, కొమ్మారి దాసళ్ళు, తలిరు దాసళ్ళు, మాతంగులు, మంద పిచ్చులు, పిచ్చుగుంట్లు, రామ గోవిందులు'' అనువారు నాటి గాథాకారులు. ఇట్లే పంద్రెండవ రాత్రి కథలో ''కంచి కావళ్ళ వారు, భైరవ జోగులు, శివరాత్రి జంగాలు'' - అనువారు పేర్కొనబడిరి. వీరందఱును శ్రీశైలము పోవునప్పుడు ప్రత్యక్షమగు గాథాకారులట:

గారఘే మల్లప్ప గంగకు నను కంచి
కావళ్ళ వారును గలసి చనఁగ
గుమ్మెత కిన్నెర ల్గాడి వాయించుచు
భైరవ జోగి వెంబడినె కదల
బసవ గంటలు బృహత్పటు శంఖములు మ్రోయ
శివరాత్రి జంగాలు చేరి కొలువ
... ... ... ... ...
ఆత డేటేట శ్రీశైల మరిగివచ్చు. -(3-188)

ఈ పంద్రెండవ రాత్రి కథలోనే కోడిపందెము లతి మనోజ్ఞముగా వర్ణింపబడినవి. కోళ్ళ జాతులు, రంగులు, ఆకారములు - వీనినిబట్టి వచ్చిన పేర్లు, పెంపుడు పేర్లు, మున్నగున వెన్నియో తెలుపబడినవి. తెలుగులో కోడిపందెములకు వీరగాథలకు అవినాభావ సంబంధమున్నది. కోడి పందెములు కారణముగా అనేక వీరగాథ లుత్పన్నములైనవి. తెలుగునాట కోడిపందెములు ప్రత్యేకముగా పరిశోధింపదగిన అమూల్య జానపద సంపద.

అజ్ఞాతకవి కర్తృకమగు 'చంద్రశేఖర శతకము' న కూడ వీరగాథల ప్రసక్తి యున్నది. ఇది నీతి హాస్య సమ్మిళితమైన శతకము. మంగళగిరి పానకాలస్వామి జాతరలో జరుగు సామాన్య జనుల ప్రసంగము లిందు హాస్యధోరణిలో అనుకరింపబడినవి. ఇందొక పద్యములో బంగారు తిమ్మరాజు కథ, పల్నాటి వీరుల కథలు, నాయకురాలి శౌర్యము ప్రసక్తములైనవి.

ఇంటిని తిమ్మరాజు కత యింటిని యీర్ల కథాప్రసంగముల్
ఇంటిని పాడు లాలి, యిబమింటిని నాయకురాలి శౌర్ర మె
ప్పంటికి నందివాక్యముల పొందు చెరిత్రిన నాకు భాగ్య మె
న్నంటికి గల్గునో యను నవజ్ఞుడు మూర్ఖుడు చంద్రశేఖరా!

-(చంద్రశేఖర శతకము, 32వ పద్యము)

ఆంధ్ర వాగ్గేయకారుల రచనలు కొన్ని జానపద కవితానుకరణములవలె నున్నవి. ఇవి దేశిసాహిత్యమున ఏ వర్గమునకు చెందునో పరిశీలింపవలసి యున్నది. అన్నమాచార్యుడు, రామదాసు, క్షేత్రయ్య, త్యాగరాజు - ఈ నలుగురును కాలానుక్రమమున గేయ రచన అధికముగా జేసిన దేశికవితాభిమానులు. ఈ నల్గురు వాగ్గేయకారులును రెండు ప్రధాన వర్గముల క్రిందికి వత్తురు. అన్నమాచార్యుడు,రామదాసు, ఒక వర్గము; క్షేత్రయ్య, త్యాగరాజు రెండవ వర్గము. ఇందు మొదటి వర్గమువారి రచనలో సాహిత్యము ప్రధానము, సంగీతము ఉపాంగము. దీనికి సరిగా వ్యతిరేకమైనది రెండవ వర్గము. అనగా క్షేత్రయ్య త్యాగరాజుల గేయములలో సంగీతము ప్రధానము, సాహిత్యము ఉపాంగము మాత్రమే. ఇంకను సూక్ష్మముగా పరిశీలించినచో, ఈ నల్వురు వాగ్గేయకారుల రచనలలోను భేదములు కన్పట్టును. రామదాసు తన రచన లన్నియును జానపద గేయములే యని భ్రమపడునంత సన్నిహితముగా సృజించినాడు. అనగా నితని గేయములలో సంగీత సాహిత్యములు రెండును సామాన్యుల కందుబాటులో నుండునట్లున్నవి. అన్నమాచార్యుని సంకీర్తనలు రామదాసు కీర్తనలకన్న భాషాపరముగను, సంగీతపరముగను గూడ కొంచెము ప్రౌఢములు. అన్నమాచార్యుడు కొన్ని జానపద గేయముల ననుకరించెనే కాని, జానపద గేయముల వలెనే వ్రాయలేదు. ఇట్లు రామదాసు, అన్నమయ్యలలో సాహిత్యము ప్రధానము, సంగీతము ఉపాంగము కాగా; క్షేత్రయ్య పదములలో సాహిత్య సంగీతములు రెండింటికిని సమప్రాధాన్య మొసగబడినది. ఇక, త్యాగయ్య కీర్తనలు (కృతులు) క్షేత్రయ్యను గూడ మించిపోయి, సంగీతమే ప్రధానముగను, సాహిత్యము ఉపాంగముగను పరిణమించిన రచనలు. ఈ నలువురు వాగ్గేయకారులను గూర్చి శ్రీ బాలాంత్రపు రజనీకాంతరావుగారిట్లు చెప్పుచున్నారు:

"కీర్తనల్లో మాతురచన ప్రధానముగా ఉండి, ధాతురచన మాతువునకు కవచ మాత్రమైన ఉపాంగముగా ఉండేది. అంటే అన్నమాచార్యాదుల కీర్తనలలో మాటలు ప్రధానములు, వానికి సంగీతం ఒక ఉపాంగం. ఆ సంగీతపు వరుసకూడ అల్లిక జిగి బిగువులు లేని సరళ పద్ధతిలోనే సాగిపోయేది. సంకీర్తనలన్నీ అంతే. రామదాసు కీర్తనలు కూడా అంతే. క్షేత్రయ్య పదాలలో మాటలూ సంగీతపు వరుసా కూడా ప్రాధాన్యం కలిగి మనోధర్మానుగుణమైన భావ ప్రకర్ష కలిగించే పద్ధతిలో రెండింటి రచనా సాగింది. ధాతు కల్పనకు మాతువుతో సమప్రాధాన్యం యిచ్చి, క్షేత్రయ్య చేసిన ప్రాతిపదిక త్యాగరాజాదులనాడు పరిపక్వత చెందింది. త్యాగరాజాదుల కాలంలో కీర్తనల్లో ధాతు కల్పనకు ప్రాధాన్యం హెచ్చింది. అంటే పాటలోని సంగతుల కల్పన ద్వారా సంగీతపు వరుస ఎక్కువ ప్రధానమై, మాటలు మట్టుకు ఉపాంగంగా మారినవన్న మాట."[39]

---

*39. ఆంధ్ర వాగ్గేయకార చరిత్ర, పుట 84.*

దీనినిబట్టి అన్నమయ్య రామదాసుల రచనలు సాహిత్యమున చేరుననియు, క్షేత్రయ్య త్యాగరాజుల రచనలు సాహిత్యమునుండి సంగీతములోనికి తప్పుకొనిన రచనలనియు విశదమగుచున్నది. అన్నమయ్య రామదాసుల కీర్తనలు సాహిత్యమున మార్గ-దేశి విభాగములలో దేశికి చెందును. ఈ దేశిలో 'పామర దేశి, జాతి దేశి, నిబద్ధ దేశి' అను మూడు విభాగము లున్నవని మొదటి ప్రకరణమున నిరూపించితిని. అన్నమయ్య సంకీర్తనలలో కొన్ని జానపద గేయానుకరణములున్నవి. తక్కిన వన్నియును నిబద్ధములే. రామదాసు కీర్తన లన్నియును జానపద గేయముల వలెనే ఉండును. వీనికి బహుజన ఆదరపాత్రతయు గలదు. కాబట్టి ఈ రామదాసు కీర్తనలు జాతి దేశికిని, అన్నమయ్య సంకీర్తనలు నిబద్ధ దేశికిని చెందును (చూ. మొదటి ప్రకరణ మందలి విభజనము).

ఇట్లు గేయముల యొక్కయు, గేయకథల యొక్కయు ప్రసక్తి సాహిత్య గ్రంథములలో నున్నట్లే, దేశి రాగముల ప్రసక్తియు, కొన్ని గేయములు ప్రసక్తియు సంగీత గ్రంథములందును గలవు. భరతుడు తన నాట్యశాస్త్రమున దేశి కవితలను 'ధ్రువా గానములు' గా పేర్కొన్నాడు. ఈ 'ధ్రువా'శబ్ద పరిణామమే 'దరువు'. తెలుగులో నున్న దరువులకు ఈ ధ్రువా గానములే మూలములు కావచ్చును.

మతంగుడు తన 'బృహద్దేశి'లో దేశి రాగములను క్రోడీకరించి, లక్షణనిర్దేశము చేసినాడు. ఇందు 'ఆంధ్రి' అనున దొక దేశి రాగముగా పేర్కొనబడినది. నలుబది రకముల గేయరచనలను గూడ ప్రసక్తికి దెచ్చినాడు. ఇందు 'గాథ, ద్విపది, హంస పదము, క్రౌంచ పదము' - మొదలగునవి కలవు. మతంగుని 'ఆంధ్రి' యను దేశిరాగ ప్రసక్తిని బట్టియు, దేశిరచనల ప్రసక్తిని బట్టియు, క్రీ.శ. 6వ శతాబ్దమునాటికే దేశి సంగీతము, దేశి కవిత్వము తెలుగున వ్యాప్తియందున్నవని తలపనగును.

అభినవగుప్తుడు ప్రత్యేక రాగములలో పాడబడు రాగ కావ్యములను పేర్కొనినాడు. ఆతని కాలమున 'రాఘవ విజయము' టక్కరాగములోను, 'మారీచ వధ' కకుభ రాగములోను పాడబడుచున్నవట.

పాల్కురికి సోమనాథుడు పండితారాధ్య చరిత్ర పర్వత ప్రకరణమున పలురకముల దేశి కవితలను పేర్కొనిన వాడే కాక, మతంగుని కన్న ఎక్కువగా దేశిసంగీతపు ప్రసక్తి కావించిన మహా పండితుడు. దేశిగాన పద్ధతిలోని రాగములు, 108 తాళములు, ప్రబంధములు, ఇతర ప్రదర్శనీయాంశములు, వాద్యచూడాదులు, బృహద్దేశిలో లేనివి కూడ ఉదాహరించినాడు. ఆనాటి తంత్రీ వాద్యముల నన్నింటిని సుమారు 40 వీణాభేదములుగా చెప్పినాడు.

జాయప సేనాని (1213-1262) 'నృత్త రత్నావళి' యను నాట్యశాస్త్ర గ్రంథమున నలుబది విధముల దేశి లాస్య విశేషములను వర్ణించినాడు. శార్ఙ్గ దేవుడు (1200-1247) తన

'సంగీత రత్నాకరము'న వివిధ దేశములలోని గాన పద్ధతులను వివరించినాడు. అందు 'ఆంధ్రి, గౌడి, లాటి'మొదలైన జాతి గానములు నిర్వచింపబడినవి. ఇతడు చెప్పిన 100 రాగ భేదములలో 'ఆంధాళీ' ఒకటి. ఇది ఆంధ్రులకు సంబంధించిన దేశిరాగము కావచ్చును. శార్ఙ్గ దేవుడు దేశి రాగములను 'రాగాంగ, ఉపాంగ, భాషాంగ, క్రియాంగము'లని విభజించినాడు. ఈ దేశిరాగ ప్రభేదములన్నియు నాంధ్రదేశమున గలవనుటకు ప్రజాకవియగు పాల్కురికి సోమనాథుడు ప్రమాణము. అతడు తన బసవ పురాణములో **'సాంగ భాషాంగ క్రియాంగ పటునాటకముల నటియించు'** వారిని పేర్కొనినాడు. (చూ. బసవ పురాణము, వేటూరి పరిష్కృతము, పుట 124).

సోమేశ్వరుని 'అభిలషితార్థ చింతామణి' లో ''కథాషు షట్పదీ'' అని కలదు. కథ చెప్పునప్పుడు షట్పదీ ఛందస్సు నుపయోగింతురని తెలుపబడినది. కావున కథాగేయములు నాడు కలవనుట కిది గట్టి ప్రమాణము.

సంగీత లక్షణ గ్రంథములలో 'చర్చరీ గీతము', 'రాహడీ ప్రబంధము' - అనునవి పేర్కొనబడినవి. ఈ 'చర్చరి' యే జానపద గీతములలోని 'జాజర పాట'; 'రాహడి' యే 'రగడ'.[40] ఇందు చర్చరీ గీతము పాదమునకు పదునాలు మాత్రలతో, బహు పాదములు కలిగి యుండునని తెలుపబడినది. ప్రాకృతములోను, ఆంధ్రాది దేశ భాషలలోను ఎన్నియో చర్చరీ గీతములున్నవని సింహభూపాలుడు వ్రాసినాడు. ఇది వసంతోత్సవమున పాడదగినదిగా తెలియుచున్నది. శ్రీహర్షుని రత్నావళి నాటకములో వసంతోత్సవ సందర్భమున చర్చరీ ప్రశంస యున్నది. ఆంధ్ర భాషలో దేశీయ పదములలోని 'జాజర' అను శబ్దమే 'చర్చరి'గా మాఱినదని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు భావించి, నాచన సోముని 'వసంత విలాసము' లోనిదిగా చెప్పబడు **'వీణా గానము వెన్నెల తేటా, జాణలు మెత్తురు జాజర పాటా'** అనుదాని నుదాహరించిరి.

ఇక, రాహడీ ప్రబంధము వీరరసోచితమైనది. సంగ్రామ రచిత స్తుతి. చరణములు పెక్కు ఉండును. కొన్ని ఉద్గ్రాహములు, కొన్ని ధ్రువములు, చివర ఆభోగము కల్పన చేయవలెను. 'రాహడీ' అను శబ్దము తెలుగు కన్నడములలో దేశిచ్ఛందస్సులలో ప్రసిద్ధమయిన 'రగడ', 'రగళె' అను శబ్దముల రూపాంతరమని పరిశోధకులు నిశ్చయముగా జెప్పినారు. వృషభ గతి, ద్విరద గతి, మధుర గతి, తురగ వల్గనము, హయ ప్రచారము, జయభద్ర, హరి గతి, హరిణ గతి - అను ఏడు రగడ భేదములను అనంతుడు చెప్పినాడు. తెలుగు యక్షగానకర్తలు, గాథాకర్తలు ఈ రగడ భేదములను విరివిగా ప్రయోగించినారు.

---

*40. చూ. బాలాంత్రపు రజనీకాంతరావుగారి, 'ఆంధ్ర వాగ్గేయకార చరిత్ర' పుటలు 70, 71.*

ఇట్లు సాహిత్యమందలి ప్రసక్తిని బట్టియే కాక, సంగీత లక్షణ గ్రంథములలోని ప్రసక్తిని బట్టియు తెలుగు జానపద కవితల ప్రాచీనతా ప్రాచుర్యములు బయల్పడుచున్నవి.

## ఉపలబ్ధ వీరగాథలు

కవిత్వోత్పత్తి, సాహిత్య క్రమపరిణామము, ప్రాచీన భాషలు, శిష్టకవుల గేయ ప్రసక్తి, సంగీత లక్షణగ్రంథముల దేశిరాగ ప్రసక్తి - ఇత్యాదులను బట్టి వీరగాథలు అతి ప్రాచీన కాలము నుండియు గలవని తెలియుచున్నను, ఈ ప్రాచీన వీరగాథ లేవియు నేడు లభించుట లేదు. వీరగాథలు కేవలము మౌఖిక సంప్రదాయోపజీవ్యము లగుటచే పాడువారు ఉన్నంత కాలమే యుండి, వారు నశింపగనే ఇవియు నశించిపోవుచున్నవి. పండితుల యనాదరణము కూడ వీని నాశమునకు దోహద మొనర్చినది. కావున నేడు లభించుచున్న వీరగాథలలో ఎక్కువ భాగము అర్వాచీనము లనియే చెప్పవలెను.

భారతీయ సాహిత్యములలో విదేశములలోవలె గాక మఱి కొంత ప్రాచీనమైన గాథలు లభించుచున్నవి. సామవేద కాలములోనే (క్రీ.పూ. 2500-1500) ఆఖ్యాన గానము వ్యాప్తియందున్నదని సంగీతచరిత్రను బట్టి తెలియుచున్నది. భరతుని కాలమున ధ్రువా గానము (దరువులు), మతంగుని కాలమున దేశిరాగములు ప్రబలియున్నవి. కాళిదాసు కాలమున ఉదయనుని వీరగాథ ప్రజలలో వ్యాపించియున్నది. అభినవగుప్తుడు రాగ కావ్యములను పేర్కొన్నాడు. తమిళమున క్రీ.పూ. వేలకొలది సంవత్సరముల నాటివిగా తలపబడుచున్న సంగపు కృతులలో కొందఱు వీరయోధులను గుఱించి వర్ణింపబడినది. ఇందలి 'జీవక చింతామణి', 'సిలప్పది కారమ్' అనునవి వీరచరిత్రలు. పంజాబీ సాహిత్యమున శాలివాహనుని కుమారులగు 'పూరణ, రిసాలూ' అను సోదరుల వీరగాథలు క్రీ.పూ. నుండియు వ్యాప్తియందున్నవని తెలియుచున్నది. పరశురాముడు కార్తవీర్యార్జునుని జయించుట క్రీ.పూ. 1176లో జరగినదని చారిత్రకులు భావించుచున్నారు. కావున తెలుగులోనున్న పరశురాముని కథలు చాల ప్రాచీనములు కావలెను. కన్నడ సాహిత్యమున క్రీ.శ. 5వ శతాబ్దమునాటి వీర పురుషులను కీర్తించు శాసము లున్నవి. క్రీ.శ. 7-10 శతాబ్దముల మధ్య తమిళ కర్ణాటాంధ్రదేశములలో అనేక శైవభక్తుల గాథలు వ్యాపించియున్నవి. 12వ శతాబ్దము నాటికి సిరియాలుని కథ ఆంధ్రదేశమున ఊరూరను పాడబడుచున్నది. 7వ శతాబ్దము నాటికి చైనీయ వీరుడగు ''చిన్వాంగ్ షిహ్మిన్'' వీరగాథ అస్సామీ భాషలో విశేష ప్రచారమున నున్నదని హ్యూనిత్సాంగ్ సాక్ష్యమిచ్చుచున్నాడు. కావున భారత భాషలలో, ఐరోపా భాషలలోవలె క్రీ.శ. 16వ శతాబ్దమున గాక, క్రీ.శ. 5-6 శతాబ్దముల నాటికే వీరగాథలు వ్యాప్తియందున్నట్లు ప్రబల నిదర్శనము లున్నవి. కాని నేడు ఉత్తర హిందూదేశమున ఉపలబ్ధమగుచున్న గాథలు మాత్రము

15వ శతాబ్దమునకు తరువాతివే. 12,13 శతాబ్దములనాటివి ఒకటి రెండున్నను, ఎక్కువ భాగము 15వ శతాబ్దమునకు పిమ్మట పుట్టినవేయని తెలియుచున్నది.

"Evey-where earliest ballads were considered post-epic in cultural texture. With the exception of the ballads of the type of Rasas, e. g., Prithviraj Rasa and others of Rajasthan and a Panjabi ballad - Vaar of Tuglaq Shah Khushron Khan, which is said to be written by Amir Khusaron (1254 -1325), we hardly come across any narrative bolonging a period prior to 15th century."[41]

తెలుగు భాష క్రీ.శ. 6,7 శతాబ్దములలో సుస్థిర రూపమును దాల్చినదని విమర్శకులు భావించుచున్నారు. అప్పటి నుండియు, జానపద కవిత్వము వెలువడి యుండును. ఇది మాత్రా ఛందస్సులో నుండును. మాత్రాఛందస్సులో నుండు రచనలు కొన్ని ప్రాఙ్నన్నయ యుగ శాసనములలో గన్పించుచున్నవి. శ్రీ దేవరపల్లి వేంకటకృష్ణారెడ్డిగారు క్రీ.శ. ఆఱవ శతాబ్దము నాటి కడపజిల్లా పొట్లదుర్తి మాలెపాడు శిలాశాసములలోని రచన ద్విరద గతి గర్భితమైన రగడ రచనగా నిరూపించి యున్నారు. (చూ. పరిశోధన, 1వ సంచిక, 'తొలి తెలుగుశాసనం - దేశి కవిత' అను వారి వ్యాసము). కావున ఆకాలమున తెలుగులో జానపద కవిత్వము కలదనుటకు ఈ శాసనము చక్కని ప్రమాణమగుచున్నది. 'రగడ' యనగా వీరరసస్ఫోరకమైన రాహడీ ప్రబంధము. కాబట్టి నాడు వీరగాథలు కలవని తలపనగును. అదియునుగాక శాసనములు సాధారణముగా దానధర్మములకును, రణ నిహతులైన వీరుల పరాక్రమములను వర్ణించుటకును వ్రాయింపబడుచుండును. ఇందు వీరుల పరాక్రమములను వర్ణించు శాసనము లొక విధముగా వీరగీతములే యనవచ్చును. ఇంతవఱకును లభించిన తెలుగు శాసనములలో మొట్టమొదటిది 6వ శతాబ్ది చరమ పాదము నందలి ధనంజయుని కలమళ్ళ శాసనము. ఈ ప్రాఙ్నన్నయ యుగ శాసనములు ఛందోబద్ధములే యనియు, రగడ భేదము లనియు, వీనిపై పరిశోధన సల్పిన డా. తంగిరాల వెంకటనారాయణశాస్త్రిగారు నిరూపించియున్నారు. వీరులు చనిపోయినపుడు వారిపై మాత్రాచ్ఛందమున గీతములు వెలువడు సంప్రదాయము తెలుగులో క్రీ.శ. ఆఱవ శతాబ్దము నుండియు గలదని చెప్పవచ్చును.

గుణగ విజయాదిత్యుని ప్రథమ రాజ్య సంవత్సరముకు చెందిన (క్రీ.శ. 848 నాటి) పండరంగని అద్దంకి శాసనము[42] లోని తరువోజ పద్యము వీరగీతమని తలచుట కవకాశమున్నది. ఇది జానపదస్త్రీలు పాడుకొను రోకటిపాటల ఛందస్సులో నుండుట, పండరంగడను వీరుని సాహసములను ప్రశంసించుట - అను కారణములచే దీనిని వీరగీతముగా

41. *Shyam Parmar, 'Ballad singing in India', Folklore, Vol.V, No. 8, August 1964, p.282.*
42. *E.I. XIX, pp.271-275.*

భావింపనగును. సిరియాలుని కథ, పాల్కురికి సోమనాథుని కాలమున ఱోళ్ళ రోకళ్ళ పాడుచుండిరట. అట్లే పండరంగని వీరమును ప్రశంసించు ఈ తరువోజ రోకటిపాటగా నాడు వ్యాప్తియందున్నదేమో!

నన్నెచోడుని కాలమున (1130 ప్రాంతము) అంక మాలికలు, ఊయల పాటలు, ఆలతులు, గౌడు గీతములు, రోకటి పాటలు, ఎఱుకుల పాటలు - వ్యాప్తియందున్నట్లు తెలియుచున్నది. ఇవన్నియును విడి పాటలుగనే తోచుచున్నవి కాని కథనముచేయు వీరగాథలుగా దోపవు. కాని యిందు 'అంక మాలికలు' మాత్రము కథాగేయములు కావచ్చునని శ్రీపాదవా రభిప్రాయపడుచున్నారు.

పాల్కురికి సోమనాథుడు (12వ శతాబ్ది ఉత్తరార్ధము -13వ శతాబ్ద పూర్వార్ధము) పండితారాధ్య చరిత్రలో పంద్రెండు రకముల పదములను పేర్కొనినాడు. ''సంసార మాయాస్తవ పదములు, తుమ్మెద పదములు, ప్రభాత పదములు, పర్వత పదములు, ఆనంద పదములు, శంకర పదములు, నివాళి పదములు, వాలేశు పదములు, గొబ్బి పదములు, వెన్నెల పదములు, సంజవర్ణన పదములు, గణవర్ణన పదములు'' - ఇవన్నియును గూడ శుద్ధ గేయములుగనే తోచుచున్నవి. కాని శ్రీపాదవారు పర్వత పదములు కథాగేయము లనుచున్నారు. నేడు లభించుచున్న తుమ్మెద పదములు, గొబ్బి పదములు, వెన్నెల పదములలో కొన్ని దీర్ఘ కథనము గాక పోయినను, లఘు కథాకథనము చేయుచున్నవి. వీనిని వీరగాథానిక లనవచ్చును. పాల్కురికి పేర్కొన్న పదములలో నిట్టివి కొన్ని యుండవచ్చును.

పాల్కురికి సోమనాథుని కాలమునకు ముందు నుండియు మౌఖిక సంప్రదాయమున ఎన్నియో శైవ వీరగాథలు వ్యాప్తియందున్నవి. ఈ మహాకవి ఆ గాథల నన్నింటిని ద్విపదీకరించి పరిరక్షించినాడు. కాబట్టి, యథారూపమున గాకపోయినను, ద్విపదరూపమున నవి నేటికిని లభ్యమగుచున్నవి. ఇందు 'కుమ్మరి గుండయ్య కథ' వంటి కొన్ని కథలు స్త్రీల పాటలుగా రూపాంతరము చెంది, తెలుగు తల్లుల కోమల గాత్రములలో జీవము పోసికొనుచు నేటికిని నిలిచి యున్నవి. సిరియాలుని కథ, నిజలింగ చిక్కయ్య కథ, రుద్రాక్ష మాహాత్మ్యము, కక్కయ్యగారి కథ - అనునవి కొన్ని నేటికిని జంగములలో ప్రచారమున నున్నవి. కాని యివి పాల్కురికి ద్విపద కావ్యమునుండి అల్లిన రగడలేకాని, సోమనాథునకు పూర్వమునుండియు తెలుగుజాతిలో అలేఖ్య పారంపర్య సంప్రదాయమున వచ్చుచున్న 'పురాతన భక్త గీతార్థ సమితి' లోనివి మాత్రము కావు.

ఊహనుబట్టి పరిశీలించినచో తెలుగు భాష సుస్థిర రూపమును దాల్చినప్పటి నుండియు, అనగా క్రీ.శ. 6,7 శతాబ్దముల నుండియు వీరగాథ లుండి యుండవలెను. ప్రసక్తిని బట్టి, ముఖ్యముగా నన్నెచోడ, పాల్కురికి సోమనాథుల పాటల ప్రసక్తిని బట్టి పరిశీలించినచో, నన్నయకు పూర్వము నుండియు వీరగాథలు కలవని తెలియుచున్నవి. 12వ శతాబ్దము నాటికి

పురాతనములైన భక్తగీతము లున్నవి; సిరియాలుని కథ ఊరూరను పాడబడుచున్నది. కాని అది మనకిప్పుడు అలభ్యము. ఉపలబ్ధములను బట్టియు, చారిత్రక సంఘటనలను బట్టియు, పరిశీలించినచో, తెలుగులో 'పల్నాటి వీరచరిత్ర' యను వీరగాథావృత్తము (Ballad-cycle) ప్రాచీనతమమైనదిగా గన్పట్టుచున్నది. ప్రసక్తిని బట్టి స్త్రీలపాటలలో విద్దికూచి రామాయణము ప్రాచీనమైనను, అది నేడు లభింపకుండుటచే, ఉపలబ్ధములలో తాళ్ళపాక తిమ్మక్క రచించిన సుభద్రాకల్యాణమే ప్రాచీనతమమైనది.

పల్నాటి వీరచరిత్రను ఒకే వీరగాథగా భావింపరాదు. నేను పరిశీలించినంతవఱకును ఇది యిరువది నాలుగు వీరగాథల చక్రము. ఈ అంతర్యుద్ధము క్రీ.శ. 1178-1182 సంవత్సరముల మధ్యకాలమున జరగినదని పండితులు నిశ్చయించినారు. సంఘటన జరగిన వెంటనే వీరగాథ పుట్టుననను సూత్రముచే నిది 12వ శతాబ్దమునాటిదని భావింపనగును. దీని ప్రసక్తి క్రీడాభిరామమున నున్నది. ఈ క్రీడాభిరామమను వీథీరూపకము శ్రీనాథుని రచనయని కొందఱును, వినుకొండ వల్లభామాత్యుని రచనయని మఱికొందఱును భావించుచున్నారు. ఈ యిరువురును సమకాలికులే- (క్రీ.శ. 15వ శతాబ్దము). కావున నిందెవరి కర్తృత్వము నంగీకరించినను, దీని ప్రాచీనతలో మార్పురాదు. కాని దీనికి మాతృకయైనది 'ప్రేమాభిరామ' మను సంస్కృత వీథీరూపకము. రావిపాటి త్రిపురాంతకుడు దీని కర్త. ఇతని కాలము క్రీ.శ. 1290-1330 ప్రాంతము. ఇతడు కాకతీయ ప్రతాపరుద్రుని కాలమువాడు. ఈ రూపక కథావస్తువు కూడ ప్రతాపరుద్రుని పాలనలోని ఓరుగల్లుపుర వర్ణనమే. ప్రతాపరుద్రుని వేశ్య యగు 'మాచల్దేవి' ప్రసక్తి క్రీడాభిరామమున గలదు. (ప్రేమాభిరామ మిపు డలభ్యము).

**ద్వీపాంతంబున నుండి వచ్చితివె? భూదేవా! 'ప్రశాంతం మహా**
**పాపం' సర్వజగత్ప్రసిద్ధ సుమనోబాణాసనామ్నాయ వి**
**ద్యోపాధ్యాయి ప్రతాపరుద్ర ధరణీశోపాత్త గోష్ఠీ ప్రతి**
**ష్ఠా పారీణ నెఱుంగ వయ్యెదవె మాచల్దేవి వారాంగనన్?**[43]

కాబట్టి ఈ రూపక భేదమున ప్రసక్తమైన పల్నాటి వీరకథా గానము శ్రీనాథుని కాలము నాటిదనుట కన్న, ప్రతాపరుద్రుని కాలమునాటి దనుట యెక్కువ సమంజసము. క్రీడాభిరామకర్త రావిపాటి త్రిపురాంతకుని రచన నాంధ్రీకరించెనే కాని, స్వకపోల కల్పితముగా వ్రాయలేదు. కావున ఈ రూపకములోని సంఘటనలు, వర్ణనలు, అన్నియును రావిపాటి త్రిపురాంతకుని కాలము నాటివే. ఇతడు ప్రతాపరుద్రుని సమకాలికుడే కాక ఓరుగల్లు ప్రాంతమువాడు కూడ. కావుననే ఆ పురవర్ణన మంత సూక్ష్మముగా గావించినాడు. ఈ

43. *క్రీడాభిరామము, 180వ పద్యము. ఇటునుండి 189వ పద్యము వఱకును మాచల్దేవి ప్రసక్తి యున్నది.*

కారణములచే పల్నాటి వీరకథలు క్రీ.శ. 13వ శతాబ్ది ఉత్తరార్ధమున ఆంధ్రదేశమున పాడబడుచున్నవని నిస్సంశయముగా చెప్పవచ్చును.

ఈ క్రీడాభిరామమున పల్నాటి వీరకథలతోపాటు పరశురాముని కథలును, జక్కుల కథలును ప్రసక్తములైనవి. ఇవి పల్నాటి కథలకన్న ప్రాచీనములు కావచ్చును. పౌరాణికము లగుటచే సంఘటనా కాలమును నిర్ణయింపలేము. క్రీ.పూ.1176లో పరశురాముడు కార్తవీర్యార్జునుని జయించి, అతని యధీనములోనున్న చేర (కేరళ) రాజ్యమును ఆర్యుల కిచ్చెనని చారిత్రకులు తెల్పుచున్నారు.[44] మలబారులో నేటికిని అమలులోనున్న 'పరశురామ శకము' ఈ పరశురామ యుద్ధకాల నిర్ణయమునకు బలము నిచ్చుచున్నది. కావున పరశురాముని కథలు క్రీ.పూ. నుండియు ద్రావిడ భాషలలో వ్యాప్తియందుండి యుండవలెను. గుణాఢ్యుని బృహత్కథ వ్రాయబడిన పైశాచీ ప్రాకృతమే 'కాల్డ్‌వెల్' ఊహించిన ఆదిమ ద్రావిడ భాషకు మూలమని కొందఱు విమర్శకులు తలచుచున్నారు. ఈ పరశురాముని కథలు కూడ మొదట పైశాచీ ప్రాకృతమున గాని, ఆదిమ ద్రావిడ భాషలోగాని వ్యాప్తియందుండి, క్రమక్రమముగా భిన్న ద్రావిడ భాషలలోనికి వ్యాపించి యుండును. ఈ పరశురాముని కథలు నేటికిని బవనీంద్రు లేక బైండ్లవారు 'ఎల్లమ్మ కథ' లేక 'గౌతు పురాణము' అను పేర 'జముకు'లను వాద్యములతో పాడుచున్నారు. ఈ బవనీల ప్రసక్తి కూడ క్రీడాభిరామమున గలదు. ఈ బవనీలను శ్రీకాకుళము విశాఖ మండలములలో 'బుడ బుడకల వాళ్ళు' అనియు; కృష్ణా, గోదావరీ మండలములలో 'జముకుల వాళ్ళు' అనియు; నెల్లూరు మండలమున 'బైనీడి వాళ్ళు' అనియు; రాయలసీమలో 'ఆసాది వాళ్ళు' అనియు; తెలంగాణమున 'బైండ్ల వాళ్ళు' అనియు వివిధ నామములతో పిలుచుచున్నారు. 'బవనీంద్రు' అనునది శిష్టుల వ్యవహారము.

ఇక పోగా, జక్కుల కథలలో చాలభాగము యక్షగానములుగా పరివర్తితములై యుండ వచ్చును. కాని స్త్రీల పాటలలో 'కామేశ్వరి పాట' లేక 'అక్కల పాట' ఒకటి నేటికిని ప్రచారమున నున్నది. రాయలసీమలో కడపజిల్లా రాయచోటి తాలూకాలో 'అక్కల దేవత కొండ' కలదు. అట నేటేట తిరునాళ్ళు జరుగును. ఆ ప్రాంతమున జానపదస్త్రీలు నేటికిని 'జక్కికలు' అను పాటలను పాడుచున్నారు. ఇవి క్రీడాభిరామ ప్రసక్త పురంధ్రీ గీత సంతానమే కానోపును. తక్కిన గాథాకారులవలె ఈ జక్కులవారు నేడు విరివిగా గానవచ్చుట లేదు. గుంటూరు మండలమునను (తెనాలి), గోదావరీ మండలమునను (పెద్దాపురము) కొన్ని కుటుంబములు కలవని తెలియుచున్నది. స్త్రీల 'అక్కల పాట'తో పాటు, రేటూరి భావయామాత్యుడు రచించిన 'ఆదిలక్ష్మీ విలాస'మను ద్విపదకావ్యము కూడ నేడు లభించుచున్నది. కాని క్రీడాభిరామ జక్కుల పురంధ్రి పాడిన 'కామవల్లి కథ' మాత్రము నేడు లభించుట లేదు.

---

*44. చూ. తెలుగు విజ్ఞాన సర్వస్వము, సంపుటి-1, పుట 316.*

ఏమైనను, తెలుగులో నిశ్చయముగా చెప్పదగిన ప్రాచీన వీరగాథ 'పల్నాటి వీరగాథావృత్తము' మాత్రమే! (అంకమ్మ కథలు అను మఱియొక వీరగాథావృత్తము గూడ పల్నాటి కథలకు సమకాలికముగా గన్పట్టుచున్నది). అట్లని, అంతకు పూర్వము తెలుగులో వీరగాథలు లేవని భావింపరాదు. మనకు లభించెడి చారిత్రకాధారములతో పల్నాటి వీరకథ మొదటిదని చెప్పగలుగుచున్నాము. పరశురాముని కథలు, జక్కుల కథలు అంతకు పూర్వమునుండియు వ్యాప్తియందుండి యుండును. ఇతివృత్తమును బట్టి పరశురాముని కథలు పల్నాటి వీరకథలకన్నను ప్రాచీనములు. కాని నేడు లభించుచున్న పరశురామునికథల రచన అంత ప్రాచీనమైనదిగా తోచుట లేదు. పాల్కురికి సోమనాథుడు తనకు పూర్వకాలమునకు చెందిన కథల నెన్నింటినో పేర్కొన్నాడు. అవి మనకిప్పుడు అలభ్యములు. లభ్యములలో పల్నాటి వీరకథాచక్రమే ప్రాచీనమైనది.

అయినను, ప్రాచీన గాథలు లభ్యము కానంత మాత్రమున వీరగాథలు అర్వాచీనములనుట సాహసము. సాహిత్య క్రమపరిణామమును బట్టి వీరగాథ లత్యంత ప్రాచీనములు కావలెను. ఉపలబ్ధములు అర్వాచీనము లగుటకు అనేక కారణములున్నవి. మౌఖిక సంప్రదాయముపై నాధారపడి జీవించుట చేతను, పండిత గర్హితము లగుట చేతను, మహాకవు లెక్కువగా వీని రచనను చేపట్టక పోవుటచేతను, ప్రాచీన వీరగాథలు నశించిపోయినవి. లభ్యములగు ప్రాచీన గాథలలో సహితము భాష గాయకానుసరణముగను, కాలానుగుణముగను మాఱిపోవుటచే రచనాకాలము ఇదమిత్థమని తేల్చి చెప్పలేకున్నాము. చారిత్రకాంశములు అద్భుత విషయములతోను, అలౌకిక సంఘటనలతోను, ముడిపెట్టబడుటచేత కూడ వీరగాథల కాలనిర్ణయము శశవిషాణ మగుచున్నది. ఆంగ్ల విమర్శకులు సహితము తమ వీరగాథల కాలనిర్ణయ విషయమున సందిగ్ధావస్థలో పడిరి:

"The age of ballads is very difficult to determine, owing to their having been handed down by tradition and therefore more or less adopted to their changing audiences. The fifteenth century is the earliest to which we can positively assign the text of any English ballads. Yet we know that they existed before."[45]

క్రీడాభిరామకర్త శ్రీనాథుడే యనియు, అందు పేర్కొనబడిన పల్నాటి కథలు, పరశురాముని కథలు అతని కాలమునాటివే యనియు భావించినచో, పాశ్చాత్యులవలెనే మనకును క్రీ.శ. 15వ శతాబ్దమునుండి మాత్రమే వీరగాథలు లభించుచున్నవని చెప్పవలసి యున్నది. కాని అంతకుపూర్వము నుండియు వీరగాథలుండి యుండునని ఊహించుటకు అనేక ప్రమాణములున్నవి.

45. *Mrs. Margaret L. Woods, 'Ballads', Essays by Divers Hands, Vol.VI, p.30.*

క్రీడాభిరామము యొక్క ఇతివృత్తము ప్రతాపరుద్రుని కాలమునాటిది. దీనికి మూలమైన ప్రేమాభిరామకర్త ప్రతాపరుద్రుని కాలమువాడు. అందుచే నిందు పేర్కొనబడిన కథలు 13వ శతాబ్ది ఉత్తరార్ధములోనివి. 12వ శతాబ్దమునాటి పాల్కురికి సోమనాథుడును గేయకథలను పేర్కొన్నాడు. అందు ముఖ్యమైనది సిరియాళుని కథ. కాబట్టి తెలుగు సాహిత్యమున క్రీ.శ. 12,13వ శతాబ్దముల నుండి వీరగాథ లున్నవని చెప్పవచ్చును.

లభ్యములగు పాశ్చాత్య వీరగాథలు 15వ శతాబ్దమునాటివి. కాని అంతకు పూర్వము నుండియు ఐరోపా ఖండమున వీరగాథలు కలవనుటలో సందేహము లేదు. అట్లే, తెలుగు సాహిత్యమున 12,13 శతాబ్దమునుండి వీరగాథలు లభించుచున్నవి. కాని అంతకు పూర్వము నుండియే వీరగాథలు కలవనుటలో సందేహము లేదు!!

ఈ ప్రకరణమున చర్చింపబడిన ముఖ్యాంశముల నిట్లు చెప్పవచ్చును. ''భారత దేశమున వీరగాథా సంపదతో తులతూగు ప్రథమశ్రేణి రాష్ట్రములలో మన ఆంధ్రప్రదేశమొకటి. తెలుగులో వీరగాథలు, వీరగాథావృత్తములు, వీరగాథానికలు కోకొల్లలుగా నున్నవి. నన్నెచోడ మహాకవి, పాల్కురికి సోమనాథుడు, క్రీడాభిరామకర్త, 'శుక సప్తతి' కర్తయగు పాలవేకరి కదిరీపతి, 'హంస వింశతి కర్తయగు అయ్యలరాజు నారాయణామాత్యుడు జానపద కవితా ప్రసక్తి నెక్కువగా దెచ్చిన తెలుగు కవులు. క్రీ.శ. 15వ శతాబ్దము నుండి పాశ్చాత్య దేశములలో వీరగాథలు ప్రచురముగా గాన్పించుచున్నవి. కాని అంతకు పూర్వము కూడ వీరగాథలు కలవనుటకు దృష్టాంతములున్నవి. ఉత్తర హిందూదేశమున క్రీ.శ. 12వ శతాబ్దమునాటి 'పృథ్వీరాజ రాసో' అను రాజస్థానీ వీరగాథను, 13వ శతాబ్దము నాటి 'తుగ్లక్ షా ఖుస్రో ఖాన్ వార్' అను పంజాబీ వీరగాథను తప్పించినచో మిగిలిన వన్నియును 15వ శతాబ్దమునకు తరువాతివే. తెలుగులో క్రీ.శ. 12వ శతాబ్దమున 'సిరియాలుని కథ', 13వ శతాబ్ది ఉత్తారార్ధమున పల్నాటి వీరకథలు, పరశు రామునికథలు, విరివిగా పాడబడుచుండినట్లు ప్రబలసాక్ష్యము లున్నవి. ఉపలబ్ధములగు వీరగాథలలో తెలుగున పల్నాటి వీరకథాచక్రమే ప్రాచీనతమమైనది. ఇందలి యితివృత్తము క్రీ.శ. 12వ శతాబ్ది ఉత్తరార్ధమున ( క్రీ.శ. 1178-1182మధ్య కాలమున) జరగిన చారిత్రక సంఘటన.''

* * * * *

ఎనిమిదవ ప్రకరణము

# వీరగాథా లక్షణములు

డాక్టరు బి. రామరాజుగారు, 'జానపద గేయము'లకు ఆఱు ముఖ్యలక్షణములు, నాలుగు ఉపలక్షణములు - మొత్తము పది లక్షణములను దెల్పినారు.[1] రామరాజుగారి మతమున వీరగాథలు కూడ జానపద గేయ మాత్రములే కావున, ఈ లక్షణములను మనము పరిశీలింప వలసియున్నది.

1. జానపద గేయమున కొక ప్రత్యేక కవి యుండడు ('జానపద గేయమునకు రచయిత లేడు')
2. పరిణత లేక నియమిత స్వరూపము లేక పోవుట.
3. గేయరచనా కాల మిదమిత్థమని యుండకపోవుట.
4. (వ్రాత పూతలతో గాక కేవలము) మౌఖిక ప్రచారముననే జీవించుట.
5. సహజ (అకృతక) శైలి.
6. పాడుకొనుటకు వీలుగా నుండుట.

ఈ ఆఱును జానపద గేయముల ముఖ్యలక్షణములు. ఆశు రచనము లగుట, పునరావృత్తి (Refrain) యుండుట, జనసామాన్య పరిచిత వస్తువును కలిగి యుండుట, గేయమంతయు నొక రస ఘుటికగా నుండుట - అను నాలుగును ఉపలక్షణములు.

కాని, వీరగాథలు జానపద గేయములకంటె భిన్నములు. (చూ. 'వీరగాథా నిర్వచన' మను రెండవ ప్రకరణము). అందుచే వీరగాథల లక్షణములును, జానపదగేయ లక్షణములకంటె భిన్నముగా నుండును. కావున, రామరాజుగారు చెప్పిన జానపద గేయ లక్షణములు వీరగాథలకు సంపూర్ణముగా వర్తింపవు. రామరాజుగారు కూడ తెలుగు వీరగాథలలో అతి ముఖ్యములయిన పల్నాటి వీరకథలను, కాటమరాజుకథలను, బొబ్బిలికథను తమ జానపద గేయములలో జేర్చుకొనుటకు ప్రత్యేకముగా 'ప్రమేయము' వ్రాసికొనిరి. దీనికి కారణము, వారు పైన చెప్పిన పది లక్షణములకును ఇవి పూర్తిగా లొంగుట లేదు.

---

*1. చూ. తెలుగు జానపదగేయ సాహిత్యము, పుటలు 15-24.*

ప్రసిద్ధ వీరగాథ లన్నింటికిని రచయితలు తెలియుచునే యున్నారు.[2] తెలుగులో ఒక్క బొబ్బిలివరుసలోనున్న కథలు తప్ప, తక్కిన కథలన్నియును ప్రత్యేక కవి కర్తృకములుగా కన్పట్టుచునే ఉన్నవి. పల్నాటి వీరకథలను శ్రీనాథుడు, మల్లయ్య, కొండయ్య అనుకవులు రచించిరి. కాటమరాజుకథలను శ్రీనాథుడు రచించెనని ప్రతీతి. గంగుల పినయెల్లయ్య, మద్దులేటి, కట్టెబోయిన మారయ్య, కనకబండి ఘట్టయ్య, పల్యా చెన్నయ్య, మంగళపురి వెంకటాద్రి, మల్లయ్య - అను కవులు రచించిన కాటమరాజు కథలు నాకు లభించినవి. పదములు, జంగంకథలు మున్నగు ప్రక్రియల కవులును తెలియుచునే యున్నారు. ఇతర భారత భాషలలోను విదేశములలోను గూడ వీరగాథా రచయితలు తెలియుచునే యున్నారు.[3] కాబట్టి 'జానపద గేయమునకు రచయిత లేడు' అను మొదటి లక్షణము వీరగాథల కన్వయింపదు.

వీరగాథలలో కొన్నింటికి పరిణత స్వరూపము కూడ కలదు. బొబ్బిలివరుసలో నున్న కథల మాట యెట్లున్నను, శక్తికథలు, పల్నాటి వీరకథలు, కాటమరాజు కథలు ద్విపద - మంజరీ ద్విపదలలో స్థిరపడినవని చెప్పవచ్చును. తాళపత్ర గ్రంథములలో వ్రాయబడిన ఈ ద్విపద రచనల నాధారముగా జేసికొని గాయక భిక్షువులు పాడుచున్నారు. ఇవి మొదట ఆయా భిక్షువుల ఆశు రచనలైనను కాలక్రమమున ప్రసిద్ధ కవుల చేతులలోబడి ద్విపద రూపమున స్థిరపడినవి. పదములు, జంగంకథలు - అను ప్రక్రియలుకూడ ప్రత్యేక స్వరూపములతోనే గలవు. కావున జానపదగేయముల రెండవ లక్షణము కూడ వీరగాథల యెడ సత్యము కాజాలదు.

రచనాకాల మిదమిత్థమని చెప్పలేకపోయినను, సంఘటన జరగిన వెంటనే వీరగాథ పుట్టుననుటకు కొన్ని దృష్టాంతములున్నవి. కామమ్మ అగ్ని గుండమున పడబోవుచు తనపై కథ వ్రాయుమని కవిని పిలిచి సత్కరించును. అనగా సంఘటనలోని ప్రముఖవ్యక్తి జీవించి

---

2. *"Ballads that deserve the name had authors and birth dates, though these were lost in oral transmission."*

*-Prof. Louise Pound, The Encyclopedia Americana, Vol.III, p.95.*

3. హిందీ సాహిత్యమున 'రాసో' రచయితలు చాలమంది తెలియుచునే యున్నారు. భారతదేశములో వీరగాథా సంపదలో ప్రసిద్ధికెక్కిన మహారాష్ట్రమున *"Sagan Bhau, Shahir Prabhakar, Patthe Baburao, Ram Joshi"* అనువారు మిక్కిలి ప్రశస్తి కెక్కిన వీరగాథా రచయితలు. ఇంగ్లండులో *"William Elderton, Thomas Deloney, Richard Johnson, Anthony Munday"* మున్నగువారు ప్రసిద్ధ వీరగాథలు రచించిన కవులు. ఇందు ''విలియమ్ ఎల్డర్‌టన్'' చాల గొప్పవాడు. ఇతనిని *"Prince of Ballad-mongers"* అని పిలిచెడివారు. కాని, ఇతడు విపరీతమైన త్రాగుబోతు. క్రీ.శ. 1592లో నితడు తప్పత్రాగి చనిపోయెను. మహాకవి 'గోల్డ్‌స్మిత్' కూడ వీరగాథలు రచించెను. ఇతనిని మన శ్రీనాథునితో పోల్పవచ్చును.

యుండగనే రచనకు అంకురార్పణము జరగినదని తెలియుచున్నది. రెండవ ప్రతాపరుద్రుని కాలమునాటికే పల్నాటి వీరకథలు తెలుగు గుండెల నుజ్జ్వాత లూగించుచుండినవి. క్రీ.శ. 1180లో పల్నాటి యుద్ధము జరగినది. క్రీ.శ. 1291-1323 ప్రతాపరుద్రుని కాలము. నూఱు సంవత్సరములకే ఇంత ప్రచారమునంది, ఆ వీరులు దైవములుగా వీరపూజ లందుకొనుచు, గుడిగోపురములలో ప్రతిష్ఠింపబడిరన్నచో, సంఘటన జరగిన వెంటనే కథలు పుట్టి యుండవలెను గదా! కావున, వీరగాథల రచనాకాలమును గూడ కొంత వఱకూహింపవచ్చును.

రామరాజుగారు 'రసఘుటిక' అను ఉపలక్షణము క్రింద ''జానపదగేయములందును, రసరాట్టగు శృంగారమునకే యగ్రతాంబూలము'' అని వ్రాసిరి. ఇది వీరగాథలకు వర్తించు లక్షణము కాదు. వీరగాథలలో వీరరసమునకే అగ్రతాంబూలము. కరుణాద్భుతరసములకు ద్వితీయ స్థానము. శృంగారరస ప్రధానములైన వీరగాథలు మనకు లేవని చెప్పవచ్చును. ఆశు రచనలను ఉపలక్షణము కూడ వీరగాథలయెడ సంపూర్ణ సత్యము కాదు. బొబ్బిలివరుసలోని వీరగాథలు ఆశువుగా పుట్టినను, తక్కిన వన్నియును ప్రత్యేక కవులచే రచింపబడినవే. వీరగాథల పుట్టుక గాయక భిక్షువుల ఆశుకవనమైనను, నేడు లభించుచున్న వీరగాథలలో ఎక్కువ భాగము శ్రీనాథాది ప్రసిద్ధ కవుల రచనలే!

ఇట్లు రామరాజుగారు చెప్పిన జానపదగేయ ముఖ్యలక్షణములలో మూడును (రచయిత లేడనుట, పరిణత స్వరూప ముండదనుట, రచనాకాలము తెలియదనుట), రసములలో శృంగారమునకే అగ్రతాంబూలమను ఉపలక్షణమును వీరగాథల కన్వయించు లక్షణములు కావు. తక్కినవి - మౌఖిక ప్రచారము, సహజశైలి, పాడుటకు వీలుగానుండుట, పునరావృత్తి, జనసామాన్య పరిచిత వస్తువును గలిగియుండుట - అను లక్షణములు వీరగాథలకు గూడ అన్వయించునట్టివే. ఆశురచనలను లక్షణముకూడ కొంతవఱకును వీరగాథలకు వర్తించును. రామరాజుగారు జానపదగేయములకు చెప్పిన ఈ లక్షణములు వీరగాథలకు గూడ అన్వయించుటకు రెండు కారణములున్నవి. రామరాజుగారు వీరగాథలను జానపదగేయములతో కలిపి సంభావించుట; లక్షణనిరూపణమున జానపదగేయ విమర్శకులతోపాటు, F. J. Child, F. B. Gummere, T. F. Henderson మొదలగు ప్రసిద్ధ వీరగాథావిమర్శకుల అభిప్రాయము లను గూడ ఆధారభూతముగా గ్రహించుట. ఇట్లు గ్రహించుట వలననే రామరాజుగారు ''జానపదగేయము బహిర్వస్తు కవిత్వము (Objective Poetry)'' అని వ్రాసిరి. ఇది వీరగాథా లక్షణము కాని, జానపదగేయ లక్షణము కాదు. జానపద గేయము లన్నియు, ఆత్మాశ్రయ కవిత్వము (Subjective Poetry)నకు చెందినవే. ఆత్మాశ్రయ కవిత్వమగు జానపద గేయమునుండి భావకవిత్వాది ప్రౌఢగేయప్రక్రియలు పరిణమించినవి. పరాశ్రయ కవిత్వమైన వీరగాథలనుండి ఇతిహాసములు పరిణమించినవి.

ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారు జానపద గేయ వాఙ్మయ పరముగా చెప్పిన లక్షణము లించుమించుగ వీరగాథలకు వర్తించునని చెప్పవచ్చును. ''జానపదగేయ వాఙ్మయము గేయరూపమును, అజ్ఞాతకాల కర్తృకమును, కామచార ప్రవృత్తియు, మౌఖిక ప్రచారమును, స్థానిక పరిచిత వస్తుకమును, వ్యావహారిక భాషా ప్రయుక్తమును, సహజ నిరాడంబర శైలీ సంపన్నమును నై యుండును. ఇది సాధారణముగా నాశురచనయై, పదవాక్య పునరుక్తులతో నొప్పుచుండును. ఇది యొక్కొక్కప్పుడు బహుకర్తృకమై యుండుటయు సంభవించును.''[4]

వివిధ కవితాప్రక్రియలకు వలెనే వీరగాథలకును కొన్ని ప్రత్యేక లక్షణములున్నవి.

"The ballads have certain definite characteristics. They have a simple metrical scheme and a fondness for repetitions and stock phrases. They are usually written in dialect, and make great use of the supernatural. The subjects are varied. There are ballads of Magic, of Romance, ... and of History. Occassionally Romance and History are intermingled, and it is not possible to locate the incident related."[5]

పై ఆంగ్లవాక్యములందు కొన్ని వీరగాథా లక్షణములు చెప్పబడినను, అతి ముఖ్యములైన 'గేయస్వరూపము, కథాఖ్యానము, సంగీతాంశము, మౌఖికప్రసరణము, అజ్ఞాతకవి కర్తృకత్వము' అను లక్షణములు తెలుపబడలేదు. 'బ్లిస్ పెర్రీ' (Bliss Perry) అను విమర్శకుడు జనరంజక వీరగాథల (popular ballads) యొక్క నిస్సందేహ లక్షణములను (indubitable characteristics) గూర్చి యిట్లు చెప్పెను;

"They are impersonal. There is no trace whatever of individual authorship. The method of such ballads is purely objective. They do not moralize or sentimentalize. There is little description, aside from the use of set, conventional phrases. They do not "motivate" the story carefully, or move logically from event to event. Rather do they 'flash the story at you' by fragments, and then leave you in the dark. They leap over apparently essential points of exposition and plot structure; they omit to assign dialogue to a specific person, leaving you to guess who is talking. Over certain bits of action or situation they linger as if they hated to leave that part of the story. They make shameless use of "commonplaces", that is, stock phrases, lines or stanzas which are conveniently held by the memory and which may appear in dozens of different ballads. They are not afraid of repetition -- indeed the theory of choral collaboration implies a constant use of repetition and refrain, as in a sailor's

---

*4. ఆంధ్ర వాఙ్మయ చరిత్రము, పుట 152.*

*5. H. Somerville, English Verse from Spencer to Tennyson, p.1.*

"chanty". One of their chief ways of building a situation or advancing a narrative is through "incremental repetition", as Gummere termed it, i.e., the successive additions of some new bits of fact as the bits already familiar are repeated."[6]

పై వాక్యములలో ఇంచుమించుగ వీరగాథా లక్షణము లన్నియును వరుసగా గుది గుచ్చబడినవి. వీనికి ఇతర లక్షణములను కూడ కలిపి, జ్యేష్ఠానుక్రమమున పరిశీలించినచో ప్రతి వీరగాథయందును పది లక్షణములు కొట్టవచ్చినట్లు కనబడును:

1. గేయ స్వరూపము (Lyrical Form)
2. ఆఖ్యానాత్మక ఆకృతి (Narrative Body)
3. గాయక భిక్షువుల ఆశుకవనము, అప్రధాన కర్తృకము
4. మౌఖిక సంప్రదాయము (Oral Tradition)
5. బహుజన ఆదరపాత్రత లేక జనరంజకత్వము (Popularity)
6. పరాశ్రయత (Objectivity)
7. శైలీ సారళ్యము, సాధారణ ప్రయోగములు లేక 'వారానువర్తనములు' ('Commonplaces')
8. అవితర సాధ్యత
9. అద్వితీయ లక్షణము - ఏక సూత్రత
10. నీతిధ్వని - జీవితవిషాద ప్రతిధ్వని

## 1. గేయ స్వరూపము (LYRICAL FORM)

వీరగాథ గేయస్వరూపమున నుండవలెను. అనగా నిది జానపద ఛందస్సున పుట్టి (లేదా వ్రాయబడి) గానయోగ్యముగా నుండవలెను. ఇది ప్రథమ లక్షణము. సరళచ్ఛందము, పునరావృత్తి (Refrain), గానయోగ్యత ఈ గేయస్వరూపములోని ప్రధాన భాగములు.

**1.1 సరళచ్ఛందము:** వీరగాథ మొదటినుండి చివరి వఱకును ఒకే రకమగు ఛందస్సులో వ్రాయబడును. అంతేకాదు, ఒక దేశములోని వీరగాథలన్నియును సాధారణముగా నొకే ఛందస్సు నుపయోగించును. ఇది కూడ వీరగాథల ప్రత్యేకతయే. ఇంగ్లండు దేశమున వీరగాథలన్నియును ఖండరూపము (Stanzaic Form)న నుండును. ఫ్రాన్సు, జర్మనీ, మధ్య యిరోపా, స్కాండినేవియా దేశముల వీరగాథలు కూడ ఇదే ఛందస్సున నున్నవి. వీరగాథలలో ఈ ఖండరూపము ప్రచురముగా నుండుటచే దీనికి 'వీరగాథా ఖండము' (Ballad Stanza) అని

6. *A Study of Peotry, pp.278-280.*

పేరు వచ్చినది. ఇందు నాలుగు పాదములుండును.[7] రెండు పాదముల 'couplets' కూడ కలవు (డెన్మార్కు). తెలుగున గల 'ద్విపద', 'జంపె వరుస' (పదము), 'జంగం రగడ' అను వీరగాథా ఛందస్సులలో రెండు రెండు పాదములకు ప్రాస నియమ ముండుటచే నివి కొంతవఱకును పాశ్చాత్యుల 'Stanzaic Form' ను బోలునని చెప్పవచ్చును. జంగం రగడలో అంత్యప్రాస కూడ ఉండును. జంపె వరుసలో ఆదిప్రాస లేకపోయినను అంత్యప్రాస సాధారణముగా నుండును. డెన్మార్కు దేశములోని వీరగాథల 'couplets' మన ద్విపదను పోలుననుటలో సందేహము లేదు. పైన చెప్పిన దేశములు కాక తక్కిన ఐరోపా దేశములు మాలికాచ్ఛందముల నుపయోగించుచున్నవి. వీనిని 'continuous metres' అందురు. స్పెయిన్ దేశము 'octo syllable' ను, గ్రీకు దేశము 'politic metre' ను, సెర్బియన్ భాష 'deca syllable' ను, రష్యా దేశము విషమ పాదములను (irregular lines) ఉపయోగించుచున్నవి. మన దేశమున గూడ ప్రాచీన కాలమున ద్విపద యెక్కువగా నుపయోగింపబడినను, తరువాతి కాలమున మాత్రాచ్ఛందస్సులలో నుండు రగడలు ఉపయోగింపబడుచున్నవి. ఇవి ఇతర దేశములలోని మాలికాచ్ఛందస్సును పోలును. మంజరీద్విపద కూడ మాలికాచ్ఛందస్సే అనవచ్చును. ఇట్లు వీరగాథలన్నియును ఒకే నిర్ణీతమగు ఛందస్సున వ్రాయబడుట వీరగాథాభివృద్ధికి సూచకము.[8] రష్యా దేశమున వీరగాథలు వచన గీతముల (Free Verse) వలె నుండును. తెలుగులో గూడ 'కుంటి మల్లారెడ్డి కథ' (రెడ్ల పురాణము), 'పోలేరమ్మ కథ' మున్నగునవి లయాత్మక వచనముననే కలవు.

మొత్తముమీద వీరగాథల ఛందస్సులో ఎక్కువ వైవిధ్యముండదు; ఒకే రకముగా నుండును.[9] అందుచే కొందఱు విమర్శకులు వీరగాథల ఛందస్సు యతిప్రాసలు మొరటుగా నుండునని ఆక్షేపించిరి. ఛందస్సు లోపభూయిష్ఠముగా నున్నట్లు పైకి కనపడినను, పాడునప్పుడు చక్కగా సర్దుకొని లయాత్మకముగా శ్రావ్యముగా నుండును. ఛందో లోపములను తంబుఱ శ్రుతియు, డక్కీ తాళమును సరిచేయును.

---

7. *"It characteristically contains fourline stanzas, written in iambics, with the second and fourth lines rhyming (abcb). The rhyming lines are usually six syllables long; the other lines are usually eight syllables long."*
*-The New Century Hand-Book of English Literature, p.86.*

8. *"The adoption of a standard metre is a sign of vigorous balladry" -Chambers's Encyclopaedia, Vol.II, p.73.*

9. *"Ballad metres are almost uniform; the range is very slight; and they can all be reduced to variations of the immemorial verse of four accents."*
*-Francis B. Gummere, The Popular Ballad, p.325.*

**1.2 పునరావృత్తి (Refrain):** వీరగాథలలో ప్రతిపాదము చివరనో, లేదా ప్రతిఖండము (stanza) చివరనో, లేదా అచ్చటచ్చటనో ఒక పదము, లేదా పాదము, పదే పదే వచ్చుచుండును. దీనిని పాశ్చాత్యులు 'Refrain' అందురు. తెలుగున దీనిని 'పునరావృత్తి', 'పాదాంత పదము', 'వంత పదము' (లేక వంత పాట) అనవచ్చును. దీనికి 'మకుటము' అను నాంధ్రీకరణము కూడ అన్వర్థముగా నుండునని ఆచార్య జి. యన్. రెడ్డిగారు అభిప్రాయపడుచున్నారు. వీరగాథలలోని 'తందాన తాన' వంటివి పునరావృత్తులే. దీని క్రమపరిణామమే సంగీత గేయములందలి 'పల్లవి' 'అనుపల్లవి'. ఈ పునరావృత్తి వీరగాథల గేయాంశమును చక్కగా నిరూపించు ముఖ్యాంశము:

"The refrain is an organic part of the ballad; it is of great structural importance; . . . . .It establishes beyond all doubt the lyric and choral origins. Ballads were at first always sung, and always had a refrain."[10]

వీరగాథల ఛందస్సులో పునరావృత్తి ఒక ముఖ్య లక్షణము. ఇది వీరగాథలలో విరళముగాను, వీరగాథానికలలో బహుళముగాను కనబడుచున్నది. ఇతిహాసమునకు దగ్గఱగా నుండు వీరగాథావృత్తములలో ఇది నశించినదనియే చెప్పవలెను. తెలుగులో ''తుమ్మెదా, వెన్నెలా, ఉయ్యాలో, గొబ్బియళ్ళో'' మొదలగు పునరావృత్తులు వీరగాథానికలలోను; ''తందాన తాన, రామరామ, రాయుడా రామన్న రాయుడా, సై సై, భళి భళి, మేలు భళీ'', ఇత్యాదులు వీరగాథలలోను కాననగును. పల్నాటి వీరగాథా వృత్తములోను, కాటమరాజు గాథ వృత్తములోను, ఈ పునరావృత్తి ప్రభావము తగ్గినది. బాహ్యరచనలో వీనిని సూచింపరు కాని, పాడుటలో మాత్రము పల్నాటికథలలో యతిస్థానమునన్ను పాదాంతమునను ''ఆc...!'' అనియు, ''ఓ...చెన్నయ్యా...!'' అనియు వంతలు పాడుదురు. కాటమరాజుకథలలో ''ఆc...!'' ''ఔనే...!'' అను వంత పాటలుండును.

ఈ పునరావృత్తి ఒకప్పుడు అర్థవంతముగను, మఱొకప్పుడు అర్థరహితముగను, ఇంకొకప్పుడు ఎరవు తెచ్చుకొన్నదిగను ఉండును. 'రాయుడా రామన్న రాయుడా - వస్తాదు' (బల్లారి కొండ్రాయుని కథ, సర్వాయి పాపని కథ) అనునది, 'మందలోడా ఓరి మాయలోడా' (మందలోడు కథ) అనునది కథానాయకునకు అన్వయించి అర్థవంతముగా నుండును. 'తందాన తాన' 'గొబ్బియళ్ళో' ఇత్యాదుల కర్థములు చెప్పలేము. Down a down a down a down అనునది, Fa la la la, Fa, la la la ra re అనునది ఆంగ్లములోని అర్థరహిత పునరావృత్తుల కుదాహరణములు. ఆంగ్లమున కొన్ని అస్పష్టముగా అర్థమును సూచించును. కొన్ని కథకు సంబంధించిన స్థల నామములను దెలుపును. కొన్ని ఇంద్రజాల పదములవలె

---

10. *Ibid., pp. 73,74.*

నుండును. మొత్తముపై అర్థరహితములే ఎక్కువ[11]. తెలుగులో వ్యాప్తియందున్న ''భళిరా భళి తమ్ముడా- దాద మేరె దాదా'' అనునది, ''భళానోయి భాయి తమ్ముడా - సై - మేలు భళానోయి దాదానా'' అనునది మరాఠీ భాషనుండి మనకు సంక్రమించి యుండును. ఎట్టి పునరావృత్తియైనను శ్రుతిని లయను చక్కగా నిలిపి, సంగీత సహాయకారిగా నుండు ననుటలో సందేహము లేదు. ఈ పునరావృత్తి పుట్టుకను గూర్చి విద్వాంసు లిట్లు తలచుచున్నారు.

"This refrain often appears to be nonsense, but it probably had some sense originally - it was perhaps meant to represent the sound of musical instruments, or some action on the part of the dancers."[12]

ఆఙ్గ్లమున 'వీరగాథా ఖండము' (Ballad Stanza) లో నాలుగు పాదములుండును. ఇందు 1,3 పాదములలో కథాకథనము, 2,4 పాదములలో పునారవృత్తి వచ్చుచుండును. తెలుగున యతిస్థానమున, పాదాంతమున పునరావృత్తి వచ్చుట పరిపాటి. విడదీసి వ్రాసినచో ఇది కూడ ఆఙ్గ్ల ఖండము వలెనే ఉండును.

ఆఙ్గ్లము : There were three ladies live in a bower
Eh, wow, bonnie!
And they went out to pull a flower
On the bonnie banks O' Fordie. -('Babylon' అను విషాద వీరగాథ)

తెలుగు :

| | |
|---|---|
| మనది యా దేశంబు | ఉత్తరాదియా భూమే అమ్మయ్యా |
| మేలూ భళి! | తందాన తాన! |
| మనది యాదీ భూమి | అందమైన లింగాలపురములోను |
| మేలూ భళి! | తందాన తాన! |
| (-సదాశివరెడ్డి కథ) | (-లక్ష్మమ్మ కథ) |

**1.3 గాన యోగ్యత:** వీరగాథ దేశిచ్ఛందమున నున్నంత మాత్రమున చాలదు. దేశిచ్ఛందమున నున్న పాల్కురికి సోమనాథాదుల ద్విపద కావ్యములన్నియు వీరగాథలు కానేరవు. కాబట్టి వీరగాథ

---

11. *"Many ballads have refrains, some relevant to the story, but most mere non-sense jingles, like 'Down a down a down a down', or 'Fa la la la, fa la la la, ra re'. These may be substitutes for musical accompaniments."*
*-Oxford Junior Encyclopaedia, Vol.XII, p.36.*

12. *Mrs. Margaret L. Woods, Essays by Divers Hands, Vol. VI, p. 27.*

పాడబడవలెను.[13] రచన ఛందస్సు పాడుట కనువుగా నుండవలెను. 'గీ' (= to sing) అను శబ్దము నుండి 'గేయము' ఏర్పడినది. దీనికి 'పాడబడునది' అని యర్థము. ఆధునికగేయములకీ యర్థము లేకున్నను, వీరగాథలు మాత్రము నేటికిని ఈ యర్థమునే కలిగియున్నవి. ప్రసిద్ధ వీరగాథలు అప్పుడును, ఇప్పుడును పాడబడుచునే యున్నవి. కాని నేడు విద్యావంతులు వీనిని చదువుచున్నారు. నాగరకులైన విద్యావంతులకు వీరగాథా పరిచయము ముద్రిత గ్రంథముల వలన మాత్రమే కలుగుచున్నది. (జనపద వాసులైన విద్యావంతులు కొందఱు వీరగాథా గానమును విని యుండవచ్చును). ముద్రణ యంత్రములు వచ్చి వీరగాథలను చంపివేసినవి. ఆ నిర్జీవములను నేడు మనము చదివి తృప్తిపడుచున్నాము. ఇది క్షీణయుగ లక్షణము. పాడబడుట వీరగాథల జీవలక్షణము.

". . . . .It is singing that keeps a ballad alive....."[14]

"Ballads were always sung - are still sung, indeed, when they have remained alive."[15]

సంగీత గేయముల (musical songs) ను పాడుటకును, వీరగాథలను పాడుటకును భేదమున్నది. ప్రతి గేయమందును రెండంశము లుండును. సాహిత్య సంబంధమగు మాటలు, సంగీత సంబంధమగు స్వరము. మాటలను 'మాతువు' అనియు, స్వరమును 'ధాతువు' అనియు పిలుతురు. శుద్ధగేయములను పాడుటలో మాతువుకన్న ధాతువునకే ప్రాముఖ్య ముండును. రాగమే వినబడును కాని, మాటలు సరిగా వినబడవు. వీరగాథల నిట్లు పాడరాదు. ఇందు ధాతువుకన్న మాతువే ముఖ్యము. పాడునప్పుడు ప్రతి అక్షరము అతిస్పష్టముగా వినబడవలెను. అట్లని ధాతువును పూర్తిగా విస్మరింపరాదు.

"(In the musical song) . . . . the accompaniment is predominated by the air to which the words are sung . . . In the ballad, as sung, the words are most important; but it is of vital importance to remember that the ballads were chanted."[16]

వీరగాథలను పాడవలె ననుట సత్యమే కాని, ఈ పాడుటలో గొంతు మంద్రమునుండి తారస్థాయికి ఎత్తినను, ఎక్కువ రాగభేదములను జూపక, ఛందస్సును సూచించు వైవిధ్యముతో

---

13. *"The ballad, of course, like any real lyric, must be sung, it must have a tune, and this tune usually rustic unsophisticated, is provocative as well as reminiscent of accompanying steps. . . . ." -Francis B. Gummere, The Popular Ballad, pp.71-72.*
14. *Prof. Louise Pound, Encyclopedia Americana, Vol.III, p.97.*
15. *G.H. Gerould, 'The Making of Ballads', Modern Philology, Vol. 21, p.24.*
16. *Frank Sidgwick, Introduction, Popular Ballads of the Olden Time .*

మా(త్రమే పాడవలెను.[17] మన పల్నాటి వీరకథలు, కాటమరాజు కథలు ఈ రీతిగనే పాడబడు చున్నవి. ఉచ్చారణ మిక్కిలి పటుత్వముగ నుండవలెను. శబ్దములు తమ అర్థమును తామే వెలువరించునట్లుండవలెను.

"In any case narrative melodies are simpler than lyrical melodies, owing to the paramount importance of making clear every word. Expression is at a discount; the words must speak for themselves."[18]

ఓరుగల్లు నడివీథిలో పడతి పల్నాటి వీరానీకమును గూర్చి పాడునప్పుడు వంతలగు కుమారకులు (ప్రత్యక్షరమునకు ఫీట్కారముతో తూలిరట! దీనిని బట్టి ఆమె (ప్రత్యక్షరమును ఎంత స్పష్టముగా పాడినదో ఊహింపవచ్చును. నేటికిని, పల్నాటివారును, గొల్లసుద్దులవారును తీ(వ్రమైన యుద్ధఘట్టములందు పాడుటను నిలిపి, కవిత్వపఠనము (recitation of poetry) గావింతురు. కాటమరాజుకథలలో భట్టు రాయబార మంతయు నిట్లు కావ్యపఠనముగనే సాగును. కావున వీరగాథలు శబ్ద స్పష్టతతో, నర్థవంతముగా, భావయుక్తముగా, స్వల్పరాగ వైవిధ్యముతో పాడబడునని తెలియుచున్నది.

విదేశములలో వీరగాథలను సేకరించువారు మొదట కేవలము అందలి సాహిత్యమును మా(త్రమే సేకరించుచు వచ్చిరి. సంగీతపు వరుసలను గుర్తింపలేదు. ఇది చాల పొరపాటని తరువాత వారు తెలిసికొనిరి. మౌఖిక (ప్రసరణమున వీరగాథయందలి సాహిత్యముకన్న సంగీతము త్వరగా మాఱిపోవును. ఏ గేయమందైనను 'మాతువు - ధాతువు' (సాహిత్యము - స్వరము) విడదీయరానివిగా నుండును. గాయకుడు ఒకటి విడిచినచో మఱియొకటి జ్ఞాపక ముంచుకొనలేడు. అయినను వీరగాథలను పాడు గాయక భిక్షువులలో పెక్కుమంది కథను బట్టియే వీరగాథలను జ్ఞాపకముంచుకొందురు కాని అందలి స్వరమును బట్టి కాదు. కొందఱు సాం(ప్రదాయక స్వరమును గుర్తుపెట్టుకొనక కథను మా(త్రమే గుర్తుంచుకొని, తమకు పరిచితమైన స్వరములో దానిని గానము చేయుదురు. ఇట్లనేకములగు మార్పులకు కూర్పులకు లోనై సాం(ప్రదాయక స్వరము నశించును. కాబట్టి వీరగాథ యందలి సాహిత్యమును ము(ద్రించి నంత మా(త్రమున చాలదు. అందలి స్వరమును గూడ సంగీత పద్ధతిలో సూచింపవలెను. "The ideal collection of ballads would record all variants of airs as well as texts."[19]

---

17. *"The chief advantage of the singing is to give out each word with greatest clearness. The voice is raised from the normal pitch to a clear high note* and kept *there with only enough variation to mark metre."*

   *- W. J. Entwistle, Chambers's Encyclopaedia, Vol.II,p.73*

18. *Ibid.,*
19. *Prof. Louise Pound, The Encyclopedia Americana, Vol.III, p.97.*

ఈ స్వరప్రాముఖ్యమును మొదట గుర్తించిన విమర్శకులు 'Ludvig Erk', 'Franz Bohme' అనువారు. ఇట్లు స్వరప్రాధాన్యమును గుర్తించిన తరువాత, విదేశీయులు క్రీ.శ. 1840 నుండి తమ వీరగాథలను స్వరసహితములుగనే సంచయనము గావించుచున్నారు. ఇంగ్లండులో నిట్టి దేశిస్వరముల నసంఖ్యాకముగా సేకరించిన మహనీయుడు William Chappel; అమరికాలో Cecil J. Sharp. మన దేశములో మాత్రము సంగీత సాహిత్యములకు అకాడమీలు స్థాపింపబడినను వీరగాథల (జానపద గేయముల) నిర్జీవ సంచయనమే కొనసాగుచుండుట విచారకరము.

"It is necessary to inquire into the connection between words and melodies, for the tune is regarded by the folk-singer as an essential part of the ballad."[20]

స్వరరహితముగా సేకరింపబడిన వీరగాథను చదువగలము కాని, పాడలేము. చదువబడునది వీరగాథ కానేరదు. పాడబడునది మాత్రమే వీరగాథ. కాబట్టి సంగీత - సాహిత్యాంశములను రెండింటిని సేకరించినప్పుడే వీరగాథా సంచయనము సంపూర్ణమగును.

ఒక ప్రత్యేక పద్ధతిలో పాడబడుట వీరగాథా లక్షణమని నిరూపింపబడినది. జానపద గేయములు, స్త్రీల పాటలు, భజన కీర్తనలు, యక్షగానములు, హరికథలు - ఇత్యాది వివిధగేయ ప్రక్రియ లాయా పద్ధతులలో పాడబడుచునే యున్నవి. కాని అంతమాత్రమున వీనిని వీరగాథలని అనలేము[21]. కావున వీరగాథల ప్రత్యేకలక్షణము వేఱొకటి కలదని తెలియుచున్నది.

## 2. ఆఖ్యానాత్మక ఆకృతి (NARRATIVE BODY):

వీరగాథ గేయస్వరూపముననే కాక ఆఖ్యానాత్మక ఆకారమున గూడ నుండవలెను. వీరగాథ యనగా 'గేయాఖ్యానము' (lyrical narrative) లేక 'గేయ కథ' (lyrical story) అనవచ్చును; లేదా 'ఆఖ్యాన గేయము' (narrative lyric) లేక 'కథా గేయము' (story lyric) అనియు పిలువవచ్చును. కొన్నింటిలో కథాఖ్యానాంశము హెచ్చుగానుండి, గేయాంశము తక్కువగా నుండును. మఱి కొన్నింట గేయాంశ మెక్కువగను, కథాఖ్యానాంశము తక్కువగను ఉండును. సాధారణముగా దీర్ఘములగు వీరగాథలలో మొదటి గుణమును, లఘు వీరగాథలలో రెండవ గుణమును గాననగును. కొన్ని లఘు వీరగాథలలో ఈ ఆఖ్యానాంశము మఱింత

20. *G.H. Gerould, 'The Making of Ballads', Modern Philology, Vol.21, p.24.*

21. *"The ballad, of course, like any real lyric, must be sung. . . . . but the same thing is true of many a song utterly foreign to ballad".*
*-Francis B. Gummere, The Popular Ballad, pp. 71-72.*

తగ్గిపోయి, శుద్ధ గేయముల (songs) వలె నుండుటచే, గేయమునకును, గేయకథకును గల భేదము తెలియుట కష్టమగుచున్నది. ఓబులరెడ్డి పాట, గుజ్జాల గోపిరెడ్డి పాట మున్నగున విట్టివే.

ఒక దేశములో గల వీరగాథలలోనే కాక, వివిధ దేశముల వీరగాథలలో సహితము ఈ కథాఖ్యాన ప్రధాన, గేయ ప్రధాన భేదము లున్నవి. రష్యా, స్పెయిన్, యుగోస్లోవియా దేశముల వీరగాథలు కథాఖ్యాన ప్రధానములుగా నుండును. ఫ్రాన్సు దేశములోని వీరగాథలలో గేయాంశము మిక్కిలి యధికము. అందుచే వీనిని ప్రత్యేక నామముతో గాక, జానపద గేయములతో కలిపి వ్యవహరించుటయే, ఆ దేశమున పరిపాటి. కథాఖ్యాన ప్రధానము లైనప్పటికిని, మన తెలుగు వీరగాథలను ప్రత్యేక నామముతో గాక, జానపద గేయములుగనే సంభావించుట విచారకరము.

వీరగాథల కథాఖ్యానాత్మక ఆకృతియను ప్రధాన లక్షణములో - నియమిత పరిమాణము, యథార్థ సంఘటనా జన్యత, దేశీయేతివృత్తము, సామాన్య నాయకత్వము, వీరరస ప్రాధాన్యము, కథాసారళ్యము, హఠాత్ప్రారంభము, సంభాషణా సహితత్వము, వచన రాహిత్యము, విషాదాంతత, అభివర్ధిత పునరుక్తి - అను పదునొకండు ఉపలక్షణము లున్నవి. వీనిని వరుస క్రమమున పరిశీలింతము.

**2.1 నియమిత పరిమాణము:** ఇతిహాసము కూడ కథాత్మకమైనదే. కాని ఇతిహాసములోని కథాఖ్యానమునకును, వీరగాథలోని కథాఖ్యానమునకును భేదమున్నది.[22] ఇతిహాసమునందలి ఆఖ్యానము సుదీర్ఘమై,, అనేక సంఘటనలను వర్ణించునదై యుండును. వీరగాథలోని ఆఖ్యానము తగు మాత్రముగ నుండి, ఒకే సంఘటనను శక్తిమంతముగా వర్ణించును. వీరగాథను చిన్న ఇతిహాస మనవచ్చును. ఇది గేయస్వరూపమున నున్నను, సాధారణ గేయము కంటె పెద్దది. కథాత్మకముగా నున్నను ఇతిహాసము కంటె చిన్నది. ఇతిహాస - గేయముల సమ్యక్ సమ్మేళనము వీరగాథ. అందువలననే T.F. Henderson అను విమర్శకుడు దీనిని "Lyric-epic" అనినాడని తెల్పియుంటిని (చూ. రెండవ ప్రకరణము).

వీరగాథలో ఏక సంఘటనావిష్కృతమైన కథ ఉన్నను, ఆ కథయే వీరగాథకు పునాది యనియు, అదియే సర్వస్వమనియు భావింపరాదు. కేవలము కథవలననే ఇవి మనల

22. *"This story is not a series of adventures, like romantic epic or the Saga. It is just a simple story of one event or adventure".*
*-Mrs. Margaret L. Woods, Essays by Divers Hands, Vol. VI, p.25.*

నాకర్షించుట లేదు. కథను చెప్పు తీరును బట్టి ఆకర్షించుచున్నవి.[23] కథయే సర్వస్వముగా కలవి జానపద వచనకథలు (Folktales). ఇవి కథాఖ్యాన శక్తికి పరమావధులు. వీనిలో కవితాస్పర్శ లవలేశమైనను ఉండదు. అంతయు కథన శిల్పమే. ఇవి సాహిత్యమగును కాని కవిత్వము కానేరవు. వీరగాథలిట్టివి కావు.[24] వీరగాథలో ఒక్క కథ ఉన్నంత మాత్రమున చాలదు. ఆ కథను కవిత్వముతో జోడించి, సంగీతస్పర్శతో రమణీయముగా వెలువరించవలెను. ఐస్‌లాండ్ దేశములోని 'Rimur' అనబడు గాథలు కూడ జానపద వచనకథల వంటివే. ఇవి కూడ సుదీర్ఘములుగా నుండి, మధ్య మధ్య ఆలంకారిక వచనములతో నొప్పుచుండును. కాని, ఇవి ఇతిహాసములవలె బింకమైనవి కావు.[25] వీనిలో వివిధోపాఖ్యానముల సమన్వయముండదు. ఇతిహాసములలో నొక వీరుడు చేసిన అనేక సాహస కృత్యముల వర్ణన ఉండును. అన్ని సంఘటనలు ఆ వీరునివే కావున వానియన్నింటను ఒక చక్కని సమన్వయముండును. ఐస్‌లాండ్ 'Rimur' కొంతవఱకును 'ఫేరోస్' (Faeroes) వీరగాథలను పోలియుండును. కాని 'ఫేరోస్' వీరగాథలు దీర్ఘములైనను వీరగాథాలక్షణముల నెక్కువగా గలిగియున్నవి. 'రిమూర్'కు ఈ లక్షణము లేవియు లేవు. ఇవి వీరగాథలు కావు కాని, ఐస్‌లాండ్ దేశమున వీరగాథలు లేని లోపము నివి తీర్చినవి; అంతే!

వీరగాథల కథాకథనమును మధ్యయుగమున విజృంభించిన అద్భుత కాల్పనిక కావ్యముల (Romances)తో సహితము పోల్పరాదు. ఈ కాల్పనికములందు సంఘటనలకు 'అంతూ పొంతూ' ఉండదు. రచయిత తన మనస్సునకేది తోచిన నది వ్రాసివేయును. కథాకథన మొక నిశ్చయాశయము లేకుండ దేశద్రిమ్మరివలె సాగిపోవును. వీరగాథ లిట్టివి కావు. కథాకథనము నాతి దీర్ఘముగా నుండుట, ఒక సంఘటనకు అంటిపెట్టుకొని యుండుట వీరగాథల సాధారణ లక్షణము.

కాని, ఫేరో (Faeroe) ద్వీపములలోని వీరగాథలు మాత్రము ఈ లక్షణము నతిక్రమించినవి. ఐస్‌లాండ్ ప్రజల వలనే ఈ ఫేరోద్వీపవాసులును అతిదీర్ఘములైన కథలకు

23. *"The greatest ballads affect us not by the story itself but by the way in which the story is told; and this "way" is not narrative art at high pitch. Narrative art at high pitch we get in the prose Sagas of Iceland; they are literature, literature "just on the autumnal verge." -Francis B.Gummere, The Popular Ballad, p.69.*

24. *"Ballads rest primarily on situation and deed of familiar, imitable type; the popular tale, untrammeled by rhythmic law, by choral conditions, tends to a more subtle motive, a more striking fact, a more unexpected memorable quality, and a more intricate coherence of events." -Ibid., p.70.*

25. *"But the Rimur are not strong as epic poetry. Apart from their too ornamental style, they are wanting in the narrative unities." -W.P.Ker, On the History of the Ballads, P.B.A., Vol.IV, 1909-1910, p.202.*

మోజుపడుదురు. ఈ ఫేరోస్ (Faeroes) వీరగాథలలో పుస్తకములనుండి తయారు చేసినవి కొన్ని, ప్రజలు స్వయముగా అల్లినవి కొన్ని గలవు. ఇంత దీర్ఘములైనను ఇవి కాల్పనిక కావ్యములుగా కాని, 'రిమూర్'గా కాని మారిపోలేదు. వీరగాథలుగనే నిలిచియున్నవి. ఏలయన, 'నాతి దీర్ఘత' అను వీరగాథా లక్షణము లోపించినను, గేయస్వరూపము, నృత్యసంప్రదాయము వంటి ముఖ్య లక్షణము లిందున్నవి. 'నాతి దీర్ఘత' అను లక్షణమునకు మాత్రము ఫేరోస్ వీరగాథలు అపవాదమని చెప్పవచ్చును. కాని ఇట్టి అపవాదములు వీరగాథా నిబంధనను అతిక్రమింపలేవు.[26] ఒకే ఒక సంఘటనను వర్ణించుట వీరగాథా నియమము.

కాబట్టి, వీరగాథలోని కథాకథనమునకును; ఇతిహాసము, జానపద వచనకథ, అద్భుత కాల్పనిక కావ్యము, ఐస్‌లాండ్ 'రిమూర్' - మున్నగు వానిలోని కథాకథనముకును మిక్కిలి భేదమున్నది. వీరగాథాఖ్యానమునకు రెండు ప్రధాన లక్షణములున్నవి:

"The essential thing . . . is, first, the conception of the story, and next, the proportion of it. The story must be either tragic or, if not that, momentous in some way; it must have a situation, it must work to some point. .... Again, they are all short poems, they rarely amplify or go into details, they have no disgressions."[27]

ఇతిహాసములకు గాని, కాల్పనిక కావ్యములకు గాని లేని గేయసౌందర్యము వీరగాథల కున్నది. ఇవి కథాఖ్యాన లఘుత్వ విషయమున 'heroic lays' అనబడు ప్రాచీన వీర కావ్యములను బోలును. ఈ 'lays' అన్నింటను ఇతిహాసములవంటివే కాని, లఘుత్వము, ఒకే ఒక సంఘటనా వివరణము ఇందు ముఖ్యము. ఇదియే వీరగాథా లక్షణము కూడ.[28] కాని 'వీరకావ్యము' (heroic lay) ప్రౌఢకవి కృత్రిమ సృష్టి, చేతనా శిల్పము. వీరగాథ జానపదుల ఆశుకవనము, సరళము, అచేతనా శిల్పము. వీరకావ్య ప్రక్రియ తెలుగులో ప్రాచీన సాహిత్యమున ఎక్కువగా కానరాదు. అందుగుల వెంకయ్య (1630) 'నరపతి విజయము' లేక 'రామరాజీయము'; కుమార ధూర్జటి (1650) 'కృష్ణరాయ విజయము' ప్రాచీన వీరకావ్యముల కుదాహరణములు, రాణా ప్రతాపుని పైనను, శివాజీ పైనను కొందఱాధునిక కవు లిట్టి ప్రక్రియలను వెలయించిరి. ఈ వీరకావ్యము లన్నియు కథాఖ్యానమున వీరగాథలను పోలును.

---

26. *"But these exceptions do not alter the rule, and the rule is that the ballad, like the older heroic lays, shall have a plot, shall not wander from it, shall not expand it, shall not be large or long." -Ibid.*

27. *Ibid., p.201.*

28. *"The ballads, with all their difference of scale and method, are like the true 'heroic poem' in the essence of their plots." -Ibid., pp. 202,203.*

ఈ కథాఖ్యాన లఘుత్వమునకు తెలుగు వీరగాథలలో చక్కని ప్రమాణమున్నది. గాథాకారు లీ ప్రమాణమును 'రాత్రి' అందురు. వీరగాథాలను గానము చేసెడి భిక్షువులు ఏ కథనైనను ఈ 'రాత్రి' ప్రమాణముతోనే చెప్పుదురు. ఉదా॥ బొబ్బిలి యుద్ధము - 'మూడు రాత్రుల కథ'; లక్ష్మమ్మ కథ -'రెండు రాత్రుల కథ'; చిన్నమ్మ కథ -'మూడు రాత్రుల కథ'. రాత్రి 8-9 గంటల మధ్య ప్రారంభింపబడిన వీరగాథ 12-1 గంటల మధ్య పూర్తియగుచో దీనిని 'ఒక రాత్రి కథ' అందురు. అనగా సుమారు 4-5 గంటల కాలము పాడబడునది 'ఒక రాత్రి' యని చెప్పవచ్చును. తెలుగు వీరగాథలలో నెక్కువ భాగము 4,5 గంటల కాలము పాడబడునట్టివే. మూడు గంటలలోనే పూర్తియగు గాథలు (సర్వాయి పాపని కథ వంటివి) తక్కువ. నేను పరిశీలించినంత వఱకు, ఒక గంట కాలములో గాథాకారుడు 200 ద్విపద పంక్తులు పాడుచున్నాడు. కావున 'ఒక రాత్రి కథ' యనగా '800-1000' పాదము లుండునని చెప్పవచ్చును. రెండు మూడు రాత్రుల కథను పాడునప్పుడు, కథాఖ్యానమును గాథాకారుడు తన యిష్టము వచ్చిన చోట హఠాత్తుగా నిలిపి వేయడు. మొత్తము కథను చక్కగా విభజించుకొని ఉచిత స్థలములందే నిలుపుచుండును. ఉదాహరణమునకు - చిన్నపరెడ్డి కథ రెండు రాత్రుల కథ. కథానాయకుని పుట్టుక, అన్నదమ్ములు, సాహసములు వర్ణించి, అతడు మైసూరు పోయి యెద్దులను కొని తెచ్చువఱకును మొదటి రాత్రి కథ. కోటప్పకొండ తిరునాళ్ళలో పోలీసులతో ఘర్షణ, మద్రాసుపోయి గుఱ్ఱమును కొని తెచ్చుట, పోలీసులాతనిని మోసగించి బంధించుట, ఉరిశిక్షను కోరుకొనుట రెండవరాత్రి కథ. తెలుగు వీరగాథలు సాధారణముగా రెండుమూడు రాత్రుల కథను మించియుండవు. ఈ పరిమాణమును మించినచో నది వీరగాథావృత్తమగును కాని వీరగాథ కానేరదు. పల్నాటి వీరకథలు, కాటమరాజు కథలు, పరశురాముని కథలు వీరగాథా వృత్తములే కాని ఏక కథలు కావు.

కనీసము ఒక రాత్రి కథయైనను లేనిదే వీరగాథ కానేరదు. అనగా నాలుగైదు గంటల కాలము పాడుట కనువుగా నుండవలెను. ఒక గంటలోపల పూర్తియగు కథలున్నచో వానిని 'వీరగాథానికలు' లేక 'లఘు వీరగాథలు' అనవలెను కాని, వీరగాథ యనరాదు. ఆ లఘు వీరగాథలను జంగములు పగటివేళ బిచ్చమెత్తుకొనునప్పుడు పాడుచుందురు. వీరగాథలు సాధారణముగా రాత్రివేళలోనే పాడబడుచుండుటచే జానపదులు 'రాత్రి'యను ఈ ప్రమాణము నేర్పఱుచుకొని యుందురు. రామాయణములోని కాండలు, భారతములోని పర్వములు, భాగవతములోని స్కంధములు, ప్రబంధములలోని ఆశ్వాసములు, వచన కావ్యములలోని అధ్యాయములు ఎట్టివో వీరగాథలలోని 'రాత్రులు'ను అట్టివే! ఈ రాత్రి ప్రమాణము తెలుగు వీరగాథాకవిత్వమున నొక ప్రత్యేక లక్షణము. విదేశములలో ఇట్టి ప్రమాణ మున్నట్లు కానరాదు. అందుచేతనే పాశ్చాత్య విమర్శకులు వీరగాథల ఆఖ్యాన లఘుత్వమును తెలుపుటకు అనేకములగు ఇతరాఖ్యాన ప్రక్రియలతో పోల్చి తలలు బ్రద్దలు కొట్టుకొనిరి.

**2.2 యథార్థ సంఘటనా జన్యత:** స్వల్పముగానున్న పౌరాణికములను, కల్పితములను తప్పించినచో, వీరగాథలు సాధారణముగా యథార్థ సంఘటనల నుండియే పుట్టునని చెప్పవచ్చును. ఇట్లు పుట్టిన గాథలలో మొదట ఏ విధమగు కల్పితములును ఉండవు. సంఘటన జరగిన వెంటనే వీరగాథ పుట్టును. ఆ సంఘటనను కన్నులార చూచిన వార లనేకు లుందురు. భిక్షువులు ఆ సంఘటనను పాడుచుండగా వీరు వినుట సంభవించును. వీరిని దృష్టిలో నుంచుకొనుట వలన కూడ గాయకుడు కల్పితముల నందు ప్రవేశపెట్టడు. కాని కాలము గడచిన కొలది, ఆ వీరుని యందలి భక్తి గౌరవములచేత కొన్ని అలౌకిక విషయములను ప్రవేశ పెట్టుదురు. ఇట్టి కల్పితము లొకటి రెండున్నను, మొత్తము మీద మూల సంఘటన మాత్రము యథార్థముగా జరగినదే.

**2.3 స్థానికేతివృత్తము:** వీరగాథల ఇతివృత్తములు యథార్థ సంఘటనా జన్యములే కాక, స్థానికములై కూడ నుండును. సంఘటన ఒకచోట జరగగా, వీరగాథ పుట్టుక వేఱొకచోట ఉండదు. సంఘటన జరగిన ప్రాంతమందే వీరగాథ పుట్టును. స్థానికముగానే ఇది మొదట ప్రచారము నందును. క్రమక్రమముగా దేశమంతటను వ్యాపించును. కొన్ని స్థానిక కీర్తితోనే ఆగిపోవును. తెలుగు వీరగాథలలో బొబ్బిలి కథ, దేశింగురాజు కథ, బాలనాగమ్మ కథ, కాంభోజరాజు కథ, లక్ష్మమ్మ కథ, కామమ్మ కథ మున్నగునవి కొన్ని దేశమంతటను వ్యాపించినను, పెక్కు వీరగాథలు స్థానిక కీర్తి పరిమితములుగనే ఉండిపోయినవి. జగపతిరాజు కథ విశాఖ, గోదావరీ, కృష్ణామండలములందు మాత్రమే వినిపించును. కండెపు సుబ్బయ్యగారి కథ కృష్ణామండలమునకు మాత్రమే పరిమితము. నారసింహారెడ్డి కథ రేనాటికి పరిమితము. సదాశివరెడ్డి కథ, బల్గూరి కొండ్రాయుని కథ, మియాసాబ్ కథ మున్నగునవి తెలంగాణమును దాటి బయటకు రాలేదు. తెలుగులో అతి ప్రసిద్ధములైన పల్నాటి వీరకథలు కూడ పరిమిత ప్రఖ్యాతములే యని చెప్పవలెను. గుంటూరు, కృష్ణా, నెల్లూరు మండలములలో మాత్రమే ఈ గాథాచక్రము గానము చేయబడుచున్నది. ఆంధ్రదేశమంతటను వ్యాపించిన బొబ్బిలి కథాదులకు కూడ ప్రశస్తమగు ప్రతులు ఆయాప్రాంతములందు మాత్రమే లభించును. ప్రశస్తమగు బొబ్బిలి కథను సేకరించుటకు శ్రీకాకుళ మండలమున కేగవలెను. ప్రశస్తమగు చిన్నమ్మకథా సంపాదనమునకు అనంతపుర మండలమున ప్రయత్నింపవలెను. సిసలైన కాటమరాజు కథలు కనిగిరి సీమలోనే లభించును.

ఇట్లు స్థానికేతివృత్తము లెక్కువగా నున్నను, వీరగాథాకవి చరిత్రనుండియు, పురాణములనుండియు, జానపద వాఙ్మయము (Folklore) నుండియు, ఇతివృత్తములను గ్రహించుట కలదు. ఇతివృత్త మెట్టిదైనను అది సంఘముయొక్క ప్రాథమికానుభవమును

సూచించును. J. Kinsley అను విమర్శకుడు వీరగాథల యితివృత్తమును గూర్చి యిట్లు చెప్పినాడు:

"The material with which the ballad poet works is the basic experience of the community; he draws upon local or national history, pseudo history, legend and supernatural folklore; and his tales are of adventure and war, love, the supernatural and to a lesser extent religious persons and events."[29]

ప్రాంతీయ వీరుని సాహసాద్భుత కృత్యములను, విషాద మరణమును వర్ణించు వీరగాథ లెక్కువ. ధైర్యశాలియగు వీరుని మరణము, విధి కన్న మానవుడు బలవంతుడని తెలియజేయును. కొన్నిటిలో అతిక్రూరమగు ప్రతీకారమే న్యాయనిర్ణయముగా సూచింపబడును.[30] ఈ వీరగాథలలోని వీరులు సాధారణముగా చరిత్ర ప్రసిద్ధి కెక్కిన వారుగా నుండరు. ఆయాప్రాంతీయ ప్రశస్తి గలవారు మాత్రమే. రాజకీయములు, దేశచరిత్రలు జానపదుల కతీత విషయములు. కావున చారిత్రక వ్యక్తులపై వీరగాథ లేర్పడుట సక్రుత్తు; అసలిట్టి గాథ లేర్పడవనియే చెప్పవచ్చును. ఆంధ్రదేశములో రుద్రమదేవి, శ్రీకృష్ణ దేవరాయలు, తిమ్మరుసు, కుమ్మరిమొల్ల, వీరేశలింగలు, పొట్టి శ్రీరాములు మున్నగు వారిపై బుఱ్ఱకథలు వ్రాయబడినవి కాని, సాంప్రదాయక వీరగాథలు పుట్టలేదు. (బుఱ్ఱకథలు వీరగాథలు కావు; వీరగాథల కనుకరణములు మాత్రమే!). కోయ ప్రజలతో కలిసి బ్రిటిషు ప్రభుత్వముతో పోరాడిన తెలుగువీరుడు అల్లూరి సీతారామరాజుపై కూడ ఇంతవఱకును సాంప్రదాయక వీరగాథ పుట్టలేదు.[31] (బుఱ్ఱకథ సాంప్రదాయక వీరగాథకాదని మొదటనే మనవి చేసితిని). ఏలయన, రాజకీయ విషయములు సామాన్యప్రజల కందుబాటులో నుండవు. స్వాతంత్ర్యోద్యమములో బయలుదేరిన ''మాకొద్దీ తెల్లదొరతనము'' వంటి పాటలు జానపద గేయములవలె మిక్కిలి ప్రచారము నందినను, అవి జానపద గేయములు కానేరవు. ఈ పాటలలో భాష, వరుస జానపద గేయములవలె నున్నను భావశబలత మిక్కిలి యెక్కువ. ఇవి పామరుల కొఱకు పండితులు వ్రాసినవి. పామరులలో సహజముగా పుట్టిన పాటలు కావు. పామరులకు రాజకీయముల గోల

29. *Cassell's Encyclopaedia of Literature, Vol.I, p.40*

30. *"The ballad maker, like the Saga maker, loves those of heroic death which show the virtue of courage raised to its highest -- man rising superior to fate. Where possible they like to show justice done -- most probably the wild justice of revenge."*
*-Mrs. Margaret L. Woods, Essays by Divers Hands, Vol.VI, p.34.*

31. విశాఖ తూర్పుగోదావరీ మండలారణ్యములలో వసించు కోయలలో నొక చిన్న గేయము వ్యాప్తి యందున్నదని శ్రీ వడాల రామారావుగారు తెలుపుచున్నారు. ఇది సత్యముగుచో అది వీరగాథానిక *(Balladling)* అగును కాని, వీరగాథ కానేరదు.

పట్టరు. స్థానికచరిత్రలే జానపదుల కథావస్తువులు. పల్నాటి యుద్ధము, కాటమరాజు యుద్ధము కూడ పెద్ద పెద్ద చారిత్రక యుద్ధములు కావు. చిన్న చిన్న అంతర్యుద్ధములు (civil wars). పశుసంబంధమగు కొట్లాటలు (cattle raids) మాత్రమే. ఇంగ్లండు, డెన్మార్కు దేశములలోని వీరగాథలలో సహితము సామాన్యులే నాయకులగుచున్నారు.[32]

ఇట్లు స్థానికేతివృత్తముతో జనించిన వీరగాథలు ఒక వీరుని చుట్టును వలయముగా వ్యాపించుట కలదు. అనగా నొక ప్రసిద్ధ వీరుని ఆధారముగా జేసికొని అతని సాహసములపైనను, అతని బంధువర్గముపైనను వీరగాథలు వ్యాపించును. ఇట్టివానిని 'వీరగాథా వృత్తములు' లేక 'వీరగాథా చక్రములు' (Ballad - cycles) అందురని నిర్వచన ప్రకరణమున దెల్పియుంటిని (చూ. వీరగాథా నిర్వచనమను రెండవ ప్రకరణము). ఆంగ్లమున రాబిన్‌హూడ్ వీరునిపై నిట్టి వృత్తమున్నది. మన తెలుగులో బ్రహ్మనాయడను వీరుని ఆధారముగా జేసికొని సుమారు 24 గాథలు వ్యాపించి యున్నవి. ఇవి చెన్నకేశవస్వామి నాధారముగా జేసికొని ప్రభవించిన వనియు జెప్పవచ్చును. పల్నాటి వీరుల కులదైవము చెన్నకేశవుడే. అందుచేతనే గాథాకారులు ఈ కథలను ''చెన్నుడి కథలు'' అని పిలుచుచున్నారు. 'పల్నాటి వీరకథ' లనుట అర్వాచీన వ్యవహారము. ఈ వీరగాథల నన్నిటిని కలిపి 'పల్నాటి వీరగాథా వృత్తము' లేక 'పల్నాటి వీరకథా చక్రము' అని పిలువవచ్చును. అట్లే కాటమరాజు నాధారముగా జేసికొని ముప్పది రెండు వీరగాథలు యాదవ గాథాకారులలో వ్యాపించియున్నవి. వీనిని 'యదుశాస్త్రము', 'యాదవ భారతము', 'కాటమరాజు కథలు' - అను పేర్లతో పిలుచుచున్నారు. యాదవుల కులదైవము గంగయగుట చేతను, ఇంచుమించు ప్రతి వీరగాథలోను ఈమె ప్రసక్తి వచ్చుట చేతను కాటమరాజు కథలను 'గంగ కథలు' అనియు పిలువవచ్చును. ఇవి కూడా వీరగాథావృత్త మగుచున్నవి. (ఇట్లు సన్నిహిత ముగా నుండు అనేక వీరుల కథలను సంస్కృతాలంకారికులు ''పురావృత్తము'' అందురు. మహాభారతము పురావృత్తము). ఈ గాథావృత్తములు క్రమక్రమముగా ప్రౌఢకవుల చేతులలో పడి, ఇతిహాసములుగా పరిణమించుటయు గలదు. ఇది పెక్కు సాహిత్యములందు కానవగు సత్యము.[33] ఇట్లు స్థానికవీరుని ఆధారముగా జేసికొని, పెక్కు వీరగాథలు పుట్టి, వృత్తములుగా నేర్పడుట కూడ వీరగాథాలక్షణమే. వీరగాథావృత్తములు ఇతిహాసములకును, వీరగాథానికలు జానపద గేయములకును దగ్గఱగా నుండును.

---

32. *"In English and Danish ballads the leading characters are of noble stock, not the highest nor yet the lowest. In the foreground are heroes of adventure, fights, forays."*
*-Prof. Louise Pound, The Encyclopedia Americana, Vol.III, p.96*

33. *"The tales of war in many literatures grouped about a single heroic figure; and they can rise to epic grandeur of tone, notably in the superb heroic cycle of Serbian ballads celebrating the national tragedy of Kossovo(1383)."*
*-J.Kinsley, Cassell's Encyclopaedia of Literature, Vol.I, p.40*

కొన్ని చారిత్రక వీరగాథలలో కల్పనలు, అలౌకిక విషయములు ప్రవేశించి, అవి అస్పష్ట చారిత్రకములుగా మాఱుటయు గలదు. బాలనాగమ్మ కథ, బంగారు తిమ్మరాజు కథ, తెలంగాణ మందలి బల్లారి కొండ్రాయుని కథ మున్నగునవి యిట్టి అస్పష్ట చారిత్రకములు. ఇరుగు పొరుగు భాషలనుండి కూడ వీరగాథలు స్వీకరింపబడుచుండును. తెలుగులో దేశింగురాజు కథ, నల్లతంగాళ్ కథ తమిళమునుండి ప్రవేశించినవి. 'కొమార రాముడు కథ' కన్నడమునుండి వచ్చినది. మన చిన్నమ్మ కథ కన్నడమున ప్రవేశించినది.

మొత్తముమీద వీరగాథల ఇతివృత్తము - యుద్ధము, చరిత్ర, అస్పష్ట చరిత్ర, పురాణము, అతిమానుషము (supernatural), జానపద విజ్ఞానము (Folklore) - మున్నగువానికి సంబంధించి యుండునని చెప్పవచ్చును. విదేశములలో ప్రేమ సంబంధమగు ఇతివృత్తములతో వీరగాథలున్నవి. ఇట్టివి మన దేశమున లేవని చెప్పవచ్చును. పాతివ్రత్యము, మతము ప్రాతిపదికగా గల వీరగాథలు మనకు గలవు. ఇట్టివి విదేశములలో లేవని చెప్పవచ్చును. మనస్సు చివుక్కుమను వీరుని విషాద మరణము, భయానకములగు క్రూర ఘోర హత్యలు, హృదయ విదారకములగు సహగమనములు, బీభత్సములగు వఱదలు, రైలు ప్రమాదములు - ఇత్యాదులు తెలుగు వీరగాథలలో తఱచుగా ప్రత్యక్షమగు నితివృత్తములని చెప్పనగును.

**2.4 సామాన్య నాయకత్వము:** వీరగాథలోని నాయకుడు ప్రబంధేతిహాసములలోని నాయకునివలె ధీరోదాత్తుడు, కులీనుడు, సద్గుణ సంపన్నుడు నై యుండవలె నను నియమము లేదు. చిన్నపరెడ్డి వంటి మోసగాండ్రు, సర్వాయి పాపనివంటి బందిపోట్లు, మియాసాబ్ వంటి గజదొంగలు కూడ వీరగాథలలో నాయకులుగా నుందురు. అమెరికాలో 'జస్సీ జేమ్స్' (Jasse James), 'శామ్ బాస్' (Sam Bass) మొదలగు దోషులపైనను, శాసన వ్యతిరేకుల పైనను అనేక వీరగాథ లున్నవి. అట్లని వీరగాథా నాయకు లందఱును ఇట్టివారే యని తలంపరాదు. బొబ్బిలి రంగారావు, ఉయ్యాలవాడ నారసింహారెడ్డి మున్నగువారి మాన వీరమును, దేశింగురాజు స్వాతంత్ర్య వీరమును, బుడ్డా వేంగళరెడ్డి దానవీరమును కీర్తించిన గాథలు కొల్లలుగా నున్నవి. కేవలము యుద్ధవీరమునే కాక, మోసగాండ్ర అద్భుతకృత్యములను, గజదొంగల ఉదారతను (వీరగాథలలోని గజదొంగలు తాము సంపాదించిన ధనమును పేదలకు దానము చేసెడివారే కాని, స్వప్రయోజనములకు ఉపయోగించుకొనెడివారు కారు), శాసనోల్లంఘనము చేసినవారి సాహసములను వీరగాథాకవులు ఇతివృత్తములుగా స్వీకరించుటకు వెనుదీయరు. వీరికి పతివ్రతా శిరోమణియగు లక్ష్మమ్మయు, భర్తను గొంతుకోసి చంపిన చిన్న మునెమ్మయు నొక్కటే. పతివ్రతల కథలలో పాతివ్రత్యమును వేనోళ్ళ ప్రశంసింతురు. కులటల కథలలో వారి క్రౌర్యమును కన్నులకు గట్టుదురు. కావున ఇతివృత్త మెట్టిది చేపట్టినను, నాయకు డెట్టివాడైనను

కథను చక్కని ఉత్కంఠతో తీర్చిదిద్దుటయే ఈ అజ్ఞాత కవిపుంగవుల ఆశయము. వీరగాథల ఉద్దేశ్యమును గూర్చి టి.ఎఫ్. హెండర్‌సన్ అను విమర్శకుడిట్లు చెప్పెను:

"Its aim, whether recited or sung, or sung and danced, is to tell a good story about anybody or anything, no matter what or whom."[34]

**2.5 వీరరస ప్రాధాన్యము:** వీరగాథలు నవరసములలో వీరరసమునకే అగ్రసింహాసన మిచ్చును. భరతుడు చెప్పిన దాన, ధర్మ, యుద్ధ వీరములు మూడును వీరగాథలలో గాననగును. ఆదిలో వీరగాథలు కేవలము యుద్ధవీర ప్రధానములుగ మాత్రమే ఉండెడివి. కాలక్రమమున కరుణరస ప్రధానములైన కథలు కూడ బయలుదేరినవి. కామమ్మ కథ, లక్ష్మమ్మ కథ, చిన్నమ్మ కథ మొదలగునవి యిట్టివే. వీనిని వీరగాథలనుటకు వెనుకాడవలసిన పనిలేదు. వీనిలో ధర్మవీరమున్నది. మరణించిన భర్తకొఱకై ఆత్మత్యాగము చేయగల సాహసము కూడ వీరమే. గజదొంగలకు బందిపోట్లకు ప్రభుత్వమును లెక్కింపని సాహసముండగా, పతివ్రతలకు స్వీయ ప్రాణములను లెక్కింపని సాహసమున్నది. ఈ రెండు విధముల సాహసములను వీరరసాంతర్భాగములే యగును.

పౌరాణిక కథావస్తువును గ్రహించినప్పుడు కూడ వీరరసమునకే ప్రాధాన్య మీయబడును. రాముడు, భీముడు, అర్జునుడు, అభిమన్యుడు మొదలగు పురాణ పురుషుల వీరకృత్యములే పౌరాణిక వీరగాథలందు కీర్తింపబడుచుండును. శక్తికథలలో వీర భయానకము లుండును. మొత్తముమీద వీరగాథలలో యుద్ధవీరమే యెక్కువగా కీర్తింపబడుచుండును. ఈ వీరరస ప్రాధాన్యము వలననే, స్త్రీల పాటలు కథాత్మకములైనను వీరగాథలుగా పరిగణింపబడకున్నవి. శాంతరస ప్రధానములైన రామదాసు చరిత్ర వంటి కీర్తనల గాథలును వీరగాథలు కానేరవు.

ఇట్లు వీరగాథలు ఉదాత్త నాయక రహితములైనను, చరిత్రకారుల దృష్టికి రాని స్థానికేతివృత్త సహితములైనను, పురాణ కల్పితములైనను, పామరులనే కాక పండిత ప్రకాండులను గూడ ముగ్ధులను గావించునంతటి శక్తి గలిగి యుండును.[35] వీనిలోని వీరరస ప్రాధాన్యమే దీనికి కారణము కావచ్చును. నిజమునకు బొబ్బిలియుద్ధ మేపాటిది? ఎనిమిది గంటలసేపు జరగిన

34. *The Ballad in Literature, p.7.*

35. *"Ballads usually deal with such subjects as war, love, enchantment, crime. They are fresh and straight forward, telling a plain tale in easily remembered verse; yet they have a grace and sincerity that appeals very strongly to most people of good taste."* *-The Book of Knowledge, Vol.I, p.350.*

స్థానిక స్వల్ప సంఘటన మాత్రమే! కొందఱు సమకాలిక చరిత్రకారులు దీనిని యుద్ధముగా పరిగణింపక అనాదరించిరి. కాని దీనిపై పుట్టిన వీరగాథ ఒక్క ఆంధ్రులే కాక యావద్భారతదేశ ప్రజలును గర్వింపదగినదిగా నున్నది! ప్రపంచ వీరగాథా కవిత్వమున నిట్టి ప్రశస్త వీరగాథలు వ్రేళ్ళపై లెక్కింప దగినవిగా నుండును. ఈ వీరగాథను విని ఆంగ్లేయులు ముగ్ధులై, దీనిని తమ భాషలోని కనువదించుకొనిరి.[36] ఇట్లనువదింపబడిన తెలుగు వీరగాథ ఇదొక్కటియే!

**2.6 కథా సారళ్యము:** వీరగాథల కథాఖ్యాన మెంత ముఖ్యమైనను అది ఏదో పరమ లక్ష్యమును సాధించెడి ఉద్దేశ్యముతో కఠిన శైలిలో వ్రాయబడిన నీతిప్రబోధకమైన దురవగాహమైన మహాకావ్యము వలె నుండరాదు. కథాకథనము సరళ రీతిలో సాగవలెను. వీరగాథ సామాన్య ప్రజల వినోదమున కుద్దేశించిన దనుటను మఱవరాదు.

"Tradition by word of mouth, mainly in isolated unlettered communities, is its vital test; and narrative is its vital fact. Its supreme art is to tell its story well; and its narrative is not to be regarded as a mere stalking ground for more serious intentions. Entertainment is an obvious purpose."[37]

సంఘటనకు కారకులైన వ్యక్తులపై కన్న సంఘటనకే ఎక్కువ ప్రాముఖ్య మీయవలెను. నీతి ప్రబోధక కవిత్వమునకు సరిగా విరుద్ధమైనది వీరగాథా కవిత్వము.[38] వీరగాథాకవి సాధారణ ముగా పతాక సన్నివేశములపైననే తన దృష్టిని ఎక్కువగా కేంద్రీకరించి సరళ రీతిని కథాకథనము చేయును.

**2.7 హఠాత్ప్రారంభము:** వీరగాథలు నాటకములవలె సరాసరి కథామధ్యమున ప్రారంభింపబడు ననియు, వీనిలో నేవిధమగు నుపోద్ఘాతమును ఉండదనియు పాశ్చాత్య విమర్శకులు భావించు చున్నారు. "It is true that they plunge often into the heart of the subject, without word of explanation. 'It begins in the fifth act of the play' was Gray's admiring comment on a version of 'Child Maurice.'"[39] ఈ లక్షణము పాశ్చాత్య

---

36. *బొబ్బిలియుద్ధ కథను 'ఏట్సు' (Yates) దొర ఆంగ్లములోని కనువదించెననియు, ఆ ప్రతి తన కడ నున్నదనియు డ్యాక్టరు గిడుగు సీతాపతిగారు చెప్పినారు. 1965 ఏప్రిల్ నెలలో నేను వారిని కలిసికొంటిని. వారియొద్ద నున్న ఆ ఆంగ్లానువాదము నెవరో ప్రబద్ధులు కాజేసిరట. ఏట్సుదొర వ్రాసికొన్న లఘుటిప్పణితో గల తెలుగు ప్రతి మాత్రము సీతాపతిగారి కడ నేటికిని గలదు.*
37. *Francis B. Gummere, The Popular Ballad, p.338.*
38. *"It seeks to concentrate the attention on the thing done or suffered rather than on the doer or sufferer. It is the exact antithesis of didactic poetry."*
*-The New Universal Encyclopaedia, Vol.I, p.886.*
39. *Francis B. Gummere, The Popular Ballad, p.73.*

వీరగాథలయెడ సత్యము కావచ్చును కాని, మన తెలుగు వీరగాథలలో నొక్కటి కూడ ఈ లక్షణమునకు లొంగునది కాదు. ప్రతి వీరగాథయును నాయకుని పితృపితామహవర్ణనతో, శైశవ విశేషములతో సవిస్తరముగా నున్నదే కాని హఠాత్ప్రారంభము కలిగి యుండదు. పల్నాటి వీర కథలు, కాటమరాజు కథలు మున్నగు వీరగాథా వృత్తములు ఇతిహాసముల వలె అతి సూక్ష్మమగు వర్ణనలతో నున్నవి. గుజ్జాల గోపిరెడ్డి పాట, మానందిరెడ్డి పాట మున్నగు వీరగాథానికలకు మాత్రము ఈ హఠాత్ప్రారంభమను లక్షణము ప్రత్యక్షరమును వర్తించునని చెప్పవచ్చును.

**2.8 సంభాషణా సహితత్వము:** ఇతిహాసముల వలెనే వీరగాథలు కూడ సంభాషణలను వర్జింపవు. పాత్రలు భాషించిన తీరు యథాతథముగా సంభాషణ రూపమున వ్రాయబడును. దీనిలో నొక్కొక్కప్పుడు ఎవరు ఏ సంభాషణను చెప్పుచుండిరో తెలియదు. సందర్భమును బట్టి ఊహించుకొనవలసినదే. ఉదాహరణమునకు, రాయలసీమలో వ్యాప్తిగాంచిన, 'ఒడ్డిరాజుల పాట' అను ఈ క్రింది లఘు వీరగాథను చూడుడు:

| | | | | |
|---|---|---|---|---|
| అంటబోకుడు అన్నలారా | తుమ్మడీలో | – | అంటయి నేనున్నా | తుమ్మడీలో |
| కాగులతో నీళ్ళున్నయి | ,, | – | తానమాడు గొల్లదానా | ,, |
| ఇటువంటి నీళ్ళాకు | ,, | – | పోదన్నా నా అంటూ | ,, |
| అత్త మామా గట్టిన్న | ,, | – | అయివోద్దా సెరువుందీ | ,, |
| అయివోద్దా సెరువూలో | ,, | – | పోతదన్నా నా అంటూ | ,, |

ఇది ఒక గొల్లపడుచుకును, ఒడ్డిరాజులను వారికిని జరిగిన సంభాషణము. ఇందు 1,3,5 పాదములు గొల్లపడుచు మాటలుగను, 2,4 పాదములు ఒడ్డిరాజుల పల్కులుగను సందర్భమును బట్టి తెలిసికొనవలెను.

పునరావృత్తి, సంభాషణలు ఒకదాని తరువాత నొకటిగా వీరగాథ సాగిపోవును. పునరావృత్తి వలెనే ఈ సంభాషణలు కూడ వీరగాథ ప్రాక్తన మానవ సంఘములు వలయ నృత్యమున పాడిన బృందగీతము (choral song)నుండి పరిణమించిన దనుటను సమర్థించును. సంభాషణలు వీరగాథల నాటక లక్షణమునకు గూడ ఉదాహరణములుగా చెప్పవచ్చును. ఆద్యంతము సంభాషణాత్మకముగా కొనసాగిన వీరగాథలు కూడ పాశ్చాత్య దేశములలో గలవు. తెలుగులో 'అమ్మవారి పదము' వంటి లఘువీరగాథలు కొన్ని ఆద్యంతము సంభాషణాత్మకములుగనే ఉన్నవి. వీరగాథల నాటక లక్షణము సంభాషణలోనే కాక, పాడుటలో గూడ బయటపడును. గాథాకారుడు చాలభాగమును నటించుచు పాడుట గమనింపదగినది.

**2.9 వచన రాహిత్యము:** సాంప్రదాయక వీరగాథలో వచనము లుండవు. ఒకే పాట రూపమున నుండును. పల్నాటి వీరకథలు, కాటమరాజు కథలు ఇందులకు చక్కని

ఉదాహరణములు. పాడువాడు పాటనే వరుసగా పాడుచుండును. వివరణ చేయువాడు మాత్రము అశువుగా వచనము నుపయోగించును. ఈ వచనము, కథ ప్రజలకు బాగుగా అర్థమగుట కొఱకు వ్యాఖ్యాత అప్పటికప్పుడు అల్లినదే కాని, వీరగాథలో నుండునది కాదు. బొబ్బిలి వరుసలోని కథలు కూడ మొదట ఇట్లే వచన రహితములుగా నుండెడివి. తరువాత, వానిని సేకరించిన పరిష్కర్తలు ఇచ్చవచ్చినట్లు వచనములను చేర్చిరి. పెద్దబొబ్బిలిరాజు కథలోని వచనములు రచయిత వ్రాసినవి కావు. తరువాతి కాలమున పరిష్కర్తలచే చేర్చబడినట్టివే. గాయక భిక్షువులు కూడ వచనములను చేర్చుచు వచ్చిరి. బుఱ్ఱకథలలో కూడ ప్రధాన గాయకుడు వచనములను చెప్పడు. వంతలే వచన సంభాషణ నల్లుచుందురు. ఏమైనను వచనము వివరణ కొఱకై వచ్చిన ఆధునిక లక్షణమే కాని, సాంప్రదాయక వీరగాథల ప్రాచీన లక్షణము కాదు. సంస్కృత భాషలో రామాయణ మహాభారతములలో గూడ వచనములు లేవు.

**2.10 విషాదాంతము:** విషాదాంతముగా నుండుట వీరగాథయొక్క సాధారణ లక్షణము. శౌర్యప్రతాపములను జూపి రణరంగమున నిహతులై వీరస్వర్గమును చూఱగొనుట వీరనాయకులకు సామాన్యము కదా! ఇట్టి చారిత్రక వీర విషాదములే కాక, దుర్భర సాంఘిక విషాదములు (క్రూర ఘోర హత్యలు) కూడ వర్ణింపబడుచుండును. మానవ మహోద్రేకములను మనస్సునకు హత్తుకొనునట్లు చెప్పుటయే వీరగాథల ముఖ్యోద్దేశము.

"Its main appeal is to the stronger or more serious passions or emotions; its story is usually intensely, and sometimes painfully, tragical, and its function is the production of an impressive dramatic climax, to aid in which it often uses the device of incremental repetition."[40]

**2.11 'అభివర్ధిత పునరుక్తి' లేక 'పరివర్ధిత పునరుక్తి' (Incremental Repetition):** వీరగాథల సంఘటనా నిర్మాణము కాని, కథాఖ్యాన గమనము కాని ఒక విచిత్ర పద్ధతిలో కొనసాగుచుండును. పాడిన ఖండిక (bit)నే మఱల పాడి, దానికి కథాకథన సంబంధమగు క్రొత్త ఖండికలను చేర్చుచుండుట వలన కథ ముందునకు నడచును. ఈ పద్ధతిని 'ఫ్రాన్సిస్. బి. గుమ్మే, అను విమర్శకుడు 'Incremental Repetition' అనినాడు. అతడు దీనినిట్లు వివరించినాడు:

" . . . . .the lingering over the detail of the narrative" or "the succession of ideas or verses, mainly in triads which are indentical save for one or two pivotal words."[41]

---

40. *The New Universal Encyclopaedia, Vol.I, p.886.*
41. *See, Folklore, Vol.V, No.8, August, 1964, p. 281.*

ఈ అభివర్ధిత పునరుక్తి ఉదాహరణము వలన మఱింత స్పష్టమగును. పాశ్చాత్య విమర్శకులు ఈ క్రింది లక్ష్యముల నిచ్చినారు:

Christine, Christine, tread a measure for me!
A silken sark I will give to thee..
A silken sark I can get me here,
But I'll not dance with the prince this year
Christine, Christine, tread a measure for me!
Silver-clasped shoes I will give to thee
Silver-clasped shoes . . . . . . . . . . . . [42]

అమెరికా దేశములోని "Cowboy Ballads" లో గూడ ఈ అభివర్ధిత పునరుక్తి కాననగును.

"I started up the trail October twenty third,
I started up the trail with 2-U herd."[43]

ఈ అభివర్ధిత పునరుక్తికిని పునరావృత్తికిని సంబంధము లేదు. పై లక్ష్యములో "Christine, Chiristine tread a measure for me" అనునది పునరావృత్తి (Refrain). క్రీగీతలున్న అంశములు అభివర్ధిత పునరుక్తులు. ఈ అభివర్ధిత పునరుక్తి వీరగాథల బాహ్య స్వరూపమున కానగు ముఖ్యలక్షణము.

". . . . . the main structural feature of popular ballads is simple repetition with incremental changes, utterly void of metaphor, which advance the statement of fact, and help narrative, however slowly, on its way."[44]

ఈ అభివర్ధిత పునరుక్తి వీరగాథలలో కన్న వీరగాథానికలో ఎక్కువగా నుండునని చెప్పవచ్చును. తెలుగున ఈ లక్షణము బహువిధములుగా నున్నది. పాశ్చాత్యులు చెప్పిన పద్ధతిలో ఈ పునరుక్తి తక్కువగ నున్నది. ముక్తపదగ్రస్తము వంటి ఇతర పునరుక్తులు హెచ్చుగా నున్నవి.

**2.11.1 మొదటి పద్ధతి:** ఒక పాదమును పాడి, రెండవ పాదమును నిర్మించునపుడు, పాడిన మొదటి పాదములోని పూర్వార్ధమును మఱల పాడి, దానికి కథాసంబంధమగు నూతనాంశమును ఉత్తరార్ధముగా జేర్చుట పాశ్చాత్యులు చెప్పిన అభివర్ధిత పునరుక్తి. అంకెలలో దీనినిట్లు చూపవచ్చును:

---

42. *See, Bliss Perry's A study of Poetry, p.280.*
43. *Ibid.*
44. *Francis B. Gummere, The Popular Ballad, p.42.*

1 + 2

1 + 3

1 + 4

1 + 5

....

పాశ్చాత్య విమర్శకులిచ్చిన పై లక్ష్యము లన్నియు నిట్లే యున్నవి. తెలుగున బొబ్బిలి కథలో కొన్ని పట్టులలో నిట్టి అభివర్ధిత పునరుక్తి కాననగును:

నూటికి పొడిచి సెలగంటాడు భూపతిరాయడు
నూటికి పొడిచి సెలగంటాడు మల్లారాయడు
నూటికి పొడిచి సెలగంటాడు ధర్మారాయడు
నూటికి పొడిచి సెలగంటాడు పడాల రాముడు
నూటికి పొడిచి సెలగంటాడు గుమ్మళ్ళ బుచ్చయ్య

పై పాదములలో పూర్వార్ధము సమానముగా నున్నది. ఉత్తరార్ధమున క్రొత్త విషయములు చేరుచు వచ్చినవి. ఇది యొక పద్ధతి.[45]

**2.11.2 రెండవ పద్ధతి:** కాని మన వీరగాథలలో దీనికి వ్యతిరేకమగు పద్ధతి కూడ కానవచ్చు చున్నది. అనగా పాదములలోని ఉత్తరార్ధము సమానముగానుండి (పునరుక్తమై), పూర్వార్ధమున క్రొత్త విషయములు చేరుచు వచ్చుట. దీనిని అంకెలలో నిట్లు చూపవచ్చును:

1 + 2

3 + 2

---

*45. దేశి కవిత్వముపై మిక్కిలి అభిమానము గల పాల్కురికి సోమనాథుడు కూడ ఈ అభివర్ధిత పునరుక్తిని విశేషముగా పాటించినాడు. ఆవేశపూరిత కవనమున నిది విధిగానుండు లక్షణమని చెప్పవచ్చును. బసవ పురాణములోని ఈ క్రింది పంక్తులు పాశ్చాత్యులు చెప్పిన అభివర్ధిత పునరుక్తికి చక్కని యుదాహరణము:*

*బసవని శరణన్నc బాపక్షయంబు*
*బసవని శరణన్నc బరమ పావనము*
*బసవని శరణన్నc బ్రత్యక్ష సుఖము*
*బసవని శరణన్న భవరోగ హరము*
*బసవని శరణన్న భక్తి సేకూరు*
*బసవని శరణన్న బంధము ల్వాయు*

4 + 2
5 + 2
....

పై బొబ్బిలికథలోనే ఇట్టి అభివర్ధిత పునరుక్తి కనబడుచున్నది. విజయరామరాజు, బుస్సీ భేటికి పోవుచు, తన ప్రక్కనున్న పాళెగాండ్రకు లేఖలు వ్రాయు సందర్భము:

గోలకొండ యెఱ్ఱభూపతికే జాబు లంపినారు
కిమిడినున్న నారాయణదేవుకు జాబు లంపినారు
ఆట్రగడ్డ హరిచంద్రునికైన జాబు లంపినారు
మాడువులేలే లింగారావుకు జాబు లంపినారు
మన్యమ్మేలే మన్యభూపతికి జాబు లంపినారు
కోయనున్న కోయభూపతికి జాబు లంపినారు
... ... ... ... ...

(ఈ పునరుక్తి ఇంకను పదునొకండు పాదముల వఱకును ఇట్లే కొనసాగి యున్నది).

రాయలసీమలో ప్రసిద్ధికెక్కిన 'నారసింహారెడ్డి కథ'లో గూడ పైన తెల్పిన రెండవ రకమగు అభివర్ధిత పునరుక్తి గలదు:

అడిగో వచ్చే ఇడిగోవచ్చే – నారసింహారెడ్డి
పళపళ పళపళ కేకలేసెరా – నారసింహారెడ్డి
చంద్రాయుధమూ చేతబట్టెనే – నారసింహారెడ్డి
కోబలీ రణబలీ యన్నడే – నారసింహారెడ్డి

బంగారు తిమ్మరాజు కథలోను ఇట్టి పునరుక్తి యున్నది:

చెడ్డీ లాగూ తొడిగిందయ్యా – పల్లెపు రమణమ్మా
పురుష వేషమే వేసినదయ్యా – పల్లెపు రమణమ్మా
డాలు కత్తులూ చేత బట్టెనూ – పల్లెపు రమణమ్మా
మేఘరంజీ గుఱ్ఱము నెక్కెను – పల్లెపు రమణమ్మా

తెలంగాణాలో ప్రసిద్ధికెక్కిన గద్వాల సోమనాద్రికథ (నల్ల సోమనాద్రి కథ) యందును పై విధమగు అభివర్ధిత పునరుక్తి కానవచ్చుచున్నది.

అద్దెడు దొరికిన మంచిదె
గిద్దెడు దొరికిన మంచిదె

**పావు దొరికిన మంచిదె**
**చారెడు దొరికిన మంచిదె**

ఇది తెలుగులో నున్న రెండవ రకమగు అభివర్ధిత పునరుక్తి.

**2.11.3 మూడవ పద్ధతి:** మూడవ రకమగు అభివర్ధిత పునరుక్తి కూడ తెలుగు వీరగాథలలో గానవచ్చు చున్నది. ఒక పాదమును పాడి, రెండవ పాదమును నిర్మించునపుడు, మొదటి పాదములోని ఉత్తరార్ధమును మఱలపాడి, దానికి నూతనాంశమును చేర్చుట. అనగా మొదటి పాదములోని ఉత్తరార్ధము రెండవ పాదములో పూర్వార్ధ మగుచుండును. దీనిని అంకెలతో నిట్లు చూపవచ్చును:

**1 + 2**
**2 + 3**
**3 + 4**
**4+ 5**
**....**

ఇది అచ్చుముగా శబ్దాలంకారమగు 'ముక్తపదగ్రస్తము' వంటిది. బొబ్బిలికథలో విజయ రామరాజు తన సమస్త సైన్యముతో విజయనగరము నుండి బయలుదేరి బుస్సీదొర భేటీకై రాజమహేంద్రవరము వచ్చు సందర్భమున ఇట్టి అభివర్ధిత పునరుక్తి కానవచ్చుచున్నది:

**పూలతోట మజిలీ లన్నా – భీమసింగి లోను**
**భీమసింగి మజిలీ లన్నా – అలమండా లోను**
**అలమండ మజిలీ లన్నా – కసిమి కోట లోను**
**కసిమికోట మజిలీ లన్నా – గుడిచెర్లా లోను**
**గుడిచెర్లా మజిలీ లన్నా – సత్యారము లోను**
**... ... ... ...**

(ఈ పునరుక్తి ఇట్లే మఱి తొమ్మిది పాదముల వఱకును సాగినది).

ముక్తపదగ్రస్తము వంటి ఈ అభివర్ధిత పునరుక్తి, బుస్సీ సైన్యము విజయరామరాజు సైన్యముతో కలిసి రాజమహేంద్రవరము నుండి బొబ్బిలి పైకి వచ్చునప్పుడు కూడ పాటింపబడినది. చిన్నమ్మ కథలో ఆ మహాపతివ్రత పెద్ద కూటిబానను నెత్తి కెత్తుకొను సందర్భమున ఈ మూడవ రకమగు అభివర్ధిత పునరుక్తి యున్నది చూడుడు: చిన్నమ్మ కాగుమీద చేయి వైచి కదిలింపహా -

**గిర గిర గిర గిర కాగు తిరిగెనే రామా రామా శ్రీహరి సీతారామా –**
**గిరకల మంటి కాగు లేచెనే రామా రామా శ్రీహరి సీతారామా!**

గిరకల మంటీ వల్లములో కాగు రామా రామా ...' మోకాల మంటీ కాగు లేచెనే రామా రామా
మోకాల మంటీ వల్లములో కాగు రామా రామా నడుముల మంటీ లేచున్నాదో రామా రామా
నడుముల మంటీ వల్లములో కాగు రామా రామా ఎదల మంటీ కాగు లేచెనే రామా రామా
ఎదల మంటీ వల్లములో కాగు రామా రామా ఎడమ బుజానా నిలిపున్నాదో రామా రామా
ఎడమ బుజానా వల్లములో కాగు రామా రామా శిరసు పైనా నిలిపెను తల్లీ! రామా రామా

ముక్తపదగ్రస్తము వంటి ఈ మూడవ రకమగు అభివర్ధిత పునరుక్తి వీరగాథలలో కన్న వీరగాథానికలలో హెచ్చుగా నున్నది. చిత్తూరు మండలమున జానపద స్త్రీలు పాడు 'ఎంకటేశుని పాట' లో ఈ పునరుక్తి కాననగును:

ఎంకటేశా! ఓ యెంకటేశా! – ఏడుకొండాలొయ్యెంకటేశా!
ఏడుకొండాలొయ్యెంకటేశా! – ఎగువ తిర్పతి గోయిందరాజా! ॥ఎంకటేశా॥
పొద్దు పొద్దున లేచీనాడో – పొద్దున్నే లేచీనాడో
పొద్దున్నే లేచీనాడో – పనస పుల్లా లించీనాడో
పనస పుల్లా లించీనాడో – పలుగారా రుద్దీనాడో
పలుగారా రుద్దీనాడో – కోనేటికి ఎల్లీ నాడో
కోనేటికి ఎల్లినాడో – తానబోనం జేసీనాడో
తానం బోనం జేసీనాడో – సందె జపమే జేసీనాడో
సందె జపమే జేసీనాడో – నామ నీమా మాడీనాడో
నామ నీమా మాడీనాడో – ... ... ...

ఇందు మొదటి రెండు పాదములును పునరావృత్తి. ఈ పునరావృత్తి యందు కూడ అభివర్ధిత పునరుక్తి కానవచ్చుట విశేషము. కడప మండలములోని 'జంగమయ్య పాట' అను 'జక్కిక' ఆద్యంతమును ఇట్టి అభివర్ధిత పునరుక్తితోనే కొనసాగినది:

''రామునా ఉయ్యాలలో – శ్రీ రామునా ఉయ్యాలలో ...'' (పునరావృత్తి)

మూలల్లో పారకెత్తి మూలల్లు తోసె – బంగారు పారకెత్తి బయలెల్ల తోసె ''రామునా''
బంగారు పారకెత్తి బయలెల్ల తోసె – కంచుకుండా కడిగి కలయెసరు పెట్టె ''రామునా''
కంచుకుండా కడిగి కలయెసరు పెట్టె – పాడిపాడీ సెక్కలతో పొయి రగల జేసె ''రామునా''
పాడిపాడీ సెక్కలతొ పొయి రగల జేసె – గందాపు సెక్కలతొ కలమంట ఏసె ''రామునా''
గందాపు సెక్కలతొ కలమంట ఏసె – వేరిన్న సన్న బియ్యం వెసట్లొ వేసె ''రామునా''
వేరిన్న సన్న బియ్యం వెసట్లొ వేసె – ... ... ... ...
... ... ... ... – ... ... ... ...

ఇట్లు పాదములోని అర్ధభాగము మాత్రమే కాక, పాదము పాదమంతయు పునరుక్తమగు పాటలును గలవు. పైన తెల్పిన 'జంగమయ్య పాట'లో కూడ ఒక విధముగా పాదము పాదమంతయు పునరుక్తమైనదని తెల్పవచ్చును. ఇది ద్విపదచ్ఛందమున గలదు. కాని పాడునప్పుడు రెండు పంక్తుల తర్వాత కాని పునరావృత్తి వచ్చుట లేదు. కాబట్టి యిందలి రెండు ద్విపద పాదములను ఒకే పాదముగా భావింపవలసి యున్నది. ఇట్లు సందిగ్ధముగా గాక, స్పష్టముగా పాదము పాదమంతయు పునరుక్తమైన ఉదాహరణమునకు రాయలసీమలో కర్నూలు మండలమున నేనుసేకరించిన ఈ క్రింది పాటను చెప్పవచ్చును. దీని పేరు 'గరుట పచ్చి పాట'. ఈ పాటలో మొదటినుండి చివరి వఱకును పాదము పాదమంతయు పునరుక్తమగుచు ముక్తపదగ్రస్తము వంటి అభివర్ధిత పునరుక్తి స్పష్టముగా గానవచ్చుచున్నది:

**పదవోయి అన్నయ్యా! – పట్బాబి సేకరుడ! – పాదములు గనివత్తమే?**
**ఎండలూ కొండలూ – ఎడలేని కారడవి – ఎట్ల బోదము తమ్ముడా!**
**ఎండలూ కొండలూ – ఎడలేని కారడవి – ఎట్ల బోదము తమ్ముడా**
**ఆ కొండ ఆకటా – ఆవుల్ల జాడుంది – అనుమాన మెందు కన్నా!**
**ఆ కొండ ఆకటా – ఆవుల్ల జాడుంది – అనుమాన మెందు కన్నా**
**ఆవుల్ల జాడకాడ – అంబోజ పాదకాడ – బోరువంటా కూలె గరుటసామీ!**
**ఆవుల్ల జాడకాడ – అంబోజ పాదకాడ – బోరువంటా కూలె గరుటసామీ**
**బతుక పాణములిస్త – విసుర రెక్కల నిస్త – లేచేవ గరుట నీవూ?**
**బతుక పాణములిస్త – విసుర రెక్కల నిస్త – లేచేవ గరుట నీవూ**
... ... ... ... ... ... ...

**2.11.4 నాల్గవ పద్ధతి:** పైన తెల్పిన మూడు విధములగు అభివర్ధిత పునరుక్తులే కాక, తెలుగు వీరగాథలలో మఱియొక విధమగు పునరుక్తి కూడ కానవచ్చు చున్నది. వీరుడు ఒక ప్రదేశమునుండి మఱియొక ప్రదేశమునకు పోవునప్పుడు చేయు వర్ణనలో మధ్య మార్గమున వచ్చు ఊరి పేర్లు తప్ప, తక్కిన పదములు, వాక్యములు యథాతథముగా తరువాతి పాదములలో పునరుక్తములగుట ఈ పద్ధతిలో కానవచ్చును. ఉదాహరణమునకు, 'పెద్దాపురపు కోడిపుంజుల కథ' (లేక 'జగపతిరాజు కథ')లో, జగపతిరాజుగారు విజయనగరము నుండి పెద్దాపురము వఱకును అంచెల గుఱ్ఱములపై స్వారి చేయుచు వచ్చునప్పుడు, ఊరిపేర్లు తప్ప తక్కినదంతయు ఉత్తర పాదములలో పునరుక్తమైనది, చూడుడు:

**కోటలోపలా గుఱ్ఱమెక్కెను జగపతి మహరాజు**
**తల్లి దేవిడీ దాటే సరికీ గుఱ్ఱం చచ్చింది**

అక్కడి గుఱ్ఱం ఎక్కారండీ జగపతి మహారాజు
సంతపేటకీ వచ్చేసరికీ గుఱ్ఱం చచ్చింది
అక్కడి గుఱ్ఱం ఎక్కారండీ జగపతి మహారాజు
భీమసింగూ వచ్చేసరికి గుఱ్ఱం చచ్చింది
అక్కడి గుఱ్ఱం ఎక్కారండీ జగపతి మహారాజు
అనకాపల్లీ వచ్చేసరికి గుఱ్ఱం చచ్చింది
అక్కడి గుఱ్ఱం ఎక్కారండీ జగపతి మహారాజు
సబ్బారమూ వచ్చేసరికి గుఱ్ఱం చచ్చింది
అక్కడి గుఱ్ఱం ఎక్కారండీ జగపతి మహారాజు
కశింకోటా వచ్చేసరికి గుఱ్ఱం చచ్చింది
అక్కడి గుఱ్ఱం ఎక్కారండీ జగపతి మహారాజు
గొల్లప్రోలు వచ్చేసరికి గుఱ్ఱం చచ్చింది
అక్కడి గుఱ్ఱం ఎక్కారండీ జగపతి మహారాజు
నందికపాడూ వచ్చేసరికి గుఱ్ఱం చచ్చింది
అక్కడి గుఱ్ఱం ఎక్కారండీ జగపతి మహారాజు
పిఠాపురమూ వచ్చేసరికి గుఱ్ఱం చచ్చింది
అక్కడి గుఱ్ఱం ఎక్కారండీ జగపతి మహారాజు
పెద్దాపురమూ సంతపేటకీ ఢకీలు పడ్డారు.

-(నేను సేకరించిన మౌఖిక వీరగాథ)

తెలంగాణమున ప్రసిద్ధి కెక్కిన 'రాజా రామేశ్వరరావు కథ' లో గూడ సరిగా ఇట్టి అభివర్ధిత పునరుక్తియే కలదు. రాజా రామేశ్వరరావు కూడ జగపతిరాజు వలెనే గుఱ్ఱపుస్వారి చేయుటలో మహాప్రవీణుఁడు. ముస్లిము లీతనిని హైదరాబాదులోబంధింపగా, తప్పించుకొని, అక్కడి నుండి అంచె గుఱ్ఱములపై వనపర్తికి వచ్చి చేరును.

వీరగాథల కథాఖ్యానమంతయు నీ యభివర్ధిత పునరుక్తితోనే నడచునని తలపరాదు. ఇది వీరగాథలలో చాల సకృత్తుగా గాననగును. వీరగాథానికలలో మాత్రమే స్ఫుటముగా కనపడును. పల్నాటి వీరకథలు, కాటమరాజు కథలు మున్నగు వీరగాథా వృత్తములలో నిది నశించనదని చెప్పవచ్చును. గాథానికలకన్న గాథలును, గాథలకన్న గాథావృత్తములును కవిత్వ శిల్ప విషయమున ఉత్తరోత్తర పరిపుష్టములు. పునరావృత్తి, అభివర్ధిత పునరుక్తి మున్నగునవి కవిత్వము యొక్క ప్రాథమిక లక్షణములు. ఈ ప్రాథమిక లక్షణములు గాథానికలలోనే ఎక్కువగా నుండును. గాథలలో అక్కడక్కడ మాత్రమే కాననగును.

"The maturer the stage of poetry, the less repetition and more facts; reversed the fewer facts, the greater amount of repetition."[46]

పైన చెప్పిన లక్షణము లన్నింటితోను కథాఖ్యానమున్నను అది వీరగాథ కానేరదు. ఒక కవి గేయరూపమున ఒక వీరుని కథను వ్రాసి దానిని వీరగాథ యనవచ్చును. కాని అది వీరగాథ కానేరదు. ప్రజాసామాన్యము యొక్క ఆమోదముద్ర లేనిదే అది వీరగాథ యగుట కల్ల. ప్రజలు దానిని ఆమోదించి, తమదిగా భావించి, మౌఖిక సంప్రదాయ ప్రవంతిలో జాలువాఱునట్లు చేయవలెను. అప్పుడే అది సాంప్రదాయక వీరగాథ యగును. కాని ఇట్లు ప్రత్యేక కవికృతములగు రచనలు సాంప్రదాయక వీరగాథలుగా మాఱుట క్వాచిత్కము. వీరగాథ స్వచ్ఛమగు ప్రజాకవిత్వమగుటచే సాధారణముగా ఇది ప్రజలలోనే ముఖ్యముగా గాయక భిక్షువులలో ఆశువుగా జనించును. ఇట్టి ఆశురచనను ఒక కవి సంస్కరించి, సాహిత్యమున స్థానము సంపాదింపగల తీరులో దీనికి పరిపుష్టి చేకూర్చును. అయినను ఈ కవికి, మార్గ సాహిత్యములోని కవికి ఉండునట్టి ప్రాముఖ్యముండదు. కావుననే ఇవి సాధారణముగా అజ్ఞాత కర్తృకములుగా మనకు లభించుచుండును. దీనిని బట్టి గాయక భిక్షువుల ఆశుకవనముగా వెలువడుట, అజ్ఞాతకర్తృకములుగా లభించుట వీరగాథల మూడవ ప్రధానలక్షణమని చెప్పవచ్చును.

## 3. ఆశు కవనము - అప్రధాన కర్తృకము

ఇప్పుడు మనకు లభ్యమగుచున్న సాంప్రదాయక వీరగాథల స్వరూపము ఆశుకవనము కాకపోయినను, ఒకప్పుడు వాని పుట్టుక మాత్రము గాయక భిక్షువుల ఆశుకవనము నుండియే. వీర సంఘటన జరగిన వెంటనే వీరగాథ పుట్టును. ఆ సంఘటనను కన్నులార చూచిన జంగము కాని, చెవులార వినిన జంగముకాని ఉద్వేగముతో ఆశువుగా గానమొనర్చును. ఆ పాట ఆ ప్రాంత మంతయు ప్రాకిపోవును. ఇట్టి గాలిపాటను కొంచెము అక్షరజ్ఞానము గల జంగమో, లేదా జానపద కవిత్వమునెడ అభిమానము గల ప్రౌఢకవియో సంస్కరించి మఱింత బింకము చేయును. ఈ సంస్కర్త లొకప్పుడు రచయితలుగా తమ నామములను జోడించుకొనుటయు గలదు. విడిగంటి వీరయ్యదేవర వంటి జంగములు ఈ శతాబ్ది ప్రారంభమున ముద్రింపబడిన పెక్కు వీరగాథలపై తమ పేర్ల నిట్లే ముద్రించుకొనిరి. శ్రీనాథుడు తనకు పూర్వము నుండియు గానము చేయబడుచుండిన పల్నాటి వీరచరిత్రను, కాటమరాజు కథలను ద్విపద రూపమున వ్రాసియుండును. ఇట్లు ఆశువుగా కాక, రచయిత స్వయముగా జానపద పద్ధతిలో వ్రాయవలెనని చేసిన ప్రయత్న ఫలమే 'బుఱ్ఱకథలు'. కాని ఇవి సాంప్రదాయక వీరగాథలు కాజాలవు. ఆశు

46. *Francis B. Gummere, The Popular Ballad, p.86.*

కవితారూప జననము, మౌఖిక ప్రసరణము అను ముఖ్యలక్షణములు వీనిలో లేవు. అందుచే నివి వీరగాథానుకరణములుగనే మిగిలిపోయినవి.

అతి ప్రాచీన కాలమున వీరగాథ ప్రాక్తన మానవ సంఘములు అమితోత్సాహమున కావించెడి వలయ నృత్యమున ఆశువుగా పుట్టి యుండవచ్చును. కాని అట్టి వీరగాథలు నేడు మనకు లభ్యమగుట లేదు. తరువాతి కాలమున రాజులకడ నుండు వందిమాగధులు, భట్టులు, ఆశ్రితులు, ఆయా రాజుల పరాక్రమ గాథలను ఆశువుగా గానము చేసియుందురు. జంగములు శివభక్తుల కథలను ఆశుకవితా రూపమున వెలయించి యుందురు. శక్తిపూజలలో, తిరునాళ్ళలో పామరులు ఆశువుగా పాడిన కథలు కొన్ని యుండవచ్చును. మొత్తముపై ఏ కాలములో ఏ విధముగా పుట్టినను, వీరగాథయొక్క ప్రాథమిక రూపము ఆశుకవిత్వమేయని చెప్పవచ్చును. పూర్వకామునసే కాక, నేటికిని సాంప్రదాయక వీరగాథలు ఆశువుగనే జనించుచున్నవి. కడపమండలములోని 'కుంటి పుల్లారెడ్డి కథ' (1946లో జరగిన హత్య), చిత్తూరు మండలమున 'యల్లమంద నాయుడు కథ' (1954ప్రాంతమున జరగిన హత్య), వీరగాథలు జంగముల నుండి ఆశురూపమున పుట్టుననుటకు ప్రబల నిదర్శనములు.

వీరగాథలవలెనే వీరగాథానికలు గూడ గాయక భిక్షువుల ఆశురచనలే. కొన్ని వీరగాథలలో ప్రత్యేక కవుల ప్రమేయమున్నట్లు తెలియుచున్నది. కాని వీరగాథానిక లన్నియును శుద్ధ ఆశురచనలనుటకు నిదర్శనములున్నవి. రాయలసీమలో ఇటీవలి కాలమున (సుమారు 20 సంవత్సరముల లోపులో) జరగిన హత్యలపై పుట్టిన ''మల్లారెడ్డి పాట, మానందిరెడ్డి పాట, గుడిపాటి కరణమయ్య పాట, అద్దాల సుబ్బులు పాట, దువ్వూరి సీతారామయ్య పాట'' మున్నగునవి బుట్టఎఱుకులవారి ఆశురచనలు. ఈ ఎఱుకులు పాడుచుండగా నేను వీనిని సేకరించితిని. ఈ భిక్షువులు నిరక్షర కుక్షులగుటచే ఈ పాటలన్నియును వీరిలో ఆశురూపమున తప్ప వేఱుగా పుట్టుట కవకాశము లేదు.

కాబట్టి వీరగాథ కాని, వీరగాథానిక కాని పుట్టుకలో ఆశురచనగా నుండి తీరును. ఇది యొక ముఖ్యలక్షణము. తెలుగులోని పల్నాటి వీరకథలు, కాటమరాజు కథలు మున్నగునవి కూడ ఆదిరూపమున ఆశురచనలేయని చెప్పవచ్చును. పల్నాటి యుద్ధము క్రీ.శ. 12వ శతాబ్ది యుత్తరార్ధమున జరగిన సంఘటన. కాటమరాజు యుద్ధము 13వ శతాబ్ది చివరి పాదమున జరగిన సంఘటన. వీని రచయితగా చెప్పబడు శ్రీనాథుడు క్రీ.శ. 15వ శతాబ్దివాడు. సంఘటన జరగిన వెంటనే వీరగాథ పుట్టును కాన, శ్రీనాథుని కాలము వఱకును పల్నాటి వీరకథలు కాని, కాటమరాజు కథలు కాని ఆంధ్రదేశమున పాడబడుట లేదనుట అవిచారితమగును. శ్రీనాథుని కన్న ముందుగనే పల్నాటి కథలను కన్నదాసు సంతతి మాలవారును, కాటమరాజు కథలను

బీరినీని సంతతి మాదిగవారును ఆశురూపమున పాడుచుండియుందురని వెనుక నిరూపించితిని. (చూ. ''వీరగాథల ఉత్పత్తి కర్తృత్వములు'' అను ప్రకరణము).

పామరులగు ఈ గాయక భిక్షువుల ఆశుకవనమునకు, శిష్టకవుల ఆశుకవనమునకును భేదమున్నది. ప్రౌఢకవులు ఆశువుగా చెప్పినను వారి కవిత్వమందు చేతనాశిల్పము ప్రత్యక్షమగును. కాని గాయక భిక్షువుల ఆశువు అచేతనా శిల్ప శోభితము. ''జానపదుడు చదువుసంధ్యలు లేనివాడు. కలము కాగిత మనునది లేక, చెప్పదలచిన విషయమును లయానుగుణముగా, ఒక్కొక్కప్పుడు లయకు సరిపోవుటకై శబ్దములు విఱిగి పొట్టివైనను, లేక పెరిగి పొడవైనను, చెప్పుట జానపదుల ఆశురచన మగును. ఈ ఆశువున తాను చెప్పునది చక్కగా నున్నదా లేదా యను పట్టింపు జానపదున కుండదు. ఈ పద్ధతి రచనమును పాశ్చాత్యులు **'Improvisation'** అనెదరు.''[47]

ఇట్లు వీరగాథను ఆశువుగా అల్లిన మొదటి కవి పేరు కాని, ఆ తరువాత ఒక నోటినుండి మఱియొక నోటికి వ్యాపించునపుడు మార్పులు చేయువారి పేర్లు కాని జనవ్యవహారమున నుండవు. ఈ వీరగాథలను ద్విపదలుగా మలచి వ్రాసినవారి నామములు సహితము కొన్ని తాళపత్ర గ్రంథములలో మాత్రమే కనబడుచున్నవి. ఎక్కువ భాగము అజ్ఞాత కవులుగనే ఉన్నారు. తాళపత్ర రూపమున గాక మౌఖిక ప్రసరణమున నున్న గాథలలో కవి నామము లసలు తెలియుట లేదు. కాటమరాజు కథలు పాడెడి సుద్దుల గొల్లలు, కొమ్ములవారు అవి శ్రీనాథ రచితములని తమ పెద్దలు చెప్పుచుండా వింటిమని తెలుపుచున్నారు. పల్నాటి కథలు, కాటమరాజు కథలు శ్రీనాథ రచితములను నమ్మకము నేటికిని తెలుగు పల్లెలలో వ్యాప్తి యందున్నది. పల్నాటి కథలలో శ్రీనాథుని రచనలు కొన్ని లభించినవి కాని, కాటమరాజు కథలలో నొక్కటియు లభింపలేదు. ''ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట'ను రచించిన గంగుల పిన యెల్లయ్య అనుకవి తాను శ్రీనాథుని వచనపద్ధతిలో వ్రాయుచుంటినని అవతారికలో చెప్పుకొనెను. అట్లే గుఱ్ఱముకొండ భక్తవత్సలకవి రచించిన 'కాటమరాజు చరిత్ర' పద్యకావ్యములో **శ్రీనాథుడను కవిశ్రేష్ఠుండు ద్విపదగా రచియించె కాటమరాజుచరిత్రము** అని యున్నది. ఈ కవిప్రమాణములే కాక, జనపదములలో (ముఖ్యముగా నెల్లూరు మండలమున) కాటమరాజు చరిత్రము శ్రీనాథుడు రచించెననుటకు కొన్ని కథలును వ్యాప్తి యందున్నవి. పరిశీలించినచో పల్నాటి వీరకథలకును, కాటమరాజు కథలకును చాల పోలికలు కూడ గలవు. ఇంకను మఱికొన్ని వీరగాథల కవులు తెలియుచున్నారు. ఇట్లు గ్రంథములను బట్టియు, ఇతర కవుల ప్రసక్తులను బట్టియు, జనశ్రుతులను బట్టియు కొందఱు వీరగాథాకవుల

---

47. *డా॥ బి. రామరాజుగారు, తెలుగు జానపద గేయ సాహిత్యము, పుట 22.*

నామములు తెలియుచున్నను, ఈ కవులకు శిష్టసాహిత్యమున కవులకున్నట్లు ప్రాముఖ్య ముండదు. మౌఖిక ప్రసరణమున ఈ కవులపేర్లు అరిగి నశించిపోయి యుండును. అందువలననే ఎక్కువ వీరగాథలు అజ్ఞాతకవి కర్తృకములుగనే లభించుచున్నవి. ఏమైనను, వీరగాథను పాడుచుండగా విని ఆనందింతుమే కాని, 'దాని రచయిత ఎవరు?' అను ప్రశ్న మన కుదయించదు.

"Good ballads are of many kinds, and doubtless had as many kinds of makers. It was the traditional art that counted - not the artist."[48]

జానపదుల అద్భుత కథ (fairy tale) వలెనే వీరగాథ కూడ అందఱి సొత్తుగా భావింపబడును కాని, ఒకే వ్యక్తికి దీనిపై అధికారముండదు. ఒకజాతి వీరగాథలు ఆ జాతిలో అందఱికిని సొంతమే! వీరగాథలు కూర్పబడు తీరుకూడ దీని కనుగుణముగనే స్వీయప్రతిభను వెలార్చునదిగాను, స్వీయఘోషను ప్రతిధ్వనించునదిగాను ఉండదు. ప్రయత్నపూర్వకముగ నెవ్వరైన ఇట్టి ఆత్మీయతాముద్ర నుంచినను, అది వాక్పూర్వక సంప్రదాయమువలన బయటకు నెట్టివేయబడును. కాబట్టి వీరగాథ 'అవేద్య కర్తృక' మనుటకన్న 'అప్రధాన కవి కర్తృక' మనుట సమంజసము. శిష్టసాహిత్యమందలి కవికి వచ్చు కీర్తికిని, వీరగాథను రచించిన కవికి వచ్చు కీర్తికిని భేదమున్నది. శిష్టకవి నామమును ఆచంద్రార్కము ఆ జాతి జనులు స్మరించుచుందురు. వీరగాథాకవి అజ్ఞాతుడు కాన నిట్టి ప్రతిఫలము వచ్చు నవకాశము లేదు. తాను ఆశువుగాపాడిన కథ ప్రజల హృదయములలో నిరంతరము ప్రతిధ్వనించుచుండుటయే వీరగాథాకర్తకు వచ్చు ప్రతిఫలము!

"The proper destiny of its author is inglorious obscurity and its appropriate place is enshrinement in the heart and memory of the people."[49]

## 4. మౌఖిక సంప్రదాయము (ORAL TRADITION)

వీరగాథ మొదట ఒక గాయక భిక్షువుచే ఆశువుగా పాడబడును. దానిని విని మఱియొకడు పాడును. అది విని ఇంకొకడు... ఇట్లు దేశమంతయు ప్రాకిపోవును. వ్రాత పూర్వకముగ గాక, ఇట్లు ఒక నోటినుండి మఱియొక నోటికి వినుకలి మాత్రముననే వ్యాపించుటను 'మౌఖిక ప్రసరణము' (Oral Tansmission) అందురు. ఈ పద్ధతిలో

---

48. *G. H. Gerould, 'The Making of Ballads', Modern Philology, Vol.21, p.24.*
49. *T. F. Henderson, The Ballad in Literature.*

వీరగాథలు ఒక తరమునుండి మఱియొక తరమునకు సంక్రమించుటను 'మౌఖిక సంప్రదాయము' (Oral Tradition) అందురు. దీనిని 'జనరంజక సంప్రదాయము' (Popular Tradition) అని కూడ పిలుతురు. ఇది వీరగాథల అతిముఖ్య లక్షణములలో నొకటి.[50] గేయస్వరూపము, కథాఖ్యానము మున్నగు లక్షణము లెన్నియున్నను, ఈ మౌఖిక సంప్రదాయము లేనిచో అది వీరగాథ కానేరదు. ఈ లక్షణము లోపించిన కారణముననే పాల్కురికి సోమనాథాదుల ద్విపద కావ్యములు కాని, ఆధునిక కవుల గేయకథలు కాని, బుఱ్ఱకథలు కాని వీరగాథలగుట లేదు.

ఈ మౌఖిక సంప్రదాయము వలన వీరగాథలో అనేకములగు మార్పులు కలిగి, వీరగాథకు సహజమగు ఒక ప్రత్యేక స్వరూపము సిద్ధించును. ఇట్లు మౌఖిక సంప్రదాయమున మార్పులు కలుగుట కూడ వీరగాథాలక్షణమే.

"One of the marked tendencies of popular narrative poetry is to alter or eliminate specific names of persons and places in the course of oral tradition."[51]

మౌఖిక సంప్రదాయమున నున్నంతకాలము వీరగాథలో మార్పులు కలుగుచునే యుండును. ఇట్లు మార్పులు కలుగుట వీరగాథ జీవలక్షణము. ముద్రించిన వీరగాథలో ఇట్టి మార్పులు కలుగు అవకాశముండదు కావున అది జీవమును కోల్పోయినదని నిర్ణయింప వచ్చును. మౌఖిక ప్రసరణమున వీరగాథలో మార్పులు కలుగు పద్ధతిని Philips Barry అను విమర్శకుడు ''ఆజ్ఞాపిత పునస్సృష్టి'' ('Command Recreation') అని పిలిచినాడు.

అది స్వరూపములో వీరగాథ ఎప్పుడును లభించదు. మౌఖిక సంప్రదాయమున అనేకములగు మార్పులకు లోనగును. దాని ఆదిరూపము గాయక భిక్షువు యొక్క ఆశుకవన మైనచో ఈ మౌఖిక సంప్రదాయమున దానికి కవిత్వపుష్టి వచ్చును. లేదా ఆ వీరగాథ ప్రత్యేకకవి సృష్టిగా వెలసినచో ఈ మౌఖిక సంప్రదాయమున దానిలోని కాఠిన్యము తగ్గి సారళ్యము వచ్చును. మొత్తముపై ఈ సంప్రదాయముచే వీరగాథకు మొదట లేని ఒక ప్రత్యేక అనిర్వచనీయ స్వరూపము సిద్ధించునని చెప్పవచ్చును.

"Oral tradition changed the form of the poem. Like money in circulation, it lost, little by little, its imprint, its salient curves were blunted; and large use gave it a polish it did not have originally."[52]

---

50. *"Tradition, again, is a prime factor in the ballads; it chooses and moulds its material in its own way"* - *Francis B. Gummere, The Popular Ballad, P. 38*
51. *F. J. Child, English and Scottish Ballads.*
52. *Emile Legouis and Luis Cazamian, A History of English Literature, p.174.*

గాయక భిక్షువుల ఆశువుగా జనించిన వీరగాథను వెనువెంటనే సేకరించుటకు వీలుపడదు. ఆశువుగా జనించిన వీరగాథ సలసల క్రాగెడి ఇనుము వంటిది. ఇది మౌఖిక సంప్రదాయమను మూసలో కొంతకాలముండి, చల్లారిన తరువాత కాని, దీనిని-తాకుటకు శక్యము కాదు. **"In its original fluid and quite choral form, the ballad could no more be preserved as a poem than molten iron is preserved as such in the casting. Only after it had cooled and hardened into some consitent shape, in some particular mould, could it be handed down as a definite ballad, sung or recited from age to age."**[53] కావున వీరగాథా సంచయనమును మౌఖిక సంప్రదాయము సుకర మొనర్చుచున్నదని చెప్పవచ్చును.

మౌఖిక ప్రసరణమున నున్నప్పుడు వీరగాథ వివిధములగు మార్పులకు లోనగుచుండును గావున దానికి ఒక ప్రమాణప్రతి ఉండదు. అనేక విధముల ప్రతులుండును. అనగా వీరగాథ ఇంకను కూర్పబడు స్థితియందే కలదని యర్థము. ఇది కాగితముపై కెక్కించిన తరువాత మార్పులు కలుగుట నిలిచిపోవును. ప్రమాణప్రతి యేర్పడును. వీరగాథ యిట్లు లిఖితరూపమున నిబద్ధమగుటను పాశ్చాత్యవిమర్శకులు 'వీరగాథా మరణము' (**Death of the Ballad**) గా పేర్కొనిరి. వివిధములగు మార్పులకు లోనగుచు మౌఖిక ప్రసరణమున నుండుట వీరగాథయొక్క జీవలక్షణమనిరి. అందుచే గాథా సంచయనకారులు వీరగాథలు సేకరింపబడిన తారీఖులను గుర్తించుట ముఖ్యము.[54] ఇవి ఆయా గాథల మరణకాలములు!

ఇట్లు లిపిబద్ధము చేయుట వలన వీరగాథలు నిర్జీవములగునను భయముచేతనే మనలో గూడ కొందఱు నిశిత విమర్శకులు వీరగాథా సంచయనమునే వ్యతిరేకించుచున్నారు. ''గ్రంథస్థమైన పదకవిత్వమును పాడుకొనుట కష్టము. (వరుసలు తెలియవు కాబట్టి). దాని గేయాంశమును నిలుపుకొనుటకు అది రసనాగ్ర సంచారిణిగనే యుండవలెను. దానిని గ్రాంథిక సాహిత్యమున జేర్చుట భౌమికావరణము నుండి మిణుగురులను నక్షత్రమండలము లోనికి తోలుట! ఇట్టివి వస్తు ప్రదర్శన శాల యందలి మృతకళేబరముల వంటివి. ఇది కారణముగ మనలోని విద్యావంతులు వీనిని గ్రంథస్థములు చేయక, తద్గాయక భిక్షువులను యథోచితముగ పోషించుచు వచ్చిరి. నేడు సంప్రదాయము నశించు రోజులు. దానిని నశింపజేయుటయే నవీన మానవుని యవతారమునకు ప్రయోజనము. వారీ పాటలను లిపిసమాధులయందు బంధించి తృప్తిపడుచున్నారు'' - ఇవి మా గురుదేవులు కీ.శే. దిగుమర్తి వేంకట సీతారామస్వామిగారి

---

53. *Francis B. Gummere, The Popular Ballad, pp.84, 85.*
54. *"But as soon as it was committed to paper this process ceased, and the text became fixed. For this reason ballad collectors maintain that the date at which a ballad is written down is to be regarded as the record, not of its origin, but of its death."*
*-Twelve Hundred Years - The Literature of England, Vol.I, p.176.*

అముద్రిత వ్యాసములలోని వాక్యములు. ఆలోచనను రేకెత్తించు ఈ వాక్యములను సులభముగా కొట్టి పాఱవేయలేము. ముద్రణ యంత్రములు వచ్చిన తరువాత వీరగాథలు నిర్జీవములైనవనుట పాశ్చాత్యు లందఱును అంగీకరించిన సిద్ధాంతము. ముద్రిత వీరగాథలను చదివి ఆనందించుట కల్ల. పాడునప్పుడే వాని సొగసు! అయినను వీని సంచయనము వర్జింప తగదు. ఏలయన, నాగరకత ఈ జానపద సాహిత్యమును నశింపజేయుచున్నది. నిత్యము నాగరకతాభివృద్ధిని పొందుచున్న మనము జానపద సంపదను తప్పక రక్షించుకొనవలెను. సేకరణలో విదేశీయుల పద్ధతుల ననుసరించటయే దిగుమర్తివారు సూచించిన ప్రమాదమునకు నివారణమని నా అభిప్రాయము. అనగా, వీరగాథా సంచయనమున కేవలము సాహిత్యాంశమును మాత్రమే ప్రోవు జేయక దానితో పాటుగ వీరగాథల సంగీతాంశమును గూడ సేకరించి భద్రపఱుపవలెను. అప్పుడే మన జానపద కవిత్వము జీవముతో మనగలదు.

ఈ మౌఖిక సంప్రదాయమున వీరగాథలు సమూలముగా మాఱిపోవునని భ్రమింప రాదు. బాహ్య స్వరూప మెంత మాఱినను ఆంతర స్వరూపము మాత్ర మట్లే నిలిచి యుండును.[55] మాతృకయగు కథాఖ్యానమున మార్పులు రావు. అనగా ఈ సంప్రదాయమున వీరగాథల భాష మాఱును కాని, కథ మాఱదు. "The elements of the story remain, wholly or in part while the literary clothing is altered according to the 'taste and fancy' of the reciter."[56]

## 5. బహుజన ఆదర పాత్రత లేక జనరంజకత్వము (POPULARITY)

ఇట్లు మౌఖిక సంప్రదాయమను లక్షణమే కాక వీరగాథకు 'బహుజన ఆదర పాత్రత' లేక 'జనరంజకత్వము' (Popularity) కూడ ఉండవలెను. వాక్పూర్వక సంప్రదాయమువలననే ఈ జనరంజకత్వము కూడ సిద్ధించును. దేశమున ఏ పల్లెకు పోయినను, ఏ తిరునాళ్ళకు పోయినను, వీరగాథచే మన చెవులు గింగురు లెత్తవలెను. తెలుగులో బొబ్బిలి కథ, దేశింగురాజు కథ, బాలనాగమ్మ కథ, కాంభోజరాజు కథ, కామమ్మ కథ, లక్ష్మమ్మ కథ, చిన్నమ్మ కథ - మున్నగు వీరగాథలకు ఇట్టి జనరంజకత్వ లక్షణము సంపూర్ణముగా గలదు. ఇవి పాడబడని పల్లె ఆంధ్రదేశమున లేదనుట అతిశయోక్తి కాదు. వేదములు మౌఖిక సంప్రదాయమున వ్యాపించినను, వానికిట్టి బహుజన ఆదర పాత్రత లేదు. అవి అగ్రకులములవారికి మాత్రమే (అ

---

55. *"Each singer may vary the texts, shorten them, or blend them with other pieces. Usually, however altered in transmission the main situation or episode persists. The critical moment or happening stands out."*
*-Prof. Louise Pound, the Encyclopedia Americana, Vol.III, p.96.*
56. *Frank Sidgwick, Introduction, Popular Ballads of the Olden Time .*

అగ్రకులములలో గూడ పురుషులకు మాత్రమే - (స్త్రీలు వేదములను చదువరాదు) పరిమితములు. అందుచే నివి జానపద కవిత్వమన జెల్లవు. కాబట్టి జనరంజకత్వము గూడ వీరగాథల ముఖ్య లక్షణములలో నొకటియని చెప్పవచ్చును.

"..... a nation makes its own ballads, which do not become current coin until stamped with public approval." [57]

ఏ కవియైనను ఒక కథను గేయరూపమున వ్రాయవచ్చును. అంతమాత్రమున అది వీరగాథ కానేరదు.[58] గురజాడ అప్పారావుగారి 'పూర్ణమ్మ కథ' యు, డా॥ సి.నారాయణరెడ్డిగారి 'కర్పూర వసంతరాయలు' ను మాత్రాచ్ఛందమున సరళరీతిలో వ్రాయబడినగేయకథలే! కాని వీనికి మౌఖిక ప్రసరణము లేదు; సామాన్య ప్రజలలో బహుళ వ్యాప్తియును లేదు. ఇవి చదువుకొని ఆనందింపగల సంస్కారవంతులకు ఉద్దేశించినవే కాని, విని ఆనందింపగల జనసామాన్యమునకు ఉద్దేశించినవి కావు. వీనికి ప్రజామోదముద్ర పడలేదు; ఇవి వీరగాథలు కావు.

సిసలైన వీరగాథ ఎల్లప్పుడును సామెతవలె ప్రజల రసనాగ్రములపై తాండవ మాడుచుండును. ప్రజాదరణయే వీరగాథకు ప్రాణము. దీనిలో ప్రజల అభిరుచులు, మనోభావములు, ఉద్రేకములు, నిసర్గ మధురముగా వర్ణింపబడుటచే ఇది జాతితోపాటు శతాబ్దముల తరబడి పయనించును. ఈ నిసర్గ వర్ణనమే వీరగాథల జనరంజకత్వమును తరముల తరబడి నిలుపుచున్నది.[59] ఇట్టి బహుజనాదర పాత్రతచే వీరగాథ, జాతి జీవనాడులలో వసింప సమర్థమై యున్నది. ఈ శక్తిని గ్రహించియే మహారాజులు తమ సాహసములను గానము చేయుటకు గాథాకారులను పోషించెడివారు:

"When James, Duke of York, went to Scotland to seek for that popularity which he had lost in England, he is supposed to have taken with him an English ballad-maker to sing his praises . . . . ."[60]

తాత్కాలిక సమస్యలపై వ్రాయబడిన పాటలు, రాజకీయ ప్రచారగీతములు, చలన చిత్రముల పాటలు జనప్రీతిని బడయుచుండుట కలదు. అంత మాత్రమున అవి జానపద

---

57. *Henry B. Wheatley, General Introduction to Reliques of Ancient English Poetry, Vol.I, p.xxxi.*
58. *"A poet may write a poem and call it a ballad; but it requires the public approval before it becomes one in fact." - Ibid., p. xxxiii.*
59. *"Nature is the salt that keeps the ballad alive, and many have maintained a continuance of popularity for several years." - Ibid., p.xxxi*
60. *Ibid., p.xlii.*

గేయములు కానేరవు. ఇవి ప్రజలలో సహజముగా పుట్టిన గీతములు కావు. సంస్కారులైన కవులు వ్రాసినవి. గరిమెళ్ళ సత్యనారాయణగారు రచించిన ''మాకొద్దీ తెల్ల దొరతనము'' పాట స్వాతంత్ర్యోద్యమములో ఎంత ప్రచారమందినను, తెలుగు జానపద గేయము కాలేదు. అట్లే శ్రీ తిరునగరి రామాంజనేయులు రచించిన ''రాష్ట్రవాంఛ'' అను సుద్దుల కథ ఆంధ్ర రాష్ట్రోద్యమమున నెంతయో ప్రసిద్ధి వడసినను, కాటమరాజు కథల సరసన నిలబడుటకు కూడ పనికిరాదు. శ్రీ వేములపల్లి శ్రీకృష్ణగారి ''చెయ్యెత్తి జై కొట్టు తెలుగోడా'' పాట కూడ తెలుగువారి జానపద గేయము కాలేదు. వీనిక గల జనరంజకత్వము తాత్కాలికమైనది. జానపద గేయముల జనరంజకత్వము, వీరగాథల జనరంజకత్వము శతాబ్దముల తరబడి యుండునట్టివి. చలనచిత్రములలో జానపదగేయానుకరణము లెన్నియో వచ్చుచున్నవి. కాని అవి బుద్బుదముల వలె నశించిపోవుచున్నవి. మూడు నెలల తరువాత బ్రతికియుండిన 'సినీమా పాట'ను నేను వినలేదు. వీని పుట్టుక వలెనే వీని ప్రయోజనమును, జనరంజకత్వమును తాత్కాలికమైనవే! వీరగాథల జనరంజకత్వము స్థిరమైనది; తరతరముల నుండి వచ్చునది!

ఆశు కవనము (Improvisation), మౌఖిక సంప్రదాయము (Oral Tradition) - అను ఈ రెండు లక్షణములును వీరగాథ కత్యంత ముఖ్యమగు లక్షణములని ఫ్రాన్సిస్ బి. గుమ్మే వంటి విమర్శకుల తలంపు. ఈ రెండు లక్షణములను కలిపి వీరు 'వీరగాథా సూత్రము' (Ballad Formula) అని పేరిడిరి.[61]

## 6. పరాశ్రయ కవిత్వము (OBJECTIVE POETY)

వీరగాథలు కథాఖ్యానాత్మకములగుట చేతను, ఆశురచనలైనను అప్రధాన కవికర్తృకము లగుట చేతను వీనియందు పరాశ్రయతాగుణముండునని గ్రహింపనగును. కాని ఈ పరాశ్రయత కథాఖ్యాన కవిత్వము(Narrative Poetry)న కుండవలసిన దానికన్న అధికముగ నుండునని తెలిసికొనవలెను.

పాడబడునది గేయము; కథను చెప్పునది ఇతిహాసము; పాత్రలను నటింపజేయునది నాటకము. గేయములో కవి ప్రత్యక్షముగా కనబడును; స్వీయఘోషను వెలార్చును. ఇతిహాసములో కవి అర్ధభాగమే కనబడును; ఆఖ్యానమును వివరించునప్పుడు దృశ్యుడుగను, పాత్రలచే సంభాషణలు జరపించునపుడు అదృశ్యుడుగను ఉండును. నాటకమునందు కవి పూర్తిగా నదృశ్యుడై పాత్రల చేతనే కథను నడిపించుచుండును. కాబట్టి గేయకవిత్వము పూర్తిగా

61. *"Improvisation and tradition, to be sure, is also the ballad formula"*
*-The Popular Ballad, p.42.*

ఆత్మాశ్రయ కవిత్వము (Subjective Poetry); ఇతిహాస కవిత్వము ఎక్కువ భాగము పరాశ్రయ కవిత్వము (Objective Poety); నాటక కవిత్వము పూర్తిగా పరాశ్రయ కవిత్వమే.

వీరగాథ బాహ్య రూపమున గేయమువలె నున్నను ఆత్మాశ్రయ కవిత్వము కాదు. ఆంతర రూపమున ఇతిహాసమైనను వీరగాథాకవి దృశ్యాదృశ్యుడుగ నుండడు. వీరగాథాకవి నాటకము నందువలెనే సంపూర్ణముగా నదృశ్యుడై యుండును. కాబట్టి వీరగాథ నాటకము వలెనే శుద్ధ పరాశ్రయ కవిత్వము.[62]

వీరగాథ బాహ్య స్వరూపము భావగీతము వంటిది; ఆంతర స్వరూపమున - అనగా కథాకథనమున ఇతిహాసమువంటిది; పరాశ్రయతా లక్షణమున నాటకమువంటిది. అంతేకాదు, వీరగాథ ఆదిలో వైయక్తిక సృష్టియైనను మౌఖిక ప్రసరణమున పలువురిచే రకరకములుగా మార్పబడుట చేతను; పునరావృత్తి, అభివర్ధిత పునరుక్తి మొదలగు లక్షణములచేతను దీనియందు గానమేళ తత్త్వము (choral element) కూడ ఇమిడి యున్నది. కావున వీరగాథ భావగీతి, ఇతిహాసము, నాటకము, బృందగానము - అను నాల్గు ప్రక్రియల లక్షణములతో కలిపి ముద్దగా చేయబడిన విశిష్ట ప్రక్రియ.

"The ballad is a conglomerate of choral, dramatic, lyric and epic elements which are due now to some suggestive refrain, now to improvisation, now to memory, now to individual invention and are forced into a more or less poetic unity by the pressure of tradition in long stretches of time."[63]

రష్యా, స్పెయిన్, యుగోస్లోవియా దేశముల వీరగాథలలో ఈ పరాశ్రయతా గుణము ప్రస్ఫుటముగా గోచరించును. స్పెయిన్ దేశపు 'రొమాన్సెస్' అనబడు వీరగాథలలో గేయ సహజమగు విస్తరణ కాని, ఆత్మాశ్రయత్వమునకు తావిచ్చు వ్యాఖ్యానములు కాని లేక, శ్రోతలు వీరగాథలలోని పాత్రలతోను, కథాగమనముతోను ప్రత్యక్ష సంబంధమును కలిగి యుందురు. ఇట్టి ప్రశస్త వీరగాథలను వినియే విమర్శకులిట్లనిరి: "The fundamental characteristic of popular ballads is therefore the absence of subjectivity and of self-consciousness."[64]

---

62. *"The true ballad is essentially dramatic and one that is to make itself felt should be all action, without any moralizing padding, for it is a narrative in verse meant for the common people."*

*-Henry B. Wheatly, General Introduction to Reliques of Ancient English Poetry, pp.xxxii, xxxiii.*

63. *Francis B. Gummere, The Popular Ballad, p.321.*
64. *T. F. Henderson, The Ballad in Literature, p.60*

ఆత్మాశ్రయతా గుణము ఏ మాత్రము కనబడినను అది వీరగాథ కానేరదు. కవి సంబంధమైన ఆత్మాశ్రయతయే కానక్కఱలేదు; పాడెడి గుంపుయొక్క ఆత్మీయతాముద్రను సహితము వీరగాథ సహింపదు[65]. బలవంతముగా ప్రవేశించిన ఒకటి రెండు ఆత్మాశ్రయతా గుణములు మౌఖిక ప్రసరణమున బహిష్కరింపబడును.

## 7.1 శైలీ సారళ్యము (SIMPLICITY OF STYLE)

వీరగాథల శైలి సరళముగా నుండవలెను. ఈ సారళ్య గుణము ఒక్క శైలికి మాత్రమే పరిమితమగు లక్షణము కాదు. పైన తెల్పిన అన్ని లక్షణములకును ఇది వర్తించునని గమనింప వలెను. ఛందస్సు సరళ దేశిచ్ఛందస్సుగా నుండవలెను. గానము ఎక్కువ రాగభేదములు లేక సరళముగా నుండవలెను. కథ నీతిబోధతో బరువుగా నుండక వినోదాత్మకముగా నుండవలెను. ఇట్లు సారళ్య గుణము వీరగాథల అన్ని లక్షణములకును వర్తించును.

వీరగాథ ఇతివృత్త విషయమున మిగిలిన సాహిత్య ప్రక్రియలను పోలును కాని, శైలీ స్వరూపములలో ఏ యితర ప్రక్రియలను పోలదు. వీరగాథ దొక ప్రత్యేక శైలి, ప్రత్యేక స్వరూపము:

"....the ballad may resemble literary poem in its matter, but never in its structure and style. Short or long, old or new, it shuns metaphor and all striving for figurative effect. It is simple in those sense that there is no play of fancy in epithet, phrase or word, or in the arrangement of words and phrases. It is not simple in all senses, because it has its own easily recognised style - that ballad 'slang' oftener mentioned than known."[66]

వీరగాథా శైలి బాహ్యాడంబరమును, అనావశ్యక విషయ వర్ణనమును వర్జించి ప్రసన్నముగా నుండవలెను[67]. ఛందస్సు, స్వరము, ఇతివృత్తముల వలెనే శైలియు సరళమే. అట్లని పేలవము కాదు. ఆడంబరమును వర్జించినను విషయమును మనః ఫలకముపై చిత్రింపగల శక్తి కలిగినదై యుండవలెను.[68]

---

65. *"....any ulterior purpose, any subjective hint; even when subjectivity is of the throng, takes a poem at once out of the ballad file." -Ibid.*
66. *Francis B. Gummere, 'Ballads', The Cambridge History of English Literature, Vol.II, p.406.*
67. *"Wilhelm Grimm .... said that the ballad says nothing unnecessary or unreal, and despises external adornment." -Frank Sidgwick, Introduction, Popular Ballads of the Olden Time.*
68. *"Ferdinand Wolf, the great critic of the Homeric question, said the ballad must be naive, objective, not sentimental, lively and erratic in its narrative, without ornamentation, yet with much picturesque vigour." -Ibid.*

తెలుగు వీరగాథల భాష దేశీయమైనది. ఇందు సజీవ వ్యావహారిక భాష ప్రయోగింపబడినది. ఇది ప్రాంత ప్రాంతమునకు భేదించి, ఆయా మాండలికములతో నొప్పు చుండును. తెలంగాణము, రాయలసీమ, మధ్య సర్కారులు, ఉత్తర సర్కారులు మొదలగు మాండలికములను వీరగాథల భాషలో గుర్తింపవచ్చును. పల్నాటి వీరకథలు, కాటమరాజు కథలు వాని రచనాకాలమునాటి వ్యావహారిక భాషలోనే వ్రాయబడినవి.

వీరగాథల సారళ్యమును కేవలము భాషా సారళ్యము మాత్రముగనే అర్థము చేసికొనరాదు. భావార్థ సారళ్యము కూడ దీనిచే సూచింపబడినది. నిజమున కీ భావార్థ సారళ్యమే ముఖ్యమైనది. జానపద పద్ధతిలో కొన్ని సాధారణ పదములు ఒక సాధారణ పద్ధతిలో ప్రయోగించుట; శబ్దాలంకారములు అర్థాలంకారములు కఠిన పదములు ప్రయోగింపకుండుట - ఇత్యాదులచే ఈ భావార్థ సారళ్యము సాధింపబడును.

"The Icelandic sagas are simple, and so is a lyric of Wordsworth; but ballads are not simple in this artistic way . . . . Indeed, it is the thought and meaning of the ballads which are simple, rather than their expression."[69]

తెలుగులో గురజాడ అప్పారావుగారి గేయములు, బసవరాజు అప్పారావుగారి గేయములు సరళముగనే ఉండును. కాని, వీనిలో భాష, ఛందస్సు సరళముగ నున్నను, భావ శబలత మిక్కిలి యెక్కువ. ''దేశమంటే మట్టికాదోయ్, దేశమంటే మనుషులోయ్'' అను పంక్తులు పైకి చాల సులభముగ కనిపించినను వీనిలో ఎంతయో భావము ఇమిడి యున్నది. నండూరివారి యెంకిపాటలలో గూడ ఈ భావశబలత మిక్కిలి యెక్కువ. అందుచేతనే ఇవి జానపద గేయములు కానేరవు. వీరగాథలలో భాషాచ్ఛందస్సులే కాక, భావములు, అర్థములు కూడ సరళముగా నుండుట ప్రత్యేకత. ఒక విధముగా భాషాచ్ఛందస్సులకన్న భావార్థములే మిక్కిలి సరళముగా నుండునని చెప్పవచ్చును.

## 7.2 సాధారణ ప్రయోగములు లేక 'వారానువర్తనములు' (COMMONPLACES)

వీరగాథలలో కథాగమనమున ఆయారసముల కనుగుణముగా కొన్ని పడికట్టు పదములు, వాక్యములు, అలంకారములు పదేపదే ప్రయోగింపబడును. వీనిని జూచి మనము వీరగాథలను అత్యంత సులభముగా పసిగట్టవచ్చును. వర్ణనలు, అలంకారములు చాల తక్కువ. ఉన్నవి కూడ ఒకే సాంప్రదాయక పద్ధతి ననుసరించి యుండును. పరస్పర భిన్నములగు

69. *Francis B. Gummere, The Popular Ballad, p.70.*

వీరగాథలలో సహితము ఈ పడికట్టు పదములు మాత్రము సమానముగనే ఉండును. వర్ణన లోను, పాత్రచిత్రణలోను, నాటకీయధోరణిలో సాగు సంభాషణలలోను ఈ సాధారణ ప్రయోగములు దొరలుచునే యుండును.

తెలుగు వీరగాథలలో రౌద్రమును వర్ణించునప్పుడు 'ఆగ్రుడై మండి', 'తెల్లని గుడ్లకు తెచ్చె రకతంబు', 'ఎఱ్ఱని గుడ్లకు ఎక్కె-కోపములు' అని ప్రయోగింపబడుచుండును. శోకమును వర్ణించు నప్పుడు ''గోడు గోడున దుఃఖ పోయె'', ''కుడికంటి వుదకాలు కుంభవర్షము లాయె, ఎడమకంటి వుదకాలు ఏరులై పారె'' అని చెప్పబడుచుండును. ''కెవ్వున కేయవేయుట, గళ్ళున నవ్వుట, కిలకిల కిలారించుట'' - ఇత్యాదులు సాధారణము. వీరగాథలో ఒకవ్యక్తి సంభాషణకు ఉపక్రమించుచున్నాడని కవి చెప్పునప్పుడు ''అప్పుడు (బ్రహ్మన్న) ఆడె నొక మాట'', ''అప్పుడు (నలనన్న) ఆడె నొక మాట'' అను వాక్యము వ్రాయబడును. ఒక పాత్ర వేఱొక పాత్రను సంబోధించునపుడు ''వినవోయి (నాయుడా) విశదంబుగాను'', ''వినవోయి (తమ్ముడా) విశదంబుగాను'' అను వాక్యముతో ప్రారంభించును. ఇట్టివి పల్నాటి కథలలోను, కాటమరాజు కథలలోను కొల్లలుగా నున్నవి. ''కండ్ల జూచి'' అనుమాట ప్రతి వీరగాథలోను కనబడును. బొంగరాలాటలు, కోడిపందెములు తెలుగు వీరగాథ లన్నిటికిని సాధారణములు. ఇట్లు వీరగాథలలో సర్వసాధారణముగా కానవచ్చు పడికట్టు పదములను పాశ్చాత్య విమర్శకులు **'Ballad Commonplaces'** అందురు.

**"Ballads are usually written in simple languages. They also contain many words and phrases, such as 'gay lady' and 'proud porter' which are used again and again, and are called 'ballad componplaces.' "** [70]

ఇంగ్లండు వీరగాథలలోను, స్కాట్లండు వీరగాథలలోను గూడ ఈ వారానువర్తనములు హెచ్చు. అందు పరిసరము లెప్పుడును పచ్చని అరణ్యములుగా పంటచేలుగా వర్ణింపబడుచుండును. దుస్తులు, గుఱ్ఱపుజీనులు, ఆభరణములు మున్నగునవి ఆకుపచ్చ, ఎరుపు, నీలము, బంగారు రంగులలోనున్నట్లు వర్ణింపబడుచుండును. ప్రకృతివర్ణన లసలే ఉండవు. వెన్నెల - ఎండ సమముగనే చూడబడును. సూర్యోదయ సూర్యాస్తమయ వర్ణన లుండవు. ఆఱు ఋతువులును వీరగాథా కవుల దృష్టిని పడకుండ చల్లగా జాఱుకొనును. ఉపమానములు చాల తక్కువ. ఉన్నవి కూడ మిక్కిలి సంక్షిప్తముగా నుండును. ఉదాహరణమునకు **"Feet as white as sleet"** అని మాత్రమే ఉండును. కవి స్వీయప్రతిభను చూపుటకై ఎక్కడను వర్ణింపడు. ఏ వర్ణనయైనను నిరలంకృతముగా, సహజముగా పలుచగా

70. *G.F. Whicher, The World Book Encyclopaedia, Vol.2, p.616.*

నుండును. రూపకాద్యలంకారము లుండవు. పాత్రోన్మీలనము కూడ సహజముగా పడికట్టు పదములతోనే సాగును.

ఇట్లు సర్వసాధారణ వర్ణన లుండుటచే వివిధ వీరగాథలలోని పాత్రలన్నియును ఒకే రకముగా ఒకదానికొకటి 'కార్బను కాపీ'ల వలె నుండునని తలంపరాదు. అలంకారములు వర్ణనలు తక్కువగా నున్నను, వీరగాథలలోని ఉత్సాహోద్రేకములు, శైలిలోని సహజ సారళ్యము, ప్రత్యక్షీకరణము, వీనిని రసవంతములుగా నుంచుచున్నవి.[71] వీరగాథలలో ధ్వని, వక్రోక్తి మున్నగు అలంకారము లుండవు సరికదా, ఇతివృత్తము ప్రాంతీయ సంఘటనకు సంబంధించి యుండుటచే, ఎంత త్రిప్పిచెప్పినను పామరు లందఱికిని సులభముగా నర్థమగుచుండును. శైలీ సారళ్యముతో, సాధారణ ప్రయోగములతో సహజ సుందరముగా సాగు పరిశుద్ధ రచనలు వీరగాథలు. కావుననే 'గుమ్మే' పండితుడిట్లనినాడు: "They are fresh with the open air; wind and sunshine play through them."[72]

## 8. అనితర సాధ్యత

వీరగాథా కవిత్వము ఇంతటి సారళ్యముగల కవిత్వమగుటచే దీని నెట్టివారైనను వ్రాయగలరని భ్రమింపరాదు: "A good ballad is not an easy thing to write, and many poets who have tried their hand at composition in this branch of their art have signally failed."[73].

ఎంతటి మహాకవులైనను, జానపద సాహిత్యము నెడ ఎంతటి అభిమానము గలవారైనను, వీరగాథలను వ్రాయుటలో కృతకృత్యులు కాలేరు.[74] వీరగాథా కవిత్వమున వైయక్తిక

71. *"Description is sparse; and metaphor and other poetic figure is rare; character - heroic, adventurous, diabolic, amorous -- is delineated by stock epithets and in the development of the tale itself. There is seldom much complication of character; but the verve and directness of the ballad style save personalities from degeneration into generalized types. Thoughts, motives and passions are boldly spontaneously and often brutally expressed."*
*-J. Kinsley, Cassell's Encyclopaedia of Literature, Vol.I, p.41*
72. *Francis B. Gummere, 'Ballads', The Cambridge History of English Literature, - Vol. II, p. 418.*
73. *Henry B. Wheatley, General Introduction to Reliques of Ancient English Poetry, p.xxxii.*
74. *"Experiment has shown that sophisticated poets cannot successfully imitate the old ballads, though they can use the technique of the ballad-makers to enhance the loveliness of their own."*
*-G. H. Gerould, 'The Making of Ballads', Modern Philology, Vol.21, p.23.*

ప్రాధాన్యము లేకపోవుటయే దీనికి కారణము.[75] ఇది అచ్చమగు ప్రజాకవిత్వము. ''ప్రజల కొఱకే పుట్టి, ప్రజలకే ఆదరపాత్రమై, వారి మెప్పునే ఆశించి, తాను తరించి, వారిని తరింపజేయు ప్రజాకవిత్వమిది''.[76] దేశముయొక్క ఆత్మ దీనిలో ప్రతిఫలించును. కావున Herder పండితుడు వీరగాథలకు "Voices of the Nations" అని చక్కని పేరిడినాడు. భారతదేశమున ఔత్తరాహులు కూడ 'ధర్తీ గాతీ హై', 'లోక సాహిత్య' అను పేర్లు పెట్టినారు.

కవులు ప్రౌఢసాహిత్యమున అనేక ప్రక్రియలను సృజించిరి. ఇవి ప్రసిద్ధ వీరగాథల కన్న చాల గొప్పవి అనుటలో సందేహము లేదు. కాని వీరగాథల సహజ సౌందర్యమును మాత్రము ఏ కవియు అనుకరింప లేకపోయినాడు:

"The grest poems of the world are far greater than the greatest ballads; but no poet has ever had the power to compete with popular tradition on its own ground. Art can create far beyond the beauty of sea-shells, and on occasion can exactly reproduce them; but it cannot fashion or imitate their murmur of the sea!" [77]

ఇంగ్లండు కవులు, స్కాట్లండు కవులకన్న మేధస్సంపన్నులే. అత్యుత్తమ కవిత్వమును సృజించిన దిట్టలే. కాని ఇంగ్లీషు వీరగాథా కవిత్వమును స్కాట్లండు వీరగాథా కవిత్వము ప్రక్కన పెట్టినచో అది వెలవెల పోవును.[78] మహాకవులుండియు ఇంగ్లీషు వీరగాథా కవిత్వము నీరసముగా నున్నది. కావున కవి పుంగవులు ఉత్తమవీరగాథలను సృజించుటలో కృతకృత్యులు కాలేరనుట కిది చక్కని యుదాహరణము. కాబట్టి శుద్ధ ప్రజాకవిత్వమగు వీరగాథలు ప్రజలలోనే పుట్టును. జానపద గాయక భిక్షువులే వీని యావిర్భావమునకు కారకులు. ఇప్పుడు మనకు సకర్తృకములుగా లభించుచున్న వీరగాథలు మౌఖిక సంప్రదాయమను మూసలో కరిగి కరిగి కృత్రిమత్వము నశించి, ఆత్మీయతాముద్రలు వర్జింపబడి, క్షాళితములైన సుస్వరూపములని గుర్తింపవలెను. కవిచే సృజింపబడిన క్రొత్తలో కాని, గాయక భిక్షువుచే ఆశుకవనముగా వెలువడిన క్రొత్తలో కాని అవి వీరగాథలు కావు. కాలక్రమమున మౌఖిక ప్రసరణమున పరాశ్రయతాగుణము హెచ్చి వీరగాథలగును.

---

75. *"It is no individual that speaks out his thoughts, his hopes, his fears in the ballads." "...they represent no individual, but are the voices of the people; and successful imitation of them by any individual, however gifted and sympathetic he may be is a task hardly to be done."* - *Francis B. Gummere, The Popular Ballad, p.346 & 321.*

76. *ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు, పల్నాటి వీరచరిత్ర, పీఠిక, పుట 27.*

77. *Francis B. Gummere, The Popular Ballad, p. 321.*

78. *"It is strange that English ballads should be in the main so inferior to Scottish, when we consider the great poetic genius of the English people."*
*-Mrs. Margaret L. Woods, Essays by Divers Hands, Vol.VI, p.37.*

## 9. అద్వితీయ లక్షణము (UNIQUE CHARACTER) – ఏక సూత్రత

అనితర సాధ్యములగు ఈ వీరగాథలకు మఱియొక అద్వితీయ లక్షణమున్నది. ఇది మఱి యే యితర సాహిత్య ప్రక్రియకును లేని అద్భుత లక్షణము. ఒక దేశమున ఎన్ని వీరగాథలున్నను వాని యన్నింటిలోను ఒక సమానత్వము గోచరించును. ఆంధ్ర ప్రదేశములోని కథలన్నింటిలోను ఇట్టి సమానత ఉన్నది. ఇట్లొక్క దేశమే కాదు; భారతదేశ మంతయు నొక ఉపఖండము; ఒకే సంస్కృతి కలది. కాబట్టి భారతదేశములోని వీరగాథలన్నింటిలోను సమానాంశము లుండును. ఇట్లొక ఉపఖండములోనే కాదు. ఒక ఖండములోని వీరగాథలన్నిటిలోను సమానాంశము లుండును. ఐరోపా ఖండమందలి వీరగాథ లన్నింటిలోను సమానత గోచరించుచున్నది.

"But in the making of stories, the human imagination, like the rest of human nature, works wonderfully alike all the world over.... We cannot, however, doubt that certain ballad themes found all over Europe have a common origin, inspite of the very various forms the stories take."[79]

**9.1 ప్రాక్తన మానవ సంఘ నిరూపణము:** మధ్యధరా సముద్రమున గల 'సిసిలీ' (Sicily) ద్వీపములో ఏడువేల వీరగాథలున్నవని 'పిట్రే' (Pitre) అను విమర్శకుడు నిర్ణయించినాడు. ఇందు పెక్కు గాథలలోని రాగద్వేషములు, సంఘటనలు, పదప్రయోగములు, భావములు మున్నగునవి ఇంగ్లండు, స్కాట్లండు, స్కాండినేవియా, గ్రీసు, జర్మనీ, ఇటలీ, ఫ్రాంసు, స్పెయిన్ ఇత్యాది దేశములలోని గాథలతో.పోలియున్నవి.[80] ఇది నిశితముగా పరిశీలింప వలసిన విషయము. అతి ప్రాచీన కాలమున ఈ భాషలన్నియు నొకే మూలమునుండి ఉద్భవించిన వగుటచే వీని జానపద సంపద ఒకే విధముగా నున్నది. ఈ వీరగాథలన్నియు ఏదో ఒక దేశమునకు మాత్రమే పరిమితములు కావు. మొత్తము ఆర్యభాషా కుటుంబమువారి కందఱికిని సామాన్యమగు సంపద.[81]

**9.2. వసుధైక కుటుంబ నిరూపణము:** ఇట్లు కొన్ని మానవ సంఘముల వీరగాథలలోనే కాక, మొత్తము ప్రపంచములోని వీరగాథలన్నిటిలోను ఏకత్వగుణము గోచరించుచున్నదని

79. *Ibid., p.34.*

80. *".....the bonds of association are indisputable, and they make European balladry, despite striking national differences, into a substantial unit."*
*-W.J. Entwistle, Chambers's Encyclopaedia, Vol.II, p.73.*

81. *"They do not belong to one nation in particular, but are the property of at least of all the people of the Aryan family." - The Home University Encyclopaedia, p.377.*

చెప్పవచ్చును. కథావస్తువు, ఛందస్సు, శైలి, సంగీతము, వస్తు వైవిధ్యము, పాత్రలు, సాంఘిక పరిసరములు -మొదలగువాని విషయమున ప్రపంచమున గల వివిధ దేశములు తమతమ ప్రత్యేకతలను చూపవచ్చును. కాని వీనియన్నిటికిని మూలముగా ఉద్రేకములు, రాగద్వేషములు, కొట్లాటలు, సాహసములు, అత్యాశలు, హతాశలు - అను శాశ్వత వలయమున్నది. ఈ వలయము ప్రపంచ మానవాళి కంతకును సహజమే కదా! ఈ ఉద్రేకాది గుణములను వివిధ దేశముల వీరగాథలు సరళరీతిని ప్రత్యక్షముగా పటిష్ఠముగా వ్యక్తము చేయును. ఇట్లు ఏకత్వగుణ భాసితములగుటచే, వీరగాథలు వసుధైకకుటుంబ నిరూపణ సమర్థము లనవచ్చును. ఇది అన్ని సాహిత్య ప్రక్రియ లందును కానవచ్చు గుణమన్నచో, అది ఇతరములకన్న ఈ వీరగాథలయందు ఎక్కువగా నున్నదని చెప్పవచ్చును. నవల, కథానిక ఇత్యాది ప్రక్రియలు ఒక దేశమునుండి మఱియొక దేశమునకు సంక్రమించినవి. కాని ఈ వీరగాథలు అట్టి యనుకరణములు కావు. ఇవి ప్రతి దేశమందును సహజముగా పుట్టినవి.

## 10. నీతి ధ్వని - జీవిత విషాద ప్రతిధ్వని

వీరగాథ నాటకమంతటి పరాశ్రయ కవిత్వ మగుటచే నీతిబోధ చేయుట కవకాశము ఏ మాత్రమును లేదు. ఇది నీతిబోధకు సరిగా వ్యతిరేకమగు కవిత్వము. అయినప్పటికిని వీరగాథ లలో నేమియు గుణపాఠము లేదని భావము కాదు. వీరగాథలు నీతిని వాచ్యముగా బోధింపవు కాని, నిశ్శబ్దముగా ధ్వనింపజేయును. ఆ గుణపాఠమును మనము గ్రహింపవలెను. ''విధి బలీయము, మానవుడు నిమిత్త మాత్రుడు'' అను ప్రాబడిన నీతియే వీరగాథలలో నుండును.

"They echo without comment the clash of man with fate. If any lesson is to be learned from them, it is by implication: the old lesson that while destiny is inevitable, inexorable, the victim is there neither to whimper nor to mock over his plight, but simply to play the man."[82]

వీరగాథ లన్నియును జీవిత విషాదమును ప్రతిధ్వనించుచుండును. జీవిత సత్యమును సంతోషముతో స్వీకరించు మనుష్యుల హృదయములనుండి ఇవి పుట్టుటయే ఈ ప్రతిధ్వనికి కారణము. జీవితములో ప్రతి ప్రస్థానము చివరను ఓటమి ఉన్నదని వారికి తెలిసియు, ఆ జీవితమును ఆనందముగా స్వీకరించిరి. ప్రపంచ వీరగాథ లన్నియును ఇట్లు జీవితవిషాదమును ప్రతిధ్వనించునట్టివే.[83] మానవ జీవితము నొక సంగ్రామముతో పోల్చినచో, వీరగాథలు

---

82. *Francis B. Gummere, The Popular Ballad, p.340.*
83. *"A modern writer has pointed out that Germanic popular poetry, along with Celtic and Slavic, has always loved the beaten cause and echoed the tragedy of life."*
*Ibid., p. 343*

ఆ సంగ్రామము ఒక సామాన్య సైనికునివలె యథాతథముగా మనకు నివేదించునే కాని, సైన్యాధ్యక్షుని వలె ఆలోచనను రేకిత్తించు ధోరణిలో తర్కించి వివరింపవు.

"They report the battle of life as soldiers, not as captain, with eyes and ears for the fighting alone, and no thought of plan and campain and allies and the unseen leader of the foe."[84]

**గాథలు – గాథానికలు:** పైన చర్చించిన పది లక్షణములును వీరగాథ లన్నింటికిని వర్తించెడివే. కాని, ఈ వర్తించుటలో కొంచెము తరతమ భేదమున్నది. వీరగాథలలో 'గాథలు' (Ballads), 'గాథానికలు' (Balladlings) అను రెండు వర్గములున్నవని రెండవ ప్రకరణమున తెలిసికొంటిమి. (చూ. 'వీరగాథా నిర్వచనము'). పైన చెప్పిన లక్షణములలో కొన్ని గాథల కెక్కువగా పట్టును; మఱికొన్ని లక్షణములు గాథానికల కెక్కువగా వర్తించును. గాథ - గాథానికల స్వరూప స్వభావములే ఈ వ్యత్యాసమునకు కారణము. గాథానికలు ప్రాథమిక స్వరూపములు; గాథలు పరిణత స్వరూపములు. సంక్షిప్త శిల్పము, సంఘటనా ప్రాబల్యము, కథాఖ్యాన రాహిత్యము (లేదా లఘుత్వము), బృందగానాతిభారము - గాథానికల స్వభావములు. విస్తృత శిల్పము, కథాఖ్యాన వేగము, వివిధ భాగముల సమ్యక్సమ్మేళనము, వైయక్తిక గానము - గాథల స్వభావములు. గాథానిక ప్రాక్తన మానవుల నృత్తగీతమునకు దగ్గఱగా నుండును. గాథ ప్రాచీనేతిహాసమునకు దగ్గఱగా నుండును.[85] కావున గేయస్వరూప లక్షణములు గాథానికలలోను, కథాఖ్యానాత్మక లక్షణములు గాథలలోను అధికముగా నుండును. గాథానిక లన్నియును అవేద్య కర్తృకములుగనే ఉండును, గాథలలో చాలభాగము విదిత కర్తృకములు. పరాశ్రయతా గుణము గాథానికలలో కన్న గాథలలో ఎక్కువ. మిగిలిన లక్షణములు రెండింటికిని సమానములే!

## లోపములు

పైన తెల్పిన పది లక్షణములును ఒక విధముగా వీరగాథల ప్రాశస్త్యమును నిరూపించు లక్షణములే యనవచ్చును. కేవలము సత్ప్రవర్తనము వలననే కాక దుష్ప్రవర్తనము వలన గూడ కొందఱు ప్రసిద్ధులగుచుందురు. శిష్ట సాహిత్యమందలి ప్రతినాయకు లందఱును ఇట్టివారే. వీరగాథలకు కొన్ని లోపములు కూడ ఉన్నవి. ఉత్తమ గుణము లెంత ప్రస్ఫుటములో ఈ లోపములును అంతే ప్రస్ఫుటములు. కావున వీరగాథల ఉత్తమ గుణములను బట్టియే కాక,

84. *Ibid., p.344.*

85. *"It is a matter of evolution; chroral and dramatic elements ruled in earliest stages, while epic prevails at the end."* *-Ibid., p.92.*

లోపములను బట్టి కూడ కొన్ని లక్షణము లేర్పఱుప వచ్చును. ఈ లోపముల వలన గూడ వీరగాథలను అతి సులభముగా గుర్తింపవచ్చును.

(1) వీరగాథలు జనుల సామూహికోద్రేకమునకు క్రమక్రమాభివర్ధిత రససిద్ధిని కలిగించునే కాని, వైయక్తిక భావనకు సూచిత రససిద్ధి నీయలేవు. విమర్శకులు దీనిని లోపమని కాని గుణమని కాని నిర్ధరించి చెప్పక, మన ఆలోచనకు వదలి వేసినారు: ".....the ballad may be said to possess the advantages and dis-advantages of a cumulative appeal to the emotion of a throng, and to lack the advantages and dis-advantages of suggestive appeal to individual imagination."[86]

(2) సరిగా ఆధునిక కవిత్వము దేనిని అసహ్యించుకొనునో అదే - ధ్వని, పదములు, పదబంధములు, వర్ణనలు, అలంకారములు పదేపదే పునరుక్తములగుట - వీరగాథలలో నుండును.

(3) వీరగాథలను చదువువారు కాని, వినువారు కాని, పదముల కూర్పువలనను, కవితా స్వరూపము వలనను వచ్చెడి రసానందమును వదలుకొనవలెను.

(4) వీరగాథలలో అభినయ మెక్కువగా నుండి, సంఘటనలు అతి ఘోరముగా నుండును. 'లక్ష్మమ్మ కథ'లో భర్త ఆమెను స్పృహ తప్పువఱకును చావగొట్టి, గదిలో బంధించి, రోజంతయును భోజనము లేకుండ మాడ్చి, రాత్రివేళ ఆ లక్ష్మమ్మను బయటకు లాగి, ఆమె తన కాళ్ళమీద పడి బ్రతిమాలుచున్నను వినక కత్తితో పొడిచి చంపివేయును. 'వీరరాజమ్మ కథ'లో దొంగలు ఆమె పసికందును ముక్కలు ముక్కలుగా నఱికి, కిటికీ గుండా బయటకు పాఱ వేయుదురు. ఇట్లు వీరగాథలలోనే కాక వీరగాథానికలలో సహితము భయంకర క్రూర ఘోర వర్ణనలుండును. హంతలు హత్య చేసి ఊరకొనరు. కారిన రక్తమంతయు కడవలకు పట్టుదురు. చిట్లిన రక్తమంతయు సీసాలకు పట్టుదురు. శత్రువులు 'గాండ్లోల్ల కోరుమన్న' ను చంపి ఎట్లు చేసిరో చూడుడు:

చిట్లిన్న నెత్తూరూ సీసాల్కి నింపుకోని
సిందంద లాడేరు కొడుకా!
కారిన్న నెత్తురుని కడవలకు నింపుకొని
కల్లంటు అమ్మేరు కొడుకా![87]

86. *Ibid., p.323.*

87. *చూ. 'త్రివేణి' (ఆంధ్ర దేశ జానపదగేయాలు), సంగీత నాటక అకాడెమీ ప్రచురణ, పుట 259.*

విదేశ వీరగాథలును ఇట్లే ఘోరకృత్యములను వర్ణించుచుండును. "The Duchess of Malfi" అను వీరగాథలో సోదరుడు హత్య చేయబడిన సోదరిపై ఎక్కి నిలబడును.

(5) వీరగాథ లెక్కువగా పక్షపాత రచనలని చెప్పవచ్చును. శిష్ట సాహిత్యమున గూడ సగభాగము పక్షపాత కావ్యములుగానే కన్పట్టును. రామాయణము ఆర్య పక్షపాతముతోను, మహాభారతము పాండవ పక్షపాతముతోను వ్రాయబడినదని తలచు విమర్శకు లున్నారు. తెలుగులో ప్రసిద్ధ వీరగాథ లన్నియును పాక్షిక దృష్టినే ప్రదర్శించుచున్నవి. పల్నాటి వీరచరిత్ర బ్రహ్మనాయనియందు మిక్కిలి పక్షపాతము చూపుచున్నదని మల్లంపల్లి సోమశేఖరశర్మగారి వంటి పండితులే తీర్మానించిరి.[88] ఇది బ్రహ్మనాయని దైవస్వరూపునిగను, విష్ణ్వంశ సంభూతునిగను, అతిమానుష శక్తి సంపన్నునిగను చిత్రించినది. నాగమ్మను కపటిగను, దుస్తంత్రపరాయణగను, దుష్టురాలుగను నిరూపించినది. ఇది సరికాదు. నాగమ్మ గొప్ప రాజనీతిశాస్త్ర పారంగతురాలు; ప్రజ్ఞాధురంధరురాలు; మీఁదు మిక్కిలి వీరనారి. పల్నాటి వీరకథలలో అంతిమ విజయము బ్రహ్మనాయనిదని వ్రాయబడినది. జనశ్రుతిని బట్టి నలగాముడే విజయు డనియు, బ్రహ్మనాయ డాతనితో సంధి చేసికొనెననియు తెలియుచున్నది. అట్లే కాటమరాజు కథలలో చిట్టచివర యాదవులు గెలిచినట్లుగా వర్ణింపబడినది. స్థానిక చరిత్రలను బట్టియు కైఫీయతులను బట్టియు నల్లసిద్ధియే గెలిచినట్లు తెలియుచున్నది. వీరగాథల పక్షపాత రచనకు ప్రబల తార్కాణము బొబ్బిలికథ. ఇందు విజయరామరాజుపాత్ర మిక్కిలి నీచముగా చిత్రింపబడినది. ఇది సత్యము కాదు. రామరాజు రాజకీయపుటెత్తుల మాట యెట్లున్నను, మహారాజుగా అతడు గొప్ప కళాపోషకుడు; ఉదారుడు; నాటి సంస్థాన పాలకులలో మిక్కిలి బలసంపన్నుడు. ఇంచుమించు వీరగాథలన్నియును ఏకపక్షాభిమానము చూపు రచనలని చెప్పవచ్చును.

(6) వీరగాథలు సాధించెడి పరమార్థమేదియును కనపడదనియు, అసలు కవిత్వమే ప్రయోజన రహిత మైనదనియు పాశ్చాత్య విమర్శకులు భావించుచున్నారు. కవిత్వము మాట ఎట్లున్నను, వీరగాథలు సాధించెడి పరమార్థమేదియును లేదనుట సంపూర్ణ సత్యము కాజాలదు. పాశ్చాత్య వీరగాథలు పరమార్థమును సాధింపలేనివిగా నున్నవేమో కాని, మన వీరగాథలలో చాలభాగము దేశభక్తిని కలిగించి, జాతీయ ప్రబోధమును కావించి, శౌర్య సాహసములను ఉద్దీపింప జేయుచున్న వనుటలో సందేహము లేదు. గ్రామకక్షలు - హత్యలు ఇతివృత్తములుగాగల వీరగాథలు మాత్రము ప్రయోజన రహితములని నిస్సందేహముగా

88. చూ. తెలుగు విజ్ఞాన సర్వస్వము, మొదటి సంపుటము, 'చాళుక్య చోళులు' అనువ్యాసము, పుట 219.

చెప్పవచ్చును. నీతిశాస్త్రములు, పురాణములు, ఇతిహాసములు మున్నగువాని నుండి కొన్ని పద్యముల నుదాహరించి సత్ప్రవర్తనను బోధింప వచ్చును. కాని వీరగాథలనుండి ఇట్టి నీతివాక్యముల నెక్కువగా నుట్టంకింపలేము.

ఛందో వైవిధ్యము లేకుండుట, అనుప్రాసాద్యలంకారములు ఒకే పద్ధతిలో నుండుట, పదజాలమంతయు మిక్కిలి పరిమితముగా నుండుట, ప్రకృతివర్ణనలు లేకుండుట - మున్నగునవి వీరగాథలలోని ఇతర లోపములు. వీరగాథలలో పతాక సన్నివేశ మెక్కడ కలదో చెప్పలేము. ఒకవేళ చెప్పగలిగినచో అది కథాంతమే యగును. గాథాకారుడు వీరగాథను ఆపవలసిన చోట ఆపడని ఆధునికుల తలంపు.[89] ఉపమానము లుండవు. ఒకవేళ ఒకటి రెండున్నను అవి చాల బలహీనముగా నుండును. ప్రకృతివర్ణన అసలే ఉండవు. ఈ లోపముల నన్నిటిని సవరించుకొని జానపద కవిత్వములోని గేయము (Folksong) భావగీతి (Lyric)గాను, వీరగాథ (Ballad) ఇతిహాసము (Epic) గాను అవతరించినవని భావింప వచ్చును.

## వీరగాథానుకరణములు - బుఱ్ఱకథలు

తెలుగులో సాంప్రదాయక వీరగాథల(Traditional Ballads)ను అనుకరింప ప్రయత్నించినవారు సామ్యవాదులు. వారి సృష్టియే 20వ శతాబ్ది మధ్యమున (క్రీ.శ. 1942 ప్రాంతమున) వెలసిన 'బుఱ్ఱకథలు'. ఇవి వీరగాథానుకరణములే కాని సిసలైన వీరగాథలు కావు. పైన తెల్పిన వీరగాథల పది లక్షణములలోను ఒక్క ఛందస్సు తప్ప, తక్కినవేవియు వీనికి వర్తింపవు. బుఱ్ఱకథలలోని ఛందస్సు కూడ పలురకములు కలిపి అతుకుల బొంతగా తయారు చేసినదే కాని, సాంప్రదాయక వీరగాథలలోవలె ఆద్యంత మొకే విధముగా నుండునది కాదు. బొబ్బిలి కథ, దేసింగురాజు కథ, బాలనాగమ్మ కథ, లక్ష్మమ్మ కథ - మున్నగు వీరగాథలు మొదటినుండి చివరివఱకును ఒకే రకమగు ఛందస్సులో నుండును. గాథాకారుడు రసానుగుణముగా రాగచ్ఛాయను మాత్రము మార్చుచుండును. బుఱ్ఱకథలలో నిట్లుగాక, కాంభోజరాజు కథలోని 'తందాన తాన వరుసలు' కొన్ని, ఆరెమరాటీల కథలోని 'సై సై వరుస' కొంత, జంగంకథలోని 'రగడ వరుస' మఱికొంత, బహువిధముల కీర్తనలు ఉండును.

బుఱ్ఱకథల ఇతివృత్తము జనసామాన్య పరిచితమైనది కాదు; రాజకీయోద్యమములు, రాజకీయనాయకులు, ఇందు వస్తువులు. భగవద్గీతవంటి వేదాంతవిషయములు కూడ బుఱ్ఱకథలలో ఇతివృత్తముగా స్వీకరింపబడుచుండును. మఱికొన్ని బుఱ్ఱకథలు ఇతిహాసములను, చరిత్రలను ఆధారముగా జేసికొని రచింపబడినవి. ఒక్కొక్కప్పుడీ

89. *"Climax is never calculated; if it occurs, it is merely the end of the singer's material; and to modern notions, the singer sometimes fails to stop where he aught to stop"*
*-Francis B. Gummere, The Popular Ballad, p.326.*

బుఱ్ఱకథలు ప్రసిద్ధ సాంప్రదాయక వీరగాథల ఇతివృత్తములను పరిగ్రహించుటయు గలదు. పల్నాటి యుద్ధము బుఱ్ఱకథ, బొబ్బిలి యుద్ధము బుఱ్ఱకథ - మున్నగునవి యిట్టివే. ఇట్లు ప్రసిద్ధ వీరగాథల ఇతివృత్తముల ననుకరించిన బుఱ్ఱకథలు అపహాస్యము పాలగుట తప్పదు. ఏలయన, దినమునకు 4-5 గంటల చొప్పున నెలరోజులు పాడినను తరుగని పల్నాటి వీరగాథావృత్తమును, 'కట్టి, కొట్టి, తెచ్చె' అను రీతిలో రెండుగటలలో చెప్పు ఈ బుఱ్ఱకథల పేలవత్వమును వేఱుగా చెప్పనక్కఱలేదు. అట్లే, ముప్పది రెండు వీరగాథలతో మహాభారతము వలె నొప్పుచున్న కాటమరాజు కథాచక్రమును రెండు గంటలలో పూర్తియగు 'కాటమరాజు విజయము' అను బుఱ్ఱకథగా వ్రాయుట హాస్యాస్పదము కాదా?

బుఱ్ఱకథల భాష వీరగాథల భాషవలె సరళముగా నుండదు. ప్రౌఢకవుల శైలివలెనే ఉండును. ''సంగరరంగ విహారా! ధీరా! శాత్రవ సంహారా!'' (అల్లూరి సీతరామరాజు బుఱ్ఱకథ) అను వాక్యము నుచ్చరింపగల జంగము ఈ తెలుగుగడ్డపై లేడు. విద్యావంతులు ముద్రింపబడిన ఈ బుఱ్ఱకథలను చదువుకొని కంఠస్థము చేసి పాడవలసినదే కాని, జానపదులీ కథలను తమవిగా భావింపలేరు.

ఈ బుఱ్ఱకథలలో మౌఖిక సంప్రదాయము పూజ్యము. కథావస్తువు ఎరవు తెచ్చుకొన్నదే కాని సంఘటన నుండి సహజముగా పుట్టినట్టిది కాదు. ఈ కథలు కొన్ని రాజకీయ వర్గములకే పరిమితము కాని, బహుజనాదరపాత్రములు కావు. వీనిలో ప్రచారదృష్టి యెక్కువ. మూలకథ కూడ ప్రచారమున కనువుగా మార్చివేయబడును. దీనికి తోడు కథకు సంబంధము లేని రాజకీయోపన్యాసములు, వెకిలి హాస్యము ఉండును. కాబట్టి సహజ సాంప్రదాయక వీరగాథలకును, ఈ బుఱ్ఱకథలకును హస్తిమశకాంతరమున్నదని నిశ్చయముగా చెప్పవచ్చును. బుఱ్ఱకథలు సాంప్రదాయక వీరగాథల విఫలానుకరణములే కాని, సహజ గాథలు కావు. ఇట్టి బుఱ్ఱ కథలను సాంప్రదాయక వీరగాథలలో చేర్చి చర్చించుట సమంజసము కాదు. పాశ్చాత్యులును దీనిని వ్యతిరేకించినారు.

"The ballad poetry of modern versifiers is not to be compared with the genuine ballads of old times."[90]

శ్రీహరి ఆదిశేషువుగారును, డాక్టరు బి. రామరాజుగారును. కృత్రిమ శిల్పముగల 'అల్లూరి సీతారామరాజు బుఱ్ఱకథను', బొబ్బిలి కథ, సర్వాయి పాపని కథ - ఇత్యాది సాంప్రదాయక వీరగాథలలో చేర్చి చర్చించుట భావ్యముగా లేదు. అల్లూరి సీతారామరాజు కథ వీరగాథానుకరణమే కాని, సాంప్రదాయక వీరగాథ కాదు. ఇది శ్రీ సుంకర సత్యనారాయణ అను ప్రసిద్ధ అభ్యుదయ రచయిత ప్రయత్నపూర్వక రచనయే కాని, జానపదుల ఆశురచన (Folk

90. *The Home University Encyclopaedia*, p.377.

Improvisation) కాదు. దీనిని విద్యాసంస్కారములు గల నాగరకులే పాడుచున్నారు కాని, నిరక్షర కుక్షులగు సంచార గాయక భిక్షువు లెవరును పాడుటలేదు. ఇది ముఖ్యముగా గమనింపవలసిన విషయము. విద్యావంతులు గేయకథలను చదివి నేర్చుకొందురు. పామరులు గేయకథలను విని నేర్చుకొందురు. ఈ పామర గాయక భిక్షువులు విద్యావిహీనులగుటచే చదివి నేర్చుకొనుట కల్ల. ఇట్లు నిరక్షరాస్యులగు గాయక భిక్షువులచే వినుకలి మాత్రమున నేర్వబడి పాడబడుట కూడ సాంప్రదాయక వీరగాథల ప్రధాన లక్షణములలో నొకటియని గుర్తింపవలెను. ఇదే మౌఖిక సంప్రదాయము! ఇట్టి సంప్రదాయము బుఱ్ఱకథలలో మృగ్యము. సీతారామరాజును దైవముగా భావించి నేటికిని పూజించుచున్న విశాఖమండలములోని కోయలు సహితము సీతారామరాజు బుఱ్ఱకథను పాడుటలేదు. ఏలయన, బుఱ్ఱకథ ప్రజల కవిత్వము కాదు; ప్రజల కవిత్వము ననుకరించుచు వ్రాయబడిన నాగరక కవిత్వము. (నండూరి వెంకట సుబ్బారావుగారి ''ఎంకి పాటలు'' జానపద గేయములు (folksongs) కావు; జానపద గేయముల ననుకరించుచు వ్రాయబడిన శిష్టగేయములు! వీనిని శిష్టులే పాడుకొని ఆనందించుచున్నారు కాని, పామరులు పాడుకొనుట లేదు. ఈ ఎంకి పాటల వంటివే బుఱ్ఱకథలును! ఎంకి పాటలు జానపద గేయముల కనుకరణములు కాగా, బుఱ్ఱకథలు సాంప్రదాయక వీరగాథల కనుకరణములు!). ప్రాచీన సాంప్రదాయక వీరగాథలిట్టివి కావు. వాని వైశిష్ట్యము నీ క్రింది విధముగా చెప్పవచ్చును:

"They were made by the people for the people and they went straight to the hearts of their hearers, who, if they lacked the refinement of their successors, were not less quick to feel the hot emotions - love, hate, pity and fear. They were versified originally by unlettered men for unlettered audiences; and passing as they did from mouth to mouth and generation to generation of reciters possessing the literary sense in very varying degrees, it is not wonderful that many changes of omission or alteration have slipped in, and that what are really the same ballads are found in versions differing considerably from each other."[91]

ఈ ప్రకరణమున చర్చింపబడిన ప్రధానాంశముల నిట్లు చెప్పవచ్చును:

రామరాజుగారు చెప్పిన పది జానపదగేయ లక్షణములలోను ''మౌఖిక ప్రచారము, సహజశైలి, పాడుటకు వీలుగానుండుట, పునరావృత్తి, జనసామాన్య పరిచిత వస్తువును కలిగియుండుట, ఆశు రచనలు'' - అను ఆఱు లక్షణములు వీరగాథలకు గూడ వర్తించుచున్నవి. 'బ్లిస్ పెర్రీ' అను పాశ్చాత్య విమర్శకుడు వీరగాథల నిస్సందేహ లక్షణములను విడమర్చి చెప్పినాడు. వీరగాథలకు అతి ప్రధానములైన పది లక్షణము లుండునని నిశ్చయింప

91. *Nelson's Perpetual Loose-leaf Encyclopaedia, Vol.I, p.542.*

వచ్చును: వీరగాథ గేయస్వరూపమున నుండును -ఇది ప్రథమ లక్షణము. సరళచ్ఛందము, పునరావృత్తి, గానయోగ్యత - అనునవి ఇందలి ఉపలక్షణములు. వీరగాథ కథాఖ్యానాత్మకముగా నుండును - ఇది ద్వితీయ లక్షణము. నియమిత పరిమాణము. యథార్థసంఘటనా జన్యత్వము, దేశీయేతివృత్తము, సామాన్య నాయకత్వము, వీరరసప్రాధాన్యము, కథాసారళ్యము, హఠాత్ ప్రారంభత్వము, సంభాషణాసహితత్వము, వచనరాహిత్యము, విషాదాంతత, అభివర్ధిత పునరుక్తి - అనునవి ఇందలి ఉపలక్షణములు. గాయక భిక్షువుల ఆశుకవనమున జనించుట వీరగాథయొక్క మూడవ లక్షణము. కవి నామము తెలిసినను వీరగాథ అప్రధాన కర్తృకముగా నుండును. ఇది మూడవదానిలోని అవాంతర లక్షణము. మౌఖిక ప్రసరణమున దేశమంతయు వ్యాపించుట, మౌఖిక సంప్రదాయమున తరతరములు జీవించుట వీరగాథల నాల్గవ లక్షణము. బహుజనాదరపాత్రత. లేక జనరంజకత్వము లేక జనప్రియత్వము - వీరగాథల ఐదవ లక్షణము. (6) వీరగాథ, నాటకము వంటి శుద్ధ పరాశ్రయ కవిత్వము. (7) వీరగాథలలోని భాషయే కాక భావములును సరళముగా నుండును. వీరగాథల రచనలో కొన్ని పడికట్టు పదములు పదే పదే ప్రయోగింపబడుచుండును. (8) ఎంతటి ప్రతిభావ్యుత్పత్తులున్న కవియైనను సాంప్రదాయక వీరగాథను తనంత తాను సృజింపలేడు. ఇది ప్రజలలో సహజముగా పుట్టును. తరువాత దీనిపై కవి చేయి పడవచ్చును. (9) ప్రపంచమున వివిధ దేశముల వీరగాథలలో నొక ఏకసూత్రము కన్పించును. అందుచే వీరగాథలు ప్రాక్తన మానవ సంఘమును, వసుధైక కుటుంబమును నిరూపింప సమర్థములని చెప్పవచ్చును. (10) వీరగాథలు నీతిని వాచ్యముగా బోధింపకున్నను, ధ్వనింపజేయును. ''విధి బలీయము, మానవుడు నిమిత్త మాత్రుడు'' అనునదియే ఇట్లు ధ్వనితమగు నీతి. వీరగాథలు జీవితవిషాదమును ప్రతిధ్వనించును. - ఈ పది లక్షణములలో కొన్ని వీరగాథల కెక్కువగా వర్తించును. మఱికొన్ని వీరగాథానికల కెక్కువగా వర్తించును. వీరగాథలలో ఇతిహాస లక్షణములును, వీరగాథానికలలో జానపదగేయ లక్షణములును హెచ్చుగా కాననగును. వీరగాథల ప్రాశస్త్యమును దెల్పు లక్షణములే కాక, వాని లోపములను దెల్పు లక్షణములును కొన్ని గలవు. సామూహిక రసానందమే కాని వ్యక్తిగత రసానందము నీయలేకపోవుట; పదముల వర్ణనలు పదే పదే పునరుక్తములగుట; పఠనము వలన ఇందలి కవిత్వము రసతృప్తి నీయకుండుట; సంఘటనలు ఘోరాతిఘోరముగా వర్ణింపబడుట; ఒకే పక్షము నభిమానించుచు రచన సాగుట; పర్యవసానమున ఏవిధమగు పరమార్థమును సాధింప కుండుట; ఛందోవైవిధ్యము లేకుండుట; మిక్కిలి పరిమితమగు పదజాలమును గలిగియుండుట - మున్నగునవి వీరగాథల ప్రధాన లోపములు. వర్తమాన కాలమున తెలుగు దేశి సాహిత్యమున విజృంభించిన 'బుఱ్ఱకథలు' వీరగాథానుకరణములే కాని, సాంప్రదాయక వీరగాథలు కానేరవు. ఈ బుఱ్ఱకథలకు పైన చెప్పిన లక్షణము లేవియు వర్తింపవు.

* * * * *

## తొమ్మిదవ ప్రకరణము

# వీరగాథల వర్గీకరణము

ఏ సాహిత్యమందైనను వీరగాథలను ప్రధానముగా రెండు వర్గములుగా విభజింప వచ్చును. (1) తరతరములనుండి మౌఖిక సంప్రదాయమున వచ్చుచున్న వీరగాథలు - ఇవి 'సాంప్రదాయక వీరగాథలు' (Traditional Ballads), (2) సాంప్రదాయక వీరగాథల కనుకరణములుగా ప్రత్యేక కవులచే రచింపబడిన వీరగాథలు - ఇవి 'సాహిత్య వీరగాథలు' (Literary Ballads). మనము సాధారణముగా ప్రయోగించు 'వీరగాథలు' అను శబ్దము సాంప్రదాయక వీరగాథలకే వర్తించును కాని, వీరగాథానుకరణములకు వర్తింపదు. ముందు పాశ్చాత్య విమర్శకుల వర్గీకరణ విధానములను చర్చించి, తరువాత తెలుగు విమర్శకుల వర్గీకరణ ప్రయత్నములను, మనము అనుసరింప దగిన విధానములను పరిశీలింతము.

**W. J. Entwistle** అను విమర్శకుడు ఐరోపా వీరగాథలను నాలుగు విధములుగా వర్గీకరించినాడు:[1]

1. Nordic Ballads (English, Scandinavian, German)
2. Romance Ballads (Franco - Italian, Hispanic)
3. Balkan Ballads
4. Russian Ballads

పై నాలుగు వర్గములలోను వీరగాథా స్వరూపము (ముఖ్యముగా ఛందస్సు) ఒక వర్గమునకు మఱియొక వర్గమునకు గల భేదమునకు కారణ మగుచున్నది. నార్డిక్ వీరగాథలలో 'ఖండ రూపము' లేక 'చరణ రూపము' (stanzaic form) ఎక్కువగా నుండి, కథాకథనము ప్రస్ఫుట గేయోన్మీలనముతో తీర్చిదిద్దబడును. రొమాన్సు వీరగాథలు లయానుగుణముగా, యతిప్రాసానుబద్ధముగా (assonantal octosyllabic forms), చరణ చరణములుగా నడచును. తృతీయ చతుర్థ వర్గములకు చెందిన తూర్పు ఐరోపా వీరగాథలలో యతి ప్రాసాదులతోగూడిన లయకాని, గేయస్వరూపముకాని మృగ్యము. ముఖ్యముగా రష్యన్ వీరగాథలు లయరహితములు. గాథాకారుని ఆశువు ఆతని యిచ్ఛవచ్చిన రీతివి

---

1. *See, Cassell's Encyclopaedia of Literature, Vol.I, p.40.*

పరుగిడుచుండును.[2] దీనిని బట్టి 'ఎంట్ విజిల్' వర్గీకరణము ముఖ్యముగా ఛందస్సును దృష్టిలో నుంచుకొని చేసిన వర్గీకరణముగా దోచుచున్నది. మానవ జాతులు, భౌగోళికావధులు కూడ ఈ వర్గీకరణమున కొంత చోటు చేసికొన్నవి.

ఇతివృత్తములను బట్టి పరిశీలించినచో పై వర్గీకరణము మిక్కిలి స్థూలమైనదని తెలియగలదు. 'ఎంట్ విజిల్' సూచించిన ఒక్కొక్క వర్గములో విభిన్న కథావస్తువులు గల గాథలు అనేక ఉపశాఖలుగా చీలిపోవును. స్కాట్లండుదేశపు వీరగాథలు భగ్నప్రేమకు, అతిమానుషత్వము(supernatural)నకు మచ్చుతునుకలు. ప్రేమసంబంధమగు ఆంగ్ల గాథలలో గేయాత్మకత, పాంగెము (sentiment) హెచ్చు. అతిమానుషత్వమును, జాతి లక్షణములను భిన్న దేశముల వీరగాథలు బహువిధములుగా చిత్రించినవి.

"The Scandinavian ballads, for example, are rich in elves, dwarfs and trolls; and the poets of Yugoslavia and Bulgaria weave fantastic tales round the sun and the moon, snakes and other animals with some supernatural significance. This catagory ranges in mood and substance from the wildly grotesque to the macabre and horrible." [3]

ఫ్రెంచి వీరగాథలు (Chanson Popularic) గేయాత్మకత వైపు మ్రొగ్గు చూపును. కాని, స్పెయిన్, యుగోస్లేవియా, రష్యా వీరగాథలు మాత్రము పూర్తిగా ఆఖ్యానాత్మకములే. జర్మను ప్రజల వీరగాథా కవిత్వమున కథాఖ్యానము, దానిలో చొచ్చుకొనిన గేయాత్మకత - రెండును పెనవైచుకొని యుండును. ఈ వర్గమున ప్రసిద్ధమగు చరణవిభాగము, దీని గేయాత్మక లక్షణమును చెప్పకయే చెప్పుచున్నది. రష్యా, స్పెయిన్, యుగోస్లేవియా దేశములలోని గాథాకవులు తమ గాథలను స్వచ్ఛమగు పరాశ్రయతా గుణము (objectivity)తో తీర్చి దిద్దుదురు. 'Romances' అనబడు స్పానిష్ వీరగాథలు గేయవిస్తృతిని గాని, ఆత్మాశ్రయ వ్యాఖ్యానములను గాని అంగీకరింపవు. శ్రోతలు వీరగాథల పాత్రలతోను సంఘటనలతోను ప్రత్యక్షసంబంధమును గలిగియుందురు. కాబట్టి, ఇతివృత్తములలోను, ఆఖ్యానగేయ లక్షణములలోను ఇంత వైవిధ్యమును జూపు ఐరోపా వీరగాథలను కేవలము ఛందస్సునుబట్టి వర్గీకరించుట స్థూల నిర్ణయమగును కాని, సూక్ష్మ పరిశీలనము కానేరదు.

కొందఱు పాశ్చాత్యులు వీరగాథలను జానపద గాథలు (Folk Ballads), జంగం గాథలు (Minstrel Ballads) - అని రెండే రెండు వర్గములుగా విభజించిరి.[4] చిన్న చిన్న

2. *"The Russian ballad particularly is free in both form and rhythm, and the poet or reciter elaborates and improvises at will."*
   *-W. J. Entwistle, Cassell's Encyclopaedia of Literature, Vol.I. p.40.*
3. *Ibid., p.41.*
4. *The New Century Hand Book of English Literature, p.86.*

చరణములలో, పాదాంత పదములతో, భగ్నప్రేమవంటి భావావేశముతో గూడిన కథతో సాగెడి ప్రాథమిక లఘురచనలను జానపద గాథలనిరి. వ్యక్తి తెలియకపోయినను వైయక్తిక కర్తృకములని యూహించుటకు వీలైనవి, సాహిత్యగౌరవము గలిగి ప్రత్యేకశిల్పముతో గూడినవి యగు సుదీర్ఘాఖ్యానములను జంగంకథలని వివరించిరి. ఇది 'వీరగాథలు, లఘు వీరగాథలు' అను రీతిగా పరిమాణమునుబట్టి చేసిన విభజనమువలె నున్నది. సామూహిక కర్తృత్వ - వైయక్తిక కర్తృత్వ సిద్ధాంతములకు గూడ నివి ప్రతీకలుగా నున్నవని చెప్పవచ్చును.

మఱికొందఱు విమర్శకులు వీరగాథల యితివృత్తములనే ప్రధానముగా గ్రహించి, యీ క్రింది విధముగా వర్గీకరించిరి:[5]

(1) సాంసారిక విషాదములు (Domestic Tragedies) - ఇరుగు పొరుగు సంఘటన, ముఖ్యముగా హత్య లేక కుటుంబ కలహము.

(2) చారిత్రక గాథలు (Historical Ballads) - చారిత్రక సంఘటనలు.

(3) విప్లవకారుల గాథలు (Out-law Ballads) - ఇంగ్లండులో రాబిన్‌హుడ్ వలెను అమెరికాలో 'జెస్సీ జేమ్సు' వలెను ప్రసిద్ధ సాంఘిక న్యాయ సూత్రములను ధిక్కరించినవారు.

(4) కన్నీటి గాథలు లేక శోక గాథలు (Coronach or Lament Ballads) - గేయాత్మకములై, చనిపోయిన వారిని గూర్చి విలపించుచు పాడబడిన జాలి పాటలు.

(5) జానపద గాథలు (Folk Ballads) - జానపద సంపదనుండి యితివృత్తములను స్వీకరించినవి. ముఖ్యముగా అతిమానుష ప్రణయము (supernatural love)ను చిత్రించునట్టివి.

ఇతివృత్తమును ప్రాతిపదికగా జేసికొని యిట్లు వర్గీకరించిన విమర్శకులు, మఱల వీనిలో కొన్నిటిని జానపద కృతములుగను, మఱికొన్నిటిని జంగమ కృతములగను ఊహించిరి. పైవానిలో చారిత్రక గాథలు, విప్లవకారుల గాథలు, కన్నీటి గాథలు - అనునవి సాహిత్యముపై ప్రత్యేక దృష్టినుంచి జంగములచే రచింపబడినవనియు; తక్కినవి - సాంసారిక విషాదములు, జానపద గాథలు నిరక్షరాస్యులగు జానపద సమూహములచే నలవోకగా సృజింపబడి యుండుననియు భావించుచున్నారు.

'లూయీస్ పౌండ్' (Louise Pound) అను అమెరికన్ ప్రొఫెసరు ఆంగ్లవీరగాథల నిట్లు వర్గీకరించెను.[6]

---

5. *Reader's Encyclopaedia, p.70.*
6. *The Encyclopedia Americana, Vol.III, pp. 96- 97.*

(1) Traditional Ballads (= సాంప్రదాయక వీరగాథలు)

(2) Literary Ballads or Art Ballads or Ballads of Culture (= సాహిత్య వీరగాథలు, లేక కళాత్మక వీరగాథలు లేక సాంస్కృతిక వీరగాథలు)

(3) Broadside Ballads or Stall Ballads or Broad Sheets (= గుజలీ ప్రతుల గాథలు)

(4) Musical ballads or Instrumental Ballads (= సంగీత గాథలు లేక వాద్య గాథలు)

ఇందు మొదటి వర్గము ప్రధానమైనది. ఇవియే సిసలైన వీరగాథలు. ఏ వీరగాథల సంగీత సాహిత్యాంశములు తరతరముల నుండి జానపదులలో మౌఖిక సంప్రదాయమున వ్యాపించుచు, అనేకములగు మార్పులకు లోనగుచు, ఉత్పత్తి కర్తృత్వము లనూహ్యములగునో ఆ వీరగాథలు 'సాంప్రదాయక వీరగాథలు' (Traditional Ballads)[7]. ఇవి శ్రోతల నుద్దేశించి చెప్పబడునవే కాని, పాఠకుల నుద్దేశించి వ్రాయబడవు. కథాకథనము, పరాశ్రయత్వము అను ఐతిహాసిక గుణములిందుండును. భావకవితా (Lyrical Poetry) గుణములగు గేయాత్మకత, హ్రస్వత కూడ వీనియందుండును. వీని నొక విధముగా ఇతిహాస భావగీతముల సమ్మేళనము లనవచ్చును. ఇవి బాహ్య స్వరూపమున భావగీతమును, అంతర స్వరూపమున ఇతిహాసమును పోలియుండును. విమర్శక లోకము తలలు బద్దలు కొట్టుకొనినది ఈ సాంప్రదాయిక వీరగాథల ఉత్పత్తి కర్తృత్వములను గూర్చియే. ఇవియే మనకు ముఖ్యముగా పరిశీలనార్హములు. వీనిని 'జనరంజక వీరగాథలు' (Popular Ballads) అనియు పిలుతురు.

సాహిత్య వీరగాథ లిట్టివి కావు. ఇవి ప్రత్యేక కవులచే వ్రాయబడి ప్రమాణ ప్రతుల రూపమున లభ్యమగును. ఇందు కొన్ని ప్రాచీన వీరగాథల ననుకరించును; మఱికొన్ని స్వతంత్రముగా నుండును. 'వర్డ్స్‌వర్త్' (Wordsworth) కవి రచించిన "లూసీగ్రే" (Lucy Gray), 'కాల్ రిడ్జ్' (Coleridge) కవి రచించిన "ఏన్షెంట్ మారినర్" (Ancient Mariner) అను పద్యములు సాహిత్య వీరగాథలకు ఉదాహరణములు. స్విన్‌బర్న్ (Swinburne) కవి కూడ ఇట్టి సాహిత్య వీరగాథల నెన్నింటినో వ్రాసెను. అమెరికాలో Long Fellow కవి రచించిన "The Wreck of the Hesperus" అనునది కూడ సాహిత్య వీరగాథయే. ఇట్లు ప్రత్యేక కవులచే రచింపబడి, ప్రయత్న శిల్ప సమన్వితములగుటచే ఈ సాహిత్య వీరగాథలను 'కళాత్మక

7. *"Traditional ballads are those the texts and tunes of which have been orally transmitted for a fairly long period of time, through serveral generations at least, their origin and authorship forgotten. As a rule they tell stories directly, as addressed to hearers, not readers, and in a plot way, not by allusion. They have an epic element in that they are narrative and objective. Like lyric poetry they are of song quality, and brevity is usual."*

*-Prof. Louise Pound, The Encyclopedia Americana, Vol.III, p.96.*

వీరగాథలు' (Art Ballads) అనియు, 'సాంస్కృతిక వీరగాథలు' (Ballads of Culture) అనియు పిలుచుట కలదు. తెలుగులో బుఱ్ఱకథలు సాంప్రదాయక వీరగాథల ననుకరించిన సాహిత్య గాథలకు ఉదాహరణములు. ద్విపద కావ్యములు స్వతంత్రములైన సాహిత్య గాథలనవచ్చును.

'బ్రాడ్ సైడ్' వీరగాథలు మన దేశములో నగరవీథుల ప్రక్కన అమ్మబడు గుజరీ ప్రతుల గాథలను పోలినట్టివి. ఇవి క్రీ.శ. 16,17 శతాబ్దములలో ఇంగ్లండు దేశమున విజృంభించిన ఒక ప్రత్యేక వర్గమునకు చెందిన పాటలు. ఇవి కొంతవఱకును నేటి వార్తా పత్రికలను పోలును. సమకాలీన ఇతివృత్తములపై తీవ్రమగు విమర్శతో వ్రాయబడిన పాటలు ఒకే ఒక పెద్ద కాగితముపై నల్లని అక్షరములతో ముద్రింపబడును. ఈ కాగితము యొక్క నాలుగు అంచులును అద్దకపు కొమ్మలతో గాని, కత్తిరింపులతో గాని అలంకరింపబడును. ఇట్లు ముద్రింపబడిన పాటలు లండను పట్టణ వీథుల కూడలి స్థలములలో మిక్కిలి చౌకగా - ఒకటి రెండు పెన్నీలకు అమ్మెడివారు. ఈ పాటలను 'బ్రాడ్‌సైడ్ బ్యాలెడ్స్' అందురు. వెడల్పు కాగితములపై ముద్రింపబడుటచేతనే వీనికి ఈ పేరు వచ్చినది.

"Their name comes from a single broadsheet on which they were printed, which often decorated with ornamentation or cuts, the latter not always appropriate. They were composed for the common people by the professional rhymsters or hack poets to some popular tune and were sung by professional singers."[8]

ఈ బ్రాడ్‌సైడ్ వీరగాథల కథావస్తువులు - రాజకీయ సంఘటనలు, యుద్ధములు, కొట్లాటలు, హత్యలు, విచిత్ర సంఘటనలు, ఉరిశిక్షలు, విచిత్ర జననములు, సాంసారిక విభేదములు మొదలగునవి. ప్రొటస్టెంట్ - కాథలిక్కుల తగవులలో మత సంబంధములగు నీతి బోధనల ప్రచారములు గూడ వీనియందు ఇతివృత్తములుగా స్వీకరింపబడినవి. 'థామస్ డిలనీ' (Thomas Deloney) అను నాతడు ఈ ప్రక్రియారూపమున చేయితిరిగిన కవి. ముద్రణ యంత్రాభివృద్ధి ఈ బ్రాడ్‌సైడ్ వీరగాథలకు మఱింత ప్రోత్సాహము నిచ్చినది. ఆధునిక పాత్రికేయ రచనలకును, ఆకాశవాణి ప్రసారములకును ఇవి మాతృకలనజెల్లును.

మొత్తముపై ఈ ప్రక్రియ ఉదాత్త కళాఖండము కాదు; ఇతివృత్తములో గాంభీర్యము లోపించిన తాత్కాలిక రచనలు.[9] సాంప్రదాయక వీరగాథలవలె వీనికి మౌఖిక ప్రసరణము లేదు.

---

8. *Ibid., p.97.*
9. *"Broadside pieces, in general, show less oral quality and vigour and a decline in the character of the topic. Poetical attractiveness is rare. The species is rather ephemeral."* *-Ibid.*

ఈ ప్రచురణ కర్తలు డబ్బు చేసికొను దృష్టితో కొందఱు ప్రత్యేక గాయకులను నియమించుకొని, వారిచే పాడించి అమ్మించుకొందురే కాని, సాంప్రదాయక వీరగాథలవలె వీనికి బహుజనాదర పాత్రత లేదు. ఇవి మన దేశములోని ఎన్నికల పాటల వంటివి.

హార్వర్డ్ (Harvard) విశ్వవిద్యాలయమునకు చెందిన Hyder E. Rollins అను విద్వాంసుడు ఈ బ్రాడ్‌సైడ్ వీరగాథా ప్రక్రియలో విశేష పరిశోధన చేసి, అనేక గాథలను సేకరించి ప్రకటించిన మహనీయుడు!

ఆంధ్రదేశమున రైళ్ళలోను, రోడ్ల ప్రక్కనను, తిరునాళ్ళలోను అమ్మబడు పాటల పుస్తకములు ఆంగ్లమున గల బ్రాడ్‌సైడ్ గాథలతో పోల్చదగినవి. గోదావరి పుష్కరాల పాటలు, వఱదల పాటలు, రైలు ప్రమాదాల పాటలు, బాలయోగి పాటలు, కొత్తలంకయోగి పాటలు, సాయిబాబా పాటలు, కుసుమ హరనాథ్ పాటలు, సత్యసాయిబాబా పాటలు, పొట్టి శ్రీరాములు పాటలు, ఎన్నికల పాటలు, ఖబర్దార్ చైనా పాటలు మున్నగున వన్నియును పైన తెల్పిన ఆంగ్లప్రక్రియకు తోబుట్టువులు. ఇవి నిన్నమొన్నటి వఱకును అణాకు అర్ధణాకు అమ్మబడు చుండెడివి. నేడు 10,12 పైసల వఱకును ఉన్నవి. తెలంగాణమున బూరెల సత్యనారాయణ మూర్తిగారివంటి కవులు రాజకీయ, సాంఘిక, పౌరాణిక, చారిత్రక విషయములపై ప్రాచీన సాంప్రదాయక వీరగాథానికలగు బ్రతుకమ్మపాటల ననుకరించుచు ఎన్నియో పాటలను రచించుచున్నారు. వీనిని సికింద్రాబాదులోని చందా నారాయణశ్రేష్ఠి, కొండా శంకరయ్యలవంటి ప్రకాశకులు అఱచేతి ప్రమాణమున చిన్న చిన్న పుస్తకములుగా ముద్రించి కారుచౌకగా అమ్ముచున్నారు. ఇవి ముమ్మూర్తుల పాశ్చాత్యుల 'బ్రాడ్‌సైడ్ బ్యాలెడ్స్' వంటివే!

ఈ గుజిలీ ప్రతుల పాటలు వీరగాథలు కానేరవు. వీనియందు మౌఖిక సంప్రదాయము. బహుజనాదరపాత్రత యను గుణములే కాక, అతి ప్రధానమైన కథాఖ్యానము లేదు. స్వల్పముగా కథాఖ్యానమున్న వీరరస ప్రధానమైన ఒకటి రెండు పాటలు లఘువీరగాథల వర్గమునకు జేరును. తక్కినవి కేవలము ప్రచార గేయములు మాత్రమే!

లూయిస్ పౌండ్ చేసిన నాల్గవవర్గమగు సంగీత గాథలు (Musical Ballads) సాహిత్యమునుండి సంగీతశాస్త్రములోనికి తప్పుకొనిన రచనలు. మన సాహిత్యములోని క్షేత్రయ్య పదములు, త్యాగరాజ కృతులు వీనిని పోలును.

కాబట్టి, లూయిస్ పౌండ్ విభజించిన నాలుగు వర్గములలోను మొదటి వర్గమగు సాంప్రదాయక వీరగాథలే నిజమగు వీరగాథలు. వీనినే మనము ప్రధానముగా పరిశీలింపవలసి యున్నది. 'పౌండ్' కూడ ఈ వర్గము పైననే తన దృష్టిని కేంద్రీకరించి, ఇతివృత్తములను బట్టి దీనిని తొమ్మిది భాగములుగా చేసెను:

(1) Sacred legend and classical story -- e.g., 'St. Stephen and Herod', 'King Orpheo'.
(2) Riddle ballads and wit contests -- e.g., 'Riddles wisely expounded.'
(3) Chronicle ballads - e.g., Otterbourne'.
(4) Ballads of outlary - e.g., 'Robin Hood'
(5) Border rids - e.g., 'Johnny Armstrong'.
(6) Domestic tragedy - e.g., 'Earl Brand'
(7) The Supernatural - e.g., 'The Wife of Usher's Well'
(8) Love stories and romances -- e.g., 'Barbara Allen.', 'Hind Horn'.
(9) Humorous -- e.g., Australian Bush Ballads.

మొత్తముపై కథావస్తువును బట్టి వీరగాథలను వర్గీకరించుట ఉత్తమమైన పద్ధతిగా కాన్పించుచున్నది. Frank Sidgwick అను విమర్శకుడు వీరగాథావర్గీకరణమునకు ఇతివృత్తములు మాత్రమే శరణ్యములని తెల్పినాడు. "The only possible method of classifying ballads is by their subject-matter; and even thus the lines of demarcation are frequently blurred. It is, however, possible to divide them roughly into several main classes, such as ballads of romance and chivalry; ballads of superstition and of the supernatural; Arthurian, historical, sacred, domestic ballads; ballads of Robin Hood and other outlaws; and so forth.'[10]

ఫ్రాన్సిస్ బి. గుమ్రే (Francis B. Gummere) అను అమెరికన్ విద్వాంసుడు 'The Popular Ballad' (1907) అను తన విమర్శక గ్రంథములో సాంప్రదాయక వీరగాథలను ఆఱు ప్రధాన భాగములుగా వర్గీకరించి, ఒక్కొక్క భాగమున మఱల సూక్ష్మ విభాగములను సూచించినాడు. ఈ అంతర్భాగములలో పెక్కింటికి ఇతివృత్తములను బట్టియే పేర్లు పెట్టినను, కొన్నింటికి మాత్రము వీరగాథానామమునే ఉంచినాడు.

I. The Oldest Groups:
(1) Riddle ballads
(2) Flytings
(3) Domestic complications
(4) Stolen brides
(5) Elopements

II. Ballads of Kidnap
(1) "Bewick and Graham" (ఇది వీరగాథా నామము)
(2) The mother-in-law
(3) The filial relation
(4) Jealousy
(5) Adultery

10. *Popular Ballads of the Olden Time, Introduction.*

(6) Fidelity
(7) The tragic conflict
(8) "The Braes of Yarrow" (వీరగాథా నామము)
(9) Betrayal
(10) "Child Waters" (వీరగాథా నామము)

III. The Coronach and Ballads of the Supernatural:
(1) Coronaches
(2) Good-nights
(3) Jonah ballads
(4) Fairy ballads
(5) Preternatural ballads
(6) Transformation
(7) Ghosts

IV. Legendary Ballads:
(1) Classical and sacred tradition
(2) "The Bitter Withy" (వీరగాథా నామము)
(3) Minstrel ballads and ribaldry
(4) Humour
(5) Ballads of the sea
(6) "Mary Hamilton" (వీరగాథా నామము)

V. The Border Ballads:
(1) Singing and saying
(2) Border raids
(3) Ballads of battle
(4) "Otterburn and Charriot" (వీరగాథా నామము)
(5) Chronicle ballads

VI. The Greenwood Ballads:
(1) Outlaws
(2) Robin Hood, his ballads and his epic.

అమెరికా వీరగాథలు కూడ ఈ పద్ధతినే విభజింపబడినవి.[11] ఇందు తొమ్మిది రకముల వీరగాథలు గోచరించుచున్నవి:

1. Criminals and outlaws -- e.g., 'Jesse James', 'Sam Bass'.
2. Narratives of faithless or Murderous lovers -- e.g. 'Poor Lorella'
3. Re-union of parted lovers
4. Local murders and disasters
5. Occupational pursuits
6. Death-bed confession pieces
7. The forsaken girl

11. *See, The Encyclopedia Americana. Vol.III, p.97.*

8. Harsh parents
9. Comedy pieces

ఇట్లు పాశ్చాత్య విమర్శకులలో ఇంచుమించు అందఱును ఇతివృత్తములను బట్టియే వీరగాథలను వర్గీకరించిరని చెప్పవచ్చును.

## తెలుగు విమర్శకుల వర్గీకరణ విధానములు

తెలుగు విమర్శకులలో ఒక్క శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు తప్ప, తక్కినవారెవ్వరును గేయములకు - గేయకథలకు భేదమును పాటింపలేదు. జానపద గేయములు (Folksongs), వీరగాథలు (Ballads) స్త్రీల పాటలు, భజన కీర్తనలు మున్నగు విభిన్న ప్రక్రియలను గుర్తింపక, అన్నింటిని కలిపి 'జానపదగేయములు' అనియే వ్యవహరించిరి. కావున వీరి వర్గీకరణము అస్తవ్యస్తముగా, అస్పష్టముగా, చర్వితచర్వణముగా నున్నది కాని, స్పష్టత లేదు.

## శ్రీపాదవారి వర్గీకరణము (1953) :

1953 డిసెంబరు నెల 'కిన్నెర' అను సాహిత్య పత్రికలో శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారు 'దేశి సారస్వతి విభూతి' అను అత్యుత్తమ వ్యాసమును ప్రకటించిరి. ఇందు దేశి సాహిత్యము చక్కని వర్గీకరణము ననుసరించి పరిశీలింపబడినది. ఈ వ్యాసమును చదివినచో శ్రీ పాదవారు ఈ క్రింది విభాగములను దృష్టిలో నుంచుకొని దానిని రచించిరని స్పష్టము కాగలదు:

(1) స్త్రీల పాటలు (గేయ కథలు)
(2) వీరగాథలు - (అ) చారిత్రకములు, (ఆ) కల్పనలు
(3) రాయలసీమ నాటకములు
(4) జంగం కథలు
(5) జానపదుల నోట వ్యాప్తిగాంచిన ద్విపద కావ్యములు
(6) పదములు
(7) వీరకథ లనదగిన గేయ కథలు లేక సాహసుల కథలు:
(అ) బందిపోటులు, (ఆ) పేరంటాండ్రు
(8) స్త్రీల పాటలు (లాలి, జోల వంటి శుద్ధ గేయములు)
(9) జానపద గేయములు (10) వేదాంతపు పాటలు
(11) కీర్తనలు (12) సామెతలు, పొడుపు కథలు

శ్రీపాదవారు తమ వ్యాసమున పై పండ్రెండు విభాగములను వరుసక్రమమున పరిశీలించి, ఉదాహరణపూర్వకముగా చర్చించిరి. ఈ విభాగములలో 'వీరగాథలు, జంగం

కథలు, జానపదుల నోట వ్యాప్తిగాంచిన ద్విపద కావ్యములు, పదములు, వీరగాథ లనదగిన గేయ కథలు లేక సాహసుల కథలు'' - అను ఐదును మనము పరిశీలింపవలసిన సాంప్రదాయక వీరగాథలకు చెందును. దీనినిబట్టి శ్రీపాదవారు వీరగాథలలో ఐదు విభాగములను గుర్తించిరని ఊహింపనగును. ఈ అయిదు విభాగములకును ఉదాహరణములుగా వారు కొన్ని వీరగాథల పేర్లను కూడ సూచించియున్నారు.

**1. వీరగాథలు:** వీరశైవమత విజృంభణతో క్రీ.శ. 12వ శతాబ్దమున వీరగాథలు తెలుగు దేశమున వ్యాపించినవి. శైవమత ప్రచారమునకు ద్విపద మిక్కిలిగ నుపయోగపడుటచే ఈ వీరగాథలును ద్విపదచ్ఛందముననే చెప్పబడినవి. శ్రీపాదవారు వీనిలో కాలమును బట్టి మూడు అంతశ్శాఖలను సూచించిరి.

**1.1 చారిత్రకములు - మత సంబంధములు (కాకతీయుల కాలమునాటివి):** పల్నాటి వీరచరిత్ర, మాహురమ్మ కథ, మాతపురాణము, గౌతమ పురాణము, మల్లెచెల్ల కథ, రేణక యుద్ధము, కాకతమ్మ కథ, అంకమ్మ కథ, గంగానమ్మ కథ, మాతంగి కథ, కామేశ్వరి పాట, పరశురామ పురాణము, కాటమరాజు కథ, ఎల్లగడ్డపాటి పోట్లాట, భట్టు రాయబారము, కోటపాటి తాటివృక్షం తెచ్చే కథ, వల్లురాజు యుద్ధము, అగుమంచి కథ.

**1.2 కల్పనలు చేరిన గాథలు (క్రీ.శ. 1300 తర్వాతవి. ఒడ్డెరాజుల కాలము):** కొమార రాముని కథ, గాంధారి కథ, బాలనాగమ్మ కథ

**1.3 శైవ వైష్ణవముల సమన్వయ కాలమునాటివి (విజయనగర కాలము):** వరాహావతారము, బంగారు తిమ్మరాజు కథ, చిన్నమ్మ కథ. - వీని యనుకరణములు: కాంభోజరాజు కథ, లక్ష్మమ్మ కథ

**2. జంగం కథలు:** శ్రవ్యములుగా ప్రచారమగుచున్న యక్షగానముల ప్రభావమువలన వానిలోని దరువులు, వచనములు, పద్యములు, అర్థపద్యములు, గేయకథలలో ప్రవేశించుటచే జంగం కథలు పుట్టినవి. ఇవి యెక్కువగా ఈ శతాబ్ది ప్రారంభమున గుంటూరు మండలము నుండి వ్యాపించినవి: ధేనువకొండ వెంకయ్య రచించిన 'విరాట పర్వము', గయోపాఖ్యానము'; ఉప్పలపాటి వెంకటరామయ్య రచించిన 'అంబరీషు చరిత్రము'; గంజి నాగదాసు - 'శ్రీయాళ మహారాజు చరిత్రము'; వెంకటసుబ్బరాయగుప్త - దేవయాని చరిత్రము, వామన విజయము'; రూపెనగుంట్ల సీతారామదాసు-'హరిశ్చంద్రోపాఖ్యానము' - ఇత్యాదులు జంగంకథలకు ఉదాహరణములు.

**3. జానపదులనోట వ్యాప్తిగాంచిన ద్విపదకావ్యములు:** ద్విపదకావ్యము లన్నియును సభా కవిత్వమునకు సంబంధించినవేయైనను, వీనిలో కొన్ని జానపదులనోట పదములుగా వ్యాప్తి

గాంచినవి. ఉదా॥ బొమ్మకంటి నృసింహకవి 'ధర్మాంగద చరిత్రము'; పురాణం రామశర్మ 'పురూరవోపాఖ్యానము'; రావూరి వెంకటసుబ్బయ్య 'తిరుత్తని తెప్పోత్సవ పాట'; రామకృష్ణ యోగీంద్రుని 'జ్ఞాన మంజరి'; హేమాద్రి తనయుడప్పన్న రచించిన 'సుభద్రా కల్యాణము' మొదలగునవి.

**4. పదములు:** పదములనుపేర క్రీ.శ. 1850లో విశాఖమండలము నుండి చాల కావ్యములు వచ్చినవి. ఇవి 'హరిహరీనారాయ ణాదినారాయణా, కరుణించి మమ్మేలు కమలోచనుడ' అను వరుసలో నుండుటచే వీనిని 'హరిహరీ పదాలు' అనియు పిలుతురు. యక్షగానములలో ఈ వరుసను 'జంపె వరుస' అందురు. ఉదా॥ అయ్యగారి కూర్మనాథుని 'విరాట పర్వము, కర్ణ పర్వము, శల్య పర్వము'; చంద్రగిరి తాతయ్య 'ఉత్తర గోగ్రహణము; దక్షిణ గోగ్రహణము'; గోపాలరాయల 'వైకుంఠ మాహాత్మ్యము'; ముడుంబ లక్ష్మణాచార్యుని 'శ్రీరామ కథ'; చిత్రాడ కామేశము 'త్రినాథుని చరిత్ర'; పూడిపెద్ది బుచ్చన్నపంతులు సంస్కరించిన 'లక్ష్మణ మూర్ఛ', రచించిన 'సుందర కాండము, రామరావణ యుద్ధము'; నీవూరి (ఈపూరి) నారాయణరాజు 'ధర్మాంగద పాముపాట'; నీవూరి రామచంద్రరాజు 'కుశలాయకము'; నడిమింటి రామయోగి కవిది 'బాణాసుర యుద్ధము'; పసుగాడ సన్యాసివి 'సారంగధర చరిత్ర, శతకంఠ రామాయణము, గంగా వివాహము'; తోలేటి సీతారామయ్య విరచిత 'శశిరేఖా పరిణయము, నలచరిత్ర, ప్రహ్లాద చరిత్ర - మున్నగునవి.

**5. సాహసులను కీర్తించిన వీరకథలు:** ఈ వీరకథలు పదములకన్న ప్రాచీనములు. బందిపోటు నుండి రాజరికమున కెగుర ప్రయత్నించినవారు, పతి మరణించినప్పుడు సతిచేసిన వారు మున్నగు సాహసులను కీర్తించిన గాథలు:

**5.1 బందిపోటులు, వీరులు:** సర్వాయి పాపడు కథ, గద్వాల సోమనాద్రి కథ, సదాశివరెడ్డి కథ, మియ్యాసాయేబు కథ, రాజా రామేశ్వరరావుక థ, బొబ్బిలి కథ, పెద్ద బొబ్బిలిరాజు కథ, పెద్దాపురపు కోడిపుంజుల కథ, దేశింగురాజు కథ, నల్లతంగాళ్ కథ, అర్భుతనాటు హవుసు చరిత్ర.

**5.2 పేరంటాండ్రు:** కామమ్మ కథ (18వ శతాబ్దమునాటి సంఘటన), సన్యాసమ్మ కథ, ఎఱుకమ్మ పేరంటాలు కథ (1867 నాటి సంఘటన), మండపేట పాపమ్మ పేరంటాలు కథ, వీరరాజమ్మ కథ (నిన్న మొన్నటిది). అలభ్య వీరగాథలుగా శ్రీపాదవారు అనంతపుర మండలములోని 'ముసలమ్మ కథ'ను, కర్నూలు మండలములోని 'దూదేకుల సిద్ధప్ప కథ'ను, గుంటూరు నెల్లూరు మండలములలో బవినీళ్ళు పాడెడి పాటలను పేర్కొనిరి.

శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారి విభజనము వీరగాథల ఛందస్సును బట్టి చేసినట్లుగా పైకి కనబడినను, వీరు ప్రధానముగా ఇతివృత్తములనే దృష్టియందుంచుకొనిరని పరిశీలనవలన తెలియగలదు. వంగిపురం వెంకట రంగాచార్యులుగారు రచించిన 'శ్రీరంగ మాహాత్మ్య' మను 'ఆండాళ్ చరిత్రము' బొబ్బిలిపాటవరుసలో నున్నది. ఛందస్సునుబట్టి చూచినచో నిది వీరకథలను వర్గమునకు చెందవలెను. కాని శ్రీపాదవారు దీనిని పదములలో జేర్చి 'బొబ్బిలి వరుసలోనున్న పదము' అని వ్యాఖ్యానించిరి. అట్లే హీరమండలపు లాడె సుందర నారాయణగారి 'రామకథా సుధార్ణవము' కూడ బొబ్బిలివరుసలోనే రచింపబడినది. 'పెద్దకాపు కథ' కూడ వస్తువు పౌరాణికముగను, ఛందస్సు బొబ్బిలివరుసలోను గల గాథ. ఈ రెండును ఛందస్సును బట్టి వీరకథలలో జేరును. కాని శ్రీపాదవారు వీనిని అంతగా నిష్టము లేకయే వీరకథలలో నుదాహరించి, ఇతివృత్తములను బట్టి ఇవి వీరకథలు కావనియు, పదములనియు వివరించిరి.[12] కాబట్టి శ్రీపాదవారి దృష్టి కూడ పాశ్చాత్య విమర్శకుల వలెనే ఛందస్సు పై కన్న ఎక్కువగా ఇతివృత్తము పైనే కలదని చెప్పవచ్చును. వీరు సూచించిన ఐదు విభాగములను కాలమునుబట్టి ''వీరగాథలు, సాహసులను కీర్తించిన వీరకథలు, జానపదులనోట వ్యాప్తిగాంచిన ద్విపద కావ్యములు, పదములు, జంగం కథలు'' అను క్రమమున నుంచుట సమంజసము.

## ఆదిశేషువుగారి వర్గీకరణము (1953) :

1953లోనే శ్రీహరి ఆదిశేషువుగారు రచించిన ''జానపద గేయ వాఙ్మయ పరిచయము'' అను విమర్శక గ్రంథము ప్రభుత్వ బహుమతి నందినది. ఇది 1954లో ముద్రింప బడినది. తెలుగులో జానపద సాహిత్యముపై వెలువడిన మొట్టమొదటి విమర్శక గ్రంథమిదియే. దీనిలో ఆదిశేషువుగారు జానపదగేయ వాఙ్మయమును తొమ్మిది భాగములుగా వర్గీకరించిరి:

1. శృంగార రసాత్మక గేయములు
2. వీరకథా వాఙ్మయము
3. సాహసిక కథా వాఙ్మయము
4. కరుణ రసాత్మక కథా వాఙ్మయము
5. అద్భుత రస ప్రధాన కథా వాఙ్మయము
6. శైవ కథా వాఙ్మయము
7. వేదాంత భక్తిరస ప్రధానమైన రచనలు
8. స్త్రీల పాటలు, బాలబాలికల గేయాలు
9. ప్రకీర్ణములు

12. ''పెద్దకాపు కథ అని వెంకటేశ్వర భక్తుని మహత్త్వగాథ ఒకటి ఉన్నది కాని, దాని కథావస్తువుని బట్టీ దానిని పదము అనాలేమో? .....హీరమండలపు లాడె సుందర నారాయణగారి రామకథా సుధార్ణవము బొబ్బిలికథ వరుసలోని పదము. పదము అని వరుసనిబట్టీ కంటె వస్తువుని బట్టీ పేరు పెట్టడమే న్యాయమనుకుంటాను.'' - కిన్నెర, డిసెంబరు 1953, పుట 557.

జానపద గేయములు (Folksongs), వీరగాథలు (Ballads) మాత్రమే జానపద కవిత్వము కాగా, శ్రీహరి ఆదిశేషువుగారు ద్విపద కావ్యములు, కీర్తనలు, స్త్రీల పాటలు - వీనినన్నటిని జానపడ గేయములుగా పరిగ్రహించుట భావ్యముగా లేదు. వీరి వర్గీకరణమున 'వీరకథా వాఙ్మయము', 'సాహసిక కథా వాఙ్మయము', 'కరుణ రసాత్మక కథా వాఙ్మయము', 'అద్భుత రస ప్రధాన కథా వాఙ్మయము', - అను నాలుగు భాగములును సాంప్రదాయక వీరగాథలకు చెందును. వీరి మొదటి విభాగము జానపద గేయములు లేక పల్లెపాటలు. ఆఱవ విభాగమగు శైవకథా వాఙ్మయము కేవలము ద్విపద కావ్యముల చర్చ. ఇందు పాల్కురికి సోమనాథుని బసవపురాణ, పండితారాధ్య చరిత్రలు; గౌరన రచించిన నవనాథ చరిత్ర, హరిశ్చంద్ర కథ మున్నగు ద్విపద కావ్యము లున్నవి. ఇవి దేశి సాహిత్యమగును కాని జానపద సాహిత్యమెట్లగును? శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారి మతమున ద్విపద కావ్యములు 'దేశి' కూడ కాదు, మార్గ కవిత్వమే! అట్లే స్త్రీల పాటలు కూడ దేశియగును కాని జానపద కవిత్వము కావు. ప్రకీర్ణములను విభాగమున గేయములు గేయకథలు కూడ చర్చింపబడినవి. అతి స్థూలమైన 'వాఙ్మయ' శబ్దమును అతిశూక్ష్మములగు గేయ విభాగముల కుపయోగించుట కూడ మెచ్చదగినది కాదు. మొత్తము మీద ఆదిశేషువుగారు వీరగాథలలో నాలుగు విభాగములను గుర్తించిరని తెలియుచున్నది.

**1. వీర కథా వాఙ్మయము:** ''వీరకథాగానం మనదేశంలో అనాదిసిద్ధమైన ఆచారమనే అనిపిస్తుంది. పృథ్వీరాజ యశఃకాయాన్ని నిల్పిన చాంద్ కవీ, రాజపుత్ర వీరగీతాన్ని గానం చేసిన భట్టులూ, మన కామటరాజుకథ పాడే గొల్లలూ, పల్నాటి వీరకథని పాడే పిచ్చుగుంట్లూ, బొబ్బిలి పాటకులూ ఒకే అనుపూర్విగలవారు.''[13] కాటమరాజు కథ, పల్నాటి వీరచరిత్ర, బొబ్బిలి కథ, అల్లూరి సీతారామరాజు కథ[14] చిన్నపరెడ్డి పదము, గుజ్జాల గోపిరెడ్డి పదము, సర్వాయి పాపడి కథ, అనునవి - ఈ వీర కథా వాఙ్మయ విభాగము క్రింద ఆదిశేషువుగారు చర్చించిన ఉదాహరణములు.

---

*13. జానపదగేయ వాఙ్మయ పరిచయము, పుట 22.*

*14. అల్లూరి సీతారామరాజు కథ సుంకర సత్యనారాయణగారిచే రచింపబడిన బుఱ్ఱకథ. బుఱ్ఱకథలు వీరగాథానుకరణములే కాని, సిసలైన సాంప్రదాయక వీరగాథలు కావని వెనుకటి ప్రకరణమున నిరూపించి యుంటిని (చూ. 'వీరగాథా లక్షణములు'). అందుచే సీతారామరాజు బుఱ్ఱకథను, పల్నాటి వీరకథ, కాటమరాజుకథ, బొబ్బిలికథ వంటి సాంప్రదాయక వీరగాథలతో కలిపి చర్చించుట సమంజసము కాదు. ఇది ఒక ప్రసిద్ధకవిచే ప్రయత్నపూర్వకముగా రచింపబడినదే కాని, గాయక భిక్షువుల ఆశువుగా జనించినది కాదు. దీనికి మౌఖిక ప్రసరణము, మౌఖిక సంప్రదాయము లేవు. భాషాభావముల సారళ్యమును లేదు. అందుచే నిది సాంప్రదాయక వీరగాథ కానేరదు. డా॥ బి. రామరాజుగారు కూడ దీనిని సాంప్రదాయక వీరగాథలలో చేర్చి విమర్శించిరి.*

**2. సాహసిక కథా వాఙ్మయము:** ''సాహసికుల కథలూ, వీరకథా వాఙ్మయమూ ఒక కోవలోనివి. ఈ విభాగం కేవలం సౌలభ్యం కోసం చేసింది మాత్రమే. ఈ రకపు కథల్లో గాథ సాహసికుడైన నాయకుణ్ణి అనుసరించి నడుస్తుంది.''[15] ఉదా॥ బంగారు తిమ్మరాజు కథ, ఆరె మరాటీల కథ, దేశింగురాజు కథ, చిన్నప్పరెడ్డి కథ, సర్వాయి పాపడి కథ, సీతారామరాజు కథ.

**3. కరుణ రసాత్మక కథా వాఙ్మయము:** ''జానపద వాఙ్మయంలో కరుణ రసాత్మక కథలొక ముఖ్యమైన విభాగము. గృహచ్ఛిద్రాలకు లోనై అష్ట కష్టములు పడు అత్తింటి కోడళ్ళూ, పత్యేక జీవనలై సహగమనం చేసిన స్వాధ్వీమణులూ, చెడి పుట్టింటికి చేరి అవమాన పీడితలై మనఃక్లేశముల పాలై ఆత్మహత్యలకు పాల్పడు ఆడబడుచులూ, మాన సంరక్షణార్థమై వీరరసావేశం పొందిన వీరనారీమణులూ మొదలైనవారి కథలు కరుణ రసాత్మకములై, జానపద జీవితాన్ని ప్రతిబింబించేవై ఉంటాయి. అలాంటి కథలు అన్ని దేశాల్లోనూ అన్ని భాషల్లోనూ ఆదరణీయములై ఉంటాయనడంలో సందేహం లేదు. .....మన దేశంలో సామాన్య జనుల్లో పుట్టి పెరిగిన సాధ్వుల కథలలో కొన్ని ప్రచారంలో ఉన్నాయి. కామమ్మ కథా, సన్యాసమ్మ కథా, వీర రాజమ్మ కథా, లక్ష్మమ్మ కథా, నల్లతంగాళ్ కథా అలాంటివే.''[16]

**4. అద్భుత రస ప్రధాన కథా వాఙ్మయము:** ఈ అద్భుత రస ప్రధాన కథలు స్త్రీలను, బాల బాలికలను, జానపదులను ముగ్ధులను జేయుననియు; ఇవి అన్ని భాషలలోను గలవనియు; వీనిలో మనసుయొక్క విస్సృంఖలవిహారము, రచయిత కల్పనాచాకచక్యము ద్యోతకమగుననియు; ఇవి జనుల నాశావాదులుగా మార్చుననియు ఆదిశేషువుగారు నుడివి, వీనినొక ప్రత్యేక వర్గముగా విడదీసినారు. బాలనాగమ్మ కథ, కాంభోజరాజు కథ, ధర్మాంగద చరిత్ర పాముపాట, చిన్నమ్మ కథ, గాంధారి కథ - ఈ వర్గమునకు ఉదాహరణముగా పేర్కొనిరి. వచన కథలలో కాశీమజిలీ కథలును ఈ విభాగమునకే చెందుననిరి.

శ్రీపాదవారు 'వీరగాథలు, సాహసులను కీర్తించు వీరకథలు' అని చేసిన రెండు విభాగములనే ఆదిశేషువుగారు 'వీర కథలు, సాహసిక కథలు, కరుణరసాత్మక కథలు, అద్భుత రస ప్రధాన కథలు, అని నాల్గుగా విభజించి చూపిరి. ఇది మెచ్చదగినదే. కాని, శ్రీపాదవారు చెప్పిన జంగంకథలను, పదములను వీరి గ్రంథములో నెచ్చటను సూచింపక పోవుట శోచనీయము. అంతేకాక, వీరు చేసిన విభాగములలో, వీర కథా వాఙ్మయమునకును సాహసిక కథా వాఙ్మయమునకును చెప్పుకొనదగినంత భేదము లేదు. వీర కథా వాఙ్మయమున కిచ్చిన ఉదాహరణములలో వీరగాథలు, వీరగాథావృత్తములు, వీరగాథానికలు ప్రత్యేకముగా చూపక

---

15. *జానపద గేయ వాఙ్మయ పరిచయము, పుట 65.*

16. *జానపద గేయ వాఙ్మయ పరిచయము, పుట 92.*

పోవుటయటులుండ, వీరగాథానుకరణమైన అల్లూరి సీతారామరాజు బుఱ్ఱకథను సాంప్రదాయక వీరగాథలతో కలిపి చర్చించుట సహింపరానిది. కాబట్టి శ్రీహరి ఆదిశేషువుగారి వర్గీకరణము సమగ్రము కాదని తెలియుచున్నది.

శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు తాము 1953లో రచించిన 'దేశి సారస్వత విభూతి' అను వ్యాసమునకు 1955లో నొక యనుబంధమును ప్రకటించిరి. (చూ. కిన్నెర, 1955 సంక్రాంతి సంచిక). ఇందు వారు పూర్వము సూచించిన దేశి సారస్వత విభాగములలో 'స్త్రీల పాటలు, వీరగాథలు, జంగం కథలు, వీరకథలు, పదములు' అనువానికి మఱికొన్ని లక్ష్యములను చేర్చిరి.

## డా॥ బి. రామరాజుగారి వర్గీకరణము (1958) :

జానపద గేయములపై మొట్టమొదటిసారిగా పరిశోధన చేసిన డా॥ బి. రామరాజుగారు తమ పరిశోధన వ్యాసమును, 1958లో 'తెలుగు జానపదగేయ సాహిత్యము' అను పేరుతో గ్రంథ రూపమున వెలువరించిరి. ఇందు జానపద గేయములు ఆలంబనము, వస్తువు, రసము అను ముత్తెఅంగుల ప్రమాణములతో పదునొకండు విభాగములుగా వర్గీకరింపబడినవి:

**I. ఆలంబనము ననుసరించిన విభజనము:**

1. బాల బాలికల గేయములు
2. స్త్రీల పాటలు
3. శ్రామికగేయములు

**II. వస్తువు ననుసరించిన విభజనము:**

1. పౌరాణికములు
2. చారిత్రకములు
3. మత సంబంధములు
4. పారమార్థికములు

**III. రసము ననుసరించిన విభజనము:**

1. శృంగార గేయములు
2. అద్భుతరస గేయములు
3. కరుణరస గేయములు
4. హాస్యరస గేయములు

ఈ పదునొకండు విభాగములలో కొన్నింటికి మఱల అంతర్విభాగములను సూచించిరి. పౌరాణిక గేయములను 'రామాయణ సంబంధములు, భారత సంబంధములు, భాగవత

సంబంధములు, ఇతరములు' అని నాలుగుగా విభజించిరి. చారిత్రక గేయములను 'చారిత్రకములు, అస్పష్ట చారిత్రకములు' అని రెండుగా విభజించిరి. మత సంబంధ గేయములను 'శైవమత సంబంధములు, వైష్ణవమత సంబంధములు' అని విడగొట్టిరి. పారమార్థిక గేయములను - 'భక్తి గేయములు, వేదాంత సంబంధములు, కర్మమార్గ సంబంధములు' అని మూడుగా విభజించిరి.

మొత్తముమీద రామరాజుగారు కూడ జానపద గేయములకు - వీరగాథలకు గల భేదమును గుర్తింపలేదు. దేశికవితకు చెందిన స్త్రీల పాటలను, కీర్తనలను గూడ జానపద గేయములుగనే సంభావించిరి. ఛందస్సులోను, వస్తువులోను, ఆలంబనములోను తమ ప్రత్యేకతను జూపు 'పదములు, జంగం కథలు' అను శాఖలకు ప్రత్యేక స్థానముల నీయక, వీనిని స్త్రీల పాటలతోను, కీర్తనల గాథలతోను కలిపి గుచ్చెత్తి పోసిరి. ఉదాహరణకు - వీరు చూపిన రామాయణ సంబంధములగు పౌరాణిక గేయములలో వీరిచ్చిన 'రామకథా సుధార్ణవము' బొబ్బిలివరుసలో నున్న పదము; 'కుశలవ కుచ్చుల చరిత్రము', ఊర్మిళాదేవి నిద్ర' అనునవి స్త్రీల పాటలు; 'శారద రామాయణము' కీర్తనల గాథ, 'పాతాళ హోమము, లక్ష్మణ మూర్ఛ, శతకంఠ రామాయణము' - అనునవి జంపెవరుసలో నుండు హరిహరీ పదములు; మాయలేడి పాట జానపద గేయకథ (వీరగాథానిక). ఇట్లే భారత భాగవత సంబంధములగు పౌరాణిక గేయములందును. శైవమత సంబంధములగు గేయము లందును, 'పదములు, జంగం కథలు, స్త్రీల పాటలు' మున్నగు భిన్న ప్రక్రియలు 'కలగాపులగము' చేయబడినవి. రసమునుబట్టి చేసిన వీరి విభజనము - ముఖ్యముగా శృంగార హాస్య విభాగములు, ఆలంబనము ననుసరించియు, వస్తువు ననుసరించియు ముందు చేసిన విభజనలకు చర్విత చర్వణమే కాని నూతనము కాదు. రామరాజుగారు చేసిన పదునొకండు విభాగములలోను 'చారిత్రక గేయములు, అద్భుతరస గేయములు, కరుణరస గేయములు' అని మూడు విభాగములు మాత్రమే మనము పరిశీలింపవలసిన సాంప్రదాయక వీరగాథలకు వర్తించును. (ఇందు చారిత్రక గేయములలో అల్లూరి సీతారామరాజు బుఱ్ఱకథ కలుపబడి యున్నది. దీనిని పరిహరింప వలెను. ఇది వీరగాథానుకరణమే కాని సాంప్రదాయక వీరగాథ కాదు). ఇతర విభాగములలో - 'పౌరాణికములు' అనుదానిలో స్త్రీలపాటలతో కలిపి వీరు సూచించిన 'జంగంకథలు, పదములు' అనువానిని గూడ సాంప్రదాయక వీరగాథలలో చేర్చుకొనవలెను.

## నేదునూరి గంగాధరంగారి వర్గీకరణము (1960) :

జానపద గేయములను, స్త్రీల పాటలను అసంఖ్యాముగా సేకరించిన శ్రీ నేదునూరి గంగాధరంగారు 1960లో 'జానపద గేయ వాఙ్మయ వ్యాసావళి' అను గ్రంథమును రచించిరి. ఇందు వీరు జానపదగేయ వాఙ్మయమును ఆఱు విధములుగా వర్గీకరించిరి:

**1. వ్యవసాయ పదాలు:** (1) రైతుల పండుగలు
(2) పొలం పదాలు
(3) పురుష సాహిత్యం
(4) పశువుల కాపర్ల పాటలు

**2. గృహ జీవనము:** (1) పిల్లల తల్లి
(2) అత్తా కోడళ్ళు
(3) వేరే కాపురం

**3. రసాశ్రయం**

**4. స్త్రీల పదసారస్వతం**

**5. శైవ సారస్వతం – స్త్రీ సాహిత్యం**

**6. వీర పదాలు, సాహస గేయాలు:** (1) చిట్టి గేయాలు
(2) దీర్ఘ గేయాలు
(3) కథా గేయాలు

ఇందు 'చిట్టి గేయాలు', దీర్ఘ గేయాలు' అను అంతశ్శాఖలు లఘు వీరగాథలకును, 'కథాగేయాలు' అను విభాగము సాధారణ వీరగాథలకును వర్తించును.

గంగాధరంగారు సూచించిన పై ఆఱు విభాగములలో మొదటి మూడును జానపద గేయములకును; 4,5 విభాగములు స్త్రీల పాటలకును; 6వ విభాగము మన సాంప్రదాయక వీరగాథలకును వర్తించును. జంగంకథలను గూర్చి కాని, పదములను గూర్చి కాని వీరు చర్చింపలేదు. మొత్తముపై గంగాధరంగారి వర్గీకరణము కూడ శ్రీహరి ఆదిశేషువు గారి వర్గీకరణము వంటిదే. వీరు కూడ స్త్రీల పాటలను జానపదగేయములతో చేర్చి సంభావించిరి. వీరి గ్రంథ నామము 'దేశి వాఙ్మయ వ్యాసావళి' అని యుండినచో సమంజసముగా నుండెడిది.

## పల్నాటి వీరచరిత్ర – పింగళివారి వర్గీకరణము (1961) :

తెలుగులో నేటివఱకును జానపద గేయములకు, స్త్రీల పాటలకు సంకలన గ్రంథములు వచ్చినవి కాని, వీరగాథా సంకలనము లింకను వెలువడలేదు. 'కృష్ణశ్రీ' (శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు) సంపాదించిన 'పల్లె పదాలు' (1955), ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడెమీ వారు ప్రచురించిన 'త్రివేణి' (1960) అనునవి తెలుగు జానపదగేయ సంకలనములకు చక్కని ఉదాహరణములు. 'కృష్ణశ్రీ' గారి సంపాదకత్వమున వెలువడిన 'స్త్రీల రామాయణపు పాటలు', 'స్త్రీల పౌరాణికపు పాటలు' అను రెండు గ్రంథములును స్త్రీల పాటలలో కథాగేయములకు లక్ష్యములు. క్రీ.శ. 1900 ప్రాంతమున నందిరాజు చలపతిరావుగారు 'స్త్రీల

పాటలు' అను పేర మూడు భాగములను అచ్చొత్తించి ప్రకటించినారు. ఇందు గేయములు, గేయకథలు రెండును గలవు. ఒకటి రెండు 'పదములు' కూడ ఇందు కలిసి ఉన్నను, మొత్తమునకివి స్త్రీల పాటలకు మంచి లక్ష్యములని చెప్పవలెను. రోడ్ల ప్రక్కన అమ్మబడు గుజిలీ ప్రతులేకాని, వీరగాథలకు ప్రామాణికమైన గ్రంథములు ప్రకటితములు కాలేదు. క్రీ.శ. 1911 ప్రాంతమున అక్కిరాజు ఉమాకాంతంగారు పల్నాటి వీరగాథా వృత్తములోని 'బాలచంద్రుని యుద్ధము'ను ప్రకటించిరి. ''నందుల కాటమరాజు'' అను ద్విపద కావ్యమును యం. సంజీవ కవి యనునాతఁడు 1917లో పరిష్కరించి ప్రకటించినట్లు తెలియుచున్నది. (చూ. ఆంధ్ర వాఙ్మయ సూచి, పుట 94). కావ్య నామమగు ఈ 'నందుల కాటమరాజు' ను నిడుదవోలు వేంకటరావుగారు కవి నామముగా బేర్కొనిరి. (చూ. Annals of Oriental Research, Volume IX, 1951-52, Parts 1&2, p.5). వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పరిష్కరించిన 'కాటమరాజు కథ'ను 1953లో మల్లంపల్లి సోమశేఖరశర్మగారి పీఠికతో మద్రాసు ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారము వారు ప్రకటించిరి. ఇందు మూడు కథలున్నవి. దీని పీఠికలో వీరగాథలను గూర్చి ఏమియును లేదు. ఈ మదరాసు భాండాగారము వారే 1958లో 'బొబ్బిలి యుద్ధ కథ'ను, 'కుమార రాముని కథ'ను గూడ ప్రకటించిరి. 1961లో విశాలాంధ్ర వారు ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి సంపాదకత్వమున 'పల్నాటి వీరచరిత్ర' ను ప్రకటించిరి. ఈ గాథావృత్తమున 11 వీరగాథలున్నవి. కనీస మొక వీరగాథా చక్రమైనను కొంతవఱకు ప్రకటితమగుట సంతసింప దగినది. ఇట్లు విడి విడిగా నొకటి రెండు గ్రంథములు తప్ప, ఆంగ్లములో వలె సంపూర్ణమగు వీరగాథా సంకలన గ్రంథములు మన తెలుగులో నేటి వఱకును వెలువడకుండుట విచారకరము. వీరగాథలను ప్రత్యేకముగా విమర్శించిన. గ్రంథములును తెలుగున పూజ్యము. 'పిడుగుకి బియ్యానికి ఒకే మంత్ర'మనినట్లు, అన్ని దేశిప్రక్రియలను కలిపి 'జానపద గేయము'లను సాధారణ నామముతో పిలుచుటయే మన విమర్శకుల కలవాటు.

ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు పల్నాటి వీరచరిత్ర పీఠికలో పదముల యావిర్భావమును, పదవర్గీకరణమును కొంత చర్చించినారు. (పింగళివారి మతమున 'పదము' అనునది 'బ్యాలెడ్'కు సమానార్థకము). తెలుగు కవిత్వమును 'పద్య కవిత్వము-పదకవిత్వము' అని రెండు ప్రధాన భాగములుగా విడదీసిరి. గీతికి ఛందస్సు ద్వారా అప్రత్యక్ష సంబంధము నిచ్చినది పద్యకవిత్వమనియు, అట్లుగాక గీతికి ప్రత్యక్షాధికారమే యిచ్చిన కవిత్వము పద కవిత్వ మనియు వివరించిరి. ఈ పదకవిత్వమును మఱల 'గేయ కవిత్వము, పదకవిత్వము' అని రెండుగా విభజించిరి. గాన ప్రధానమైనది గేయ కవిత్వము; కవితా ప్రధానమైనది పద కవిత్వము; త్యాగరాజాదుల కృతులు, క్షేత్రయ్య పదములు, జావళీలు, ముత్తైదువుల పెండ్లి పాటలు, మంగళ హారతులు మున్నగునవి గేయ కవిత్వమందలి వివిధ శాఖలు. చిన్నమ్మ కథ, కామమ్మ కథ, లక్ష్మమ్మ కథ మున్నగు సాంఘికములును; బొబ్బిలి కథ, కాటమరాజు కథ, దేశింగురాజు కథ,

పలనాటి కథ మున్నగు చారిత్రకములను పదకవిత్వమందలి అంతశ్శాఖలు. ఇది పింగళివారు సూచించిన వర్గీకరణము. అనగా వీరగాథలలో పింగళివారు 'సాంఘికములు, చారిత్రకములు' అను రెండు వర్గములను మాత్రమే గుర్తించినట్లు తెలియుచున్నది. ఇది మిక్కిలి స్థూల విభాగము. శక్తికథలు, పదములు, జంగంకథలు, వీరగాథా వృత్తములు, వీరగాథానికలు - మున్నగున వెన్నియో విభాగములుండ, రెండు వర్గములను మాత్రమే గుర్తించుట సరికాదు.

## శ్రీపాదవారి వర్గీకరణము (1961) :

దేశిసాహిత్యముపై అత్యుత్తమ వ్యాసములను ప్రకటించిన మహనీయులు శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు. ఈ మహారణ్యమును మొట్టమొదట ఛేదించి బాటలు తీర్చిన సాహసులను వీరే! 1953లో వీరు ప్రకటించిన వ్యాసము దేశిసారస్వత విభూతిని సహస్ర ముఖముల ఘోషించుచున్నది; దేశి సాహిత్యములోని వివిధ వర్గములను వింగడించి చూపు చున్నది. శ్రీపాదవారు 1961లో తెలుగు విజ్ఞాన సర్వస్వములో 'జానపద గేయ-గేయ కథా వాఙ్మయము' అను మఱియొక గొప్ప వ్యాసమును రచించిరి. దీనిలో వీరు గేయములు వేఱు, గేయకథలు వేఱు అని ప్రప్రథమున సూచించిరి. తెలుగు విమర్శకులలో ఇంతకు ముందెన్నడును ఏ విమర్శకుడును ఈ విభాగమును చేసియుండలేదు. గేయములందును, గేయ కథలందును గల వివిధ అంతశ్శాఖలను విమర్శసహముగా విడదీసి చూపిరి. వస్తువెంత ధారాళమైనదైనను, జానపద గేయ వాఙ్మయమంతయు ''విడి గేయములు - గేయకథలు'' అను విభాగము క్రిందికి వచ్చి వేయునని శ్రీపాదవారు చెప్పిరి. ఇది పాశ్చాత్యుల 'Song - Ballad' అను విభజనకు సరిగా సరిపోవుచున్నది. ఇందు విడిగేయములు జానపదుల జీవిత ఘట్టముల నాశ్రయించిన ఉత్సాహమును, ఆనందమును, జాలిని వెలిబుచ్చునట్టివి. వీని లయ, రాగము కూడ సందర్భానుసారముగనే యుండును. వీనిలో ఐదు అంతశ్శాఖలను సూచించిరి: ''పసిపిల్లల కొఱకు పాడునవి, గృహజీవనము, ఇంటి బయట పనిపాటలు చేసుకొనేటప్పుడు పాడునవి, ఆట పాటలు, చాటువుల వంటివి.'' ఇవి యన్నియు కథాకథనము లేని శుద్ధ గేయము లగుటచే ఈ విడి గేయములు నా పరిశోధనా ప్రమేయములోనికి రావు. గేయకథలు మాత్రమే నాకు సంబంధించినవి.

గేయకథలలో శ్రీపాదవారు నాలుగు వర్గములను సూచించిరి (1) జంగంకథలు, బొబ్బిలిపాట వంటివి, (3) పదాలు, (4) స్త్రీల కథాగేయములు - ఇందు మొదటి మూడును జానపద కవితకు చెందిన సాంప్రదాయక వీరగాథలు. నాల్గవది 'జాతి దేశి'. ఇది మనకు పరిహరణీయము. ఈ వీరగాథలను గూర్చియు, వీని క్రమ పరిణామ వికాసములను గూర్చియు శ్రీపాద వారీ క్రింది విధముగా సెలవిచ్చినారు:

''విడిగేయాలు వ్యక్తుల కాలక్షేపానికీ, ఆనందానికీ అయితే, కథాగేయాలు పలువురి కాలక్షేపానికి, ఆనందానికీ తోడ్పడుతాయి. ప్రసిద్ధ కరుణగాథలూ, వీరగాథలూ, పురాణ గాథలూ, పదాల రూపాన బవనీళ్ళు, పించుకుంటులూ, జక్కులవాళ్ళూ, జంగములూ, శారద కాండ్రు వినిపిస్తే, వేసవికాలపు రాత్రులలో ఆరుబయట కూర్చుని గ్రామీణులీ కథలాలకిస్తారు... తొలిరోజుల్లో ఈ కథలు నాలుగు 'కిటతకిట' ఆవృతాల పాదాలతో జంపెలనే పేరుతో ఉండేవనీ, పాల్కురికి వంటి శివకవులీ దేశిపద్ధతిని కొద్దిగా సంస్కరించి ద్విపద ప్రబంధాలు రచించారని నా విశ్వాసము. అయినప్పటికీ మాతంగి కథ, మాహురమ్మ కథ, అగుమంచి కథ వంటి 14వ శతాబ్దపు కథలు జంపెవరుసలుగనే సంతరింపబడ్డవి. క్రమముగా 'కిటతక కిటతక' అనే ఎనిమిది అక్షరాల ఆవృతాలు నాలుగింటితో బొబ్బిలిపాట వరుసలో బంగారు తిమ్మరాజు కథవంటివీ, నాలుగు కిటతక ఆవృతాలతో వరాహావతారకథా, కాంభోజరాజుకథవంటివీ వచ్చాయి. కొమార రామునికథను పోలిన గాంధారికథలో దరువులు ప్రవేశించినవి. గేయకథలు దరువులూ, పద్యాలూ, రగడలూ పెంచుకొని జంగం కథలుగానూ, నాలుగు ఎనిమిదిఅక్షరాల ఆవృతాలో, ఎనిమిది అయిదుఅక్షరాల ఆవృతాలో పెట్టుకొని క్రమంగా బొబ్బిలి పాటవంటివీ, హరిహరీ నారాయణ పదాలవంటివీ గా విడిపోయాయి. మొత్తం మీద పదాలు ఎక్కువగానూ, జంగంకథలు అంతకన్న (సంఖ్య) తక్కువగానూ, బొబ్బిలి పాట వంటివి ఇంకా తక్కువగానూ కనబడు తున్నాయి నేడు''.[17]

దీనిని బట్టి శ్రీపాదవారు వీరగాథలలో 'జంగంకథలు', 'బొబ్బిలి పాటవంటి కథలు', 'పదములు' - అను మూడు విభాగములను ఛందస్సు ప్రాతిపదికగా గుర్తించిరని తెలియు చున్నది. అంతమాత్రమున వీరు వస్తు ప్రాధాన్యమును మఱచిపోయిరని తలపరాదు. వస్తువు నందును ఈ మూడు విభాగములు వేఱుగుచున్నవని శ్రీపాదవారు సూచించియే యున్నారు; ''ఈ మూడు విభాగాలూ వస్తువులో కూడా వేరవడము చిత్రముగా ఉంటుంది. జంగంకథలు శైవవైష్ణవ పురాణగాథలు; బొబ్బిలి పాటల్లాంటివి వీరగాథలూ, పేరంటాండ్ర గాథలూను. పదాలు మళ్లీ పురాణగాథలే''.[18] తరువాత శ్రీపాదవారు స్త్రీల గేయకథలను గూడ చర్చించిరి.

ఇంత సమగ్రము సహేతుకము నగు శ్రీపాదవారి వర్గీకరణమున సహితము చంద్రునిలో మచ్చవలె నొక చిన్న దొసగు తోచుచున్నది. వీరిదివరలో 'కిన్నెర'లో ప్రకటించిన వ్యాసమున 'దేశి సారస్వత విభూతి' ని ప్రదర్శించిరి. ఈ 'దేశి' శబ్ద ప్రయోగముచే నందు స్త్రీల పాటలను గూర్చియు, కీర్తనలను గూర్చియు ముచ్చటించుట యుక్తముగనే ఉన్నది. కాని విజ్ఞాన సర్వస్వమున వ్రాసిన వ్యాసములో ''జానపద గేయ - గేయకథా వాఙ్మయము''ను చర్చించిరి.

*17. విజ్ఞాన సర్వస్వము, నాలుగవ సంపుటము, పుట 805.*

*18. అదే.*

ఇందలి 'జానపద' శబ్దముచే వీరిందు కేవలము పామరులకు సంబంధించిన గేయములను (Folk songs), గేయకథలను (Popular Ballads) గూర్చి ముచ్చటించిన బాగుండెడిది. కాని వీరు దీనిలో స్త్రీల పాటలను గూడ చేర్చిరి. ఈ పాటలు అగ్ర వర్ణముల స్త్రీలు పాడునవే కాని, పామరస్త్రీలు పాడునవి కావు. ఇవి జానపద కవిత్వము కన్న ఒక మెట్టు పైన ఉండుననియు, అందుచే వీనిని 'జాతిదేశి' అని పిలుచుట యుక్తమనియు మొదటి ప్రకరణమున నిరూపించి యుంటిని (చూ. ఆముఖము). జంపెవరుసలో సాగిన 14వ శతాబ్దపు కథలుగా 'మాతంగి కథ, మాహురమ్మ కథ' అను శక్తి కథలను స్మరించినను, మంజరీ ద్విపదలలోను, ద్విపదలలోను సాగిన పల్నాటి వీరకథలను, కాటమరాజు కథలను వీరిట వర్గీకరించి చూపలేదు. వీనిని 'కిన్నెర' సంచికలో 'వీరగాథ'లను పేర తడవి యుండుటచే, నిట వదలివేసిరి కాబోలు. అయినను "ఏకోహి దోషో గుణ సన్నిపాతే..." అను కాళిదాస సూక్తిచే నిట్టి దొసగు లొకటిరెండున్నను లెక్కింపదగినవి కావు. శ్రీపాదవారి వర్గీకరణ విధానమే నాకు మార్గదర్శకమైనది.

## నా వర్గీకరణ విధానము (1967) :

వీరగాథల వర్గీకరణమున ఇతివృత్తములు ప్రముఖపాత్రను వహించుచున్నవని ప్రాక్ప్రతీచీ విమర్శకుల విభజన విధానములను బట్టి తెలియుచున్నది. పాశ్చాత్య వీరగాథల యితివృత్తములు సాధారణముగా చారిత్రకములుగను, అస్పష్ట చారిత్రకములుగను, కాల్పనికములుగను ఉండును. సాంసారికములు, మత సంబంధములు, ఐంద్రజాలికములు నగు కథలు కూడ కొన్ని గలవు.[19] మన వీర గాథలలో గూడ చారిత్రకములు, అస్పష్ట చారిత్రకములు, సాంఘికములు, జానపదములు (కాల్పనికము), పౌరాణికములు - అను వర్గములకు చెందిన ఇతివృత్తములు గలవు.

నిర్వచన ప్రకారము గేయరూపమున కథనుచెప్పిన కవితాప్రక్రియ లన్నియు వీరగాథలైనప్పటికిని, ఇందలి యితివృత్తములు నూటికి తొంబది వంతులు వీరరస ప్రధానములై యుండునని గుర్తింపవలెను. మొదట వీరగాథలన్నియును వీరరసాత్మకములుగనే వెలువడి యుండును. పౌరాణిక వీరగాథలు కూడ ఆయా పురాణములలోని వీరులను గూర్చియే చెప్పుచున్నవి. కాలక్రమమున పేరంటాండ్ర కథలవంటి కరుణరస ప్రధానములగు రచనలు గూడ వీరగాథలలో చొఱబడినవి. అద్భుత రసము జానపదులకు మిక్కిలి యిష్టమైనది. చారిత్రక సంఘటనలలో సహితము కొన్ని అద్భుత కల్పనలు చేయుదురు. బాలనాగమ్మకథ వంటివి అద్భుత రసమునకు ప్రాధాన్యమిచ్చి కూర్పబడిన వీరగాథలు. మొత్తముమీద వీరగాథలు,

19. *"The stories ballads tell are historical; or quasihistorical, like the Scottish ballads that relate the feuds of the Border; adventerous, like the cycle of Robin Hood Ballads; romantic, like the beautiful 'Helen of Kirkconnell'...Other ballads have domestic, religious or magical themes." -Oxford Junior Encyclopaedia, Vol.XII, p.36.*

యుద్ధములకు, చిన్న చిన్న కొట్లాటలకు, హత్యలకు, ఆత్మహత్యలకు, హృదయవిదారక సంఘటనలకు సంబంధించి యుండును. ఈ యితివృత్త వైవిధ్యములను బట్టి వర్గీకరణము చేయవచ్చును.

ఇట్లు వీరగాథల వర్గీకరణమున కథావస్తువును దృష్టియందుంచుకొనుట ముఖ్యమే. కాని వీరగాథలు పాడబడునవే కాని, చదువబడినవి కావు. వీని రాగతాళములు వీని రచనా విధానముపై (ఛందస్సుపై) ఆధారపడి యుండును. అందుచే వర్గీకరణమున ఛందోభేదములను విస్మరించుట మంచిది కాదు. ఈ కథలలో కొన్నిటి రాగతాళములు కొన్ని ప్రత్యేక వాద్యములపైననే అమరును. ద్విపద వికారములుగా వ్రాయబడిన పల్నాటి వీరకథలను, కాటమరాజు కథలను, తిత్తి శ్రుతితో, వీరణముల తాళముతో మాత్రమే పాడ వీలగును. వీనిని తంబుఱ గుమ్మెటలతో పాడలేము. అట్లే చతురశ్ర గతిలో సాగు బొబ్బిలిపాట వరుసలోని వీరగాథలను తంబుఱ శ్రుతితో, గుమ్మెటల తాళముతో పాడ వీలగును. వీనిని తిత్తి, వీరణములతో పాడ వలనుపడదు. చిన్నపరెడ్డికథను చిటికెలు, కంజిర, నాగస్వరములతో పాడెదరు. ఇట్లే తెలంగాణమున త్రిశ్ర గతిలో నడచు మియాసాబుకథను 'మెట్ల కిన్నెర' తోనే పాడగలరు కాని మఱొక వాద్యముతో పాడుటకు వీలుపడదు. అందుచేతనే వీనిని 'కిన్నెర కథలు' అందురు. కాబట్టి వీరగాథలలో వాద్యములును ప్రముఖపాత్ర వహించుచున్నవి. ఈ వాద్యములను బట్టియు వీరగాథలను వర్గీకరింపవచ్చును.

వీరగాథలలో నొక్కొక్క విధమగు కథలను ఒక్కొక్క జాతి గాయక భిక్షువులు మాత్రమే పాడుదురు. 'వీర విద్యావంతు' లనెడి మాలలు పల్నాటివీరకథలను; పిచ్చుకుంట్లు రెడ్ల పురాణమును; 'కొమ్ములవారు' అను మాదిగలు కాటమరాజు కథలను; జంగములు బొబ్బిలికథాదులను; మాదిగలు పరశురామునికథలను; మాలలు అంకమ్మకథలను పాడు చుండుట పరిపాటి. దీనినిబట్టి వీరగాథాగానమున ఆయాజాతుల గాథకులు (గాథాకారులు) విశిష్ట పాత్రను నిర్వహించుచున్నారని తెలియుచున్నది. కావున వర్గీకరణమున ఈ జాతులను విస్మరింపరాదు.

గాథాగానమున వంతపాటగాండ్రు ఉచ్చరించెడి పాదాంతపదముల (Refrains) ను బట్టికూడ కొన్నివీరగాథలకు పేర్లిడవచ్చును. ''ఆఁ...., ఆహో, తందాన తాన, భళిభళీ, మేలు భళీ, మేలు భళాజీ, సై సై, గొబ్బియళో, ఉయ్యాలో, తుమ్మెదా, వెన్నెలా, రాంభజనో'' మున్నగునవి ఆయా గాథల గానమునకు పరిపుష్టి నొసంగెడి పాదాంత పదములు.

కొన్నివీరగాథలు చాల హ్రస్వములుగ నుండి, జానపదులచే పనిపాటులయందు గాని, గాయక భిక్షువులచే పగటిపూట బిచ్చమెత్తుకొను నప్పుడు గాని పాడబడుచుండును. మఱికొన్ని సుదీర్ఘ వీరగాథలు గాయక భిక్షువులచే రాత్రివేళ గంటల తరబడి చెప్పబడుచుండును. ఇంకను

కొన్ని వీరగాథలు వారములు, నెలలు చెప్పినను తఱుగని సుదీర్ఘ రచనలు. కాబట్టి వీరగాథల పరిమాణమును బట్టియు వర్గీకరింపవచ్చును.

వీరగాథలు కొన్ని ఒక ప్రముఖ వీరుని చుట్టును అల్లబడి, ఆతనిని గూర్చియు, ఆతని బంధువులను గూర్చియు కథలను వర్ణించుచుండును. ఒక్కొక్కప్పు డొక కులదైవమునకు ప్రాధాన్యమిచ్చి, ఆ దైవమును గొల్చిన రాజుల కథలెన్నియో పెద్ద ఇతిహాసమువలె చెప్పబడును. పల్నాటి వీరకథలలో ప్రధానవీరుడు బ్రహ్మనాయడు, కులదైవము చెన్నుడు లేక చెన్నకేశవుడు. జానపదు లీ కథలను 'చెన్నుడి కథలు' అందురు. కాటమరాజు కథలలో కాటమరాజు ప్రధాన వీరుడు; కులదైవము గంగ. కావున గాథలను విభజించునప్పుడు ఈ ప్రముఖ వీరులను కులదైవములను దృష్టియందుంచుకొనవలెను. జానపదులిట్టి కథలను ఆయా ప్రధానవీరుల పేర్లతోను, కులదైవముల పేర్లతోను పిలుచుచుందురు. కావున మన వర్గీకరణమున ఈ జానపద వ్యవహారమును తృణీకరించుట హాస్యాస్పదమగును.

మతదర్శనములను బట్టి వీరగాథలను - ముఖ్యముగా గాథాచక్రములను వర్గీకరింప వచ్చును. ఈ గాథాచక్రములు మాలమాదిగలచే పాడబడుచుండును. వీరిలో నాలుగు ప్రధాన దర్శనములున్నవి: ''అమ్మగారి దర్శనము, అయ్యగారి దర్శనము, చెన్నుని దర్శనము, గంగ దర్శనము.'' ఈ నాలుగు రకముల మాలమాదిగలును నాలుగు రకముల వీరగాథలను పాడుచున్నారు. వారు పాడెడి వీరగాథలను బట్టియే ఈ దర్శనముల పేర్లు వచ్చియుండును. అమ్మగారి దర్శనమువారు ప్రధానముగా మాదిగలలో గలరు. వీరు ఎల్లమ్మ కథలను (పరశురాముని కథలను) పాడుదురు. అయ్యగారి దర్శనమునకు చెందినవారు మాలలు. వీరు అంకమ్మ కథలను పాడుదురు. చెన్నుని దర్శనమునకు చెందిన 'వీర విద్యావంతు' లను మాలలు పల్నాటి వీరకథలను మాత్రమే పాడుచుందురు. గంగ దర్శనమునకు చెందిన 'కొమ్ములవారు' అను మాదిగలు కాటమరాజు కథలనే పాడుచుందురు. కావున ఈ దర్శనములను బట్టి కూడ వీరగాథలను వర్గీకరింప వచ్చును.

దేశ మాండలిక విభాగములను బట్టి కూడ వీరగాథలను విభజింపనగును. వీరగాథల సంఘటనలు ప్రాంతీయములగుటచేతను, పదజాలము ఆయా ప్రాంతముల మాండలికముల తోను ఉపమానములతోను ఒప్పుచుండుట చేతను, ఈ విధమగు విభజనము కూడ కొంత సమంజసమే. విశాలాంధ్రమున 'ఆంధ్ర, రాయలసీమ, తెలంగాణము' అను మూడు ప్రధాన మాండలిక విభాగములున్నవని నిన్న మొన్నటి వఱకును తలపబడుచుండెడిది. కాని యిటీవల గురువర్యులు డా॥ భద్రిరాజు కృష్ణమూర్తిగారు వృత్తిపదకోశ నిర్మాణమునకై జరపిన పరిశోధన వలన విశాఖ, విజయనగర, శ్రీకాకుళ మండలములు ప్రత్యేక మాండలిక భాగముగా నేర్పడినవని ధ్రువ పడినది. ఈ నాల్గు విభాగముల ననుసరించి వీరగాథలను వర్గీకరింపవచ్చును.

సాంప్రదాయక వీరగాథలు కాకపోయినను, బుఱ్ఱకథలు నేటి ఆంధ్ర దేశమున ప్రముఖ స్థానమును వహించుచున్నవి. సాంప్రదాయక వీరగాథల వరుసల నన్నింటిని అనుకరించి, ఒక సమాహార - వీరగాథగా బుఱ్ఱకథ యవతరించినది. కాబట్టి వీరగాథానుకరణములగు ఈ బుఱ్ఱకథలకు కూడ వర్గీకరణమున ఒక స్థానమును కల్పింపవలెను.

పై విషయముల నన్నింటిని దృష్టియందిడుకొని తెలుగు వీరగాథలను ఈ క్రింది మార్గముల ననుసరించి విభజింపనగును:

### I. మౌఖిక సంప్రదాయము ననుసరించిన వర్గీకరణము:

1. సాంప్రదాయక వీరగాథలు
2. వీరగాథానుకరణములు - ఈ వీరగాథానుకరణములలో మఱల ఐదు అంతశ్శాఖలు కానవచ్చును: (i) బుఱ్ఱకథలు (ii) జముకుల కథలు (iii) సుద్దుల కథలు లేక గొల్లసుద్దులు (iv) తందనాన కథలు (v) బతుకమ్మ పాటలు

### II. కాలప్రమాణము ననుసరించిన వర్గీకరణము:

1. వీరగాథా చక్రములు లేక వీరగాథా వృత్తములు (Ballad-cycles)
2. వీరగాథలు (Ballads)
3. వీరగాథానికలు లేక లఘు వీరగాథలు (Balladlings)

### III. భాషా మాండలికముల ననుసరించిన వర్గీకరణము:

1. ఉత్తరాంధ్ర వీరగాథలు (విశాఖ, విజయనగర, శ్రీకాకుళము మండలములు)
2. మధ్యాంధ్ర వీరగాథలు (ఉభయ గోదావరులు, కృష్ణా, గుంటూరు, ప్రకాశం, నెల్లూరు మండలములు)
3. రాయలసీమ వీరగాథలు (చిత్తూరు, కడప, కర్నూలు, అనంతపురము మండలములు)
4. తెలంగాణా వీరగాథలు (మహబూబ్‌నగర్, నల్గొండ, హైదరాబాద్ (రంగారెడ్డి), మెదక్, నిజామాబాద్, ఆదిలాబాద్, కరీంనగర్, వరంగల్లు, ఖమ్మం మండలములు)

## IV. ఇతివృత్తముల ననుసరించిన వర్గీకరణము:

1. చారిత్రకములు: (i) స్పష్ట చారిత్రకములు
   (ii) అస్పష్ట చారిత్రకములు
2. సాంఘికములు: (i) పేరంటాండ్రు
   (ii) బందిపోటులు
   (iii) గజదొంగలు
   (iv) గ్రామకక్షలు - హత్యలు
3. జానపదములు
4. పౌరాణికములు

## V. ఛందస్సును బట్టి వర్గీకరణము:

1. ఖండగతి రచనలు లేక ద్విరదగతి రగడలు
2. ద్విపదలు, మంజరీ ద్విపదలు
3. బొబ్బిలి వరుసలు
4. పదములు (జంపె వరుసలు)
5. జంగం కథలు
6. త్రిశ్రగతి లేక తురగవల్గన రగడ

## VI. గాథాకారులను బట్టి వర్గీకరణము:

1. బవనీల కథలు
2. పంబలవాండ్ర కథలు
3. వీర విద్యావంతుల కథలు (పల్నాడు)
4. గొల్లసుద్దుల కథలు లేక కొమ్ములవాండ్ర కథలు
5. పిచ్చుగుంట్ల కథలు
6. జంగం కథలు
7. వీరముష్టుల కథలు
8. శారదకాండ్ర కథలు (తెలంగాణ)
9. జక్కుల కథలు

10. పూసల బలిజల కథలు (రాయలసీమ)
11. బుట్టెబుకులవాండ్ర కథలు (రాయలసీమ)
12. డక్కలవాండ్ర కథలు లేక మాష్టీల కథలు (తెలంగాణ)
13. బీరన్నల కథలు (తెలంగాణ)
14. దాసరుల కథలు
15. గరుడస్తంభం దాసరుల కథలు (రాయలసీమ)

## VII. పునరావృత్తిని బట్టి వర్గీకరణము:

1. ఆకుపదములు
2. తందాన కథలు
3. మేలు భళీ కథలు (తెలంగాణ, రాయలసీమ)
4. సై సై కథలు
5. రాయుడా! రామన్న రాయుడా కథలు (తెలంగాణ)
6. హరిహరీ పదములు
7. గొబ్బి పదములు
8. తుమ్మెద పదములు
9. వెన్నెల పదములు
10. రాంభజన పాటలు (తెలంగాణ)
11. ఉయ్యాల పాటలు

## VIII. జానపద వాద్యముల ననుసరించి వర్గీకరణము:

1. జముకుల కథలు
2. పంబల కథలు
3. వీరణం కథలు
4. తంబుఱ కథలు
5. శారద కథలు (తెలంగాణ)
6. బుఱ్ఱకథలు
7. కిన్నెర కథలు (తెలంగాణ)

8. జాగట కథలు (రాయలసీమ)
9. ఒగ్గుల కథలు (తెలంగాణ)

## IX. ప్రధాన వీరుని బట్టి వర్గీకరణము:

1. పరశురాముని కథలు
2. మారాచపు రాజుల కథలు
3. పల్నాటి వీరుల కథలు
4. కాటమరాజు కథలు లేక యాదవ రాజుల కథలు
5. వెలకంటి వీరుని కథలు (రాయలసీమ)

## X. కులదైవములను బట్టి వర్గీకరణము:

1. ఎల్లమ్మ కథలు
2. అంకమ్మ కథలు
3. చెన్నుడి కథలు
4. గంగ కథలు
5. చౌడమ్మ పాటలు (రాయలసీమ)

## XI. దర్శనములను బట్టి వర్గీకరణము:

1. అమ్మవారి దర్శనమువారి కథలు
2. అయ్యగారి దర్శనమువారి కథలు
3. చెన్నుని దర్శనమువారి కథలు
4. గంగ దర్శనము వారి కథలు

పైన తెల్పిన పదునొకండు విధములగు వర్గీకరణములలోని విభాగములన్నియు ఆయా పేర్లతో జానపదులలో వ్యాప్తియందు లేవు. ఇందు లక్షణానుసారముగా కల్పింపబడిన నామములే హెచ్చు. కొన్ని కథలు ప్రధాన వీరులను బట్టియు, మఱికొన్ని కులదైవములను బట్టియు, ఇంకను కొన్ని గాథాకారులను బట్టియు ఏర్పడిన ప్రసిద్ధ నామములతో జానపదులలో వ్యవహరింపబడు చుండును. కొన్ని కథలకు రెండు మూడు నామములు ప్రసిద్ధములై యుండవచ్చును. ఉదాహరణమునకు, కాటమరాజు కథలలో ప్రధాన దైవమగు గంగకు అత్యంత ప్రాధాన్యమున్నను, ఆ కథలు 'గంగ కథలు'గా వ్యవహరింప బడుట లేదు. 'కాటమరాజు కథ' లనియే వానికి ప్రసిద్ధి. వీనికి 'యదుశాస్త్రము, యాదవ చరిత్ర, యాదవరాజుల కథలు' అను నామాంతరములును

గలవు. అట్లే వాద్యములను బట్టి చేసిన వర్గీకరణములో, 'వీరణం కథలు, పంబల కథలు, గుమ్మెట కథలు' అను పేర్లు జనవ్యవహారమున లేవు. 'పల్నాటి వీరకథలు, అంకమ్మ కథలు', జంగం కథలు అనియే ప్రజలలో వాడుక. పరశురాముని కథలకు 'ఎల్లమ్మ కథలు, గౌతు పురాణము' అను మఱి రెండు పేర్లుకూడ ప్రజలలో వ్యాప్తియందున్నవి. ప్రధానవీరుడు, కులదైవము, దర్శనము - అను వానినిబట్టి చేసిన విభజనము ఒక్క గాథావృత్తములకే వర్తించు చున్నది కాని తక్కిన వీరగాథలకు వర్తించుట లేదు. కావున పైన తెల్పిన వివిధ వర్గీకరణ విధానములను సమన్వయపఱచి, అన్ని విభాగములను కూడగట్టుకొని వచ్చునట్లుగ నొక మధ్యే మార్గము ననుసరింపవలెను. సాధ్యమగునంత వఱకు జానపదులలో ప్రసిద్ధ వ్యవహారమున నున్న నామములను స్వీకరింపవలెను.

తెలుగు కవిత్వము 'మార్గ (Classical) - దేశి (Popular)' అని ద్వివిధము. ఇందు దేశి కవిత్వము 'నిబద్ధ దేశి (Partly Popular) - అనిబద్ధ లేక శుద్ధ దేశి (Purely Popular)' అని మఱల ద్వివిధము. సూక్ష్మ పరిశీలనము వలన, ఇందలి శుద్ధదేశిలో 'జాతి దేశి (స్త్రీల పాటలు), పామర దేశి (జానపద - Folk Poetry)' అను రెండంతర్భాగములు గోచరించును. వీరగాథలు పామరదేశికి చెందిన కవితాప్రక్రియ. ఇవి పరాశ్రయత్వ లక్షణముతో నొప్పు కథాకథన సహిత సరళగీతములు. కథారహితములై ఆత్మాశ్రయత్వ లక్షణముతో నొప్పు పల్లె పాటలు లేక జానపద గేయములు (Folksongs) వీనికి సోదరశాఖ. అనగా పామరదేశి లేక జానపద కవిత్వమున 'వీరగాథలు - పల్లె పాటలు' అను రెండు అంతశ్శాఖలున్నవి యర్థము.

## I. సాంప్రదాయిక వీరగాథలు:

మౌఖిక సంప్రదాయము ననుసరించి వీరగాథలను రెండు ప్రధాన వర్గములుగా విడదీయ వచ్చును. I. సాంప్రదాయక లేక జనరంజక వీరగాథలు, II. వీరగాథానుకరణములు. వ్రాతకోతలతో గాక, నిరక్షర కుక్షులగు జానపదులలో ఒక నోటినుండి మఱియొక నోటికి, ఒక తరమునుండి మఱియొక తరమునకు వాగ్రూపమున వ్యాపించు వీరగాథలు సాంప్రదాయక వీరగాథలు, లేక జనరంజక వీరగాథలు. శక్తి కథలు, పల్నాటి వీరకథలు, కాటమరాజు కథలు, బొబ్బిలి కథ, దేశింగు రాజు కథ, బాలనాగమ్మ కథ, కాంభోజరాజు కథ, ఆరె మరాటీల కథ, కామమ్మ కథ, లక్ష్మమ్మ కథ, చిన్నమ్మ కథ, చిన్నపరెడ్డి కథ, సర్వాయి పాపడు కథ, సదాశివరెడ్డి కథ, నారసింహారెడ్డి కథ - ఇత్యాదులు; లక్ష్మణమూర్ఛ, అంగద రాయబారము, శతకంఠ రామాయణము, గంగా వివాహము మున్నగు పదములు; విరాట పర్వము, ఉత్తర గోగ్రహణము, వామన విజయము, భళ్ళాణరాయని చరిత్ర, శ్రీయాళ మహారాజు చరిత్ర మున్నగు జంగం కథలు - ఇవి తెలుగున గల సాంప్రదాయక వీరగాథల కుదాహరణములు.

పరిమాణమును బట్టి ఈ సాంప్రదాయక వీరగాథలు మూడు రకములుగా నుండును;

(1) వీరగాథా చక్రములు లేక వీరగాథా వృత్తములు (Ballad-cycles)

(2) వీరగాథలు (Ballads)

(3) వీరగాథానికలు లేక లఘు వీరగాథలు (Balladlings)

**1.1 వీరగాథావృత్తములు (BALLAD-CYCLES):** వీరగాథలు, ముఖ్యముగా యుద్ధములకు సంబంధించినవి, ఒక ప్రసిద్ధ వీరుని చుట్టును గుత్తులు గుత్తులుగా నేర్పడుచుండును. కవితాగుణమునను, సుదీర్ఘత యందును ఇవి యితిహాస స్థాయికి చేరుకొని యుండును. (ఈ వీరగాథావృత్తములే కాలక్రమమున ఇతిహాసములగునని వేత్తల మతము). తెలుగులో పరశురాముని కథలు, అంకమ్మ కథలు, పల్నాటి వీరుల కథలు, కాటమరాజు కథలు, వెలకంటి వీరుని కథలు మున్నగునవి గాథావృత్తములకు ఉదాహరణములు. ఈ గాథావృత్తములు ప్రపంచమున ప్రతి సాహిత్యమందును గాననగును. సెర్బియన్ సాహిత్యమున క్రీ.శ. 1383కి చెందిన ''Kossovo'' అను జాతీయ వీరునిపై ఒక విషాద గాథా చక్రమున్నది. దీనికి ''Tragedy of Kossovo'' అని పేరు. ఇట్లే ఇంగ్లండులో 'రాబిన్‌హుడ్' (Robin Hood) పైనను, అమెరికాలో ''జెస్సీ జేమ్స్, (Jesse James), యాంకీ డూడిల్(Yankee Doodle)'' అను వీరులపైనను, వీరగాథా వృత్తములు వ్యాప్తియందున్నవి. 'తాయ్' లేక 'సయామీస్' భాషలో జావాదేశపు ప్రసిద్ధవీరుడగు 'పంజి' అను వానిపై అనేక వీరగాథలున్నవి. ఆస్ట్రేలియాలో "Kell Gang" అనునది ప్రసిద్ధ వీరగాథావృత్తము. భారత దేశమున మహారాష్ట్ర సాహిత్యమున శివాజీ సాహస కృత్యముల పైనను, అతని కుమారుల పైనను పెక్కు వీరగాథలు చక్రముగా నేర్పడి యున్నవి. తెలుగులో ఎల్లమ్మ, అంకమ్మ, చౌడమ్మ మున్నగు శక్తుల పైనను; బ్రహ్మనాయడు, కాటమరాజు మున్నగు చారిత్రక వీరుల పైనను, వెలకంటి వీరుని వంటి జానపద వీరులపైనను వీరగాథా వృత్తములు వ్యాపించి యున్నవి.

ఎల్లమ్మ కథాచక్రము (లేక పరశురాముని కథాచక్రము)న - మట్టిచెట్లకథ, జలగన్న పార్వతి కథ, రేణుక కల్యాణము, రేణుక యుద్ధము, పరశురాముని జననము, పరశురాముని యుద్ధము, గవరమ్మ గాజులు, జంపన్న వెలుగొండ వెళ్ళుట - అను ఎనిమిది వీరగాథలున్నవని తెలియుచున్నది. అంకమ్మ కథాచక్రమున అంకమ్మకథ, రసద్దేవి రాజు కథ, గంగు రాజు కథ అనుమూడు వీరగాథలున్నవి. పల్నాటి వీరకథా చక్రమున - పెద్దన్న బాదరాజు పెండ్లికథ, దక్షిణాది యాత్రకథ, పేర్నీడు చందోలు యుద్ధము, తెప్పలి నాయని ఊరకోట యుద్ధము, బ్రహ్మనాయని ఆరణగండ్ల యుద్ధము, నాయకురాలి కథ ఇత్యాదిగా సుమారు ఇరువది నాలుగు వీరగాథలున్నవని నా పరిశీలనము వలన తేలినది. ఇట్లే కాటమరాజు కథాచక్రమున - వల్లురాజు కథ, పంపాద్రి కథ, పెద్దిరాజు కథ, సింహాద్రిరాజు కథ, ఎఱనూకరాజు కథ, నలనూకరాజు కథ,

పోలురాజు కథ, బల్లికురువ యుద్ధము, కటియావులరాజు కథ, కాటమరాజుకు పట్టము కట్టిన కథ, పాపనూక కథ, ఆవుల మేపులు - ఇత్యాదిగా ముప్పదిరెండు కథలున్నవని తెలియుచున్నది. వెలకంటి వీరుని కథాచక్రమున - ముక్కంటి వీరుని కథ, వీర నాయడు కథ, వెలకంటి వీరుని కథ, భూపతి కన్నయ్య కథ, కన్నకైరుడు కథ - అనునైదు వీరగాథలున్నవి. రాయలసీమలో చౌడమ్మపై అనేక గేయములు వ్యాప్తియందున్నవి.'చౌడు పురాణము' అను ద్విపద కావ్యము కూడ కలదు.

ఈ గాథావృత్తములు సుదీర్ఘములై వారములు నెలలు పాడినను తఱుగని రీతిలో నుండును. ఇవి ఇతిహాసములకు మిక్కిలి సన్నిహితములుగా నుండుటచే కాబోలు తెలుగున గల ప్రసిద్ధ వీరగాథావృత్తములను సి.పి. బ్రౌను దొరగారు 'చరిత్రలు' అని పిలిచినారు. (ఉదా॥ పల్నాటి వీరచరిత్ర, కాటమరాజు చరిత్ర).

ఇతివృత్తముల ననుసరించి పరిశీలించినచో తెలుగు వీరగాథా చక్రములలో నాలుగు ప్రధాన భాగములు గోచరించును. (1) శక్తి కథాచక్రము (2) పల్నాటి వీరకథాచక్రము (3)కాటమరాజు కథాచక్రము, (4) వెలకంటి వీరుని కథాచక్రము - ఇందు శక్తి కథాచక్రమను విభాగము కొంత స్థూలమైనది. ఏలన, ఈ శక్తికథలలో ఎల్లమ్మ కథలు, అంకమ్మ కథలు - తమ తమ ప్రత్యేకతనుజూపుచు, భిన్న గాథావృత్తములుగా నేర్పడి యున్నవి. రాయలసీమలోని చౌడమ్మ పాటలును ప్రత్యేకమైనవే. మాతపురాణము కాకతమ్మను గూర్చియు, ఓరుగల్లును పాలించిన కాకతీయ రాజులను గూర్చియు చెప్పుచున్నది. ఇది కూడ గాథాచక్రమేమో పరిశీలింప వలసి యున్నది. పోలేరమ్మ కథ, ముత్యాలమ్మ కథ వంటి కొన్ని శక్తికథలు విడిగా లభించుచున్నవి. అయినను ఈ వివిధ శక్తులన్నియు ఆదిశక్తి నుండియే ఉద్భవించినవి కావున, మొత్తము శక్తి కథలన్నింటిని ఒకే గాథాచక్రముగా భావింపవచ్చునని నా యభిప్రాయము. ఎల్లమ్మ కథాచక్రము, అంకమ్మ కథాచక్రము అనునవి ఈ ఆదిశక్తి కథాచక్రములోని అంతశ్శాఖలుగా తలప నగును.

శక్తి కథాచక్రములో ఎల్లమ కథాచక్రమును అమ్మవారి దర్శనమునకు చెందిన మాదిగలు పాడుచున్నారు. వీరిని 'బవనీలు' అందురు. అంకమ్మ కథాచక్రమును అయ్యగారి దర్శనమునకు చెందిన మాలలు పాడుచున్నారు. వీరిని 'పంబలవారు' అందురు. చౌడమ్మ పాటలను 'తొగట వీరులు' అను పేరుగల సాలెవారు పాడుచున్నారు. పల్నాటి వీరకథా చక్రమును చెన్నుని దర్శనమునకు చెందిన మాలలు పాడుచున్నారు; వీరిని ''వీర విద్యావంతులు'' అందురు. గుంటూరు మండలమున పిచ్చుగుంట్లు కూడ కొందఱు పాడుచున్నారు. కాటమరాజు కథలను గంగదర్శనునకు చెందిన మాదిగలు పాడుచున్నారు. వీరిని 'కొమ్ములవారు' అందురు. గొల్లలలో కూడ కొన్ని తెగలవారు (పికిలివారు, పూజగొల్లలు, ఎఱ్ఱగొల్లలు మున్నగువారు) కాటమరాజు

కథలు పాడుట కలదు. వెలకంటి వీరుని కథాచక్రమును జంగములు పాడుచున్నారు. ఈ వీరగాథా వృత్తములు నేడు ప్రత్యేక కవుల రచనలుగా తెలియుచున్నను, వీని ఆదిరూపము మాత్రము గాయక భిక్షువుల ఆశుకవనమే కానోపును.

**1.2 వీరగాథలు (BALLADS):** రెండు మూడు రాత్రులలో పాడబడు కథలు సాధారణ వీరగాథలు. 'రాత్రి' అనగా నాలుగైదు గంటల కాలము. రాత్రివేళ 8-9 గంటల ప్రాంతమున వీరగాథాగానము ప్రారంభమై 12-1 గంట ప్రాంతమువఱకును సాగును. దీనిని 'ఒకరాత్రి' యందురు.

బొబ్బిలి కథ - మూడు రాత్రుల కథ. కొందఱు దీనిని నాలుగు రాత్రుల కథగా చెప్పుచున్నారు (ముఖ్యముగా శ్రీకాకుళ మండలమున)

దేశింగురాజు కథ - మూడు రాత్రుల కథ

బాలనాగమ్మ కథ - మూడు రాత్రుల కథ

లక్ష్మమ్మ కథ - రెండు రాత్రుల కథ

కామమ్మ కథ - రెండు రాత్రుల కథ

కాంభోజరాజు కథ - నాలుగు రాత్రుల కథ

ముగ్గురు మరాఠీల కథ - మూడు రాత్రుల కథ

చిన్నమ్మ కథ - మూడు రాత్రుల కథ

సర్వాయి పాపని కథ - ఒక రాత్రి కథ

చిన్నపరెడ్డి కథ - రెండు రాత్రుల కథ

వెంకటేశుని కథ - మూడు రాత్రుల కథ

వేమన కథ - మూడు రాత్రుల కథ

ఈ సాధారణ వీరగాథలలో మూడు అంతశ్శాఖ లున్నవి. 1.బొబ్బిలి వరుస కథలు, 2. పదములు, 3. జంగం కథలు.

**1.2.1 బొబ్బిలివరుస కథలు:** బొబ్బిలి పాట వరుసలోను తద్భేదముల లోను నుండు కథలు బొబ్బిలి వరుస కథలు. వీని ఇతివృత్తములు సాధారణముగా వీరులను గూర్చియు, పేరంటాండ్రను గూర్చియు నుండును. ఇవి సాధారణముగా గాయక భిక్షువుల ఆశుకవనమై యుండును. బొబ్బిలి కథ, దేశింగురాజు కథ, బాలనాగమ్మ కథ, కాంభోజరాజు కథ, ముగ్గురు

మరాటీల కథ, కామమ్మ కథ, సన్యాసమ్మ కథ, లక్ష్మమ్మ కథ, చిన్నమ్మ కథ, వీరరాజమ్మ కథ, జగపతిరాజు కథ (లేక పెద్దాపురం కోడిపుంజుల కథ), కర్నూలు నవాబు కథ, నారసింహారెడ్డి కథ, సదాశివరెడ్డి కథ, నల్లసోమనాద్రి కథ (లేక గద్వాల సోమనాద్రి కథ), మియాసాబ్ కథ, కుంటి పుల్లారెడ్డి కథ మున్నగునవి బొబ్బిలి వరుస కథల కుదాహరణములు.

**1.2.2 పదములు:** 'హరిహరీ నారాయ ణాదినారాయణా, కరుణించి మమ్మేలు కమలలోచనుడ' అను వరుసలో తుదివఱకును సాగు రచనలు 'పదములు'. ఇవి విశాఖమండలము నుండి విరివిగా వచ్చినవి. ఈ ఛందస్సును 'జంపె వరుస' అందురు. వీని ఇతివృత్తము లన్నియును పౌరాణికములే. ఇవి ప్రత్యేక కవులచే వ్రాయబడును. అయ్యగారి కూర్మనాథుడు, చంద్రగిరి తాతయ్య, గోపాలరాయలు; ముడుంబ లక్ష్మణాచార్యులు, చిత్రాడ కామేశము, పూడిపెద్ది బుచ్చన్న పంతులు, నీవూరి (ఈవూరి, పూరి) నారాయణరాజు, నీవూరి రామచంద్రరాజు, మంథా రాయుడుశాస్త్రి, బొట్టు నరసింహదాసు, నడిమింటి రామయోగి కవి, పసగాడ సన్యాసి, తోలేటి సీతారామయ్య, కటోజు వీరాచారి, పొడుగు రామబ్రహ్మము, బెహరా నరసయ్య, బెహరా రామకృష్ణ కవి, మంగిపూడి సూర్యనారాయణ శాస్త్రి, చెఱువు అప్పల నరసింహదాసు - మున్నగు వారు పుంఖానుపుంఖములుగా పదములు రచించిన కవి పుంగవులు. విరాట, కర్ణ, శల్య పర్వములు; ఉత్తర, దక్షిణ గోగ్రహణములు; లక్ష్మణమూర్ఛ, సుందరకాండ, రామరావణ యుద్ధము, ధర్మాంగద పాముపాట, కుశలాయకము, పాతాళ హోమము, బాణాసుర యుద్ధము, సారంగధర చరిత్ర, శతకంఠ రామాయణము, గంగా వివాహము, శశిరేఖా పరిణయము, నలచరిత్ర, ప్రహ్లాద చరిత్ర, భల్లాణ రాయ పదము, మైరావణ చరిత్రము, వైకుంఠ మాహాత్మ్యము, శ్రీరామ కథ, త్రినాథుని చరిత్ర - మున్నగునవి ముద్రితములైన పదములు. ఈ జంపె వరుసలోనున్నవే కాక, కొన్ని ద్విపద రచనలు కూడ పదములుగా వ్యాప్తియందున్నవి. శారద వరుసలో నున్న కథలను గూడ పదములన వచ్చును.

**1.2.3 జంగం కథలు:** 'జంగములు పాడు కథలు జంగంకథలు' అని ప్రాచీనార్థము. కాని కాలక్రమమున నిది యొక ప్రత్యేక ప్రక్రియగా మాఱినది. 19వ శతాబ్దము చివరి పాదమున ధార్వాడ నాటక సమాజముల వారిచే కొన్ని పార్శీమట్టులు మన గేయకవిత్వమున ప్రవేశ పెట్టబడినవి. అట్టి వానిలో "డోరా, గజల్' అను ఛందస్సులు మన వీరగాథలలో 'రగడ' అను పేరుతో వ్రాయబడినవి. దీనికి తోడు యక్షగాన ప్రభావముచే దరువులు, వచనములు, పద్యములు, అర్ధ పద్యములు కూడ ప్రవేశించుటచే 'జంగంకథ' అను ప్రక్రియ వెలసినది. ఇది ఈ శతాబ్ది ప్రారంభమున పుట్టినది. ఇందు కథాఖ్యానము 'రగడ'లో కొనసాగుచు, మధ్య మధ్య సందర్భానుసారముగా పద్యములు, అర్ధ పద్యములు, దరువులు, వచనములు వ్రాయబడును.

యక్షగానము, హరికథ, చిఱుతల కథ అను ప్రక్రియలతో దీనికి దగ్గఱ సంబంధమున్నది. బొబ్బిలివరుస కథల ప్రౌఢ పరిణామమున కిది చిహ్నము.

జంగంకథల ఇతివృత్తములు గూడ పదముల వలెనే పౌరాణికములు. ఎక్కువగా శైవ వైష్ణవ పురాణములకు సంబంధించి యుండును. ఇవి కూడ ప్రత్యేక కవులచే రచింపబడినవే కాని, బొబ్బిలి కథలవలె గాయక భిక్షువుల ఆశుకవనమున జనించినవి కావు. ధేనువకొండ వెంకయ్య, ఉప్పలపాటి వెంకటరామయ్య, గంజి నాగదాసు, కంకిపాటి వెంకటసుబ్బరాయగుప్త, రూపెనగుంట్ల సీతారామదాసు, కిన్నెర వీరాస్వామి, గాయకవాడ పెద్దన, చీమకుర్తి వీర రాఘవయ్య, రామానుజదాసు, మేడూరి నరసింహాచార్యులు, జి. గోపాల్ నాయుడు, ఉద్దండ నాగలింగము, పులికొండ పరబ్రహ్మకవి, తూళ్ళూరి మాధవరాయలు, కంచర్ల సూర్య నారాయణరావు, సరికొండ వెంకటప్పలరాజు, బత్తుల లక్ష్మయ్య, - మున్నగువారు పెక్కుజంగం కథలు రచించిన కవులు. విరాట పర్వము, గయోపాఖ్యానము, అంబరీషు చరిత్రము, శ్రీయాళ మహారాజు చరిత్రము, భళ్ళాణరాయ చరిత్రము, దేవయాని చరిత్రము, వామన విజయము, హరిశ్చంద్రోపాఖ్యానము, మార్కండేయ చరిత్ర, ఉత్తర - దక్షిణ గోగ్రహణములు, రుక్మిణీ కల్యాణము, తులసీ మాహాత్మ్యము, రుక్మాంగద, యల్లమంద కోటీశ్వరుని చరిత్ర, వామన చరిత్రము, పద్మవ్యూహము, చిత్రసేన మహారాజుకథ, కమ్మవారి పణతి పసల బాలరాజు కథ, నలోపాఖ్యానము, రామదాసు, వేణుగోపాలస్వామి పరిణయము, అంగమ్మ చరిత్ర, కాళీయ మర్దనము, పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి, శ్రీకృష్ణ విజయము, నిజలింగ చిక్కయ్య చరిత్ర, అహల్యాసంక్రందనీయము, చిత్రకేతూపాఖ్యానము, శాకుంతల చరిత్రము, సులభోపాఖ్యానము, మంగళాచల మాహాత్మ్యము, సావిత్రీ కల్యాణము, సారంగధర చరిత్రము - మున్నగునవి ముద్రితములైన కొన్ని జంగంకథలు. ఈ జంగంకథలును, పదములును క్రీ.శ. 1890-1910మధ్యకాలములో మద్రాసులో గుజిలీప్రతుల రూపమున విశేషముగా ముద్రింపబడినవి.

**1.3. వీరగాథానికలు లేక లఘు వీరగాథలు (BALLADLINGS):** సాంప్రదాయక వీరగాథలలో ఇది మూడవ వర్గము. వీరగాథావృత్తములు నెలలకొలది పాడబడుననియు, వీరగాథలు రెండు మూడు 'రాత్రులు' పాడబడునవియు కాగా, వీరగాథానికలు కొన్ని నిముషములు లేదా ఒక గంట లోపుననే పూర్తియగునవి. వీనిలో కథాకథనము మిక్కిలి స్వల్పముగా నుండును; కొన్నింటిలో పూర్తిగా లుప్తమై సూచనామాత్రముగ నుండును. వీనికిని, జానపదగేయములకును భేదమును కనుగొనుట కష్టమగును. వీని ఇతివృత్తము లెక్కువగా గ్రామ కక్షలకు హత్యలకు సంబంధించి యుండును. చారిత్రకములు, పౌరాణికములు, జానపదములు నగు ఇతివృత్తములతో నున్నవి తక్కువ. వీనిలో ఎక్కువ కోలాటపు పాటలగుటచే ఇవి

జానపదుల సామూహిక కర్తృత్వమును బలపఱుచుచున్నవని చెప్పవచ్చును. ఈ వీరగాథానికల కథాకథన లాఘవత్వముచే కాబోలు, జానపదులు వీనిని 'కథ' నామముతో గాక 'పాట', 'పదము' అను పేర్లతో పిలుచుచుందురు. బొబ్బిలి కథలవలెనే ఇవియు నెక్కువగా అజ్ఞాత కవికర్తృకములు. ఇందుకొన్ని జానపదుల సామూహిక కర్తృత్వమున పుట్టినవని కూడ తలపవచ్చును. రాయలసీమలో బుట్ట ఎఱుకులవారు పెక్కు వీరగాథానికల నాశువుగా గానము చేసిరనుటకు నాకు ప్రమాణములు లభించినవి. కాబట్టి ఈ వీరగాథానికలు కొన్ని గాయక భిక్షుకుల ఆశుకవనమున పుట్టినవని కూడ చెప్పవచ్చును. ముఖ్యముగా గ్రామ కక్షలకు, హత్యలకు సంబంధించినవి ఇట్లే జనించియుండును.

గుజ్జాల గోపిరెడ్డి పాట, మానందిరెడ్డి పాట, ఓబులరెడ్డి పాట, కోరుమన్న పాట, విరూపాక్షరెడ్డి పాట, ఈడిగ రామన్న పాట, కురుమలయ్య పాట, రాచోటి రామయ్య పాట, వెంకట్రామరెడ్డి పాట, గడేకల్లు నాగిరెడ్డి పాట, దొరవారి నరసింహారెడ్డి పాట, మల్లన్న పాట, బండోల్ల గురవన్న పాట, వేపూరి బ్రతుకమ్మ పాట - ఇత్యాదులు ముద్రిత వీరగాథానికలు. అముద్రితములై, అలేఖ్య వాగ్రూప పారంపర్య సంప్రదాయమున జానపదులలో వ్యాప్తియందున్నట్టి - నారసింహారెడ్డి పాట, ధర్మాపురం నరసింహ పాట, రాములు పాట, సీత చెఱ, గురుటపచ్చి పాట, లక్ష్మణమూర్తి పాట, లలికట్ట పదము, బత్తిరన్న పదము, బోన కాటపరెడ్డి పాట, ఒడ్డిరాజుల పాట, గొఱ్ఱెపోతుల పందెం, పోట్ల బూదయ్య పాట - ఇత్యాదులు సుమారు ఎనుబది వఱకును నేను సేకరించితిని. ఇతివృత్తములను ప్రమాణముగా పెట్టుకొని ఈ లఘువీరగాథలను ''హత్యలు, ఆత్మత్యాగములు, జానపదములు, పౌరాణికములు,'' అను నాలుగు వర్గములుగా చేయవచ్చును.

ఇట్లు సాంప్రదాయక వీరగాథలలోని మూడు ప్రధాన భాగములను చర్చించిన తరువాత, వీరగాథానుకరణములలోని వివిధ శాఖలను గూర్చి తెలిసికొనుట యుక్తము.

## II. వీరగాథానుకరణములు:

ఇవి సాంప్రదాయక వీరగాథల ననుకరించుచు ప్రసిద్ధ కవులచే వ్రాయబడును కాని, జానపదులలో ఆశువుగా పుట్టునవి కావు. ఇవి ముద్రింపబడును. ఈ ముద్రిత గాథలను విద్యావంతులు, సంస్కారవంతులు నగువారు చదివి పాడుచుందురు. అంతేకాని, ఇవి నిరక్షర కుక్షులగు జానపదులలో మౌఖిక ప్రకరణమున వ్యాపించునట్టివి కావు. ఇందలి వస్తువు జనసామాన్యమునకు పరిచితమైన స్థానిక సంఘటనలు కావు; రాజకీయ సంఘటనలు. ఈ విధమగు రచనలలో రసదృష్టికన్న రాజకీయ ప్రచారదృష్టి యెక్కువ. ఇట్టి వీరగాథానుకరణములో 'బుఱ్ఱకథలు' ప్రధానమైనవి. 'జముకుల కథలు, సుద్దుల కథలు, తెలంగాణములోని తందనాన కథలు, బతుకమ్మ పాటలు' - [illegible]

**2.1 బుఱ్ఱకథలు:** జంగంకథలలోని 'రగడ' వరుస, కాంభోజరాజుకథలోని 'తందాన' వరుసలు, ముగ్గురు మరాటీల కథ (ఆరె మరాటీల కథ) లోని 'సై సై' వరుస - ఈ మూడు వరుసలను అనుకరించి ఉద్భవించిన ప్రక్రియయే బుఱ్ఱకథ. మధ్య మధ్య జంగంకథలలో వలె కీర్తనలును ఉండును. ఇవి ప్రసిద్ధ భజన కీర్తనలకు నమూనాలు. శ్రీయుతులు కాకుమాని సుబ్బారావు, సుంకర సత్యనారాయణ, వారణాశి సత్యనారాయణ శాస్త్రి, షేక్ నాజర్, దంటు కృష్ణమూర్తి, వి. సత్యనారాయణ, తిరునగరి రామాంజనేయులు, నదీరా మున్నగు ఆధునిక కవులు పెక్కు బుఱ్ఱకథలను వ్రాసియున్నారు. ఈ బుఱ్ఱకథా ప్రక్రియ రెండవ ప్రపంచ యుద్ధకాలమున - అనగా క్రీ.శ. 1942 ప్రాంతమున పుట్టినదని నా పరిశీలన వలన తెలిసికొంటిని. ''బాబూరావు బుఱ్ఱకథ, టాన్యా, కష్టజీవి, బెంగాల్ కరవు, రైతు విజయము, కాంగ్రెసు, నేతాజీ జీవిత చరిత్ర, తెలంగాణావీరులు, అరుణా అసఫాలీ, ఆంధ్రకేసరి ప్రకాశం, ఆజాద్ హింద్ ఫౌజు, గాంధీ నిర్యాణం, జవహరలాల్ నెహ్రూ, నిజాంమీద పోలీసు చర్యలు, రౌడీ రజాకార్లు, సర్దార్ పటేల్ , డాక్టర్ కొట్నీస్, రాయలసీమ కరవు, పల్నాటి యుద్ధము, బొబ్బిలి యుద్ధము, వీరాభిమన్యు, మహారథి కర్ణ, అల్లూరి సీతారామరాజు, రుద్రమదేవి, చల్లపల్లి నారాయణరావు, భగవద్గీత, కట్నంలేని కమలమ్మ పెండ్లి, బుడ్డా వేంగళరెడ్డి మొదలగునవి ప్రసిద్ధములగు బుఱ్ఱకథలు.

ఈ బుఱ్ఱకథలు మొదట రాజకీయ ప్రచారమున కనువగు ఇతివృత్తములను స్వీకరించినను, కాలక్రమమమున పౌరాణిక, సాంఘిక, చారిత్రక వస్తువులను చేపట్టసాగినవి. కొన్ని ప్రాచీన వీరగాథల ఇతివృత్తములను స్వీకరించినవి. వర్తమాన ప్రభుత్వము కూడ బుఱ్ఱకథను తన ప్రచార సాధనముగా జేసికొన్నది.

బుఱ్ఱకథ లెక్కువగా రాజమహేంద్రవరము నుండి వెలువడినవి. అచ్చటనున్న కొండవల్లి వీరవెంకయ్య అండ్ సన్స్‌వారు, కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్‌వారు 1946 నుండియు అనేకములగు బుఱ్ఱకథలను ముద్రించుచున్నారు. వీరగాథలు, జంగంకథలు, పదములు - అనునవి మద్రాసు నుండియు, బుఱ్ఱకథలు రాజమండ్రి నుండియు, బ్రతుకమ్మ పాటలు సికింద్రాబాదు నుండియు ప్రకటింపబడినవని చెప్పవచ్చును.

**2.2 జముకుల కథలు:** ప్రాచీనములగు బొబ్బిలి కథలకు జంగంకథలకు అనుకరణములుగా బుఱ్ఱకథలు వెలయగా, ప్రాచీనములగు హరిహరీపదముల కనుకరణములుగా 'జముకుల కథలు' వెలసినవి. బుఱ్ఱకథల వలెనే ఈ జముకుల కథలు కూడ రాజకీయ పక్షముల ప్రచార సాధనములుగనే వెలసినవి. ఈ జముకుల వరుసలు బుఱ్ఱకథలలో కూడ తఱచు ప్రవేశపెట్టబడు చుండును. పశ్చిమ గోదావరీ మండలమున, తాడేపల్లి గూడెము తాలూకా 'కృష్ణాయ పాలెము' అను గ్రామములో నివసించుచున్న 'జాతీయ కవిభూషణ' బిరుదాంకితులు శ్రీ వారణాసి

సత్యనారాయణశాస్త్రిగారు స్వాతంత్ర్యము సిద్ధించిన నాటినుండియు (1947-నుండి) బుఱ్ఱకథలతోపాటు పెక్కు జముకుల కథలను గూడ రచించియున్నారు. ఈ కథలను కీ.శే. పుట్టా సుబ్బారావుగారు అను కాంగ్రెసు కార్యకర్త పాడి బహుళ ప్రచారము గావించిరి. వీని ఇతివృత్తములు బుఱ్ఱకథల ఇతివృత్తములను బోలియుండును. గాంధీజీ నిర్యాణము, భక్త ప్రహ్లాద, అజామిళోపాఖ్యానము, నేతాజీ సుభాస చంద్రబోసు అంతర్ధాన గాథ, రాణీ సంయుక్త- మున్నగునవి సత్యనారాయణ శాస్త్రిగారు రచించిన అముద్రితములగు జముకుల కథలు.

**2.3 సుద్దుల కథలు లేక గొల్ల సుద్దులు:** కాటమరాజు కథలకు అనుకరణములుగా ఆధునిక కాలమున వెలసిన ప్రక్రియ. కాటమరాజు కథలను గొల్లలు పాడుదురు కావున వానికి 'గొల్ల సుద్దులు' అను పేరు వచ్చినది. 'గొల్ల సూక్తులు' అను శబ్దమే 'గొల్ల సుద్దులు'గా మాఱినదని తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారు తలచుచున్నారు. వీరగాథాపరమైన ఈ గొల్ల సుద్దులను శబ్దము తరువాత జాతివాచకముగా మాఱినది. కాటమరాజు కథలను పాడు యాదవ గాథాకారులకు 'గొల్ల సుద్దులు' లేక 'సుద్దుల గొల్లలు' అను పేరు వచ్చినది. ఆధునికులు ఈ యర్థమున దీనిని ప్రయోగించుటలేదు. వీరగాథా పరమగు అర్థముతోనే వాడుచున్నారు. 'కాటమరాజు కథల వరుసలో నుండు కథలు' అని సుద్దుల కథల కర్థము. ఇవి కాటమరాజు కథలవలెనే ద్విపద, మంజరీ ద్విపదలలో నుండును. కథా ప్రారంభమునను, కథా మధ్యమునను యాదవ గాథాకారులు పాడు చిన్న చిన్న పాటల వరుసలు కూడ వీనిలో అనుకరింపబడినవి. శ్రీ తిరునగరి రామాంజనేయులు 1952 ప్రాంతమున 'రాష్ట్రవాంఛ', 'మన్యం విప్లవం' (అల్లూరి సీతారామరాజు కథ) అను రెండు సుద్దుల కథలను వ్రాసినారు. ఇందు రాష్ట్రవాంఛ మిక్కిలి ప్రచారమంది, ముద్రింపబడినది. వారణాశి సత్యనారాయణ శాస్త్రిగారు 'సతీ ముసలమ్మ' అను సుద్దుల కథను వ్రాసిరి. ఇది అముద్రితము.

**2.4 తందనాన కథలు:** సాంప్రదాయక వీరగాథల ననుకరించుచు ఆంధ్ర ప్రాంతమున బుఱ్ఱకథలు వ్యాపించినట్లే, తెలంగాణమున 'తందనాన కథలు' పుట్టినవి. ఇవి కేవలము బొబ్బిలి వరుస కథలను మాత్రమే అనుకరించినవి. బుఱ్ఱకథలలోవలె పాటలు, కీర్తనలు ఇందుండవు. ఇవి బుఱ్ఱకథలవలె రాజకీయ, చారిత్రకాది వివిధ ఇతివృత్తములతో గాక, కేవలము పౌరాణికేతివృత్తమును మాత్రమే కలిగియున్నవి. ఈ తందనాన కథలను రుక్మాభట్ల విధుమౌళి శర్మవంటి పండిత కవులు రంచించిరి. వీని ధోరణిని బట్టి చూడ ఇవి యెక్కువగా చదువబడునే కాని పాడబడవని తోచుచున్నది. ''తందనాన రామాయణము, తందనాన ఉత్తర రామాయణము, తందనాన కృష్ణలీలలు, తందనాన దేవీభాగవతము, తందనాన జైమిని భారతము, తందనాన పంచపాండవుల వనవాసము, తందనాన శ్రీ కన్యకాపరమేశ్వరి'' - మున్నగునవి తెలంగాణమున వెలసిన తందనాన కథల కుదాహరణములు. వీనిలో ఎక్కువ

భాగము రుక్మాభట్ల విధుమౌళి శర్మగారు రచించినవే. శ్రీయుతులు గౌరిభట్ల నృసింహస్వామి, వితాల రాజమౌళిశాస్త్రి, మంగి వెంకటయ్యశర్మ, మంచాల గురవయ్యగుప్త, యామవరపు రాజయ్యశాస్త్రి - మున్నగు కవులు కూడ తందనాన కథలను రచించి యున్నారు.

**2.5 బ్రతుకమ్మ పాటలు:** తెలంగాణమున 'కాముని పున్నమ' పండుగ దినములలో పల్లెలలో పామరస్త్రీలచే తరతరముల నుండి పాడబడు పాటలు 'బ్రతుకమ్మ పాటలు'. 'బ్రతుకమ్మ' యనాగా లక్ష్మీదేవి, 'బ్రతుకయ్య' అనగా విష్ణుమూర్తి. ఈ పాటలు లఘు రచన లగుటచే 'వీరగాథానిక' అను వర్గమునకు జెందును. ''బ్రతుకమ్మ పుట్టుక, వేపూరి బ్రతుకమ్మ పాటయను లవకుశ, బాలనాగమ్మ బ్రతుకమ్మ పాట'' ఇత్యాదులు సాంప్రదాయకములగు బ్రతుకమ్మ పాటలు. ఈ సాంప్రదాయక గేయములకు అనుకరణములుగా కొందఱాధునిక కవులు పౌరాణిక, సాంఘిక, రాజకీయేతివృత్తములతో పెక్కు రచనలు చేయుచున్నారు. సికిందరాబాదు నుండి చందా నారాయణశ్రేష్ఠి, కొండా శంకరయ్య అను ప్రకాశకులు వీనిని విరివిగా ముద్రించి చౌకగా నమ్ముచున్నారు. శ్రీ బూరెల సత్యనారాయణమూర్తిగారు (సికింద్రాబాదు) బ్రతుకమ్మ పాటల నసంఖ్యాకముగా రచించిన కవి. శ్రీయుతులు కొండూరి నారాయణగుప్త, నరసింహమూర్తి, వి.యస్. నరహరి, జగ్గయ్య, చెర్విరాల భాగయ్య-మున్నగువారు కూడ బ్రతుకమ్మ పాటలను రచించుచున్నారు. ఈ బ్రతుకమ్మ పాటలలో 'రుక్మిణీ కల్యాణము, సావిత్రి, దమయంతీ దేవి, రుక్మాంగద చరిత్ర, కుచేలోపాఖ్యానము' - ఇత్యాదులు పౌరాణికములు. బాలరాజు, ఎఱుకల నాంచారి, కామమ్మ, కాంభోజరాజు - మున్నగునవి వీరగాథా జన్యములు. 'జనగామ రైలు ప్రమాదము, జడ్చర్ల రైలు ప్రమాదము' మొదలగునవి సాంఘికములు. 'చైనా దురంతాలు, చైనా దుండగాలు' - అనునవి రాజకీయ సంబంధములు. చారిత్రకేతివృత్తముగల బ్రతుకమ్మ పాటలు లేవు.

పదములు, జంగంకథలు, బుఱ్ఱకథలు, బ్రతుకమ్మ పాటలు - వీనిలో ప్రక్రియను సూచించు విశేషణము నామములో ఉత్తరార్ధమున నుండును. ఉదా॥ ''లక్ష్మణమూర్ఛ పదము, సుందరకాండ పదము, నిజలింగ చిక్కయ్య చరిత్ర జంగం కథ, విరాటపర్వము జంగం కథ, కష్టజీవి బుఱ్ఱకథ, అల్లూరి సీతారామరాజు బుఱ్ఱకథ, శృంగార శాకుంతలం బ్రతుకమ్మ పాట, దమయంతీ దేవి బ్రతుకమ్మ పాట'' ఇత్యాది. కాని శారద కథలలోను, తందానన కథలలోను మాత్రము ప్రకియా సూచక విశేషణము నామములో పూర్వార్ధముననే కాన్పించుచున్నది. ఉదా॥ ''శారద రామాయణము, శారద హరిశ్చంద్ర, తందనాన రామాయణము, తందనాన కృష్ణలీలలు'' ఇత్యాది.

ఈ వర్గీకరణ ప్రకరణ మందలి సారాంశము నిట్లు చెప్పవచ్చును:

''వీరగాథలను ఇతర విధానములను బట్టి వర్గీకరించుటకన్న, ఇతివృత్తములను బట్టి వర్గీకరించుట ఎక్కువ సమంజసము. 'ప్రొఫెసర్ లూయిస్ పౌండ్', 'ఫ్రాన్సిస్ బి. గుమ్రే' - మున్నగు పాశ్చాత్య విమర్శకులువీరగాథల ఇతివృత్తములనే ప్రధానముగాగైకొని వర్గీకరించిరి. ఈ వర్గీకరణములో ఇతర పద్ధతులను గూడ కొంత సమన్వయపఱుచుకొనవలెను. తెలుగు విమర్శకులలో శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు, శ్రీహరి ఆదిశేషువుగారు, డా॥ బి. రామరాజుగారు, నేదునూరి గంగాధరంగారు, ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు వీరగాథల వర్గీకరణ విధానములను పరోక్షముగా కొంత సూచించియున్నారు. ఇందు శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు 1953లో చేసిన వర్గీకరణము కన్న, 1961లో చేసిన వర్గీకరణము ప్రశస్తమైనది. మౌఖిక సంప్రదాయము, కాలప్రమాణము, భాషా మాండలిక విభాగములు, ఇతివృత్తములు, ఛందస్సు, గాథాకారులు, పునరావృత్తి, జానపద వాద్యములు, ప్రధానవీరులు, కులదైవములు, దర్శనములు -మున్నగు వాని నాధారముగా జేసికొని తెలుగువీరగాథలను వర్గీకరింపవచ్చును. ఈ వర్గీకరణములో జానపద వ్యవహారమును విస్మరింపరాదు.''

తెలుగున వివిధ విమర్శకుల వీరగాథా వర్గీకరణ విధానములను, నేను కావించిన వర్గీకరణ మార్గమును పటముల రూపమున ఈ క్రింది రీతిని చూపినచో సులభముగా నవగతమగును:


శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారి వర్గీకరణము (1953)
దేశి సారస్వతము
స్త్రీల పాటలు (గేయకథలు)
వీరగాథలు
1. చారిత్రకములు
2. కల్పనలు
నాటకములు
జంగం కథలు
జానపద ద్విపద కావ్యములు
పదములు
వీరకథలు
బందిపోట్లు
పేరంటాండ్రు
స్త్రీల పాటలు (లాలి, జోల మొదలగునవి)
జానపద గేయములు
వేదాంతపు పాటలు
కీర్తనలు
సామెతలు, పొడుపు కథలు


శ్రీ హరి ఆదిశేషువుగారి వర్గీకరణము (1953)
జానపద గేయ వాఙ్మయము
శృంగార రసాత్మక గేయములు
వీర కథా వాఙ్మయము
సాహసిక కథా వాఙ్మయము
కరుణ రసాత్మక కథా వాఙ్మయము
అద్భుత రసప్రధాన కథా వాఙ్మయము
శైవ కథా వాఙ్మయము
వేదాంత, భక్తి రస ప్రధానమైన రచనలు
హరి భక్తి
శివ భక్తి
అద్వైత వేదాంతము
స్త్రీల పాటలు
బాలబాలికల గేయాలు
ప్రకీర్ణములు


డా॥ బి. రామరాజుగారి వర్గీకరణము (1958)
జానపద గేయములు
ఆలంబనము ననుసరించిన విభజనము
1. బాలబాలికా గేయములు
2. స్త్రీల పాటలు
3. శ్రామిక గేయములు
వస్తువు ననుసరించిన విభజనము
1. పౌరాణికములు
2. చారిత్రకములు
3. మత సంబంధములు
4. పారమార్థికములు
రసము ననుసరించిన విభజనము
1. శృంగార గేయములు
2. అద్భుతరస గేయములు
3. కరుణరస గేయములు
4. హాస్యరస గేయములు


నేదునూరి గంగాధరంగారి వర్గీకరణము (1960)
జానపద గేయ వాఙ్మయము
1. వ్యవసాయ పదాలు
రైతుల పండుగలు
పొలం పదాలు
పురుష సాహిత్యం
పశువుల కాపర్ల పాటలు
2. గృహ జీవనము
పిల్లల తల్లి
అత్తా కోడళ్ళు
వేరే కాపురం
3. రసాశ్రయం
4. స్త్రీల పదసారస్వతం
5. శైవ సారస్వతం, స్త్రీ సాహిత్యం
6. వీరపదాలు, సాహసగేయాలు
చిట్టి గేయాలు
దీర్ఘ గేయాలు
కథా గేయాలు


ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి వర్గీకరణము (1961)
తెలుగు కవిత్వము
పద్య కవిత్వము
పద కవిత్వము
1. గేయ కవిత్వము (గాన ప్రధానము)
2. పద కవిత్వము (కవితా ప్రధానము)
1. సంగీత ప్రధానములు (త్యాగరాజ కృతులు)
2. అభినయార్థములు (పదములు, జావళీలు)
3. సామాన్యములు (ముత్తైదువుల పెండ్లి పాటలు, మంగళ హారతులు)
1. సాంఘికములు (చిన్నమ్మ కథ, కామమ్మ కథ, లక్ష్మమ్మ కథ మొదలగునవి)
2. చారిత్రకములు (బొబ్బిలి కథ, కాటమరాజు కథ, దేశింగురాజు కథ, పలనాటి కథ మొదలగునవి)


శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారి వర్గీకరణము (1961)
జానపద గేయ వాఙ్మయము
విడి గేయాలు
1. పిల్లల కొలకు పాడునవి
2. గృహ జీవనము
3. ఇంటిబయట పనిపాటులు చేసికొనేటప్పుడు పాడునవి
4. ఆటపాటలు
5. చాటువుల వంటివి
కథా గేయాలు
1. జంగం కథలు
2. బొబ్బిలి పాట వంటివి
3. పదాలు
4. స్త్రీల కథాగేయాలు
కథా గేయాలు
గేయ కథలు
గేయ కావ్యములు


నా వర్గీకరణ విధానము (1967)
జానపద కవిత్వము (Folk Poetry)
జానపదగేయములు లేక పల్లెపాటలు (Folksongs)
వీరగాథలు లేక జానపద గేయకథలు (Ballads)
సాంప్రదాయక వీరగాథలు (Traditional Ballads)
లేక జనరంజక వీరగాథలు (Popular Ballads)
వీరగాథానుకరణములు
(Ballad Imitations)
వీరగాథాచక్రములు (Ballad-cycles)
వీరగాథలు (Ballads)
వీరగాథానికలు లేక
లఘు వీరగాథలు (Balladlings)
శక్తి కథా
చక్రము
పల్నాటి వీర
కథాచక్రము
కాటమరాజు
కథాచక్రము
వెలకంటి వీరుని
కథాచక్రము
ఎల్లమ్మ
కథాచక్రము
అంకమ్మ
కథాచక్రము
చౌడమ్మ
పాటలు
ఇతరశక్తి
కథలు
బొబ్బిలి వరుస కథలు
పదములు
జంగం కథలు
బుఱ్ఱకథలు
జముకుల కథలు
సుద్దుల కథలు
తందనాన కథలు
బ్రతుకమ్మ పాటలు

ఇంతవఱకును చర్చింపబడిన తొమ్మిది ప్రకరణములలోను - వాఙ్మయమున గల వివిధ ప్రక్రియలలో వీరగాథల స్థానము, వీరగాథా నిర్వచనము, వీరగాథల ప్రాచీనత, వీరగాథల ఉత్పత్తి కర్తృత్వములు, విదేశ సాహిత్యములలోని వీరగాథాసంపద, భారత భాషలలోని వీరగాథాసంపద, తెలుగు సాహిత్యమున గల వీరగాథలు, వీరగాథా లక్షణములు, వీరగాథల వర్గీకరణ విధానములు - అను అంశములను గూర్చి తెలుపబడినది. ఈ తొమ్మిది ప్రకరణములును ఈ పరిశోధన వ్యాసమున మొదటి సంపుటముగా నేర్పడియున్నవి.

ఈ మొదటి సంపుటము తరువాత వచ్చెడి రెండవ సంపుటములో- తెలుగులో గల ప్రసిద్ధ వీరగాథాచక్రములైన శక్తికథాచక్రము, పల్నాటి వీరకథాచక్రము, కాటమరాజు కథాచక్రములను గూర్చి వివరింపబడును. పిమ్మట వచ్చెడి మూడవ సంపుటములో - వీరగాథలైన బొబ్బిలి వరుస కథలు, పదములు, జంగంకథలు, వీరగాథానికలు లేక లఘు వీరగాథలు, వీరగాథానుకరణములైన బుఱ్ఱకథాదులు - అను అంశములను గూర్చి విశదీకరింపబడును. అనంతరము వచ్చెడి నాల్గవ సంపుటములో - వీరగాథల రసపోషణ, వీరగాథా కవిత్వములోని 'వారానువర్తనములు', వీరగాథల భాష, వీరగాథల ఛందస్సు, గాథాగానములోని సంగీతము, వీరగాథల వైశిష్ట్యము, గాథాకారులు, వీరగాథల క్షీణతాకారణములు, వీరగాథల సేకరణ మరియు పరిరక్షణ అను విషయములను గూర్చి సవిస్తరముగా చర్చింపబడును.

* * * * *

అనుబంధము: 1

# వీర గల్లులు - సతీ కల్లులు

అన్యాయమును అధర్మమును ఎదిరించి, తన జాతి జనుల మేలుకొఱకు యుద్ధము చేసి, ప్రాణత్యాగము చేయువాడు 'వీరుడు'. ఆ వీరుని భార్య 'వీరపత్ని'. పూర్వకాలములో మన సమాజములో పశుసంపదయే సంపద. అందువలన ఒక గ్రామములోని ఆలమందను దొంగలు అపహరించిన సందర్భములలో కూడ ఆ గ్రామములోని ఒక ధైర్యశాలి ఆ దొంగల నెదిరించి, ఆలమందను మళ్ళించును. ఆ జగడములో అతడు చనిపోవచ్చును. ఆతడును వీరుడే! (కేవలము మానవులేకాదు; జంతువులు కూడ ఇట్టి ధైర్య సాహసములు ప్రదర్శించుట కలదు. వేటకుక్కలు అడవిపందిని ఎదిరించి పోరి చనిపోవుట కలదు). ఇట్టి వీరుల విగ్రహములను శిలలపై చెక్కి పూజించుట కాకతీయుల కాలమునుండి ప్రారంభమైనది. ఇట్టి వీర శిలలను 'వీర గల్లులు' అందురు.

వీరగల్లు పై శిల్పములు మూడు చట్రములలో మూడు ప్రత్యేక భాగములుగా చెక్కబడును. అడుగున నుండు మొదటి భాగములో వీరుడు శత్రువులతో యుద్ధము చేయుచుండుట సూచింపబడును. మధ్యనుండు రెండవ భాగములో రంభ, ఊర్వశి, తిలోత్తమ మొదలైన అప్సరసలు యుద్ధములో మరణించిన ఆ వీరుని స్వర్గమునకు గొనిపోవుట తెలుపబడును. దానిపైన ఉండెడి మూడవభాగములో కైలాసములో వీరుడు శివునిలో ఐక్యమగుట చూపబడును. ఈ మూడు భాగములకు మధ్యనుండు ఖాళీస్థలములలోను, శిలమొదటనుండు ఖాళీలోను ఆ సంఘటనకు సంబంధించిన వీరశాసనము చెక్కబడును. ఒక్కొక్కప్పుడు యుద్ధము చేయుచున్న వీరుని ప్రతిమ, దాని ప్రక్కనే సహగమనము చేయుచున్న ఆతని వీరపత్ని ప్రతిమయు శిల్పీకరింపబడును. సహగమనము చేసెడి వీరపత్నుల శిలలను ''సతీ కల్లులు'' అందురు. వీరిని ప్రజలు ''పేరంటాండ్రు''గా సంభావించి పూజింతురు. వీరత్వమును ప్రదర్శించిన జాగిలములను చెక్కిన వీరశిలలు కూడ మనకు దర్శనమిచ్చును.

ఆంధ్రదేశములో వీరశైవము విజృంభించిన తరువాత పరమేశ్వర ప్రీత్యర్థము కత్తులు దింపుకొనుట, నాలుకలు కోసికొనుట, పొట్టలు చీల్చుకొనుట, తలలు ఖండించుకొనుట వంటి సాహసకృత్యములను చేయుచు ఆత్మబలి చేసికొను స్త్రీ పురుషుల వీరశిలలు కూడ వెలసినవి. ఇట్లు ఈశ్వరుని ముందు ఆత్మబలి చేసికొనెడి గుడులను ''చంపుడు గుళ్ళు'' అని పిలిచెడివారు. ఒక వీరశైవభక్తుడు తన ఆత్మబంధువులకు గాని, తన జాతికి గాని, తన దేశమును పాలించెడి ప్రభువునకు గాని ఏదైన అరిష్ట మేర్పడినప్పుడు, అది శమించినచో తాను ఆత్మబలి చేసికొనెదనని

శివునకు మ్రొక్కుకొనును. ఆ కష్టము తీరగనే ఆ మ్రొక్కు చెల్లించును. ఆ మ్రొక్కుబడి తలను నఱకుకొనుట, పొట్ట చీల్చుకొని ప్రేవులతో శివుని అర్చించుట, గుండెలలో కత్తులు దింపుకొనుట మొదలగు సాహస కార్యములతో కూడియుండును. ఇట్టి శివభక్తులను ''వీర మాహేశ్వరులు'' అందురు. వీరిలో స్త్రీలును గలరు.

వీరశైవులలోనే కాకుండ, శాక్తేయ మార్గము ననుసరించు భక్తులలో కూడ ఇట్లు ఆత్మబలితో కూడిన మ్రొక్కుబడులు చెల్లించుట కలదు. ఒక వెదురు బొంగును భూమిలో పాతి, దాని చివర ఒక త్రాడు కట్టి, ఆ త్రాటితో దానిని బాగుగ వంచి, ఆ త్రాటి రెండవ కొసను బలిపీఠము పై కూర్చున్న వీరభక్తుని 'వీరగంటు' (వీరముడి) అనబడు జుట్టునకు గట్టిగా ముడివైచెదరు. ఒక్క వ్రేటుతో ఆ వీరభక్తుని శిరస్సును నఱకుదురు. వెంటనే ఆ వెదురుబొంగు వేగముగా పైకిలేచి, భక్తుని తలతో కూడిన త్రాటితో అటు ఇటు వేగముగా ఊగును. నెత్తురు నలుదిక్కులకు చిమ్మబడును. ఆ రక్తము ఎంత ఎక్కువ మేర చిమ్మునో భక్తునకు అంత ఎక్కువ పుణ్యము లభించునని ఆనాటి ప్రజల నమ్మకము. ఈ విధముగా ఆదిశక్తికి తలను సమర్పించుకొనుటను ''సిడిదల'' (సిడితల) అందురు. (చూ. డా॥ ఆర్. శేషశాస్త్రి, సిద్ధాంత వ్యాసము, 'కన్నడ వీరగల్లుగళు - ఒందు సాంస్కృతిక అధ్యయన').

ఈ విధముగా ఆంధ్రుల చరిత్రలో రకరకములుగా కానవచ్చెడి ''వీరపూజ''ను గూర్చి పురాతత్వశాఖలో నిపుణులైన డా॥ పుచ్చా వాసుదేవ పరబ్రహ్మశాస్త్రిగారు ఇట్లు తెలియ జేయుచున్నారు:

''కాకతీయుల నాటినుండి మృతవీరుల నారాధించు ఆచారము కొంతగా గనవచ్చును. రాయలసీమ ప్రాంతములో వైదుంబుల, బాణరాజుల యుద్ధములలో మృతి చెందినవారి స్మారకముగ వారి శిలాప్రతిమలను నిలిపి, వాటిని ఆయా పితృదినములలో ఆరాధించుట గలదు. కాని మధ్యయుగములో అది కొంత అంతరించెను. వీరశైవము పేరిట దేవుని కొరకు ఆత్మబలి ఇచ్చుట ప్రారంభమయ్యెను. అట్లు తమను స్వయముగా నరకుకొనుచున్నట్లు తెలుపు శిలాప్రతిమలు అనేకము మనదేశములో రెడ్డిరాజుల కాలమునుండి కనవచ్చును. శ్రీశైలములోని ''వీర శిరోమండపము'' అందుకొరకేర్పడినదే! యుద్ధములందు సాహసకృత్య మాచరించి వీరస్వర్గము పొందినవారి ప్రతిమలు ప్రతిష్ఠించి పూజించుటకై రాజులు భూదానములను వృత్తులను ఇచ్చెడివారు. పల్నాటి వీరులలో పినమల్లి దేవరాజు, శీలమ నాయుడుల నుద్దేశించి కారెంపూడిలో వారి ప్రతిమలను ప్రతిష్ఠించి వాటిపైన నాయుడు మండపము నిర్మించినట్లు క్రీ.శ. 1445 నాటి శాసనమొకటి తెలుపుచున్నది. వారి సాహసకృత్యములను గూర్చి పాటలు పాడెడివారు. ఇదే విధముగ శివుని కొరకో, కాళికాదేవి కొరకో, వీరభద్రుని కొరకో, భైరవుని కొరకో తమ శిరములను నరికి, సమర్పించుచున్నట్లు తెలుపు వీరశిలలు కనుపించును. అట్టి

శిలలను గూడ ఆయా దేవాలయముల వద్ద పూజించుచుందురు. అట్టి ఆలయములను ''చంపుడు గుళ్ళు'' అనెడివారు. కడపజిల్లాలో మోపూరు భైరవస్వామి గుడి, వరంగల్లు జిల్లాలో కొరవి వీరభద్రుడి గుడి, శ్రీశైల మల్లికార్జునుని గుడి యిట్టి గుళ్ళుగా ఆనాడు ప్రసిద్ధమయినవి. పతివ్రతలగు స్త్రీలు తమ పతులు చనిపోయినపుడు వారితోబాటు సహగమన మాచరించుట మరియొక ఆచారముగ నుండెడిది. ఇట్టి స్త్రీల రూపముతో నుండు శిలాప్రతిమ లనేకము ఈ నాటికిని కనుపించును. కాని అందరు స్త్రీలు ఇట్టి సహగమన మాచరించువారు కాదు. పుత్ర సంతతి లేని స్త్రీలు తరచుగ ఇట్లు చేయువారట. ఇట్లు సహగమన మాచరించిన స్త్రీలను 'పేరంటాలు' అను పేరుతో గ్రామదేవతలవలె పూజించు ఆచారముండెడిది. ......మైలార దేవుని భక్తులు, భటులు ముఖ్యముగా ఆ దేవుని రథయాత్రోత్సవములందు, నిప్పులలో దుముకుట, కత్తిని రొమ్ముగుండ ఇరువైపులకు ఉండునట్లు చొప్పించి దానికడ్డుగా త్రాడు చుట్టి ఉయ్యాల ఊగుట, నాలుకలు కోసికొనుట - మొదలైన సాహసకృత్యములు చేసెడివారు. రేచెర్ల అనపోతనాయుడు వరంగల్లు వద్ద అయినవోలులో మైలారదేవునికి గొప్ప గుడి కట్టించెను. అచట పెద్ద ఉత్సవము జరుగుచుండెడిది.''

**విజ్ఞాన సర్వస్వము, తెలుగు సంస్కృతి, మొదటి సంపుటము (పునస్సంశోధితము), దేశము-చరిత్ర, (హైదరాబాదు:-తెలుగు విశ్వవిద్యాలయం, 1990), పుట 494**



వీరగల్లు - 1

ఆలమంద కొఱకు యుద్ధము, అప్సరసలు వీరుని స్వర్గమునకు గొనిపోవుట,
వీరుడు కైలాసవాసి యగుట



వీరగల్లు - 2

ఆలమంద కొ౦ఱకు యుద్ధము, అప్సరసలు వీరుని స్వర్గమునకు గొ౦నిపోవుట



వీరగల్లు - సతీకల్లు కలిపి చెక్కిన శిల్పము



గుఱ్ఱమునెక్కి యుద్ధము చేయుచున్న వీరుడు - ఆతని వీరపత్ని



'సిడిదల' (సిడితల): వీరుని ఆత్మబలి
త్రాడుతో వెదురు బొంగును వంచి వీరుని తలమీది
వీరగంటునకు కట్టి నఱకుట, అప్సరసలతో వీరుడు



'చంపుడుగుడి' లో ఒక వీర మాహేశ్వరి
తన కుత్తుక నుత్తరించుకొనుట



'చంపుడిగుడి'లో వీర మాహేశ్వరుడు
పొట్ట చీల్చుకొని ప్రేవులతో శివుని అర్చించుట; అప్సరసలు



వేటకుక్కకు ‘వీరగల్లు’ – వేటకుక్క అడవిపందితో పోరుట




వేటకుక్కకు ‘వీరగల్లు’

అనుబంధము: 2

# ఆచార్య తంగిరాల వెంకటసుబ్బారావు

## జీవన రేఖలు

1. పూర్తి పేరు : తంగిరాల వెంకటసుబ్బారావు

2. జననం : పశ్చిమ గోదావరి జిల్లా, కొవ్వూరు తాలుకా, 'పెదవాడపల్లి' గ్రామం (మాతామహుల గృహం), 30-3-1935, భావ నామ సంవత్సరం, ఫాల్గుణ బహుళ ఏకాదశి, శనివారం, రాత్రి 8.30గంటలకు.

3. తల్లిదండ్రులు : కీ.శే. సీతామహాలక్ష్మి, కీ.శే. వేంకట సుబ్బావధానులు.

4. స్వగ్రామం : పశ్చిమ గోదావరి జిల్లా, తణుకు తాలుకా, 'కాకుల ఇల్లిందల పఱ్ఱు' గ్రామం.

5. విద్యాభ్యాసం : ప్రాథమిక విద్య : స్వగ్రామం (1940-1944 మరియు 1945-46)

   వేదాధ్యయనం : తాతగారు (పితామహులు) జగ్గన్నశాస్త్రిగారి దగ్గర (1944-1945)

   ఉన్నత పాఠశాల విద్య: రాజమండ్రి (1946-1948), తణుకు (1948-1952), యస్.యస్.యల్.సి. 1952 (జిల్లా ఫస్టు)

   కళాశాల విద్య: భీమవరం, డబ్ల్యూ.జి.బి.కళాశాల, ఇంటర్-మీడియేట్(1952-1954), బి.ఏ. (తెలుగు) (1955-1957).

   విశ్వవిద్యాలయ విద్య: శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం, తిరుపతి. ఎం.ఏ. తెలుగు (1961-1963), ప్రథమ శ్రేణి; పిహెచ్.డి. (1963-1968) ''తెలుగు వీరగాథా కవిత్వము'' (ఆచార్య పింగళి లక్ష్మీకాంతం, ఆచార్య జి.యన్.రెడ్డిగారల పర్యవేక్షణతో); పోస్ట్-డాక్టరల్ రిసెర్చ్ (1968-69) ''కాటమరాజు కథాచక్రము''

6. గురువులు : శ్రీ టి.వి.కె సోమయాజులుగారు (అన్నగారు); కీ.శే. దిగుమర్తి సీతారామస్వామిగారు; డా॥ నండూరి రామకృష్ణమాచార్యులవారు; ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు; ఆచార్య తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారు; ఆచార్య జి.యన్.రెడ్డిగారు.

7. ఉద్యోగాలు : 1969-1978 ఆంధ్రోపన్యాసకుడు, బెంగుళూరు విశ్వవిద్యాలయం, బెంగుళూరు.

1978-1980 రీడరు మరియు తెలుగు అధ్యయన శాఖాధ్యక్షుడు, బెంగుళూరు విశ్వవిద్యాలయం, జ్ఞానభారతి, బెంగుళూరు-56

1980-1983 మొట్టమొదటి పరీక్షా నియంత్రణాధికారి (First Controller of Examinations), గుల్బర్గా విశ్వవిద్యాలయం, గుల్బర్గా -585 106.

1983-1987 రీడరు, తెలుగు అధ్యయన శాఖ, బెంగుళూరు విశ్వవిద్యాలయం, జ్ఞానభారతి, బెంగుళూరు - 560 056.

1987-1994 ప్రొఫెసరు మరియు తెలుగు అధ్యయన శాఖాధ్యక్షుడు, బెంగుళూరు విశ్వవిద్యాలయం, బెంగుళూరు.

1994-1996 ప్రొఫెసరు, తెలుగు అధ్యయన శాఖ, బెంగుళూరు విశ్వవిద్యాలయం, జ్ఞానభారతి, బెంగుళూరు.

1998- 2000 ప్రొఫెసర్ ఆఫ్ ఎమెరిటస్ (యు.జి.సి.), తెలుగు అధ్యయన శాఖ, బెంగుళూరు విశ్వవిద్యాలయం, బెంగుళూరు.

8. ముఖ్య విషయం : 1971లో అప్పటి ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ పి.వి. నరసింహారావుగారికి లేఖ వ్రాసి, మూడు లక్షల రూపాయల గ్రాంటు సంపాదించి 1974లో బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగు స్నాతకోత్తర శాఖ (P. G. Department)ను స్థాపించడం.

9. సంసారం : వివాహం(మేనరికం) : 1954. భార్య: ''భళ్ళమూడివారి చిట్టి'' (శ్రీమతి తంగిరాల శకుంతల). సంతానం: 'కాళిదాసు' (వెంకట సుబ్బావధానులు); 'రామయ్య'(సీతారామరాజు); 'సీత' (సీతామహాలక్ష్మి); 'శీను' (శ్రీనాథ కవిసార్వభౌమ); 'శశి' (రేవతీ శశిప్రియ).

10. ముద్రిత గ్రంథాలు: (అ) సృజనాత్మకాలు

1. 'హంస పదిక' (ప్రణయ కావ్యం), 1967.
2. 'వనదేవత' (బుఱ్ఱ కథ), 1968.
3. 'గుండె పూచిన గులాబి' (· వన గీతాలు), 1987.

(బి) పరిశోధనాత్మకాలు

1. 'జానపద సాహిత్యము - వీరగాథలు', 1974, ప్రపంచ తెలుగు మహాసభల ప్రచురణ, ఆంధ్ర ప్రదేశ్ సంగీత నాటక అకడమీ, హైదరాబాదు-500 004.
2. 'కాటమరాజు కథలు' (మొదటి సంపుటము) 1976, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ, హైదరాబాదు-500 004.
3. 'కాటమరాజు కథలు' (రెండవ సంపుటము) 1978, ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ ప్రచురణ, హైదరాబాదు-500 004.
4. 'తెలుగు వీరగాథా కవిత్వము' (రెండవ సంపుటము), తంగిరాల ప్రచురణలు, 1983.
5. 'అంకమ్మ కథలు', తంగిరాల ప్రచురణలు, 1993.
6. 'శ్రీకృష్ణ కర్ణామృతము' (సం), శ్రీరస ప్రచురణలు, 1998.
7. 'రేనాటి సూర్యచంద్రులు', శ్రీరస ప్రచురణలు, 1999.
8. 'తెలుగు వీరగాథా కవిత్వము'-1 ('వీరగాథా లక్షణము'), శ్రీరస ప్రచురణలు, 2000.

(సి) **English**

1. Ranganatha Ramayanam, 'Nikumbhila Yagam', (along with others)
2. 'Sumathi Satakam' (Poetry), (along with others)

(డి) కన్నడం

1. 'వేమన - ఎరడు అధ్యయనగళు', 1993, కర్ణాటక రెడ్డి జన సంఘ ప్రచురణ, బెంగుళూరు.
2. 'విశ్వనాథ సత్యనారాయణ', 1995, కర్ణాటక సాహిత్య అకాడమీ ప్రచురణ, బెంగుళూరు.
3. 'హిమవద్ గోపాలస్వామి' (సం), 1997, హిమవద్ గోపాలస్వామి టెంపుల్ ట్రస్ట్ ప్రచురణ, గుండ్లుపేట, మైసూరు జిల్లా.

(ఇ) 'చైతన్య కవిత' - కేవలం కవిత్వానికే అంకితమైన పత్రికకు సంపాదకత్వం. ప్రముఖ కవుల ముఖచిత్రాలతో ఆరు మాసాల కొకసారి అందంగా వెలువడుతుంది (వసంతం - శరత్తు). 1986లో మైసూరులో 'ధ్వన్యాలోకం'లో ప్రొ॥ సి. డి. నరసింసయ్య, ప్రొ॥ యస్వీ. జోగారావుగార్ల చేత ప్రారంభించబడింది. ఇప్పటివరకు 30 సంచికలు వెలువడ్డాయి.

11. పరిశోధన : 1. తెలుగు, ఇంగ్లీషు, కన్నడ భాషలలో సుమారు 100 పరిశోధన పత్రాల రచన, సమర్పణ. ఒక్క 'భారతి' లోనే 40 వ్యాసాలవరకూ ప్రచురింపబడ్డాయి.

2. ఈయన పర్యవేక్షణలో 15 మందికి పిహెచ్.డి. డిగ్రీలు, 25మందికి ఎం.ఫిల్. డిగ్రీలు వచ్చాయి.

3. 1997-1998: 'పల్నాటి వీరకథా చక్రం - సామాజిక సాంస్కృతిక అధ్యయనం' అనే అంశాన్ని గూర్చి U.G.C. Major Research Project చేశారు.

4. 1998-2000: 'కాటమరాజు కథాచక్రం - సామాజిక సాంస్కృతిక అధ్యయనం' అనే అంశాన్ని గురించి U.G.C. Emeritus Professor-గా పరిశోధన చేశారు.

5. ఆంధ్రప్రదేశ్, తమిళనాడు, కర్ణాటక రాష్ట్రాలలో అనేక ప్రాంతాలలో పర్యటించి, సాహిత్యోపన్యాసాలు చేశారు.

12. అభిరుచులు : ఆధునిక కవిత్వం, జానపద కవిత్వం, తులనాత్మక సాహిత్యం ప్రాచీన సాహిత్యం, కవి పండిత గోష్ఠి.

13. Address : **Prof. T. V. Subba Rao** (Retd.)
No. 40/12-7, "Saurabha" (Upstairs)
22nd Cross, Govindarajanagar,
Vijayanagar, Bangalore - 560 040
Phone: 080 - 3305902

## జానపదము - జ్ఞానపథము

సప్తపది:

ధ్వని వాక్కుచేc దెల్పెడి తత్త్వమెదియొ
అనుభవమునకుc దుదిహద్దటంద్రు బుధులు
తంగిరాల సతీర్థ్యుc డుద్దామ యశుcడు
జానపద వాఙ్మయాంభోధి సలిల (సార) మెల్ల
పుడిసిలించు నగస్త్యుc డద్భుత వచస్వి
జ్ఞానభారతికిన్ జతురాననుండు
కన్నడము-తెల్గు సంధాన కారకుండు!

-డా॥ మల్లేల గురవయ్య

''వీరగాథలను గుఱించి
ఈ ఆంధ్రదేశములో నీవొక్కనివే ప్రసంగింపగలవు!''

-గురుదేవులు శ్రీ దిగుమర్తి సీతారామస్వామి

''తంగిరాల వెంకటసుబ్బారావు పది పన్నెండు డాక్టరేట్ పట్టాలకు సరిపడా విషయ సేకరణ చేశారు. కాలికి బలపం కట్టుకొని దేశమంతా తిరిగారు. చేతివ్రేళ్ళు అరిగే దాకా కలానికి పనిపెట్టారు... ఆ తర్వాత వర్గీకరణకు పూనుకొని కృతకృత్యు లయ్యారు. తదుపరి వివరణాత్మకమైన రచనలోనూ సాఫల్యం పొందారు''

-ప్రొ॥ కె. వి. రమణారెడ్డి
('భారతి', జూన్ 1988)

తరుణారుణ కరుణామయ విపులాయత నయనం
కమలాకుచ కలశీభర విపులీకృత పులకమ్
మురళీరవ తరళీకృత మునిమానస నళినం
మమఖేలతి మదచేతసి మధురాధర మమృతమ్.

- (లీలాశుకుని శ్రీకృష్ణకర్ణామృతము)





నా యిష్టదైవము

'భగవాన్ శిఖి పింఛ మౌళిః'

(గురువాయూరు కృష్ణుని కౌపీన దర్శనము)

